ఎబికె సాహిత్యకీయాలు (నిబద్ధాక్షరి - 2)

- ఎబికె ప్రసాద్

ప్రథమ ముద్రణ: ఆగస్టు, 1998

ప్రతులు: 1000



వెల: రూ 75-00

ముఖచిత్రం: ఏలె లక్ష్మణ్

సోల్ డిస్ట్రిబ్యూటర్స్:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,

విజ్ఞాన్ భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ - 500 001

విశాలాంధ్రబుక్ హౌస్,

హైదరాబాద్ (సుల్తాన్‌బజార్, ఆబిడ్స్), విజయవాడ, విశాఖపట్టణం,

కాకినాడ, గుంటూరు, హన్మకొండ, అనంతపురం, తిరుపతి

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో

ముద్రణ శ్రీ కళాంజలీ గ్రాఫిక్స్, హైదరాబాదు-29 ఫోన్ : 597831

# అంకితం

నలభైమూడేళ్ల నా పాత్రికేయ జీవితంలో

అడుగడుగునా  తన మనస్సును

అమృత భాండంగా మార్చుకుని అనేక క్లిష్టమైన ఘట్టాలలో

వెన్నుదన్నుగా  నిలిచి ప్రోత్సహిస్తూ వచ్చిన

నా జీవిత సహచరి **సుధారాణి**కి

ప్రేమతో,

కృతజ్ఞతతో--

**- ఎబికె**

# మామాట

**సు**ప్రసిద్ధ పాత్రికేయులు ఎబికె ప్రసాద్‌గారు వివిధ విషయాలపై వ్రాసిన సంపాదకీయాలు చాలా ప్రసిద్ధం. వాటిలో సాహిత్యంపై ప్రతి ఆదివారం వ్రాసిన సంపాదకీయాలు ఒక ఊపు ఊపాయి.

ఎబికె సంపాదకీయాలు అచ్చయిన నాటి సాయంకాలంతోనే అంతం కావు. అవి పాఠకుడిలో ఆలోచనలు రేపుతాయి. ఆ తరువాతి కాలంలో కూడా అవసరపడే విశిష్ట గుణం కలిగి ఉన్నందువల్ల వీరి సంపాదకీయాలు లోగడే నాలుగు సంపుటాలుగా అచ్చయ్యాయి. గత ఏడాది 'నిబద్ధాక్షరి' పేర సాహిత్యకీయాలు అచ్చయ్యాయి.

'సిరా సరాగాలు', 'పరాధీన భారతం' ఇత్యాది గ్రంథాలు కూడా ఎంతో ప్రసిద్ధి పొందాయి.

ప్రస్తుతం అచ్చవుతున్నవి ఒక ఏడాది కాలంగా వ్రాసినవి. తెలుగు, ఆంగ్ల భాషా సాహిత్యాలకు సంబంధించిన విషయాలపై చేసిన పరిశోధనాత్మక పరిశీలనలు, వ్యాఖ్యలు, విశ్లేషణ పొందుపరిచిన సాహిత్యకీయాలను ఒక చోట సంకలనపరిచి మీ ముందుంచుతున్నాం.

రొడ్డకొట్టుడు అకడమిక్ చట్రంలోంచి కాకుండా తన అధ్యయన విధానంలోంచి నవ్య సాహిత్య ధోరణులను, బలమైన కొత్త వ్యక్తీకరణలను గుర్తించడం - అప్పటికప్పుడు స్పందించడం, ఆ రకంగా సామాజిక బాధ్యతలు నిర్వహించడం ఎబికె వ్యక్తిత్వంలోని ఒక అనివార్యమైన అంశం. అందుకే ఈ సాహిత్యకీయాల ప్రచురణ! ఇది 'నిబద్ధాక్షరి' రెండవ భాగం.

ప్రచురణ కర్తలు

# కృతజ్ఞతలు

ఎన్నో పనుల వత్తిడి మధ్యనే ఈ సంపుటికి ఆప్యాయంగా ముందుమాట అందజేసిన సుప్రసిద్ధ విమర్శకులు, కవి ఆచార్య చేకూరి రామారావుకు నా ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ రెండవ సంపుటిని ప్రచురించడానికి వివిధ దశల్లో ఎంతగానో చేయూతనిచ్చిన సాహితీ సర్కిల్ నిర్వాహకులు, ప్రసిద్ధ రచయిత ప్రొ. జయధీర్ తిరుమలరావు, పాత్రికేయ చిరంజీవులు పవన్, రమేష్, డి.టి.పి. ఆపరేటర్స్ వసంత, కె. జ్యోతికి, ముద్రాపకులకు నా మనఃపూర్వక అభినందనలూ, కృతజ్ఞతలూ.

ఈ పుస్తకం వెలువడడానికి సహకరించిన విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ రాజేశ్వరరావుగారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

ముఖపత్రాన్ని ముచ్చటగా తీర్చిదిద్దిన సుప్రసిద్ధ చిత్రకారుడు చిరంజీవి ఏలె లక్ష్మణ్‌కు, ఎంతో అందంగా టైటిల్ పేజీని ముద్రించి పెట్టిన ప్రగతి ఆర్ట్ ప్రింటర్ అధినేత చిరంజీవి పరచూరి నరేంద్రకు, సిబ్బందికీ - నా కృతజ్ఞతలు

- రచయిత

# వరస

# సాహితీయాత్ర

వర్తమాన భారతీయ సాహిత్యంలో అంతర్భాగమే తెలుగు సాహిత్యం. ఆధునిక రచయితలు-కవులు, కళాకారులు, కథకులు, నాటక కర్తలు, నవలాకారులు, ఎవరూ సారస్వత ప్రక్రియా వైచిత్రిలో రచనా వైవిధ్యంలో ఏ పాశ్చాత్య రచయితలకు తీసిపోరనీ, కొన్ని పట్టుల్లో సమాంతర సాహితీ ధ్రువాలకన్నా మిన్నగానే జ్వలిస్తున్నారనీ నా ఉద్దేశం. కవులూ, దార్శనికులూ, స్వాప్నికులూ మానవాళికి ఉత్తమ స్నేహితులని ఒకనానుడి ఉంది. ఈ అభిప్రాయాన్ని దృష్టిలో పెట్టుకొని నేను అనేక మంది రచయితల సృజనశక్తిని వారివారి కొన్ని రచనలను అలవోకగా అంచనా కట్టడానికి ఓ ప్రత్యేక వేదికను ఎంచుకున్నాను. దానికి మారుపేరే సాహిత్య సంపాదకీయాలు (సాహిత్యకీయాలు) ఇవి 'వార్త'లో నేను ఎడిటర్-ఇన్-ఛీఫ్‌గా ఉన్నప్పుడు ప్రతి ఆదివారం వెలువడ్డాయి వీటిలో మినహాయింపల్లా - కరిబియన్ కవి సామ్రాట్ నోబెల్ బహుమాన గ్రహీత వాల్కాట్‌గురించి ఆలిండియా రేడియో ప్రసారం చేసిన నా ప్రత్యేక ప్రసంగం. ఈ సాహిత్య సంపాదకీయాలకు యుగతా సంపాదకీయాలతోపాటే పాఠకులనుంచి అపారమైన ఆదరణ లభించింది ఒక విధంగా ఈ సాహిత్యకీయాలను Journeys into literature గా పేర్కొనవచ్చు వీటిలో ఒక అంశంకాదు, ఒక రచయిత కాదు, ఒక విషయం కాదు - ఎన్నో అంశాలు, ఎందరో కవులు, నాటకకర్తలు, కథకులు, నవలాకారుల తాత్త్విక చింతనకు సృజనశక్తికి సంబంధించిన విశ్లేషణకోసం ప్రయత్నించాను. మన రచయితల శక్తియుక్తులను సమకాలీన ప్రపంచ సాహితీ వేత్తల రచనలలో ఆయా పట్టుల్లో నాకు అనిపించిన కొన్ని సామ్యాలతో పోల్చి తూచడానికి ఓ చిన్న ప్రయత్నంచేశాను

ఇలాంటి సాహితీయాత్రలు అరుదుగాని, కొత్తకాదు. కొన్నేళ్ళ క్రితం ప్రొఫెసర్ చార్లెస్ సిల్విస్టర్ "Journeys" (Through Book Land) మకుటంతో ఎనిమిది సంపుటాలు ప్రచురించాడు అందులో ఆయన పెట్టుకున్న లక్ష్యం - "read with intelligence and appreciation the current writings of the day"! నా ఉద్దేశం కూడా - పెక్కుమంది పత్రికా యజమానులు సంస్కృతీ విరోధులుగా మారి కళలకు, సాహిత్యానికి పత్రికలను దూరంచేస్తున్నందున పాఠకుల ముందు ఈ ప్రత్యేక వేదికను ఆవిష్కరించుకోవలసి వచ్చింది. రాష్ట్ర వ్యాపితంగా పెక్కుమంది రచయితలు, సాహితీ ప్రియులూ, సారస్వతేయులూ ఈ కృషిని

మెచ్చుకుంటూ అభినందనలూ, ప్రశంసలూ అందజేశారు. వారందరికీ నా వందనాలు.

సిల్విస్టర్ మాదిర్, ప్రసిద్ధ సాహితీ విమర్శకుడు, రచయిత బిల్ అట్కిన్ ఇటీవలనే Literary Trials (స్టేట్స్‌మన్) పేరిట ఓ సాహిత్య నివేదనం అచ్చువేశాడు. అదొక అద్భుతమైన సాహితీలోకయాత్ర. ప్రసిద్ధ రచయితలు పుట్టిన, మెట్టిన, గిట్టిన పలు ప్రదేశాలను సందర్శించి, వారి రచనా కృషిని అంచనాకట్టి అచ్చొత్తించిన సమీక్షా కదంబం అది; సాహితీ మిత్రుల పరామర్శ అది. బార్నార్డ్ లెవిన్ కూడా ('లండన్ టైమ్స్') ఇలాంటివాడే. యూరప్ సంగీత కచేరీల విశిష్ట సమీక్షకుడు. వాటికి మ్యూజికల్ ట్రయల్స్ అనిపేరు పెట్టినట్టు గుర్తు 'లండన్ టైమ్స్' ఒకప్పుడు మూడవ సంపాదకీయంగా ("Third Leaders") సాహిత్య వివేచన చేస్తుండేది. ఈ ప్రక్రియను తెలుగులో నార్ల అప్పుడప్పుడు చేస్తూండేవారు నేను ప్రతి ఆదివారం నిత్య నివేదనంగా మార్చుకున్నాను! ఈ నా సాహిత్యకీయాల మొదటి సంపుటి ''నిబద్ధాక్షరి'' పేరుతో (Committed Word) వెలువడింది. దాని కొనసాగింపుగా విడుదలవుతున్న ఈ సాహిత్యకీయాలు 'నిబద్ధాక్షరి' రెండవ భాగం తులనాత్మక సమీక్షలో రచయిత నిబద్ధత కూడావ్యక్తమైతేగాని ఆ రచనకు విలువ ఉండదని నా ప్రగాఢ విశ్వాసం.

- ఎబికె

# సృజనాత్మక సంపాదక పరంపరలో కొసమెరుపు ఎబికె

ఎబికె అనే మూడు ఇంగ్లీషు అక్షరాల సంయోజనకు తెలుగు విద్వత్ప్రపంచంలో ఇంత గ్లామర్ ఎక్కడనుంచి వచ్చిందో, చుట్టూ ఇంత మిస్టరీ ఎలా ఏర్పడిందో సుమారు మూడు దశాబ్దాల నుంచి పరిశీలిస్తున్నా నా ప్రయత్నం ఇంకా పూర్తి కాలేదు. ఆయన పనిచేయని తెలుగు పత్రిక లేదంటే కొద్దిగా మాత్రమే అతిశయోక్తి. దాదాపుగా అన్ని పత్రికలలో పనిచేసిన ఏకైక సంపాదకుడు ఎబికె ఒక్కడే అంటే పూర్తి స్వభావోక్తి. పని చేసిన ప్రతి పత్రికనూ బాగుచేయటం, మెరుగుపర్చటం, స్థిరపరచటం, ఆకర్షణీయం చేయటం ఆయనకు స్వభావ సిద్ధంగా వచ్చిన గుణం. పూర్వం తిరుపతి వేంకటకవులను ఆద్యతనాంధ్ర కవి ప్రపంచ నిర్మాతలు అనేవాళ్ళు. ఇప్పుడు ఎబికెను కూడా 'ఆద్యతనాంధ్ర పత్రికా ప్రపంచ నిర్మాత' అంటే సరిపోతుంది. ఆద్యతనం అంటే ఈ శతాబ్దపు చివరి మూడు దశాబ్దాల పైచిలుకుగా అన్వయించుకోవాలి.

తెలుగువారికి ( మిగతా వారి సంగతి నాకంతగా తెలీదు) ఒక అదృష్టం ఉంది తెలుగు పత్రిలకు తొలి రోజుల నుంచి మంచి విద్వత్తు, లోతైన సాహిత్యం పరిచయం ఉన్నవాళ్ళే సంపాదకులుగా ఉన్నారు. ఒకనాటి ముట్నూరు కృష్ణారావుగారు, కాశీనాధుని నాగేశ్వరరావుగారి వంటి వారి నుంచి ఇటీవలి నార్ల వేంకటేశ్వరరావు, నండూరి రామమోహనరావు, ఎబికె వరకు చూడండి. పూర్వపు వారిలాగే ఇప్పటివారికి తెలుగు సాహిత్య పాండిత్యం బాగా ఉండటం అదనపు విశేషం. ఈ అంశంలో ఎబికె అధికుడిలాగా కనిపిస్తాడు ఒక్కోసారి ఈయన విశ్వసాహిత్య పాండిత్యం పాఠకులను ఉక్కిరిబిక్కిరి చేసి ఊపిరాడనియ్యదు. ఈయన పేర్కొన్న రచయితల పేర్లను పలకటానికి కూడా కష్టపడతాం. ముకుంద రామారావును గురించి రాస్తూ ఆనటోల్ ఫ్రాన్స్‌ను రాబర్ట్ ఫ్రాస్ట్‌ను ఎజ్రాపౌండ్‌ని, మేరి మెకార్థిని, రాబర్ట్ లోవెల్‌ను ప్రస్తావిస్తాడు కుప్పిలి పద్మను గురించి రాస్తూ సిల్వియా ప్లాత్ కవిత్వం గురించి చెపుతాడు. పాటిబండ్ల రజని, రావులపల్లి సునీతల గురించి రాసిన వ్యాసంలో విశ్వరచయితల పేర్లు అయితే చాలా మంది పాఠకులు ఎనే ఉండరు

పత్రికల వార్తలలోను, సంపాదకీయాలలోనూ రాజకీయాంశాలే ఎక్కువ కన బడతాయి ఇటీవలి కాలంలో సాంస్కృతికాంశాలకు కూడా కొంత అవకాశం కల్పిస్తున్నారు ఆదివారం సంచికలలో, రాజకీయేతరాంశాల విశేష సంపాదకీయాలు కనిపిస్తున్నాయి రొటీన్ రాజకీయాల నుంచి ఇదొక పెద్ద రిలీఫ్. ఈ సంప్రదాయానికి ఎబికేయే ప్రారంభకుడు అవునో కాదో నాకు సరిగ్గా తెలీదు కాని చాలామందికి ప్రేరణ ఆయనే అని మాత్రం చెప్పవచ్చును ఈ ఆదివారం సంపాదకీయాలలో అధికభాగం సాహిత్యం మీద రాయటం ఒక పనిగా పెట్టుకున్నాడు ఎబికె వీటికి సాహిత్యకీయాలు అని పేరు పెట్టాడు. సాహిత్య సంపాదకీయాలు అనే రెండు మాటలను కుగిస్తే వచ్చిన మాట ఇది. ఈ పద్ధతి ఇంగ్లీషులో ఉంది. ఫస్టు అక్టోబరును శ్రీశ్రీ ఫస్టోబరు అన్నాడు.

ఈ సాహిత్యకీయాలు పూర్వం ఒక సంపుటం వచ్చింది. ఇది రెండో సంపుటం ఇందులో ఈయన అభిరుచి వైవిధ్యం, దృష్టి వైశాల్యం, కొన్ని ఆదర్శాల పట్ల నిబద్ధత, మరికొన్నింట సామాజిక బాధ్యత మనకు కనిపిస్తాయి ఒకసారి కవిత్వం మీద, మరోసారి నవల మీద, ఇంకోసారి కథల మీద, ఒక్కోసారి అందమైన పుస్తకాల మీద - ఒకటేమిటి సాంస్కృతిక రంగాలన్నీ ఆయన క్రీడాస్థలాలే. వీటిల్లో సొంత ఆదర్శాలుంటాయి కాని స్వాభిమానాలు ఉండవు సీనియర్ రచయితలైన సినారె, గోపీల పుస్తకాల మీద రాస్తాడు. తన అభిరుచికి పాత్రమైన నామాడి శ్రీధర్ కవిత్వాన్ని పరిచయం చేస్తాడు.

అభ్యుదయ దృక్పథాల మీద ప్రత్యేకాభిమానం, దళిత, స్త్రీవాదం పట్ల విశేషాభినివేశం కనపరుస్తాడు. అట్లా అని దృష్టి సంకుచితం కానీయకుండా జాగ్రత్త పడతాడు విప్లవ రచయితలను అభిమానిస్తూనే ఇతర రచయితలను గౌరవించే దృష్టి వైశాల్యం ఈ సాహిత్యకీయాలలో కనిపిస్తుంది. కులవ్యవస్థను విమర్శిస్తూనే కులద్వేషాన్ని నిరసిస్తాడు. ''సమాజానికి కేవలం బ్రాహ్మణవాదం ఎంత చేటో, కేవలం గుడ్డి బ్రాహ్మణ ద్వేషం కూడా అంతే అనర్థమని గుర్తించాలి'' అని ఒకచోట అన్నాడు

తెలుగు నవలలో ఇటీవల ప్రతిభా స్ఫోరకమైన రేగడివిత్తులు, ఖాకీ బతుకులు అనే పుస్తకాలపై ఈ సంపాదకీయాలలో అద్భుత పరిచయాలున్నాయి ఖాకీబతుకుల గురించి రాస్తూ సివిల్ రూల్సులో 13వ నిబంధనను కోట్ చేసి రచయిత మోహనరావుపై జరుగుతున్న దాడిని ఎదుర్కొని అతని పక్షం వహిస్తాడు

స్త్రీవాదం పట్ల విశేషాభిమానం ఉన్నా సంయమనం పాటించడం కూడా ఎబికెలో కనిపిస్తుంది ''అతి వేలానికి దూరంగా బాధ్యతలు తెలిసి మెలిగిన స్త్రీవాదిగా'' అబ్బూరి ఛాయాదేవి గారిని అభినందిస్తాడు ముఖ్యంగా త్రిపురనేని శ్రీనివాస్ మరణానంతరం అతని రచనల

సంపుటిగా బయటకు వచ్చిన 'హో'ను బాధ్యతగా తాను విమర్శించటమే కాక తి శ్రీ మిత్రుల, మగస్త్రీవాదుల బాధ్యతారాహిత్యాన్ని నిశితంగా విమర్శించాడు. తి.శ్రీ ప్రమాదంలో మరణించిన తరువాత ఊరూరా అధిక సంఖ్యలో సంతాప సభలు జరిగాయి, కవులు రచయితలు అతని పుస్తకాలంకితమిచ్చారు. ఆ సమయంలో ఈ సంపాదకీయం రాయటం ఆయన బాధ్యత స్వీకరణకే కాక సాహసానికి కూడా నిదర్శనం.

ఎబికె ఈ సంపుటిలో అభిరుచి వైవిధ్యాన్ని ప్రదర్శిస్తాడు ఒక్క ఉదాహరణ: నాగార్జున గ్రూపు వ్యాపార సంస్థల వారు చెలువ కన్నడనాడు అనే పుస్తకాన్ని ప్రచురించారు. దీని సంకలన బాధ్యతను సునీతా బుద్ధి రాజా అనే ఆమె నిర్వహించారు. కర్ణాటక ప్రకృతి సౌందర్యాన్ని ఆమె అందులో బంధించి ప్రదర్శించారు ఈ పుస్తకం చూసిన తరువాత ఎబికె అన్నట్టు ''కర్ణాటక పర్యావరణం కళ్ళు కుట్టిస్తుంది'' ఇట్లాంటి పుస్తకం ఆమె నిర్వహణలోనే తెలుగునాడు మీద 1998 నవంబరు 1కి రాబోతున్నది మనకు అంత పర్యావరణ సంపద లేకపోయినా ఇతర కళా సంపదలున్నాయి గదా ఎబికె ఆ పుస్తకం మీద ఎక్కడో ఒక చోట రాస్తారని ఎదురుచూద్దాం

ఎబికె పాండిత్యాన్ని అంచనా వేసే పని పెట్టుకోను. అది అపారం. నాబోటివాళ్ళు ఈదలేనంత అపారం పాండిత్యం కన్నా ఆయన భాషా ప్రయోగం నన్ను ఎక్కువ ఆకర్షిస్తుంది. అంతర్జాతీయ విషయాలను కూడా జాతీయ స్పృహతో, తెలుగు నుడికారం చెడకుండా చెప్పే నేర్పు ఆయనకుంది శోభాడే మీద రాసిన వ్యాసంలో ఈ వ్యాక్యాలు చూడండి ''షర్టులు, జీన్స్, శారీస్, సెంట్లు, టూత్‌పేస్టులు, ఇళ్ళస్థలాలు, మైక్రోవేవ్ ఓవెన్లు, వాషింగ్‌మెషీన్లు, షేర్లు, బాండ్లు - ఈ ఉచ్చులు వివాహ సంబంధాల్ని మెరుగుపర్చేది పోయి ఉక్కిరి బిక్కిరి చేస్తాయని చెప్పింది వస్తువినియోగానికి ఆమె వ్యతిరేకం. అవి స్త్రీ పురుష సంబంధాల్లో కట్టుగొయ్యలుగా మారకూడదని మాత్రమే ఆమె ప్రబోధం''. ఇక్కడ ఉచ్చు, కట్టుగొయ్య, ఉక్కిరి బిక్కిరి అనే పద ప్రయోగంలో ఎంత నేటివిటీ కనిపిస్తుందో చూడండి.

సిల్వియా ప్లాత్ చెప్పినదాన్ని తెలుగులో ఎంత అందంగా చెప్పాడో చూడండి 'స్త్రీ ఆటబొమ్మ కాదు సింగారాల అంగారవల్లరీ కాదు. పులి, ఆడపులి, బెబ్బులి'. ఇంగ్లీషులో jewelled, lioness అనేమాటలున్నాయి

ఎబికె వచనంలో సంగీతం ఉంటుంది. దీన్నే నన్నయ అక్షర రమ్యత (Syllabı harmony) అన్నాడనుకుంటా ప్రతిచోట శ్రవణపేయంగా ఈ నాదం వినిపిస్తుంది కొన్ని అలవోకగా ఏరిన ఉదాహరణలు చూడండి

1 జాతుల బతుకు వెతుకులు తరతరాల బాధ మయగాథల్ని అక్షర నిబద్ధం చేసిన

చరిత్ర.

2. కల్లోలం నుంచే ఎవరో కమలనాభుడు ఉదయిస్తాడు.

3. సంజీవదేవ్ కుంచె మెరుగులే కాదు కలం మెరుపులూ చూపినవాడు కలం కల కూజితాలలోనూ రచనా ప్రక్రియలలోనూ వైవిధ్యం చూపించాడు. కవనంలో చిత్రకళాదవనంలో సూక్ష్మాతిసూక్ష్మమైన విషయాలెన్నిటినో దర్శించి రచనల ద్వారా, గోష్ఠి కార్యక్రమాల ద్వారా, ఉపన్యాసాల ద్వారా, వివేచన ద్వారా విపులీకరించిన కళాతపస్వి సంజీవదేవ్.

4. (కమలాదాస్) ప్రతిరాత్రీ స్త్రీకి కాళరాత్రి కాకూడదనుకుంది.

5... క్రిస్టోఫర్ కాడ్వెల్, ఆడెన్, లుకాసీలు అంతర్యుద్ధంలో చిక్కుకున్న స్పానిష్ ప్రజలకు అండదండలుగా తమ గుండె గొంతుకలు కలిపారు.

6. రాతినేలను అరక కుమ్ముతుంది. రేగడి పార దమ్ముతో విచ్చుకుంటుంది.

వర్ణావృత్తి, సంతులన పద, వాక్య ప్రయోగం అనే వ్యూహాల వల్ల ఈ సంగీత గుణం వచ్చిందనుకుంటున్నాను. మదర్ థెరెస్సా గురించి రాసిన వ్యాసంలో ఈ కొసమెరుపు చూడండి. 'థెరెసాను మరచి విశ్వం ఉండలేదు. ఈ ప్రపంచాన్ని మరచి థెరెస్సా అక్కడా ప్రశాంతంగా ఉండలేదు' థెరెస్సా, ప్రపంచమూ ఒకళ్ళను మరిచి ఇంకొకరు ఉండలేరని భావం. అయితే ఇట్లాగే ఉంటే అందం పోతుంది. ఈ భావాన్ని సమతులన వాక్యాలుగా పేర్చి అందం సాధించాడు.

ఈ సాహిత్య సంపాదకీయాల్లో ఎ బి కె ది సాహిత్య వచనం, ఇంగ్లీషులో దీన్ని క్రియేటివ్ ప్రోజ్ అంటారు. ఈ క్రియేటివిటీ ఎబికెలో ఉండవలసిన దానికన్నా ఒక పిసరు ఎక్కువే ఉంది. ఇది పదసృష్టిలోనూ అర్థసృష్టిలో కూడా కనిపిస్తుంది. సాహిత్యకీయాలు అనేమాటే కొత్త సృష్టి. 'యాంగ్రీ యంగ్‌మెన్‌ను ఆగ్రహ భార్గవులు అని వాడతాడు వాత్సల్యం అనే మాటను సాంప్రదాయకంగా పెద్దలకు చిన్నవాళ్ళ పట్ల ప్రణయభావానికి వాడతారు. ఈయన స్త్రీ పురుష ప్రణయానికి వాడాడు. ఎబికె 'శరించు' అనే క్రియను ఈ పుస్తకంలో ఐదారు వ్యాసాల్లో వాడాడు నైఘంటుకార్థం 'దూషించు' అని అకారణంగా దూషించడం అని ప్రాచీనార్థం అయితే, సకారణంగా ఆగ్రహించు అని నవీనార్థం కల్పించాడు

సైన్సును గురించి రాసినా సాహిత్య స్పర్శ లేకుండా రాయలేదు ఎబికె చంద్రగ్రహంలో నీరుందని శాస్త్రజ్ఞులు కనుక్కొన్న సందర్భాన్ని చెపుతూ 'మక్కలో ఇవి కావు, సురలోకనాహిని ఎమలాంబుకణ కదంబములు కాని' అని శ్రీనాధుణ్ణి స్మరించుకోగలిగింది ఒక్క ఎబికెయే

**సృజనాత్మక సంపాదక పరంపరలో కొసమెరుపు ఎబికె**

ఎబికె వచనం ఉరవళ్ళు, పరవళ్ళతో పరుగులు తీస్తుంది. చంద్రలత రేగడి విత్తులు నవల గురించి రాసిన ఈ భాగం చూడండి. చంద్రలత తెలుగులో నుడికారపు సొంపు ఎక్కువ ఆ నుడికారాన్ని ఈయన శైలీవేగం కలుపుకున్న తీరు చూడండి

'ఈ తరం వారికి తెలియనివి ఇందులో ఎన్నో ఉన్నాయి. కోల్గేట్ పేస్ట్ తెలిసినంతగా కచ్చికపొడి తెలీదు. కళ్ళాపి పేరు తెలీదు. కర్ర తెలిసినంతగా ముగ్గుకర్ర తెలీదు. బావులు తెలిసినా మోటబావుల ఎరుకలేదు గోదావరి తెలుసు కాని వెన్నగాచిన తరవాత అడుగున దిగే 'గోదారి' ఎరుగరు. బల్ల తెలుసు గాని బండి జల్ల తెలీదు. అడుసు తొక్కడం తెలిసినా చేనుదమ్ము చేయడం తెలీదు. మొక్కకు పాదులు తీయడం తెలిసినా గొప్పులు పోసుకోడం తెలీదు. గిత్తలు తెలిసినా వాటి గిట్టలు తెలీవు' ఇట్లా సాగుతుంది ఈ వచనం. వాక్యంలో కాంట్రాస్టు, వాక్యాల్లో నిర్మాణసమత వల్ల ఈ వేగం వచ్చింది.

ఎబికె వాల్కాట్‌ను గురించి రాసినా కృష్ణశాస్త్రి గారిని స్మరించగల భావుకుడు. సృజనాత్మక సంపాదక సంప్రదాయంలో బహుశా ఎబికె కొసమెరుపు ఆ సృజనాత్మకత ఈ సంకలనంలో పుష్కలంగా కనిపిస్తుంది. విచిత్రమైన శబ్ద చమత్కారాలు, అర్థంపట్టు, చోటుచేసుకొను, వెలుగుచూచు వంటి క్రియాప్రయోగాలు, మనోపరిపక్వత వంటి అనిష్ట సంధులూ అక్కడక్కడా కనిపిస్తున్నా, అవి అందమైన వచనానికి పెట్టిన చుక్కల్లాంటివి. పట్టి చూసేవాళ్ళకి కనిపిస్తాయి గాని ప్రవాహవేగంలో కొట్టుకుపోతాయి

తెలుగు పత్రికారచన దేశ భాషలన్నింటికన్నా ఎంతో ముందంజ వేసింది. పత్రికల నిర్వహణలో అద్వితీయమైన సామర్థ్యం కలిగివు ఉన్న ఎబికె తన సంపాదకీయ రచనలోనూ దిట్ట. వీటిపై పరిశోధనలు జరగాలి. కాని ఎంతమంది పరిశోధకులు అంతటి సాహసం చేయగలరు!

ప్రొఫెసర్ చేకూరి రామారావు

# కొత్త శతాబ్ది ముఖద్వారానికి ముస్తాబులు

**అ**ందరూ దార్శనికులు కాలేరు. అలా అని భవిష్యద్దర్శనం కోసం ఎవరూ ఉబలాట పడకుండానూ ఉండలేరు. కలగనడం మానవుని స్వభావం. కలలు కనలేనివాడు ఆదర్శాన్ని గౌరవించలేడు. కలను చెరిపివేసుకొనేవాడు రేపటిని గురించి ఆలోచన చేయలేడు. స్వప్నలోక సౌందర్యాన్ని అనుభవించగలిగిన వాళ్ళే భవిష్యత్‌ను గురించిన ''బ్లూప్రింట్''ను కూడా తయారు చేసుకోగలుగుతారు! అలాంటి ఓ నమూనాయే రేపటి ప్రపంచం గురించీ, 21వ శతాబ్దంలో ప్రవేశించడానికి మానవాళి పడుతున్న పురిటి నొప్పుల గురించీ సుప్రసిద్ధ అమెరికన్ మేధావులలో ఒకరైన ప్రొఫెసర్ పాల్ కెన్నెడీ రచన ''ప్రిపేరింగ్ ఫర్ ది ట్వంటీ ఫస్ట్ సెంచరీ''. రానున్న అయిదు - పదేళ్ళలో ప్రపంచవ్యాపితంగా సంభవించగలవని తానూహిస్తున్న పరిణామాలకు ఇది కెన్నెడీ వాక్చిత్రం. వర్తమాన ప్రపంచంలో సంపన్న దేశాలకు, వర్ధమాన దేశాలకు, ఇంకా తక్కువ స్థాయిలో ఉన్న బడుగు దేశాలకూ మధ్య సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో ఉన్న అసమానతలు ఆధారంగా రానున్న శతాబ్దంలో దేశాల వృద్ధిక్షయాలను గురించిన ఒక ఊహాచిత్రాన్ని కళ్ళముందుంచుతున్న రాజకీయార్థ శాస్త్రం ఇది. పాల్ కెన్నెడీ రచనలో మంచి-చెడుల గురించి స్థూలంగా పరిశీలించే ముందు తాజాగా నాల్గైదు రోజుల క్రితమే మరి ఇద్దరు అమెరికన్ ప్రముఖులు ప్రపంచ వర్తక వాణిజ్యాల తీరు తెన్నుల గురించి వెల్లడించిన అభిప్రాయాలను కూడా గణనలోకి తీసుకోవాలి. అదే విధంగా విదేశీ గుత్త సంస్థల వ్యాప్తి వల్ల జరుగుతున్న అవకతవకల గురించి, ఈ పరిణామ క్రమాన్ని ముందుకు నెట్టడంలో సామ్రాజ్యవాద శక్తుల లక్ష్యం గురించి ప్రపంచ ప్రజలకు వారు చేస్తున్న హెచ్చరికను కూడా పెడచెవిని పెట్టలేము ఈ ఇద్దరిలో ఒకరు ప్రముఖ ఆర్థికవేత్త రేమాండ్ లొట్టా, మరొకరు అమెరికన్ రిపబ్లికన్ పార్టీ తరపున క్లింటన్‌కు వ్యతిరేకంగా అమెరికా అధ్యక్ష పదవికి పోటీచేస్తున్న రిపబ్లికన్ మితవాది

పాట్ బుఖనాన్. ''సామ్రాజ్యవాద శక్తులు తమ సొంత ప్రయోజనాల కోసం రూపొందించుకున్న ఆర్థిక విధానాలే ప్రపంచంలోని వివిధ సంక్షోభాలకు దారి తీస్తున్నాయి''నీ, వరల్డ్ బ్యాంక్, ఐ.ఎమ్.ఎఫ్.ల ద్వారా తమ ఆర్థిక విధానాలను వర్ధమాన దేశాలపైన బలవంతంగా రుద్దుతున్నాయనీ డాక్టర్ లొట్టా అభియోగం. కాగా పాట్ బుఖనాన్ అమెరికాలో ఒక నూతన రాజకీయ శకాన్ని ఆవిష్కరిస్తున్నాడా అన్నట్టు, అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేసే ప్రకటనలు చేస్తున్నాడు. 'మార్కెట్ ఎకానమీ'ని ఆయన సంత దోపిడీతో పోల్చుతూ లాభాల వేట అనే తొక్కిసలాటలో సామాన్య మానవుడు బతకలేని పరిస్థితి వస్తుందన్నాడు. అందుకాయన చూపుతున్న విమోచన మార్గం - ఈ శతాబ్దం తొలి దినాల్లో అమెరికాలో తలెత్తిన పౌర సంస్థలను, చైతన్య వంతమైన పౌర ఉద్యమాన్ని పునరుద్ధరించడం. అంతేగాదు, నేటి అమెరికన్ పాలక వర్గాలు సోవియెట్ పతనం తర్వాత ''ప్రచ్ఛన్న యుద్ధం'' తొలగి ''ఏ నూతన ప్రపంచ ఆర్థిక వ్యవస్థ''కు బీజాలు పడ్డాయని ప్రపంచ దేశాలను నమ్మించజూచారో ఆ అమెరికన్ విధాన పునాదులనే ప్రశ్నిస్తున్నాడు బుఖనాన్! అతని ఉద్దేశంలో - ఇటీవల ప్రపంచ వాణిజ్యంలో వస్తున్న పరిణామాలు, టెక్నాలజీలో వస్తున్న పెను మార్పులూ సాధారణ, మధ్యతరగతి వర్గాల ప్రయోజనాలను దెబ్బతీస్తున్నాయి; పారిశ్రామికాభివృద్ధి దశలో ఉన్న దేశాలలో సంపన్న వర్గాలకూ పేద వర్గాలకూ మధ్య వ్యత్యాసాలను మరింతగా పెంచివేస్తున్నాయి. అందువల్ల అమెరికా తన వస్తూత్పత్తి రక్షణకు తగిన ఏర్పాట్లు చేసుకోవాలేగాని ప్రపంచం తరపున 'వకాల్తా' పట్టే పనికి దిగకూడదని బుఖనాన్ వాదన. ఇందుకనుగుణంగానే కార్పొరేట్ అమెరికా అల్లకల్లోలానికి గురవుతోంది. ''విశ్వీకరణ'' (గ్లోబలైజేషన్) పేరుతో, టెక్నాలజీ పేరుతో నేడు జరుగుతున్న పని ఉపాధి అవకాశాలు పెంచడం గాక వేలు, లక్షల సంఖ్యలో పనివాళ్ళను ఉద్యోగాల నుంచి ఊడబెరకడమేననీ, ఈ పరిణామం అమెరికాలో రాజకీయ విపరిణామాలకు దారితీసే ప్రమాదం ఉందని ''న్యూస్ వీక్'' లాంటి పత్రికలూ రాస్తున్నాయి. సెనేట్ మెజారిటీ నాయకుడు రాబర్ట్ డోల్ ఇంకొంచెం ముందుకుపోయి ''కార్పొరేట్ సంస్థలు లాభాలు తెస్తున్న మాటా నిజమే, కార్పొరేట్ లేఆఫ్లు పెరిగిన మాటా నిజమే''నని వ్యంగ్యంగా వ్యాఖ్యానించారు. అంతేగాదు, అమెరికా కుదుర్చుకుంటున్న వాణిజ్య ఒప్పందాలను విమర్శిస్తూ కొత్తగా ఏర్పాటైన ప్రపంచ వర్తక సంస్థ (WTO) నుంచి అమెరికా ఉపసంహరించుకోవాలని కూడా సలహా ఇస్తున్నాడు. పైగా బుఖనాన్ కారల్ మార్క్స్‌ను ఉదహరిస్తూ అమెరికాకు స్వీయ రక్షణ విధానమే

(ప్రొటెక్షనిజం) వర్తక వాణిజ్యాలలో శ్రీరామ రక్ష అని చెప్పాడు : ''స్వేచ్ఛా వాణిజ్య వ్యవస్థ వినాశకరమైనదీ, సాంఘిక విప్లవాన్ని త్వరితం చేసే దగ్గరి మార్గం'' అనీ హెచ్చరించాడు.

ఈ పూర్వరంగంలో చూసినప్పుడు పాల్‌కెన్నెడీ రచన ("Preparing For The Twenty First Century") వైశిష్ట్యం మనకు తెలుస్తుంది. కెన్నెడీ ఈ రచనకు ముందు మరొక గ్రంథం రాశాడు. 1500-2 000 సంవత్సరాల మధ్య ప్రపంచదేశాలలో వచ్చిన ఆర్థిక పరిణామాల, సైనిక ఘర్షణల సారాంశాన్ని వివరిస్తూ, పెద్ద రాజ్యాల వైభవ పతనాలకు కారణాలను వెల్లడించిన రచన అది. (''రైజ్ అండ్ ది ఫాల్ ఆఫ్ ది గ్రేట్ పవర్స్''). ఈ రెండు రచనల్లో కెన్నెడీ ఏయే శక్తులు ఈ దేశాల ఉత్థాన పతనాలకు పౌరోహిత్యం వహించాయో చెప్పాడు. '21వ శతాబ్ది' రచనలో నేటి మల్టీనేషనల్స్ విస్తృతి వల్ల, టెక్నాలజీ ప్రదర్శిస్తున్న విశ్వరూపం వల్ల మానవ సంబంధాలలో, దేశాల మధ్య సంబంధాలలో రాగల మార్పులను, వినాశకర పరిణామాలను సోదాహరణంగా వివరించాడు. ''పరస్పరం సంఘర్షించిన శక్తులలో చరిత్ర పుట్టెను'' అన్న మహాకవి మాటకు కెన్నెడీ ఆవిష్కరిస్తున్న 'శతాబ్దం' కూడా సాక్షి కాబోతోంది! పెరుగుతున్న జనాభా, తరుగుతున్న సహజవనరులు, కాలుకదపనక్కరలేని కమ్యూనికేషన్ వ్యవస్థ, బయోటెక్నాలజీ, జెనెటిక్ ఇంజనీరింగ్, విశ్వసమాచార వ్యవస్థ ఇన్ని రకాల అనుకూల ప్రతికూల వాతావరణం మధ్య ప్రవేశిస్తున్న మరొక మహమ్మారి - మల్టీ నేషనల్స్. ఈ బహుళజాతి గుత్త సంస్థల ప్రవేశంతో దేశదేశాల ఆర్థిక, రాజకీయ వ్యవస్థలు కల్లోలానికి గురి కాగలవన్న హెచ్చరికను పాల్ కెన్నెడీ గ్రంథం అందిస్తోంది. జన్యు శాస్త్రంలో (జెనెటిక్ ఇంజనీరింగ్) వస్తున్న పెను మార్పుల వల్ల ఆహారోత్పత్తులు ఎలా ఇబ్బడి ముబ్బడికాగలవో చెప్పాడు. వచ్చే శతాబ్ది పూర్వార్థం నాటికే ప్రపంచ జనాభా 800 నుంచి 1000 కోట్లు కాగలదని అంచనా. బయోటెక్నాలజీ సాధిస్తున్న విజయాలు జనాభాకు, దాని ఆహార అవసరాలకు మధ్య గండిని ఎలా పూడ్చగలవో చెప్పాడు. రానున్న యుగంలో జనాభా, పర్యావరణ పరిస్థితులూ పరస్పరం ఎలా ప్రభావితం చేసుకుంటాయో వివరించాడు. ఈ సమస్యలు ఆధారంగా పరిష్కారం కోసం పెనుగులాడుతున్న రాజకీయాలు ఏ దిక్కును ఆశ్రయించబోతున్నాయో ఉదాహరించాడు. కొత్త సాంకేతిక పరిజ్ఞానం సంప్రదాయ విలువలను ఎలా ప్రభావితం చేయబోతోంది? శాస్త్ర, సాంకేతిక రంగాలలో దూసుకు వస్తున్న పరిణామాలు పెరుగుతున్న జనాభా

ఉపాధి అవకాశాలను పెంచుతాయా? ''టెస్ట్ ట్యూబ్'' ప్రయోగాల ఫలితంగా సరికొత్త మొక్కల, మొగ్గల అనుసృష్టి - ''విశ్వామిత్ర సృష్టి''కి దారితీసి కనుల పండువైన కొత్త సంస్కృతికి తోడునీడలవుతాయా, లేదా వెర్రి వేయి విధానాలన్నట్టు భస్మాసుర హస్తంగా మారుతుందా? తన బాగోగులన్నీ మానవుడి హస్తవాసి అంటాడు, అతని చేతిలోని పనే అంటాడు, కెన్నెడీ.

ఇండియా, చైనాల మధ్య పోలికతెస్తూ, చైనా జనాభా రేటు 2.4 శాతానికి పడిపోగా, ఇండియా రేటు 4.3 వద్దనే నిలిచిపోయింది. శిశుమరణాల సంఖ్య చైనా కంటే మనకు రెట్టింపు. జనాభా పెరుగుదలను ఇండియాలో త్వరపడి అదుపుచేసుకొనకపోతే 2025వ సంవత్సరం నాటికి చైనా జనాభా స్థాయికి చేరిపోతుంది. ఫలితంగా భూములు లేని నిరుపేదల సంఖ్య పెరిగిపోతుంది; పౌష్టికాహారానికి, అక్షరాస్యతకూ హెచ్చుమంది మరింత దూరమవుతారు; కొంపాగోడు కోల్పోతారు. జనాభా నియంత్రణ జరక్కపోతే ప్రస్తుతం జనాభాలో సగం మందిని పీడిస్తున్న దారిద్ర్యం పెచ్చరిల్లుతుంది. ఈ పరిస్థితులలో 15 ఏళ్ళ వయసులో ఉన్న వారిలో 40 శాతం జనాభా దారిద్ర్య పరిస్థితులు ఆఫ్రికా, పశ్చిమాసియాలలోని పెక్కు దేశాలకు దగ్గరగా ఉంటాయని కెన్నెడీ రాశాడు. అయితే దక్షిణాసియాలో, తూర్పు ఆసియాలో ఇండియా - చైనాలు ''ప్రాంతీయ అగ్రరాజ్యం'' కావాలని తహతహలాడుతున్నాయని ఆరోపించాడు. జనాభారీత్యా అగ్రరాజ్యాలైన ఈ రెండు దేశాలు రాజకీయంగా కూడా అగ్రరాజ్యాలు కావడం ఇష్టంలేకనే కొందరిలా రాస్తున్నారు. అంతర్జాతీయంగా చూస్తే ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో పరిస్థితులను విశ్లేషించడానికి ప్రయత్నించినంతగా అమెరికా, పశ్చిమ రాజ్యాలు ప్రపంచ రాజ్యాలపై పెత్తనం కోసం జరిపే పెనుగులాటను కెన్నెడీ వర్ణించలేదు. అయితే సైన్స్, టెక్నాలజీలలో వస్తున్న మార్పులు - 21వ శతాబ్దంలో ప్రవేశించడానికి అన్ని హంగులతో కూడిన కొంతమంది వ్యక్తుల, సంస్థల ప్రయోజనాలకే పరిమితం కావచ్చునని, ఆ అవకాశాలు కొలది దేశాలకే పరిమితం కాగలవనీ ఆయన జోస్యం చెప్పాడు. ఎన్ని లోపాలు ఉన్నా, ఇండియా - చైనాలకున్న మానవ సంపద మరెవరికీ లేనందున, ఈ దేశాలు వాసిగల విద్యావ్యాప్తికి నడుములు బిగించి, ప్రగతి కార్యక్రమాల అమలు కోసం అకుంఠితమైన ప్రయోగాల ద్వారా ముందడుగు వేసి, ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలను ప్రోత్సహించుకొని, కార్మికుల, ఇంజనీర్ల, సైంటిస్టుల, సాంకేతికజ్ఞుల, డిజైనర్ల నైపుణాన్ని పెంచుకోగలిగితే - ఈ దేశాల అంగబలమే అసలు సిసలైన గొప్ప

పెట్టుబడి అవుతుందని పాల్ కెన్నెడీ ఆశాభావం వ్యక్తం చేశాడు. అలాంటప్పుడు జనాభా శాపం కాదు, ఆశీర్వాదమేనంటాడు! కాబట్టి ఇంతకూ కావలసిందల్లా, మానవాళికి పునర్వికాసం. అది పునర్విద్యవల్లనే సాధ్యం. ఇది కొత్త సూత్రం కాదు. ఈ ప్రాపంచిక వ్యవస్థ నిరంతరం విద్యకూ, విలయానికీ మధ్య సాగుతున్న సమరంలోనే తనతనాన్ని నిరూపించుకొంటోందని తాత్వికులు అంటారు. కాకపోతే ఈ శతాబ్దం ముగింపు దశలో అజ్ఞానానికీ విజ్ఞానానికీ మధ్య ఈ పోరు మరింత ఎక్కువగా ఉంటుంది. ఎందుకని? జనభా సమస్యలు, మానవుడు తన అవసరాల కోసం దారితప్పి చెడగొట్టుకుంటున్న పరిసరాలు, వినాశాన్ని చేతులారా కొని తెచ్చుకోగల మానవుని శక్తీ - ఈ పోరుబాట తీరును దిద్దితీర్చుతుందని కెన్నెడీ-ఊహ. ఈ సందర్భంగా శ్రీశ్రీ చెప్పిన ఒక మాట గుర్తుకొస్తుంది: ఈ సారి యుద్ధం వస్తే దేవుడున్నట్టే, యుద్ధం రాకపోతే - మానవుడే దేవుడవుతాడు!!

*(ఆదివారం 3, మార్చి 1996)*

# భారతీయ నవలాకాశంలో 'అరుంధతీ' నక్షత్రం

ఉదయ సంధ్య, సాయం సంధ్య - ఆమె సమయా సమయాలు. కాలం ఆమె చేతిలో కరకు తేలింది. ఆమె కళ్లతో వింటుంది. చెవులతో చూస్తుంది. కాలం కదలికలను కనిపెట్టగల కళా వైదుష్యం తన సొత్తు కాబట్టే, ఆమె దృష్టిలో ఒక్క రోజులోనే, 24 గంటలలోనే వైయక్తికంగానూ, సామాజికంగానూ మార్పులు, ఎన్నో మార్పులు సంభవం. కాలవాహినిలో ఆ కొలది గంటలే మానవుల జీవితాల్ని ఊగించి శాసిస్తాయి, కుదిపివేస్తాయి. కాలిపోయిన ఇల్లు మిగిల్చిన శిథిలాల నుంచి పునర్జీవనానికి ప్రాణికోటి తహతహలాడుతుంది. ఆ శిథిలాలను చారిత్రక సత్యాలుగా పునరుజ్జీవింపజేసి పరిశోధించి భద్రపరచాలి, ముందుతరాలకు చరిత్ర పాఠాలు అందించాలి. ఆ శిథిల చరిత్ర పొదిగిన రహస్యాలను వెల్లడించాలి. దాచినా దాగని సత్యాలకు కొత్త అర్థాలు చెప్పాలి. నూతన భాష్యాల ద్వారా నవ్య సంస్కృతీ నిర్మాణానికి నడుంబిగించాలి. అవి కొందరి దృష్టిలో చిన్న ఘటనలే కావొచ్చు, అతి సామాన్య విషయాలే కావొచ్చు. కాని ఆ 'చిరు'సత్యాలే చిరంతన సత్యాలుగా సానతీరిన జానపదుల వ్యథార్థ జీవిత యథార్థ దృశ్యాలుగా విశుద్ధ కథారత్నాలుగా ("they become the bleached bones of a story") మన కళ్లముందు ఆవిష్కరించుకోవాలని ఆమె ఆకాంక్ష. అదే - తాడితుల, పీడితుల జీవితాలను పోరుబాటలో దిద్దితీర్చుకొనే రోజు కోసం ఎదురు చూస్తున్న ఆమె చేతిలోని కథా వస్తువు. అందులోనే ఆమె చిన్నారి లోకాల చిరుదేవుళ్లను చూపింది. ఈ రోజుకీ రకరకాల వెలివేతలకు లోనవుతున్న దళితుల భగ్న హృదయాలను విప్పిచూపిన ఆమె నవల ''ది గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్''. రచయిత్రి అరుంధతీరాయ్! ఇటీవల అంతర్జాతీయ సాహితీ క్షేత్రంలో కొత్త సాళ్లు దున్నుతున్న అరుంధతి సృష్టించిన ఈ నవలపై వచ్చిన బహుకొలది భాష్యాలూ, విమర్శలూ - అసలు నవలా సారాంశాన్ని ఏ మాత్రం పట్టుకోకుండా చిల్లర మల్లర ముచ్చట్లతో సరిపెట్టుకున్నాయని చెప్పాలి! పురాణ సృష్టి అయిన వశిష్ఠుడు పాతివ్రత్య ధర్మం పేరిట స్వార్థం కొద్దీ తనకు కట్టు బానిసగా మార్చుకొనేందుకు ఆనాటి అరుంధతికి కమండలాన్ని చేతికిచ్చి దానితోనే సరిపెట్టుకోమని

జబర్దస్తీ చేసి ఉండవచ్చు. కాని ఈనాటి అరుంధతి ఆ కమండలాన్ని కత్తిగా, కలంగా మలిచింది! అధునాతన భారతీయ నవలా ప్రపంచంలో వింతకాంతులతో, నిశితమైన స్వచ్ఛంద భావనాధారతో, సరికొత్త మనో దృశ్యాలతో, అరుదైన చమత్కారంతో, ప్రతి పద కవితా స్ఫూర్తితో తొలి రచనతోనే వెలుగులు చిమ్ముకుంటూ అవతరించిన కవీ, కథా రచయిత, నవలాకారిణి అరుంధతీరాయ్. కమలాదాస్ స్వీయ చరిత్రను పోలిన స్వీయ కథా చిత్రం అరుంధతి నవల. అరుంధతి ఒప్పుకొన్నా, లేకపోయినా ఎదుగుదలలో ఎన్నో అవకాశాలకు దూరమైన దళిత బిడ్డల, అనాథల ఆక్రందనకు తన స్వీయ చరిత్ర పూర్వరంగంగా అక్షర రూపమిచ్చిన నవల ఇది. రాహెల్ (బాలిక) ఎసా (బాలుడు)లు జీవితమనే తిరుగలిలో నలిగిపోతున్న అనేక మంది బాలబాలికల తీరని కోరికలకు, తీర్చుకునే తాపత్రయంలో అంగలార్చి అడుగడుగునా హతాశులయ్యే ప్రాణులకూ ఇందులో ప్రాతినిధ్యం వహిస్తారు. ఇలాంటి అనాథల్ని, అణగారిన సంతతినీ, సమాజం అజాపజా పట్టించుకోని దళితులను చరిత్ర హీనుల్ని చేయడానికి చరిత్రలో జరిగిన ప్రయత్నాన్ని, అన్యాయాన్నీ ఎండకట్టడం అరుంధతి రచన అసలు ఉద్దేశం. కావలసింది ఆ ప్రేమ పురాణాలు, ఈ ముట్టడికైన ఖర్చుల చిఠాలు కావు. ఇందులో జాగ్రఫీ ఉంది, చరిత్ర ఉంది, కనిపించని చరిత్ర తాలూకు రహస్య పురాగాధలున్నాయి. ''రూట్స్'' గ్రంథంలోలాగా దగాపడిన దళిత జీవుల తరతరాల వంశ వృక్షాల తబిశీళ్లు తెలుసుకునే ఓ ప్రయత్నం ఉంది. చారిత్రక విభాత సంధ్యలలో, స్పృశ్యాతాస్పృశ్యతల ఊసులేని ఆ సువయూహూర్తాలలో పీడితులు వేసిన అడుగుజాడలను, వాటి ఆనవాళ్లనూ రూపుమాపడానికి జరిగిన కుట్ర దాఖలాలు వెల్లడించే ప్రయత్నం ఉంది. ("their foot Prints had been swept away')! కేరళ కార్యరంగంగా, అలెప్పీ, ఎర్నాకుళం, కొట్టాయంలు వేదికలుగా జరిగిన దళితుల మహాప్రస్థాన గాథకు రాహెల్, ఎస్తాలు నవల ఆసాంతం ప్రాతినిధ్యం వహిస్తారు. ఇందులో హైందవుల మీదనే కాదు, క్రైస్తవం మీద, చర్చి పనుల మీద కూడా చెణుకులున్నాయి. బైబిల్‌ను ఒక చేత్తో, బందూకును మరొక చేత్తో పట్టుకొని కేరళలో ప్రవేశించిన క్రైస్తవ చరిత్ర కొంత ఉంది. క్రైస్తవాన్ని ఆశ్రయించక తప్పని దారిద్ర్య గాథ ఉంది. పార్లమెంటరీ పంథాను చేపట్టిన తరువాత ''రంగు మార్చకుండానే దిక్కుమార్చి''న వామపక్షాల వ్యాపార సరళి గురించిన అంటింపులూ ఉన్నాయి, వాస్తవాల చాటింపులూ ఉన్నాయి అవకతవకలకు, అన్యాయాలకూ చోటిచ్చిన వివాహ చట్టాలపై (లవ్‌లాస్) చరుపులున్నాయి, పురుషాహంకార సమాజంపై విరుపులూ ఉన్నాయి! సల్మాన్ రష్దీ బొంబాయిలో తన చిన్ననాటి ముచ్చట్లు ఆధారంగా ''మిడ్‌నైట్

చిల్డ్రన్'' రాశాడు. కేరళ వాతావరణం జీవన పతాకంగా అనాథ దళితుల చరిత్రకు అరుంధతి నవల బీజం వేసింది. అందుకు అవసరమైన వాతావరణాన్ని ఆస్ట్రియా నుంచి ఆంధ్రప్రదేశ్ దాకా (హైదరాబాద్) కథలో అల్లుకుంది. ''అయెమీనమ్'' గ్రామం కథా వేదిక. అంతర్జాతీయంగా గుర్తింపుకోసమా అన్నట్టు ఒక తరం వారి పాత ఇంట్లో పురా వస్తువులు - వయోలిన్ స్టాండు, ఊటీ కబోర్డులు, ఢిల్లీ బెడ్స్, దంతపు గుబ్బలు పొదిగిన వియన్నా డ్రెస్సింగ్ టేబిల్, డైనింగ్ టేబిల్ చూపిస్తుంది. రాహెల్, ఎస్తా కవలల తల్లిదండ్రులు, తాతముత్తవలు, ముత్తాతలు, జేజెమ్మలు జీవన సమరంలో పడిన కడగండ్లను ఏకరువు పెట్టటంలో ''అమ్ము'' పాత్ర ద్వారా అరుంధతి తన 'అమ్మ' మేరీరాయ్ గాథను చెప్పక చెప్పింది! దారిద్ర్య భారంలో ఉన్న కుటుంబానికి గానీ, వ్యక్తికి గానీ ఎదురయ్యే సమస్యలు ఒకటి కావు. శూద్రకుడు రాసిన ''మృచ్ఛకటికమ్''లోని చారుదత్తుడు చెప్పినట్టు దారిద్ర్యంతో తీసుకుంటున్న వ్యక్తి నెత్తిపైకి చేయని నేరాలు కూడా వచ్చిపడతాయి. భర్త తప్పిదానికి భార్య బలికావడం సర్వసాధారణం. ఛిద్రమైన కుటుంబానికి రక్షణ దుర్లభం. అదే 'అమ్ము'కు జరిగిన అన్యాయం. అరుంధతి తన బెంగాలీ భర్తకు విడాకులివ్వవలసి వచ్చింది. ఈ నవలలోని 'అమ్ము' (కవలల తల్లి) అస్సాం టీ తోటల్లో ఉద్యోగం చేసుకుంటూ తాగుడికి అలవాటు పడిన భర్త సంసారాన్ని గాలికి వదిలినప్పుడు విడాకులు తీసుకుంటూ కవలల్ని అతి కష్టం మీద సాకుకుంటూ వస్తుంది! అరుంధతికి ఆర్ద్రత హెచ్చు, మానవతా స్పర్శ అమోఘం. ''బందిపోటు రాణి''గా ప్రసిద్ధిలోకి వచ్చిన పూలన్‌దేవిపై తీసిన చలన చిత్రాన్ని మానవీయ దృష్టితో తూర్పారపట్టి, ఏ ఏ సాంఘిక దురన్యాయాలకు పూలన్ బలి అయిందో చెప్పి, ఆమె జీవితానికి చిత్రంలో జరిగిన వక్రీకరణను ఖండించిన మొదటి విమర్శకురాలు అరుంధతి. వాస్తుశిల్పి విద్యార్థిగా గెరార్డ కున్హా (ఢిల్లీ) పర్యవేక్షణలో బతుకు తెరువు కోసం కొన్నాళ్లు ఉద్యోగం చేసిన అరుంధతి గోవా వీధుల్లో కేకులు తయారు చేసి బీచ్‌లో వాటిని అమ్ముకుని పొట్టపోసుకుని జీవించిన కర్మజీవి, కష్టజీవి.

కుటుంబం పడిన బాధలు ఆమెకు పాఠాలయ్యాయి. కనుకనే అరుంధతి జీవన సమరంలో రాటుతేలి ఈ ప్రపంచాన్ని సాధించాలనుకుంది. ఆమె ఒక సందర్భంలో ఈ విషయాన్ని కాళ్లు తడబడకుండా నీళ్లు నమలకుండా చెప్పింది : ''చిన్నప్పటి నుంచే నేను రాజీపడకుండా నా షరతులపైననే ఈ ప్రపంచంతో విషయం తేల్చుకోవాలని నిర్ణయించాను. నాకు తల్లిదండ్రులు లేనట్టే లెక్క. బాబాయిలు, మేనమామలూ లేరు, పిన్నులు, మేనత్తలూ, ఎవరూ లేరు. నా భావికి నేనే బాధ్యురాలిని'' అలా రాజీపడలేదు

కనుకనే మిత్ర-వాత్సల్యంలో ఒకరిచ్చిన ఉంగరం రూ. 300కు అమ్ముకొని (గోవాలో) జీవించగలిగింది. ఒక పట్టణాభివృద్ధి సంస్థలో ఓ చిన్న ఉద్యోగం కుదిరితే అద్దెకు తీసుకున్న సైకిల్‌మీద వెడుతుండేది. తల్లిదండ్రులు ఉండి కూడా అనాథగా బతికిన అరుంధతి ఇంత దారిద్ర్యం అనుభవించబట్టే తన నవలలో దళిత చరిత్రను నూతన కోణం నుంచి దర్శించింది. కథా క్రమంలో ఒకచోట కర్ణుణ్ణి అనాథ దళితుడుగా పేర్కొంటూ అతడు స్వయం ప్రతిభతో పలువురు మెచ్చిన ఆరాధ్య వీరుడయ్యాడని చెప్పి, వ్యక్తిత్వ వికాసానికి జేజేలు పలుకుతుంది! పరాజయం పరాభవం కాదని, రాబోయే విజయ పరంపరకు పునాది అనీ భరోసా ఇస్తుంది. నిరాశలో కూడా తొణకని నిండుకుండగా కర్ణుణ్ణి భావిస్తున్న అరుంధతి దళితులందరి మనస్సుల్లో సదా వెలగవలసిన నక్షత్రం. జీవితానుభవం నుంచి ఆమె నేర్చుకున్న పాఠం - ఎవరినీ పూర్తిగా నమ్మకూడదని! బ్రూటస్ సీజర్‌కు పరమ ఆప్తుడే అయినా ఆయన్ని చంపింది కూడా బ్రూటస్సే! అందువల్ల **"You cannot trust anybody, mother, father, brother, husband, best friend, Nobody"** అంటుంది అరుంధతి. ఇది ధర్మాగ్రహంలో వచ్చిన శాపమే కాని చరిత్రను తప్పుగా అర్థం చేసుకోడం కాదు. ఆ విశ్వాసం లేకపోతే కర్ణుణ్ణి వెనకేసుకురాదామె! చరిత్రకు కొత్త భాష్యం చెబుతున్న అరుంధతి దృష్టిలో - సమకాలీన చరిత్ర, యుద్ధాలు, కలలలో కనే యుద్ధాలూ, చంద్రుడిపై మానవుడి కాలూనిక, ఈ శాస్త్ర, సాంకేతిక విజ్ఞానం, సాహిత్యం,తత్వశాస్త్రం, విజ్ఞానాన్వేషణ - ఇవన్నీ నేలతల్లి కనురెప్పల చాటున దాగవలసిందే, తమ ఉనికిని అలా సమర్థించుకోవల్సిందే! అంతేగాదు, అరుంధతి ఆలోచనలో జాతి ఎదుర్కొనే సంక్షోభాల ముందు వైయుక్తికమైన నిరాశ నిస్పృహలు పనికిమాలినవీ, వెలవెలపోయేవీ. ఒక విధంగా మన జాషువా కవితా ''గబ్బిలం''తో పోటీపడుతున్న నవల అరుంధతి వచన రచన! జాషువా అన్నట్టు ''నాదు కన్నీటి కథ సమన్వయము సేయ / నార్ద్ర హృదయంబు గూడ కొంతవసరంబు''. ఆ అవసరాన్ని అరుంధతి గుర్తించింది. జరిగిన పొరపాటు సకాలంలో సరిదిద్దుకొనకపోతే అది అలవాటుగా మారి సంప్రదాయంగా ఆచారంగా బలపడుతుంది. అస్పృశ్యతకు అర్థం అదే స్పర్శకు, స్పందనకూ తభేదం ఉంది. దారిద్ర్యాన్ని గుర్తించగలగడం స్పర్శ, దారిద్ర్యాన్ని రూపుమాపడానికి ఉద్యమించడం స్పందన అలాంటి స్పందన లేని వాళ్ల గురించి అరుంధతి ఏమంటుంది? చూసీచూడనట్టు తప్పించుకు తిరగడం అలవాటులో ఘోరపొరపాటు అంటుంది ఎలా? "the smellness, like other peoples" Poverty was merely a

matter of getting used to.... airconditioning, nothing more"! ఈ తప్పిదం ఇలా ఉండగానే ఒకరెవరో కేరళలో అరుంధతి నవల ''అశ్లీల'' రచనగా పేర్కొంటూ, అలాంటి ప్రస్తావనలను తొలగించాలని (పేజీ : 337) కోర్టుకెక్కారు! ఈ వాదనలో పసలేదు. ఎందుకంటే, చంద్రకాంతిని అనుభవిస్తూనే, చంద్రునిలోని మచ్చను చూపడం లాంటిదీ వాదు! మానవ జీవితం పడుగు పేకల సమన్వయం. మంచి చెడుల పూర్ణ కుంభం. బహుళ కాంతుల రోచిర్నివహం 'అశ్లీలం' గురించి కబుర్లు చెప్పేవాళ్లు కాపురాలు కట్టిపెట్టి, మునివాటికలలో చేరగలిగితే, చెప్పే నీతి పాఠాలకు అర్థం ఉంటుంది. ఈ కారణం మీదనే 1930ల్లో జేమ్స్ జాయిస్ ''యులిసీస్'' నవలను నిషేధించాలని కొందరు కోర్టుకు ఎక్కినప్పుడు - అమెరికన్ జిల్లా కోర్టు జడ్జి ఊల్సే కేసును కొట్టేశాడు! నవలా రచనలో ఒక ప్రయోగంగా, భాషా రంగంలో ఒక సంచలనంగా దూసుకువచ్చిన జాయిస్ రచనను ''భావ ప్రకటనా స్వేచ్ఛకోసం జరుపుతున్న పోరాట చరిత్రలో ఒక 'మహద్ఘటన'గా న్యాయమూర్తి పేర్కొనవలసి వచ్చింది! మానవ సహజమైన జీవ కార్యకలాపాల వర్ణనే గాని అందులో అశ్లీలత తనకు కనిపించలేదన్నాడు. పరిపూర్ణ రూపంలో మానవ నైజాన్ని పాఠకులకు అందించడంలో జాయిస్ వాడిన ప్రతీ మాటా ఒక్కో అలంకారం అన్నాడు! స్త్రీ, పురుష ఆంతరంగిక జీవితాలపై అదో శక్తివంతమైన వ్యాఖ్యానం అన్నాడు ("Each word of the book is like a bit of mosaic to the detail of the picture... a very powerful commentary on the inner lives of men and women")! ఈ మాటలన్నీ అరుంధతి రచనకూ వర్తిస్తాయి. వాక్య నిర్మాణంలో, భాషా ప్రయోగంలో కొత్త బాణీలు సృష్టించింది. భాషా సూత్రాల నియమోల్లంఘనమే కాదు, ఆంగ్ల నవలా చరిత్రలో సీమోల్లంఘనమూ చేసింది. అరుంధతి భావ చిత్రాలకు ఓ ఉదాహరణ : ''ఆ కళ్లలో సాగర రహస్యాలు - ఆ చెవులపై ముత్యాల వాన చినుకులు (Sea secrets in eyes - A silver raindrop on ear). దళితుల ప్రస్తుత పరిస్థితులను కూడా అరుంధతి పరామర్శించింది : ''అస్పృశ్యతా సమరంలో మేము బందీలం. చివరికి మా కలల్ని కూడా వీళ్ళు శాసిస్తున్నారు. కల్లోల సముద్రంలో లంగరు దొరకని ప్రయాణం మాది. తీరమూ, చేరనివ్వరు. మా కన్నీటి వాగులా, ఇంతకన్నా తరిగేది లేదు. మా ఆనందాలా, పెరిగేది లేదు. అసలు మా జీవితాల విలువ ఇంతకన్నా ఒరిగి పడేదీ లేదు. ఈ స్థితిలో మా జీవితాలు చిన్ని చిన్ని కోర్కెలతోనే సరిపుచ్చు కుంటాయి.''

*(ఆదివారం 13, జులై 1997)*

# ''నల్లరేగడి దున్ని చూడు! తెల్లజొన్నలు పండవేమో''!

''వ్యవసాయాన్ని మించిన కళేం ఉంది? వ్యవసాయదారుడిని మించిన కళాకారుడెవ్వరు? పొలం కాగితం పైన నాగలి కుంచెతో గీసే అద్భుత చిత్రాలు పచ్చని చేలు. మట్టిని మాణిక్యంగా మలచకలిగే పరుస వేదిని ఎరిగిన స్వర్ణకారుడు; ఎద్దు మువ్వల నేపథ్యంలో అలుపు తీర్చుకోను ఆశువుగా పాడుకునే పాటలతో సంగీతకారులకే సంగీత కారుడు; ప్రకృతి మాత గీచిన అపురూప చిత్రంలో ఆమె మురిపంగా దిద్దుకున్న ముద్దు బిడ్డడు వ్యావసాయదారుడు''.

రెండు మూడు రోజులనాడే లాస్ ఏంజల్స్‌లో జరిగిన పదకొండవ ఉత్తర అమెరికా తెలుగు మహాసభల సందర్భంగా భూరి పురస్కారం పొందిన తెలుగు ఆడపడచు పైడి చంద్రలత రచించిన ''రేగడి విత్తునాలు'' నవలకు ఈ మాటలు తాత్త్విక పునాదిని సమకూర్చి పెట్టాయి. ఇది చంద్రలత తొలి నవలే అయినా తెలుగు రైతు చేతికి అందివచ్చిన చంద్రహాసం! ఇది తెలుగు రైతు ఉసురు. తెలుగు నవలా చరిత్రను కొత్త మలుపు తిప్పగల నవల 'రేగడి విత్తులు'; కోస్తాలోని రేపల్లెకు, తెలంగాణాలోని 'మైబ్‌నగర్' (మహబూబ్‌నగర్ - పాలమూరు) జిల్లాలోని ''నడిగడ్డ''కూ మధ్య వారధిగా వలసపోయిన ఒక రైతు కుటుంబం ఈ నవలకు ఇతివృత్తం. అమెరికాలో భారతీయ ప్రవాసుల కడగండ్లకు భారతీముఖర్జీ సరిగ్గా పదేళ్ల నాడు ''ది మిడిల్ మాన్ అండ్ అదర్ స్టోరీస్'' రచన ద్వారా అద్దం పట్టింది. ప్రవాస భారతీయుల సమస్యలను, వారి జీవితాలను ఆమె ఉద్విగ్న హృదయంతో సజీవ పాత్రలలో హాస్య భరిత సంభాషణా చాతుర్యంతో మలిచిపెట్టింది నిష్కర్షగా చర్చించింది, నిండు మనసుతో అభిప్రాయాలు వెల్లడించింది ముఖర్జీ నవలకు ఆనాడు (1988) ''నేషనల్ బుక్ క్రిటిక్స్ సర్కిల్ అవార్డు'' పురస్కారం లభించింది. కాగా ఈ రోజున పైడి చంద్రలత తెలుగు రైతు

బాగోగులను, కష్టసుఖాలను సీమాంతరాలు దాటించి అక్కడి తెలుగువారిని అలరించే ప్రయత్నం చేసింది. ఇది సామాన్యమైన ప్రయత్నం కాదు, బృహత్ యత్నం. ఇది విశాలాంధ్ర సరిహద్దులలోనే జరిగిన ప్రవాసాంధ్రుల కథ, వాస్తవ గాథ, ప్రకృతి వైపరీత్యాల దోబూచులాటల మధ్య, ప్రభుత్వాల ప్రజా వ్యతిరేక విధానాల మధ్య, పాలకుల పదవీ వెంపరలాటల మధ్య కొన్ని రైతు కుటుంబాలు, నేలతల్లిని, కన్నతల్లిలాంటి భూమినీ నమ్ముకొన్న తెలుగు కుటుంబాలు మనుగడ కోసం రాష్ట్రంలోనే మరో తెలుగు ప్రాంతానికి వలసపోయిన గాథ ఇది. చంద్రలత ''రేగడి విత్తులు'' ఆద్యంతం మట్టి వాసనే. చెలకదున్నుకుని, బతికి పరాధీన స్థితి నుంచి బయటపడాలన్న రైతు ఆశ ఈ నవలకు శ్వాస! ఈ శ్వాసను పీల్చుకోడానికి వచ్చిన అడ్డంకులను అధిగమించి సమైక్యతా గానం చేసిన కుటుంబగాథ నవలకు ప్రాణం. ఆంధ్ర - తెలంగాణా ఉద్యమాలకు అతీతంగా, బతుకు తెరువు కోసం ఆధునిక పద్ధతులలో వ్యవసాయాన్ని చేపట్టి నాలుగు రాళ్ళు వెనకేసుకోడంకోసం వలసపోయిన చోట ప్రతివారికీ ఆదర్శకుటుంబంగా అవతరించడానికి చేసిన ప్రయత్నం దానికి పూర్వ రంగం. తెలుగుజాతి వైతాళికులలో ఒకరైన సురవరం ప్రతాపరెడ్డిని కన్నగడ్డ ''నడిగడ్డ'' కృష్ణా - తుంగభద్రల మధ్య నల్లరేగడి ప్రాంతం. సారవంతమైన నడిగడ్డ ఏళ్ళూ పూళ్ళుగా బీడుగా, తుమ్మల బీడుగా, నైజాం రక్కసి కీడుగా పడి ఉన్న, కేవలం జొన్నకు, సజ్జకు, వాము పంటకూ పరిమితమైన ఆ భూమిలో వరివంగడాలతో, సంకరజాతులతో రాజనాలు పండించగల గడ్డగా మార్చడానికి చేసిన కృషీవలుల అవిశ్రాంత శ్రమ జీవనానికి ఈ నవల నిలువుటద్దం. స్థానికుల సహకారం, ఆప్యాయతలు, అనురాగాలు, ప్రేమలు, ఎదుటివాడి మనస్సు నొప్పించకుండా వారితో కలివిడిగా, కలుపుగోలుగా స్థానికులతో ప్రవాసులు సంచరించడం తెలుగువారి ప్రాంతాలలో తెలుగు వాడిగానే మసలడం - రెండు ప్రాంతాల మధ్య ప్రజల మనోవికాసానికి ఎలా దోహదం చేస్తుందో నిరూపించిన అద్భుత నవల ''రేగడి విత్తులు''. తెలుగు రైతు కుటుంబాల సాంఘిక, ఆర్థిక, రాజకీయ, పర్యావరణ రంగాలను సమతూకంలో సర్వహంగులతో పరామర్శించిన రైతు నవల బహుశా ఇంతవరకు మనకు లేదని చెబితే అతిశయోక్తి కాదు! మనకు ఉద్దండులైన రైతు నాయకులు ఎందరో ఉండవచ్చు; చేయి తిరిగిన పెక్కుమంది రచయితలు, కవులూ ఉండవచ్చు; పేదల, మధ్య తరగతి కుటుంబాల చరిత్రను కథలుగా, నవలలుగా, కవితలుగా చెప్పవచ్చు కాని కేవలం రైతుగాథను, సాంఘికంగా అతడి కుటుంబ బంధాలను, కొంద్రతో అతడికి ఉన్న

''నల్లరేగడి దున్ని చూడు! తెల్లజొన్నలు పండవేమో''!

విడదీయరాని అనుబంధాలనూ సొగసుగా చెప్పిన నవల చంద్రలత ''రేగడి విత్తులు'' తప్ప మరొకటి లేదు! నార్లవారి ''కొత్తగడ్డ'', వాసిరెడ్డి సీతాదేవి ''మట్టిమనిషి'', దాశరథి రంగాచార్య ''జనపదం'', పెరల్‌బక్ ''గుడ్‌ఎర్త్'', షోలకోవ్ ''బీళ్ళు దున్నేరు'' **(Virgin Soils Upturned)**, అలెక్స్ హైలీ ''ది రూట్స్'' రచనలూ మట్టివాసనలు వెదజల్లినవే. అయినా చంద్రలత ''రేగడి విత్తులు'' నిలువెల్లా రైతు స్పృహతోనే కూడుకున్న నవల. కుటుంబ సంప్రదాయాలలో, అవసరమైనప్పుడు ఆ సంప్రదాయాల ఉల్లంఘనలో, వ్యవసాయంలో పాత పద్ధతుల స్థానే ఆధునిక పద్ధతులు ప్రవేశపెట్టడంలో, సాంఘిక మర్యాదలు, మన్ననలు పాటించడంలో, ప్రకృతిని ఆరాధించడంలో, నిర్ణయంలో, నిబద్ధతలో, కరుకుదనంలో, మొండితనంలో తెలుగు రైతుల వాడినీ, వేడినీ చూపిస్తుందీ నవల! ఆ మాటకొస్తే ''రేగడి విత్తులు''లో నాయికా నాయకులు-రామనాథం, సావిత్రి ఎవరో కాదు, చంద్రలత విద్యా వికాసాలకు సాక్షాత్తూ కారకులయిన కోటగిరి మురహరిరావు దంపతులేనంటే ఆశ్చర్యపోవలసిన అవసరం లేదు. రైతుగా మారిన ఉద్యోగి రామనాథం ఆధునికత మూర్తీభవించిన వ్యక్తిగా, ప్రవాసం వెళ్ళిన అతని కుటుంబాన్ని అంటిపెట్టుకున్న వ్యక్తుల, కుటుంబాల కష్టసుఖాలన్నీ ఇందులోకి ఎక్కాయి. అతి సుఖంగా, ప్రతిపద సుందరంగా, కమ్మని తెలుగులో, నుడులతో నానుడులతో సంస్కృతీ వైభవంగా సాగిన ఈ నవలలో - రామనాథం, సావిత్రి, రత్తయ్య, లచ్చుమమ్మ, పున్నమ్మ, భూషయ్య, బ్రహ్మయ్య, బాలయ్య, శివుడు, సూరయ్య, అనూరాధ, కమలమ్మ, కల్యాణి, దమయంతి, హిమబిందు, రమ, మల్లేష్, విజయ, ప్రసాద్, చలపతి, రేణుక, శ్రీదేవి, ఇత్యాది పాత్రలన్నీ భూమిని అంటిపెట్టుకున్న సంసారాల నుంచి వచ్చినవే! ఇందులో చంద్రలత - ''నడిగడ్డ'' కాకతీయుల కాలంలో ఎలా వెలుగొందిందీ చెప్పింది. విజయనగర రాజుల, బహమనీల మధ్య పదవుల పోరులో రాజ్య విస్తరణ కాంక్షలో ఎలా నలిగిపోయి వీర రక్తపుధారలు వారపోసిందీ చెప్పింది. అందుకే ఇది రైతుగడ్డకు బదులు కొన్నాళ్ళు పోతుగడ్డ అయింది. కాని ఈ గడ్డకు నీరందించగలిగితే, ఆధునిక వ్యవసాయ పద్ధతులు చేబడితే దానినెలా గనిగడ్డగా మార్చవచ్చో రామనాథం కుటుంబం నిరూపిస్తుంది! అంతేగాదు, భూమికి విలువాలేదు, విలువ కట్టగల షరాబూ లేడు. అందువల్లనే కొందరికి చేను (నరసింహం దొరల్లాంటి కామందుల్లా) ఆస్తికాగా, స్వయంగా కాయకష్టం చేసి జీవించే రత్తయ్యలాంటి రైతుకు అదే భూమి ప్రాణం అవుతోంది. ఒకరికి ఆస్తి అలంకారం, మరొకరికి అవసరం!

కనుకనే చంద్రలత, ఏనాడైతే మట్టిపై ఉండాల్సిన రైతు కాళ్ళు గట్టుపైకి లేస్తాయో ఆ రోజే అతని పతనం మొదలవుతుందని హెచ్చరించింది! ఈ విషయంలో (భూమికి విలువకట్టే విషయంలో) ఆర్థికవేత్త రికార్డోకూ, సామాజిక శాస్త్రవేత్త, రాజకీయార్థిక శాస్త్రాచార్యుడైన కారల్ మార్క్స్‌కూ ఉన్నతేడా చంద్రలత రచనకూ ఇతర రచనలకూ మధ్య ఉందనిపిస్తుంది! పుట్టిన రేపల్లె వాడ వదిలి రామనాథం కుటుంబం మెట్టిన 'నడిగడ్డ'కు తొలుత 'నడకసిరి' నేర్పిందెవరు? రామనాథం కాదు, ''హలంపురి'' - అదే ఆలంపూర్ (హలం = నాగలి)! నడిగడ్డకు ప్రవాసిగా ఉన్నా చంద్రలత చరిత్రకు అందాలు దిద్దిందేగాని, ఉన్న చరిత్రకు నడమంత్రపు భాష్యాలు చెప్పలేదు; ప్రాంతీయ విభేదాలు రాజకీయుల రాక్షస విద్యగా, వారి సృష్టిగా తలెత్తినవే గాని, ఆంధ్రలోని గురజాల పాలకుడు చాందమూలుడి కుమార్తె పేరు ''నడుకసిరి'' అనీ, నడిగడ్డ మీదకు నాగళ్ళను తెచ్చింది ఆమేననీ, ఆ నడుకసిరికి పర్యాయపదమే 'నాగలి' అనీ చంద్రలత పదచర్చ చేయడం విశేషం! కాని ఒక్కమాట - వ్యాపారి లాభం లేనిదే వరదనపోడు; మధ్యతరగతి రైతు కూడా కష్టజీవిగా ఉంటూనే తానున్న ప్రాంతంలోకన్నా తక్కువ రేటుకు మరొకచోట భూమి లభిస్తే 'చేదు'గా భావించడనీ మరవరాదు! మానవుడి సాధారణ స్వార్థచింతనలో ఇదొక అధ్యాయం.

వలస చరిత్ర లేనివాడు ఈ ప్రపంచంలో లేడు. రాహుల్ సాంకృత్యాయన్ ''వోల్గా సే గంగా'' అసంఖ్యాక జనపదాల ప్రవాస చరిత్ర, ఆర్యుల చరిత్ర! భారతీ ముఖర్జీ రచన ప్రవాస భారతీయుల ప్రచండ యాత్రా చరిత్ర! ఆ వరసలో రచనా యాత్ర చేసిన చంద్రలత తన నవలను ఆత్మీయంగా, ఆంధ్రీయంగా తెలుగు రైతుల, తెలుగు ప్రజల, తెలుగు యువకుల సంస్కృతీ చరిత్రగా దిద్దితీర్చింది. ఆంధ్ర - తెలంగాణాల మధ్య విశ్వసనీయ వారధిగా నిలిచింది. ఈ సమన్వయాన్ని చంద్రలత భాషలో సాధించింది, భావంలో సాధించింది, అనుభవంలో సాధించింది, ఆచరణ సాధ్యంగా చూపెట్టింది. ఒక తల్లి బిడ్డల మధ్య సమైక్యతకు ఇది ఏడుగడ అని రుజువు చేసింది! కొత్తను కాదన కూడదని, అలవాటుపడడానికి ప్రయత్నించాలని చెప్పింది. రాతినేలను అరక కుమ్ముతుంది, రేగడి పార దమ్ముతో విచ్చుకుంటుంది - మానవుడి మనస్సు కూడా గుండెనిబ్బరంతో ధైర్యంతో ఉన్నప్పుడు ఇంద్రధనస్సులు చిందిస్తుంది. చంద్రలత ఇందులో గ్రామీణాభివృద్ధిని, సకల వృత్తుల సమస్త చిహ్నాలతో నిరూపించడానికి ప్రయత్నిస్తుంది నేటి సమాజంలో కనుమరుగవుతున్న ఉమ్మడి కుటుంబాలలోని మంచి

''నల్లరేగడి దున్ని చూడు! తెల్లజొన్నలు పండేవేమో''!

సెబ్బరలు, వాటిలో అడుగడుగునా తొణికిసలాడే ఛలోక్తులు, అనుబంధాలు, అప్యాయతలు, అసూయాద్వేషాలు, వేదనలు, రోదనలూ, అనివార్యమవుతున్న వ్యష్టి కుటుంబాలు, పట్టణీకరణ - ఫలితాలూ ఒక్కమాటలో మానవ సంబంధాలలోని వెలుగు - నీడలు చంద్రలత చేతిలో కమ్మెచ్చు లాగినట్టు బొమ్మ కట్టుకున్నాయి. గద్వాల గత వైభవాలు కన్నుల కట్టింది. పల్లె జీవనంలోని అమాయకత్వం, పండుగలు, పబ్బాలు, ఆనందాలు, ఆవేశాలూ, మన్ననలూ, సాంద్ర మర్యాదలూ ''రేగడి విత్తులు'' తన సొత్తుగా మార్చుకుంది! సాంఘికంగా ఇందులో చంద్రలత తీర్చిదిద్దని పార్శ్వం ఏదీ లేదనిపిస్తుంది! మూడు ప్రాంతాల (ఆంధ్ర, తెలంగాణా, రాయలసీమ) మాండలికాలూ అనువైనచోట్ల ముప్పేటగా అందాలు దిద్దుకున్నాయి. పెద్దల మాటలు చద్దిమూటలుగా అందివచ్చాయి. ఇది కేవలం నవల కాదు. చరిత్ర! నవలా రూపంలో నడిచిన మూడు నాలుగు దశాబ్దాల తెలుగువారి అచ్చటా, ముచ్చటా. సురవరం వారి ఆంధ్రుల సాంఘిక చరిత్రకు నవలా రూపం ''రేగడి విత్తులు''! దేశానికి వెన్నెముక అయిన రైతుగోడు పట్టించుకొనకపోతే ''ఆగునా జీవాలు, సాగునా లోకాల''ని కృషీవలులకు వకాల్తా పట్టిన శ్రీనాథ, తుమ్మల, దువ్వూరి, ఏటుకూరి నరసయ్య, దేవులపల్లి లాంటి కవుల నుంచి పొందిన స్ఫూర్తిని అక్షరమూర్తిగా చంద్రలత ఇందులో మలచుకుంది. ఆ మాటకొస్తే చంద్రలతే ప్రకృతిమాత రూపమెత్తింది, ప్రకృతి సౌందర్యాన్ని అడుగడుగునా దోసిళ్ళతో కుమ్మరించింది, పానం చేసి, గానం చేసింది. ఫలితం - తెలుగు రైతు పెరట్లో విరబూసిన మందారాలు, విప్పారిన కాగడా మల్లెలు, విచ్చుకున్న దొంతర మల్లెలు, బోర్లాపడిన పారిజాతాలు, కనకాంబరాలు, ముగ్ధమనోహరంగా ఉన్న ముద్దబంతులు, చిరునవ్వులు చిందే రెక్కబంతులు, చిలిపిగా పలకరించే గడ్డిచేమంతులు, నయగారాలు పోయే నక్షత్ర చామంతులూ, సీతమ్మ జడబంతులూ! ఇందులో స్త్రీవాదం అంతర్వాహినిగా సాగింది; పెళ్ళినాటి వరకు తాను జీవించిన జీవితాన్ని శూన్యం చేసుకోవడానికి అంగీకరించని ఏ ఆడపిల్లయినా ఎదురీదక తప్పదనీ, కొన్ని సందర్భాల్లో ఘర్షణ తప్పదనీ, సంఘర్షణ తప్పదనీ చంద్రలత భావిస్తుంది. మంచి సంప్రదాయాలను మన్నించడం, పురోగతిని అడ్డుకునే చాదస్తాలను చాటలతో చెరగటం, ప్రగతిశీల శక్తులకు ఆహ్వానం పలకడం చంద్రలత సొత్తు. ఎక్కడికక్కడ హేతువాదం నదిలా ప్రవహించింది. తండ్రి శిక్షణ ఆమెకు రక్షణ అయింది. మానవీయ సంబంధాలకు మార్గదర్శి అయి కక్షలనూ, కార్పణ్యాలను కాలరాసింది. చంద్రలత జానపద సాహిత్యాన్నీ, తెలుగువారి

సామెతలనూతనివితీరా చేదుకుని, రచనను నవరసభరితం చేసింది! నేలతల్లిని నమ్ముకొన్న రైతుకు, భూమిని కమ్ముకున్న వ్యవసాయదారునకూ, కొం(డను నమ్ముకున్న కౌలుదారుకు, రెక్కల కష్టం తప్ప మరో ఆధరువులేని వ్యవసాయ కార్మికునకూ - మట్టివాసనే మాణిక్యం. నారతాడు పేనే రత్తయ్య, రాట్నం వడికే పున్నమ్మ గ్రామీణ జీవితానికి సజీవ ప్రతినిధులు. జొన్నరొట్టెలు, ఉల్లిపాయ పప్పులు, చింతకాయ తొక్కులు, నూనెంకాయలు పల్లెవాసుల భిన్న రుచులకు తావలాలు. గుజ్జనగుళ్ళు, బిళ్ళం గోళ్ళు, తొక్కుడు బిళ్ళలు, గచ్చకాయలతో అచ్చం గాయలు, చింతపిక్కలతో వామనగుంటలూ - పల్లెపట్టుల్లో ఆబాల గోపాలానికి ఒకనాటి మన క్రీడా విశేషాలు. ఈ తరం వారికి తెలియని ఎన్నెన్నో అంశాలు ఇందులో ఉన్నాయి. కోల్గేట్ పేస్ట్ తెలిసినంతగా కచ్చికపొడి తెలీదు, ''కళ్ళాపి'' పేరు తెలియదు. కర్ర తెలిసినంతగా ముగ్గుకర్ర తెలీదు, బావులు తెలిసినా మోటబావులు ఎరుకలేదు; గోదావరి తెలుసుగాని వెన్నకాచిన తరువాత నెయ్యి అడుగున దిగే 'గోదారి' ఎరుగరు! బల్లతెలుసు గాని బండి 'జల్ల' తెలీదు; అడుసు తొక్కడం తెలిసినా చేను 'దమ్ము' చేయడం తెలీదు; చేను పిలకలు కట్టడం, పోటాకు పొడవడం తెలీదు, మొక్కకు పాదులు తీయడం తెలిసినా 'గొప్పులు' పోసుకోడం తెలియదు. గిత్తలు తెలిసినా వాటి 'గిట్టలు' తెలియవు! మట్టి తెలుసుగాని 'మొరుసు' మట్టి తెలీదు, దుబ్బులు తెలిసినా 'ఒదెలు' తెలీవు! ఇక మన తెలుగు కార్తెలు అసలే తెలియవు. మృగశిర ఉరిమినా, ముసలెద్దు రంకె వేసినా, పునర్వసు వచ్చి వరినాట్లు వేసినా, ఉరుకులు పరుగులతో ఉత్తరకార్తె వచ్చినా మనకు పట్టదు! ఇంగ్లీషు చదువులు మరిగి తెలుగు సౌందర్యాన్ని, సౌలభ్యాన్ని, సౌకుమార్యాన్ని తాకట్టుపెట్టి కూర్చున్నాం! పంటసిరి నాట్యానికి ఆచార్యులు రైతులు. వారి విజయ రహస్యం అంతా ''విత్తనాలు, పంట, పనిముట్ల''లో ఉందని రామనాథం తీర్పు! కాని ఆ విత్తనాలపైన ''సంస్కరణల'' పేరిట నేడు పెత్తనం చెలాయించజూస్తున్నవి అమెరికన్ కంపెనీలు. వరి, వేప, పసుపు, నూనె విత్తులపై 'పేటెంటు' కాజేయడానికి బహుళజాతి గుత్త సంస్థల కన్నుపడిందని రచయిత మరువరాదు. అయినా నవల కథానాయకుడైన రామనాథం అన్నట్టు విత్తనాలు విధ్వంసానికి లొంగవు. కాని మొక్కబలం విత్తనంలోలేదు, భూమిలో ఉందని గ్రహించాలి! సారమతి భూమి, సాగుదారు రైతు పురోగామి!

*(ఆదివారం 6, జూలై 1997)*

# కరిబియన్ కవి సామ్రాట్ వాల్కాట్

పరిసరాలు మానవుడి జీవన విధానాన్ని దిద్దితీర్చుతాయి. ఆ పరిసరాలే కవుల మనస్సుల్లో కావ్యగీతీ కలాపాలవుతాయి. చెట్టు, పుట్ట, చేను, చెలక, ఏరు, సెలయేరు, నదీనదాలు, సంద్రాలు, సూర్యాస్తమయాలు - ఒకటేమిటి, చరాచరకోటి కవిని కవ్వించి గిలిగింతలు పెట్టగల కావ్యవస్తువులవుతాయి. ఆంధ్రుల ఆదికవి ఏ సముద్రం వద్దనో కాపువేసి ఉండకపోతే చంద్రుని రాకును ''కలశ పాథోరాశి గర్భవీచిమ తల్లి కడుపార నెవ్వాని గన్నతల్లి'' అని అంత అందంగానూ ఆర్ద్రంగానూ చెప్పగలిగేవాడు! మన జాతీయ కవితా శాఖను అమితంగా పుష్పింపజేసిన కలకంఠాలలో ఒకరైన విశ్వనాథ లాంటి వాళ్లు కూడా - గోదావరి, తుంగభద్ర, పెన్న, కృష్ణా తరంగాలతో సయ్యాటలాడుతూ అంతటి అక్షర శిల్పులు అయిండేవారు కారు! అలాగే - తెలుగునేల విడిచి కళ్లు విప్పి సీమాంతరాలు దాటి చూస్తే కరిబియన్ సముద్రప్రాంత దీవులలో ఒకటైన ట్రినిడాడ్ (వెస్ట్ఇండీస్) కవి డెరిక్ వాల్కాట్ కూడా అలాంటి వాడే; సాగర పుత్రులు బెస్తలేకాదు, జీవన గీతాలు ఆలాపించే కవులు కూడా గంగపుత్రులే! అల కలను చెదరగొట్టిన వేళ, తరంగ నాదం మృదంగ నాదమైన వేళ - కరిబియన్ కోస్తాలో వాల్కాట్ గీతమే చేతనా సంగీతమయింది! సముద్రమూ, దాని ఆటు పోటులూ జీవన సమరానికి ప్రతిబింబాలై అమితంగా ప్రభావితం చేసిన వెస్ట్ ఇండీస్ కవులలో ఒకరైన వాల్కాట్కు ఆంగ్ల సాహిత్యంలో గుర్తింపు నిన్న మొన్నటి స్వీడిష్ అకాడమీ నోబెల్ పురస్కారం వల్లనే వచ్చింది. కాదు. కల్లోలానికి, గంభీరతకు ఆనవాలు సముద్రం. శతాబ్దాల తరబడి బ్రిటిష్ సామ్రాజ్యవాదం కింద మనలాగానే నలిగిపోయిన వెస్ట్ఇండీస్ ప్రజల, కరిబియన్ ప్రాంత ప్రజల సుఖదుఃఖలాను కావ్య వస్తువులుగా మలిచి గానం చేసిన కవులలో ఒకరు వాల్కాట్. ఆఫ్రికన్ సాహిత్యంలో తొలి ''నోబెల్'' గ్రహీత ఓలే సోయెంకా, వెస్ట్ ఇండీస్లో మొట్టమొదటి ''నోబెల్'' కవి వాల్కాట్.

నాలుగు దశబ్దాల సాహిత్య వ్యవసాయంలో కాపుకొచ్చిన వాల్కాట్ తోట పంటలు పన్నెండు సంపుటాల నాటకాలు, మరి పన్నెండు సంపుటాల కవితా ఖండికలూ. వెస్ట్

ఇండీస్‌లో లెస్సర్‌యాంటిలీస్ ఓ అగ్ని పర్వతం. అది బద్దలవుతుందో లేదో గాని, ట్రినిడాడ్‌లో మాత్రం వెస్ట్ ఇండియన్ జాతులు భూమికోసం భుక్తికోసం దాస్యవిముక్తి కోసం వలస సామ్రాజ్యవాదులతో నిరంతరం జరుపుతూ వచ్చిన జీవన సమరం వాల్‌కాట్‌లో అగ్ని జ్వాలలు రేపింది. అతని రచనలే ఇందుకు ప్రత్యక్షర సత్యాలు. తన తల్లిదండ్రులు ఉపాధ్యాయులే అయినా, తన తాత ముత్తాతలు మాత్రం వలస దోపిడీ వల్ల కృంగి కృశించి నశించి పోయిన వాళ్లు. అందువల్ల బానిసల సంతానంగా ఎదిగి వచ్చిన వారి గుండెమంట ఎవరూ ఆర్పలేని తీర్చలేని కడుపుమంట. తన ఎదలో రగిలిన ఈ చిచ్చుకు ప్రతి రూపాలే వాల్‌కాట్ రచనలు. ఆంగ్ల సాహిత్యంలోనే గాక ప్రపంచ సాహితీక్షేత్రంలోనే ''చైతన్య స్రవంతి'' సంప్రదాయాన్ని ప్రవేశపెట్టి, ''యులిసిస్'' ద్వారా వాంగ్మయ ప్రపంచంలో - భావనలో, భాషలో, వాక్య నిర్మాణంలో, ఎత్తుబడిలో కల్లోలం పుట్టించిన వాడు జేమ్స్ జాయిస్. అతని కథా వస్తువు తాను పుట్టి పెరిగిన డబ్లిన్ (ఐర్లాండ్) నగర జీవనం, ఆ నగర పరిసరాలూ, అలాగే వెస్ట్‌ఇండీస్‌లో తాను పుట్టిపెరిగిన సెయింట్ లూసియా, డెరిక్ వాల్‌కాట్‌కు ఆధునిక ఇతిహాసంగా పేరొందిన ''ఓమరోస్'' కు కావ్యవస్తువు, వాల్మీకి రామాయణం ఒక్కటే అయినా మనకెన్నో రామాయణాలు వెలసినట్టే హోమర్ మహాకవి ''ఇలియడ్'', ''ఒడెస్సీ'' కావ్యాలు తరువాతి కవులకు స్ఫూర్తినిచ్చాయి. ఆ స్ఫూర్తితో వెలువడిందే వాల్‌కాట్ స్వతంత్ర కావ్యం ''ఓమరోస్'' కూడా. ఇందులోని పాత్రలు కొత్తవి కాకపోయినా ''ఓమరోస్'' ఇతివృత్తం మాత్రం వెస్ట్ ఇండీస్ సామాన్య ప్రజల కథలూ, గాథలూ, ఒక్క ముక్కలో కరిబియన్ ప్రాంత ప్రజల సుఖదుఃఖాలకు అద్దం పట్టిన రచన.

''ఓమరోస్'', గార్సియా మార్క్వెజ్ రచన ''నూరేళ్ల ఏకాంతం''లా ("Hundred Years of Solitude") అలెక్స్ హేలీ సృష్టి ''ఏడుతరాల కథ''లా (Roots) జాతుల బతుకు చితుకుల్నీ, తరతరాల బాధామయ గాథలనూ అక్షరబద్ధం చేసిన చరిత్ర. ఈ గాథను అతను రెండవ ప్రపంచ యుద్ధం దాకా నడిపించాడు. దురంత దుఃఖాలతో కూడిన తన జాతి అనుభవాలకు సముద్రాన్ని కర్మసాక్షిగా చేశాడు వాల్కాట్.

పాత్రికేయుడూ, పాత కొత్తల మేలు కలయికగా విభిన్న సంస్కృతులకు జాతులకూ (ఆఫ్రికన్, డచ్, ఇంగ్లీష్) మధ్య సమన్వయ కర్తగా సంచరిస్తూ కావ్య జగత్తులో వ్యవహరిస్తున్న వాల్కాట్ దృష్టిలో ఏకాంతానికి అర్థం ఏకాకితనం కాదు! ప్రశాంతికీ, ఆలోచనకూ ఆదరవు ఏకాంతం. కనుకనే వాల్కాట్ దీవులను ఎండమావులుగా

భావించుకోరాదని చెబుతూ-వాల్కాట్ పరిసరాలతో తన తాదాత్మ్యాన్ని 1971లో ఇలా వర్ణించాడు : ''ఏకాంతర ద్వీపాంతర వాసం ఒక విధంగా అమోఘ మయింది. ఎందుకంటే సముద్రం వొడిలో ఆప్యాయంగా వొదిగిపోయే ద్వీపాన్ని ఒక్కసారి ఊహించుకోండి. నీకన్నా నా కన్నా గొప్పదైన అనూహ్యమైన అధి భౌతికమైన అనుభూతి ఏదో కలుగుతుంది'' అంటాడు. అలా అని తన చుట్టూరా ఉన్న భౌతిక ప్రపంచాన్ని అతను మరిచిపోడు. చారిత్రక విభాత సంధ్యలలో మిశ్రమ జాతుల సంస్కృతీ వికాసం వల్ల ఆఫ్రికన్, యూరోపియన్ రక్తాన్ని పంచుకు పుట్టిన వాల్కాట్ వెస్ట్ ఇండీస్ ఉమ్మడి సంస్కృతికి కవితా వారసుడయ్యాడు. అందువల్లనే వాల్కాట్కు నోబెల్ పురస్కారం అందజేస్తూ స్వీడిష్ అకాడమీ ఇలా చెప్పగలిగింది :

''వాల్కాట్ తన సంస్కృతీ వారసత్వానికి అనువైన మార్గాన్ని తన సాహిత్యంలో ఎంచుకున్నాడు. అయితే తన రచనల ద్వారా ఆయన మనలో ప్రతి ఒక్కరితోనూ కలివిడిగా మాట్లాడుతున్నట్టే ఉంటుంది. అతడు భిన్న సంస్కృతుల సమ్మేళనం ద్వారా చారిత్రక దృష్టిని అలవరచుకున్న మహాకవి''.

అతని కావ్యం ''ఓమరోస్'' హోమర్ రచనలకు అనుకరణం అన్న వాళ్లకు సమాధానంగా వాల్కాట్ "I have not read all of Homer, perhaps, if I knew his writing well I would not have dared to adopt it. That would have been pompus", అని తేగేసి చెప్పాడు. నమ్రతలో వాల్కాట్ ఎవరికీ తీసిపోడు. నోబెల్ పురస్కారానికి ముందు అందుకు అర్హులైన పలువురు సమర్థుల జాబితా చర్చకు వచ్చినప్పుడూ, ఆ తరువాత పురస్కార ప్రకటన వెలువడినప్పుడూ వాల్కాట్ గౌరవ స్పందన ఇందుకు నిదర్శనం : ''ఈసారి నోబెల్ సాహిత్య పురస్కారం ట్రినిడాడ్లో స్థిరపడిన వెస్ట్ ఇండియన్ గానే గాక, ప్రపంచంలోనే విఖ్యాతి చెందిన రచయితగా వి.ఎస్.నైపాల్కు గాని, సీమస్ హేనీకి గాని దక్కాలని ఆశించాను. కోరుకున్నాను'' అన్నాడు వాల్కాట్. 1992 పురస్కారానికి సమర్థుల జాబితాలో వాల్కాట్తోపాటు గంతర్ గ్రాస్, మార్గరెట్ డురాస్ కూడా ఉన్నారు. కాని ఎవరో ఒక్కరే ఆ ఒక్క బహుమతికి 'సమర్థ రామదాసు' కాగల్గుతాడు! ఆ అవకాశం వాల్కాట్కు వచ్చింది. అతని స్వీయ చరిత్రగా చెప్పదగిన కావ్యం ''మరో జీవితం'' (Another). అందులో ఆయన వ్యంగ్యంగా ''వర్ణ వైవిధ్యంతో పూచిన గుమ్మడి పువ్వు, ఉమ్మడి బిడ్డ''గా తనను గురించి వర్ణించుకున్నాడు ("divided child of the wrong

**colour**"). ''ఓమరోస్'' కావ్యం సకల జగజ్జనులారా మానవుడే నా సంగీతం అని వినిపించిన మరో 'మహాప్రస్థానం', నూనూగు మీసాల నూత్న యవ్వనంలో వాల్కాట్ మన భావకవుల మాదిరిగానే కౌమార దశలో అల్లిన పాతిక కవితల తొలికదంబం తర్వాత - కొత్త పుంతలు తొక్కిన రచనగా ప్రసిద్ధి పొందిన కవితా సంపుటి 'హరిత రాత్రి' (**In a Green Night**). భావ చిత్రాలలో తన తరం కవులలో వాల్కాట్‌తో వియ్యం అందుకోగల తెలుగు కవులు అజంతా, త్రిపురలను పేర్కొనవచ్చు. మొదట్లో భావ కవుల మాదిరి గిరజాల సరదాలు తీర్చుకోకపోయినా, కావ్యసంకలనాలు ఆకృతిలో అందంగా సుందరమైన కవర్ పేజీలతో రావాలని తహతహలాడి ఇలియట్ పుస్తకాల్లా అచ్చుకావలని ప్రయత్నించాడు వాల్కాట్.

ప్రసిద్ధ నాటక కర్తగా కూడా పేరు మోసిన వాల్కాట్ ట్రినిడాడ్ థియేటర్ వర్క్‌షాపు ద్వారా ఎన్నో నాటకాలు ఆడిస్తూ, ఔత్సాహికులకు శిక్షణ ఇస్తున్నాడు. నోబెల్ పురస్కారానికి కారణాన్ని కొంతరు చిలిపిగా చిత్రించజూచారు. స్వీడిష్ అకాడమీ ఉన్న స్టాక్‌హోమ్ మెయిన్ థియేటర్‌లో వాల్కాట్ తాజా నాటకం "**The last Carnival**" ప్రేక్షకులను సమ్మోహితులను చేయడం వల్ల, పురస్కార సంఘం నిర్ణయాన్ని ముందుగానే ప్రభావితం చేసినట్టయిందని కొందరు వ్యాఖ్యానించారు. కాని, వాల్కాట్ ప్రతిభకు గుర్తింపు అంతకు ముందే వచ్చింది. వాల్ట్‌విట్‌మన్ ''లీవ్స్ ఆఫ్ ది గ్రాస్'' లాగా కథా కావ్యంగా సాగిన 'ఓమరోస్'కు నోబెల్ పురస్కారానికి రెండేళ్ళు ముందుగానే ''స్మిత్ లిటరరీ అవార్డు'' వచ్చింది. కాగా 1988లోనే ఇతని కావ్య సృష్టికి బ్రిటిష్ రాణి స్వర్ణపతకం లభించింది. అయినా తెల్లవాడి జాత్యాహంకారం చావలేదు. చింత చచ్చినా పులుపు చావలేదు. నిన్న మొన్నటి దాకా వాల్‌కాట్‌ను నాటక కర్తగానూ, కవిగానూ బ్రిటిష్ పాలకులు గుర్తించలేదు. ఉత్తమ కవిని గుర్తించడానికి అక్కడ ఎదురైన సమస్య సాహితీరంగంలో బహు నాయకత్వం కాదు, వర్ణ వివక్షమాత్రమేనని మరవరాదు! అంతేగాదు, ఇక్కడ తెలుగు దేశంలో 'అరసాని'కి 'విరసాని'కి మధ్య సాగిన వాగ్యుద్ధాల్లాంటివి వెస్టిండియన్ కవుల మధ్య కూడా సాగాయి. రచనలో కళాత్మకత చెడకూడదని కొందరంటే, రాజకీయ సందేశంలేని కళ కూడా నిరర్థకమని మరికొందరి వాదన. అలాంటి కొన్ని సందర్భాలలో వాల్కాట్‌తో వెస్టిండీస్ రాడికల్ కవులు కొందరు విభేదించారు. ప్రజలకు సన్నిహితంగా ఉన్నప్పటికీ వాల్కాట్ భావ వ్యక్తీకరణలో క్లిష్టత పాటిస్తున్నాడనీ, రచనల్లో ఎవరికీ అర్థం కాని ''క్వీన్స్ ఇంగ్లీష్'' రాస్తున్నాడనీ రాడికల్స్

విమర్శ. ఈ తగాదాలతో విసిగి వేసారిన వాల్కాట్ ''నా కిప్పుడు హద్దులు లేవు, సరిహద్దులు లేవు. ఉన్నదల్లా భావుకత ఒక్కటే'' అని విమర్శకుల నోళ్లు మూయించాడు ("I have no Nation now, but the imagination")!

''గ్రీక్ హీరో ఎచిలస్‌కు ఎలివేటర్ అక్కర లేదు, ఎందుకో తెలుసా!'' అని ప్రశ్నించి దిగంతం అనంతం కాబట్టి ''దిఙ్మండలనికి నిచ్చెన లేదు, ఎలివేటర్ లేదు'' అని అందమైన ఓ భావ చిత్రం అందిస్తాడు వాల్కాట్! ఈ మాటలు వాల్కాట్ అన్నప్పుడు మనదేవులపల్లి పదచిత్రాలు- ''విశ్వమంతా ప్రాణవిభుని మందిరమైన వీథి వాకిలి ఏది చెల్లెలా'' గుర్తుకు వచ్చి తీరవలసిందే.

విశ్రాంతి ఎరుగని తన మనసు ఓ కల్లోల జలధి, దాన్ని మించిన సముద్రం లేదన్న వాల్కాట్ నిత్య ప్రపంచ యాత్రికుడు కూడా! 'ఓమరోస్' కావ్యంలో ఫ్రెంచి యుద్ధ నౌకల దాడికి గురైన విండ్‌వార్డ్ ద్వీపాన్ని వర్ణించిన వాల్కాట్ క్రమంగా ఆ విండ్‌వార్డ్ దీవిలోని సెయింట్ లూసియాను వానప్రస్థం చేసుకున్నాడు. తన పూర్వీకుల్ని బానిసలుగా మార్చిన తెల్లవాళ్లపైన లోలోపల ఎంత కక్షున్నా తాను పుట్టి పెరిగిన వాస్తవ పరిస్థితులను ఆంగ్ల భాషాధ్యాయనాన్ని, దానివల్ల పొందిన ప్రాపంచిక దృష్టినీ వాల్కాట్ మరిచిపోలేడు. తన మనస్సులో అవిశ్రాంతంగా కదలాడే ఈ వైరుధ్యాన్ని ఒక కవితా ఖండికలో వాల్కాట్ ఇలా వినిపిస్తాడు :

''మదించి మత్తిల్లిన
తెల్లదొరను శరించిన వాడిని....
కానిప్పుడు-
నా రక్త స్పర్శ జాగృత ఆఫ్రికా ఒక వైపు,
నేను ప్రేమించిన ఆంగ్ల భాష మరొక వైపు
ఈ రెండింటి మధ్య ఎంపిక ఎలా సాధ్యం?

ఈ వైరుధ్యానికి పరిష్కారంగా వాల్కాట్ తనలో వైవిధ్యపూరితమైన సంస్కృతీ విలువను ప్రేమించి గౌరవించబట్టే - చడీచప్పుడూ లేకుండా ఎక్కడో మారుమూల గ్రామంలో కాలక్షేపం చేస్తున్నప్పటికీ నోబెల్ పురస్కారం లభించింది అందుకే ప్రఖ్యాత వ్యాఖ్యాత డేనియల్ జాక్సన్ వాల్కాట్ గుణగణాలకు గొప్ప కితాబునిచ్చాడు

''అతడొక నేషనల్ హీరో. ఈ కథా నాయకుని ప్రతిభా పాటవాలు అనంతం. అలాంటి వెస్టిండీస్ కవితా గిరిశిఖరం ముందు నోబెల్ పురస్కారం వల్ల వచ్చే ఆస్తులూ, అంతస్తులూ ఏపాటివి? ఏ సాటివి?

*(ఆదివారం 29, జనవరి 1996)*

# సృష్టి రహస్యాల శోధనలో 'సినారె' విశ్వరూపం!

సృష్టి రహస్య పరిశోధన ఈనాటిదికాదు. ఈ సృష్టి ముందు తానెందుకు పుట్టలేదన్న మానవుడి తొలి ప్రశ్న ఉదయించిననాటి నుంచీ ముముక్షువులు, తాత్త్వికులు, కవులూ, రచయితలూ వేసుకొంటూ వస్తున్న ప్రశ్నే : '' ఈ సృష్టికి అర్థం ఏమిటి? ఒక సకలాతీత శక్తి ఉన్నట్టా లేనట్టా? ఏ అవ్యక్త హస్తం తిప్పితే ఈ జగత్తు పుట్టిందో ఎందుకు కనిపెట్టలేదు''? ఈ విశ్వం అంతమా, అనంతమా? ప్లేటో నుంచి క్వాక్వేదాకా, హెరోడోటస్ నుంచి డెమోక్రటస్ దాకా, ఆరివియస్ నుంచి అనక్సోరస్ దాకా, వేదాల నుంచి బౌద్ధం దాకా, శంకరుడి నుంచి విరజానంద, వివేకానందల వరకూ, ధర్మగుప్తుడు నుంచి దయానందుడి దాకా ఈ తాత్త్విక చింతనకు ఆటవిడుపు లేదు. కాని జ్ఞానపీఠ్ పురస్కార గ్రహీత, సుప్రసిద్ధ కవీ, పద చిత్రాచార్యుడైన డాక్టర్ సి.నారాయణరెడ్డి రాసిన తాజా కవిత ''మట్టీ, మనిషీ, ఆకాశం'' ఉబుసుపోని చర్చను పక్కకు నెట్టి మానవ ప్రయోజనాన్ని ముందుకు నెట్టి అతడి సుఖశాంతులకు రక్షరేకగా విశ్వకల్యాణానికి అవసరమైన తాత్త్విక వేదికను సమకూర్చి పెడుతోంది. ఇంతకుముందు జ్ఞానపీఠ్ అవార్డుకు ఆలంబనమైన సినారె ''విశ్వంభర''కూ, ఈ నెల 29న విడుదల కాబోతున్న ఈ సరికొత్త కవితకూ ఒక తేడా ఉంది. మానవ కథా బీజం ''విశ్వంభర''. అది మనిషి కథ, ఆ కథా కావ్య రంగస్థలం విశాల విశ్వంభర. దాని నేపథ్యం ప్రకృతి. ఆదిమ దశల నుంచి ఆధునిక యుగం దాకా మనిషి చేసిన మజిలీలు, మహా ప్రస్థానాలూ 'విశ్వంభర కార్యక్షేత్రాలు. కాగా ఆ 'విశ్వంభర'కు విస్తరణే సినారె కొత్త సృష్టి ''మట్టీ, మనిషీ, ఆకాశం'' రెండింటిలో చెదురు మదురుగా భావశకలాల పునరుక్తి తప్పనప్పటికీ రెండు కావ్యాలకూ మధ్య కొట్టొచ్చే ప్రధాన భేదం ''విశ్వంభర''కు మానవుడు కేంద్రబిందువు కాగా తాజా కవితలో మానవ మూర్తి వైజ్ఞానిక వికాసాన్ని వివిధ దశలలో దిద్దితీర్చడానికి దోహదం చేసిన విశ్వతాత్త్విక చింతన, దానిని అర్థం చేసుకోడానికి మానవుడు పడుతున్న తపనా ప్రధాన బిందువయింది ఒకటి మానవుడి పరిణామ దశలకు అద్దం, మరొకటి

సృష్టి రహస్య స్థావరాల్లోకి, కవి చేసిన సుదీర్ఘ ప్రయాణం! భూమిపైన ప్రారంభమైన మానవుడి 'అన్వేషణ' గ్రహాంతర యాత్రలతోగాని, అన్య గ్రహాలలో జీవరాశి మనుగడ తబిశీళ్ల కోసం జరిపే ప్రయత్నాలతో గానీ ముగిసేటట్టు లేదు! భారతీయ తాత్త్విక చింతనలో, దార్శనిక దృష్టిలో హేతువాదానికి పెద్ద పీట వేసిన బౌద్ధ, జైన, చార్వాక, సాంఖ్య, భౌతిక వాదాలలోని సారాన్నీ, పూర్వమీమాంసలోని అభ్యుదయ ధోరణులనూ ఒంటపట్టించుకున్న సినారె మనిషి బొమ్మను ''భూగోళమంత'' నిండుగా ఇంతకుముందే నిలబెట్టాడు. ఆ ప్రతిష్ఠకు అనుగుణంగా ఇప్పుడాయన తాత్త్వికార్థంలో ఇస్తున్న అందమైన వివరణే, చూపుతున్న ఉపపత్తే, 'విశ్వంభర' విస్తరణే ''మట్టీ, మనిషీ, ఆకాశం''. ఏ కోణం నుంచి దర్శించినా ఈ నవ్య కవిత మానవుడి ఔన్నత్యాన్ని చూడటంతోపాటు కోల్పోతున్న నైతిక మూల్యాలను కూడా ఎత్తిచూపే ఉత్తమ ప్రబోధ కావ్యం. తెలుగు కావ్య జగత్తులో మానవుణ్ణి నిరంతరం గిరిశిఖరంపై నిలిపి దిద్దుబాట్లతో అతని మూర్తిని కీర్తిమంతం చేసి నిరాశా నిస్పృహలను పారదోలి ఆశాదీపాలు వెలిగించిన కవులు ఎందరో ఉన్నా, ప్రధానంగా చెప్పుకోదగినవారు గురజాడ, జాషువా, శ్రీశ్రీ, నారాయణరెడ్డి. భౌతికానందం ద్వారా భౌతికాతీతమైన అనుభూతిని అందజేయడం అందరివల్లా సాధ్యంకాదు. ఆ పనిని ఒక 'దేశభక్తి' గేయం, ఒక ''కవితా, ఓ కవితా'', ఒక ''శరచ్చంద్రిక'', ఒక ''విశ్వంభర'', ఒక ''మట్టీ, మనిషీ, ఆకాశం'' మాత్రమే జయప్రదంగా చేయగలుగుతాయి. ఒకప్పుడు లోకంలోని సౌందర్య దృష్టిని రూపం ద్వారానో, సాహిత్యం ద్వారానో సంగీతం ద్వారానో అబ్బించడానికి ఉద్యమించిన ఘనత విశ్వకవి ఠాగూరుకు దక్కింది. అమృతం దక్కేది 'దేవతలకే'నన్నది ఓ మూఢవిశ్వాసం! కాని అసలు అమృతానికి ఠాగూర్ ఇచ్చిన నిర్వచనం గొప్పది. అమృతానికి రూపం లేదు, పరిమితి లేదన్నాడు ఠాగూర్! మరెక్కడ దొరుకుతుందట: ''జలజల ప్రవహించే సెలయేటిలో/ కన్నుల పండువుగా పుష్పించే చెట్ల గుంపులో/ మీన నేత్రాల కాటుక కనుకొలకుల్లో నాట్యమాడే మందహాసంలో'' అంటాడు! అలాగే సినారె కారణం లేని కార్యాన్ని ఊహించలేడు. తాను కవిగా ఊహాజగత్తులో విహరిస్తున్నా మానవారాధనలో ఆ జగత్తును కూడా ముగుదాడుతో కట్టిపడేస్తాడు. మానవుని ఉనికిని ఊగించి శాసిస్తున్న ఈ జగత్తును, భిన్న ధ్రువాల మధ్య, విభిన్న అనుభవాల మధ్య, మానవ ప్రకృతికి, మానవేతర ప్రకృతికి మధ్య తారాస్థిల్లే ఘర్షణల మధ్యనే తన రూపుదిద్దుకోడానికీ, తన దారి సర్దుకోడానికీ ప్రయత్నిస్తాడు. అందుకే ప్రసిద్ధ భౌతికవాదీ, హేతువాదీ, కవీ

డబ్ల్యు.బి.యేట్స్ అన్నాడు : "Between extremitries / Man runs his course" అని! మానవుడిలో సుఖదుఃఖాల మధ్య ద్యోతకమయ్యే ఈ అతివేలాన్ని సినారె సుందరమైన భావ చిత్రాల ద్వారా తాత్త్వికంగా విశిష్టార్థాలతో వివరించి, సమన్వయం సాధించాడు. మనిషిలో మాసిపోని పూల మనువును మరిచిపోడు. అదే సమయంలో మనిషికి ''తుడిచిన అద్దంలా మనసుంటే / మిణుగురు పురుగుల్లా మిలమిలలాడే చుక్కలు/సంపూర్ణ శరచ్చంద్ర బింబాలై సాక్షాత్కరిస్తాయం''టాడు! ఊహాపోహాలలో సినారె సాధించిన ఔన్నత్యానికీ, సమున్నతమైన వ్యూహరచనకూ నిదర్శనం - మట్టిని స్థలానికీ, ఆకాశాన్ని కాలానికీ సంకేతాలుగా గ్రహించి, మనిషిని ఈ రెంటికీ అనుసంధానకర్తగా మలచడమే! అలా, స్థల, కాలాల మధ్య సజీవ వారధిగా నిలబెట్టాడు మనిషిని. ఈ మూడు శక్తులూ దేనికదే అహంకారంతో తన గొప్పదనాన్ని చాటుకుంటాయి. ఆకాశం అస్తిత్వాన్నీ, మనిషి అస్తిత్వాన్నీ భూమి ప్రశ్నిస్తే, మిగతా రెండింటి అస్తిత్వాన్నీ (భూమి, ఆకాశం) మనిషి ప్రశ్నిస్తాడు. కాగా ఆకాశం మిగతా రెండు శక్తుల ఉనికినీ ప్రశ్నిస్తుంది. అహంకారం ఆగ్రహం మూడింటికీ సమానధర్మం ఫలితంగా ఆకాశం అమృత వృష్టి బదులు హఠాత్తుగా పిడుగులు వర్షిస్తుంది. భూమి ప్రకంపనాల ద్వారా మానవుణ్ణి భయపెడుతుంది, మనిషి మనస్సు క్షణికోన్మాదంలో వికటిస్తుంది. ఈ అహంకారాన్ని అణగదొక్కి సమన్వయం సాధించడం కవి లక్ష్యం! కేవలం లయబద్ధమైన భావచిత్రాలూ, ప్రతీకలే (SYMBOLS) కావ్య గౌరవాన్ని నిలబెట్టలేవు. కవి సంఘజీవిగా సమష్టి శ్రేయస్సునూ, సమాజ సంక్షేమం అనే ఆదర్శాన్నీ ఆచరణ సాధ్యం చేసుకోవడం కోసం ఊడిగం చేయించుకొనే పరికరాలూ, కొలమానాలే అలంకారాలు, భావచిత్రాలూ, ప్రతీకలూ! ఆ పనితనంలో కడు నేర్పరి సినారె! ఈ కవితలో సృష్టి పరిణామం ఉంది, వేదాంతం ఉంది, ఉపనిషత్ సారమూ, మార్క్సియన్ భావజాలమూ ఉంది, రాడికలిజం, రాడికల్ హ్యూమనిజం ఉంది. ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంత వాసనలున్నాయి, విశ్వ సమాచార వ్యవస్థ ముమ్మరిస్తున్న ఆధునిక భావజాలమూ ఉంది అన్నింటికీ మించి సినారె తాత్త్విక పునాదిని పరిపుష్టం చేస్తున్న సరిహద్దులెరుగని మానవతా వాదం ఉంది, చదువరుల బొడ్లో చేయి వేసి అడుగడుగునా నిలదీసే నైతిక మూల్యాలున్నాయి; మానవుడి జయపతాకను ఎప్పటికీ అవనతం కానివ్వని ఆశావాదం ఉంది! కాలం అంతు చూడ్డం సినారె లక్ష్యం! ''హోరెత్తే ప్రశ్నలకు నోరెత్తే జాడలు'' కనిపించకుండా చేయగలుగుతాడు! సుప్రసిద్ధ కవి డేవిడ్ గాస్కోసీ కవిత గురించి

విమర్శకులన్నట్టుగా సినారె తాత్త్విక రచనలో కూడా "Each stanza is a round, and every line A blow" అని చెబితే అత్యుక్తి కాదు! మానవుడి జన్మ వ్యర్థం కాకుండా సార్థకం కావాలంటే సర్వజ్ఞత పొందాలన్నది సినారె ప్రతిపాదన అప్పుడు గాని ధూళి రేణువు కూడా మనిషి జ్ఞానతృష్ణకు ఆలోచనా కేంద్రం కాజాలదు! కవి మనసు రసాయనశాల. జీవరాశిలో, దాని నిత్య నైమిత్తికాలలో, వైయక్తికంగానూ, విశాల దృష్టిలోనూ అభేదం చూస్తున్న సినారె ''మనుషులే కాదు పక్షులూ సంభాషిస్తాయనే భావరేఖ'' మనిషి మెదడులో మెదలాలంటాడు. అమాయకుల మనస్సుల్లోని స్వచ్ఛతను పక్షుల స్వచ్ఛ స్వరాలతో పోల్చి ఆ స్వరాలు ''ప్లాస్టిక్ చెవులకెక్కవ''ని నిరసన ప్రకటిస్తాడు! ఇలాంటి ప్రతీకలను వాడడంలో సినారె ఆంగ్ల సాహిత్యంలో డబ్ల్యు.ఎస్. గ్రాహమ్‌కు సమఉజ్జీ కాగలడని చెప్పవచ్చు. ఈ విషయంలో (ప్రతీక వినియోగ శక్తిలో) స్కాటిష్ కవులు మార్దవానికి ప్రాధాన్యమిస్తారని అంటారు ("they change the tone of rhetoric deftly from raucous to tender, from shouting to a whisper')! ఈ విశ్వరూప దర్శనంలో సినారె వాస్తవికతకు కైమోడ్పులు అర్పిస్తూనే ఒక్కోచోట అధివాస్తవికతను, వేరొక చోట అధి భౌతికవాదాన్ని మందుమాత్రంగానైనా సమాశ్రయిస్తాడు! కేవల ప్రకృతి ఆరాధనలో గానీ, భక్తి భావనలో గానీ సామాజిక నిబద్ధత ఉండదు. భౌతిక వాదిగా, చింతనాపరుడుగా సినారె ఈ హద్దులు దాటి విశ్వమానవుడిగా ఇందులో అవతరిస్తాడు. ఆయని మనోమందిరం నుంచి జాలువారే భావచిత్రాలు రూపారూపాల సమ్మేళనం, ముత్యాల సరాలు (గ్రాహమ్ మాటల్లో చెప్పాలంటే అవి words drifting on words/The real unabstract snow")! అందుకే 'విశ్వంభర'లోలా పూసగుచ్చినట్టు కథాక్రమం ''మట్టి'' కవితలో లేకున్నా కమనీయమైన భావ చిత్రాల కోసం సదా మానవుడి పురోగతిని ఆశించే వర్ణ చిత్రాల కోసం చదవాలి. ఏకకాలంలో అల్పాక్షరంలోనే అనల్పార్థాన్ని పిండి చూపించే ఒక నన్నయ, ఒక పదకవితల అన్నమయ, తేనె సోనలు చిందించే ఒక తిక్కన, తేట గీతులువినిపించే ఒక వేమన స్ఫురణకు వస్తారు. అప్పుడప్పుడూ జాషువా స్ఫూర్తి, శ్రీరంగం శ్రీనివాసరావు మూర్తి గుర్తుకు వస్తూనే ఉంటుంది. ఒక్క ముక్కలో ప్రాచీన, అర్వాచీన సంస్కృతీ వారసత్వం కవితా రూపంలో సినారె కలంలో రాశులుగా కుప్పపోసుకుంది. వచనంలో కూడా గతి తప్పని లయ, ఆ లయలో అంతర్లయ అడుగులో అడుగై ముందడుగై సాగుతాయి. ఒకచోట సినారె కవనఝరి శాంతంగా,

వేరొక చోట అవిశ్రాంతంగా, మరొక పట్టులో ప్రళయ భీకరనాదంగా ప్రచండవాదంగా దర్శనమిస్తుంది. ఎడ్వర్డ్ థామస్ అన్నట్టు పక్షుల్లానే, జన విశ్వాసానికి పాత్రమైన భాషను కవి వాడకం చేసుకోవాలి. (I should use, as the trees and birds did/A language not to be betrayed")! ఇందులో సినారె చేసిన ప్రయత్నం కూడా అదే. పక్షుల భాష, ప్రకృతి భాష తెలుసుకోడానికి అతను పరకాయ ప్రవేశం చేయలేదు. అ కిలకిలలకు చెవుల్ని రిక్కిస్తేచాలు " చెక్కినట్టున్న రాతప్రతులు దిగొస్తాయి / హృదయం మొద్దుబారినవాళ్లకు కలకూజితాలు పిచ్చిరొదలే" మరి! సినారె "మట్టి, మనిషి, ఆకాశం" నోబెల్ బహుమాన గ్రహీత ప్రపంచ ప్రసిద్ధ మేధావుల్లో ఒకరైన రోమరోలా నవల "మానవుడు"ను (జీన్ క్రిస్టోఫ్) గుర్తుచేస్తుంది. అందులోని తాత్త్విక దృక్పథానికీ, మానవీయ స్పర్శకూ సినారె బోధిస్తున్న మానవ సంబంధాలకూ, మదింపు వేస్తున్న సౌజన్య మూల్యాలకూ దగ్గర సంబంధం ఉంది. అహంకారాన్ని మనోవికారంగా నిరూపించిన వాడు రోమరోలా. జీవితంలో కష్టాలు గానీ, ఆశయం కానీ లేకపోవడమే దానికి కారణమన్నాడు! ఈ సూత్రం సినారె రచనలో మరింతగా వివృతమైంది, విస్తరించింది. హింసావాదాన్ని నిరసించే సినారె నరికే కరకు కత్తికీ, పెరిగే జీవశక్తికీ తేడాను గమనించమని కోరతాడు. అయితే ఈ ద్వంద్వ ఘర్షణలో కత్తి "చరమసత్యంగా మాత్రమే" వాడుకలోకి వస్తుందంటాడు! తాను కరిగి, కదిలించే చైతన్య స్ఫూర్తిగల మానవుడు మనకు కావాలంటాడు; ఆత్మవిశ్వాసం అప్పుడప్పుడూ కార్యకారణ సంబంధాల మూలంగా కొడిగట్టవచ్చు గాని, "మట్టి మొలకై మ్రొల్లాడినట్టు" ఎప్పటికప్పుడు కొత్త ఆశ చిగురించి తీరుతుందని భరోసా చెబుతాడు! మనిషి లక్ష్యం అర్థం లేని చాంద్రాయణం కాదు, సుడిగాడ్పులు సాగించే మడమ తిప్పని పురోగమనం, పరస్పర విరుద్ధ దిశల సమీకరణం అని తెలుసుకోమని ప్రబోధిస్తాడు. ఈ మనిషి "స్థితమతిగా రూపొందితేనే విశ్వప్రగతి" అని చాటుతాడు సినారె! మగత ప్రగతికి శత్రువుగా భావించిన కవి వాత్సల్యవారధిని మనిషి కూలగొట్టుకో కూడదంటాడు; పరాధీనతను, పరాధార స్థితినీ ఏవగించుకుంటాడు; పొరలు కమ్మని కళ్లకోసం ఒళ్లంతా కళ్లు చేసుకొని వెదుకుతాడు! ఆశలు విరిగినప్పుడల్లా వ్యక్తిత్వం విరిగిపోరాదని హితవు చెబుతాడు. మానవ హృదయాన్ని కొలవడానికి తవ్వకాలక్కరలేదు, ఒక్క స్పందన వీచిక చాలు, ఆ ఒక్క స్పర్శ చాలు - అతనిలో దాగి ఉన్న చైతన్య నిధులు నిలువెత్తునా ఉబికొస్తాయని హామీ ఇస్తాడు! సినారె నిర్దుష్టమూ, నిర్దిష్టమూ అయిన కొన్ని విశ్వాసాలున్న కవి విశ్వాసాల, నిబద్ధతా ప్రకటనే

సాహిత్యం అన్నాడు యేట్స్ (Literature must be the expression of convictions)! కనుక సినారె సరికొత్త రచన, ఏ విధంగా సమీక్షించుకున్నా మానవ సంబంధాల సమతుల్యతకు పట్టిన నీరాజనం. అందుకే ఆయన దృష్టిలో ''నిత్య చైతన్యంతో నిలిచే మనిషి / నిష్క్రమణలేని పాత్రధారి / నిఖిల విశ్వంభరా పురోగతుల / నియతిని కాపాడే సూత్రధారి''గానే ఉంటాడు. కవి సినారె (ఖండకావ్యమైనా, వచన కవిత అయినా) ఒక జలపాతం, ఒక దివ్వెల మువ్వ, విశ్వంభరను కమ్ముకున్న మట్టీ, మనిషీ, ఆకాశం, సృష్టి, రహస్యాల శోధనలో విశృంఖలంగా రచనా పుష్ప సౌరభాలు, పుప్పొడిరాగాలూ వెదజల్లిన ఒక కర్పూర వసంతరాయలు; వివేకంతో వివేచనతో విచక్షణతో ప్రగతి నిరోధకులపై కురిపించిన సినారె మతి మెరుపులు!

*(ఆదివారం 27, జూలై 1997)*

# విశ్వాసాల ముకుందమాల
# ''వలసపోయిన మందహాసం''

కొందరికి, పేగులు మెడలో వేసుకుని తిరిగితే గాని 'వీడు ఫలానా' అని గుర్తించరేమోనన్న బాధ! ఇంకొందరికి పరోక్షంగా సందేశాన్నివ్వడం ఇష్టం. ఈ తేడా పాడాలు కవిత్వంలోనూ తప్పవు. కొందరు కవులకు మార్మికత అభిలషణీయం, మరికొందరికి సూటిగా సందేశం ఇవ్వడం ఇష్టం. ఇంకొంతమందికి అందమైన భావచిత్రాలు అందించడం తృప్తి, మరికొందరికి నేరుగా చప్పిడి వచనంలో చెప్పడం అలవాటు; కళకు రాజకీయాలు పులమడం కొందరికి నచ్చిన ప్రక్రియ అయితే మరికొందరికి సందేశం బొత్తిగా లేని కేవల కళావైచిత్రితో రచనను సరిపెట్టుకోవడమే ఒక కళ; కేవలం నినాదభూయిష్టమైన కవిత్వం ఒకరి సొత్తు అయితే కళా ప్రమాణాలు చెడకుండా నర్మగర్భంగానే అయినా సమాజానికో సందేశం, సంఘానికో ప్రబోధం, అందుకు అనుగుణంగా వ్యక్తుల వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దే నీతి బోధ అందించడం మరొకరి అలవాటు. ఇంతకూ కవికి గానీ, రచయితకు గానీ ప్రమాణం ఏది అంటే - వారి వారి అనుభవాలు, పరిశీలనా శక్తీ, అభివ్యక్తీ అని చెప్పాల్సి ఉంటుంది. సుప్రసిద్ధ అమెరికన్ రచయిత డాస్ పాసోస్ అనలేదూ: పరిశీలనా వాంఛ, కళ్ళార చూసిన దానిని సాధ్యమైనంత వాస్తవికంగా కలంలోకి దించడం, కవికీ, రచయితకూ ప్రధానం. అరటి పండు ఒలిచి నోటికందించకపోయినా అర్థం చేసుకోగల కనీస స్పష్టతతో రచన ఉండాలని పాఠకుడు, శ్రోతా కోరుకోవడం అత్యాశ కాదు. కళా విలువలకు కొంత మార్మికత తప్పదేమో. ఈ దృష్ట్యా ''ఆకులందున అణగిమణగి కవిత కోయిల పలకవలెనోయ్'' అన్న గురజాడ వారి ప్రమాణం ముకుందరామారావు ''వలసపోయిన మందహాసం''కు వర్తించి తీరుతుంది. రామారావు కవితా సంపుటిలో ప్రతి రచనా నినాద కవితలకు విరుద్ధమైనదీ, సొంత గొంతుకను విప్పుకుని మరీ చెలాయించగలదీ! ఇజం 'ప్రిజాన్ని' దాటి నిజం హాజం సరిహద్దులను నిర్ణయించగలదీ! పరాయి రాష్ట్రంలో (ఖర్గపూర్ - పశ్చిమ

బెంగాల్) నివసించిన ప్రవాసాంధ్రుడయినా తెలుగు భాషను, అందమైన భావ చిత్రాలనూ, సమాజ శ్రేయస్సును కోరుకునే ఆదర్శ వాదాన్నీ, అభ్యుదయ దృక్పథాన్నీ వదులుకోనివాడు ముకుంద రామారావు. కవన ఝరిలో స్పష్టాస్పష్టతల మధ్యనే అయినా తనతనాన్ని కోల్పోనివాడు. కవితా రంగంలో వ్యక్తిత్వ వికాసాన్ని ఒక్క సంపుటితోనే జయప్రదంగా చాటుకున్నవాడు. నిశిత పరిశీలనా శక్తి కలవాడికి గ్రూపులతో నిమిత్తం ఉండదు, వర్గాలతో చెలిమి అంతకంటే ఉండదు. విశ్వజనీనతను విజయపతాకగా, కవన బావుటాగా మలచుకున్న ముకుంద రామారావు నిశ్చలతను సహించడు. చలనం అతనికి ప్రాణం, తాత్త్వికత అతని భావుకతకు అమరివచ్చిన చోదక శక్తి. లోకంలోని కుళ్ళును, కాపట్యాన్ని, వంచనను, ఆత్మ వంచననూ తెగనాడిన కవితా సంపుటి ''వలస పోయిన మందహాసం''.

ప్రవాసాంధ్రుడుగా ఏదోవుూల కవి మునస్సులో అసంతృప్తి జ్వాల రగులుతున్నప్పటికీ దృష్టిని సంకుచితం చేసుకోక, ఆశావాదిగా తనను తాను మలచుకోవడానికి జరిపిన విశిష్ట ప్రయత్నంగా ఈ కవితలను పేర్కొనవచ్చు. కనుకనే ఇందులో ముకుంద రామారావు ఆశతోనే కాదు, ఆర్తితో విషయాన్ని శోధిస్తాడు. తెలిసిన వివరాలతో తెలీని ముఖాల్ని అన్వేషిస్తాడు. తెలిసిన ముఖాల్లో తెలీని లోతుల్ని అనేకానేక కోణాల్నుంచి అధ్యయనం చేస్తాడు. పరిశోధన ప్రాణంగా అనుభవాలను జోడించి తాత్త్వక నవనీతాన్ని అందించడానికి ప్రయత్నిస్తాడు. రణగొణ ధ్వనుల మధ్య రోజువారీ జీవితానికి దూరంగా ఆలోచనకింత అవకాశం ఇచ్చేందుకు కదిలివెళ్ళాలన్న తపన ఉన్నా, నలుగురితో ఏకాంతాన్ని అప్పుడప్పుడూ అభిలషించినా మనస్సు పొరల అట్టడుగున మాత్రం మానవతను మరవని వాడు ముకుంద రామారావు! కనుకనే అతను ఫలితాల మీద కంటే, మనుషుల మీదనే విశ్వాసం పెంచుకోవాలంటాడు. అలాగాక మనిషిని విస్మరించి ఫలితాల మీద నమ్మకం పెట్టుకొని ఆ దిశలోనే సాగే శక్తియుక్తులకు వ్యూహరచనలకు అతను విలువ ఇవ్వడానికి నిరాకరిస్తాడు. ఈ మొత్తం కవితా సంపుటిలో - మనిషి అన్ని రకాల సవాళ్ళను ఎదుర్కోడానికి సిద్ధపడి ఉండాలన్నదే కవి సందేశం. బెంబేలు పడిపోయి కార్యక్షేత్రాన్ని విడవ కూడదన్నదే అతని వేదం. ఎందుకంటే ఎంత ఏకాంతాన్ని తాను ప్రేమించినా ఆయన వంశపారంపర్య హక్కుల్ని ఈసడిస్తాడు, వ్యష్టి ప్రయోజనాన్ని హద్దులలో పెడుతూనే సమష్టి బాగుని కోరే కవి ఈయన ఎవరికి వారు గీసుకునే హద్దులే హక్కుల వుతున్నప్పుడు ''సకల జీవరాశులూ బాధితులు'' కావడాన్ని రామారావు సహించలేడు, ప్రతిఘటించాలంటాడు ఆయన ఆరాటం, పోరాటం అంతా

మనం అందరం ఆశించే ఆ ''మంచి రోజుల కోసమే''నని మరువరాదు. వ్యక్తి స్వేచ్ఛకు విలువ ఇస్తూనే వ్యష్టి ప్రయోజనం సమష్టి మంచిద్వారానే సిద్ధించగలదని విశ్వసించినవాడు. అయితే లోకం దృష్టికి దూరంగా కేవలం జాతీయ వాదులుగా వ్యవహరించిన పాశ్చాత్య కవికుమారుల్లో కిప్లింగ్, ఇప్సన్, అనటోల్ ఫ్రాన్స్ లాంటి వారితో పోలిక అని కాదుగాని ముకుంద రామారావు వాళ్ళ పరిధుల్ని కూడా దాటి విశ్వజనీన దృష్టిని అలవరచుకున్న కవి. స్వాభిమానం, స్వరాష్ట్రాభిమానం కన్నా ఎల్లలోకం ఒక్క ఇల్లుగా సకల జగజ్జనులారా, మానవుడే నా సందేశం అని చాటగలిగిన తెలుగువాళ్ళు ఇద్దరే ఇద్దరు - గురజాడ, శ్రీశ్రీ. రెండు ప్రపంచయుద్ధాలు చూసిన రచయితలలో పెక్కుమంది రాసిలోను వాసిలోనూ జాతీయతా సరిహద్దులను అధిగమించి అంతర్జాతీయ దృష్టిని సార్వజనీనం చేసుకున్నారు **(denationalised in quality and type).** ఈ కోవకు చెందిన వాళ్ళే - రాబర్ట్ ఫ్రాస్ట్, ఎజ్రాపౌండ్, ఇలియట్, మరియాని మూర్, రాబర్ట్ లోవెల్, మేరీ మెకార్థీ. మన ముకుంద రామారావు కూడా బహుశా ప్రవాసాంధ్రుడుగా ఎదగడం వల్లనో ఏమో హెన్రీమిల్లర్‌లా గ్రూపులకు, వర్గాలకు అతీతంగా ఉండగలిగాడు (**"against groups and sets and sects and cults and isms"**)! కవీ, కళాకారుడూ భావుకతతో ఎన్నడూ శాస్త్రవేత్తతో పాటు బరాబరిగా ఉండాలంటాడు మిల్లర్! ఇందుకు హద్దులు, సరిహద్దులూ ఉండవు. నోరు మంచిదైతే ఎక్కడున్నా తానున్న ఊరూ మంచిదే అవుతుంది. ఊరి పొలిమేరలు దాటితే గాని మనిషి ప్రపంచపు పొలిమేరలు కొలవడానికి ముందడుగు వేయలేడు. మనస్సును విశ్వగామి చేసుకోడానికి మనిషి నిరంతరం తపనపడక తప్పదు. హెమింగ్‌వే పారిస్ నగరం విడిచిపెడితేగాని క్యూబాలో తన ఉనికిని కాపాడుకోలేకపోయాడు. ఆల్డస్ హక్స్‌లీ ఇంగ్లాండు విడిస్తేగాని కాలిఫోర్నియలలో ''సమర్థ రామదాసు'' కాలేకపోయాడు. కాథరీన్ పోర్టర్‌కు మెట్టినచోటే - మెక్సికోలో ప్రవాస జీవితమే పరమ ప్రాణమూ ప్రమాణమూ అయింది. డి.హెచ్. లారెన్స్‌కు, డెరాల్‌కు గ్రీస్, సైప్రస్‌లే సొంత ఇళ్ళయ్యాయి! ఈ విషయంలో ముకుంద రామారావు కూడా బాధపడవలసిన అవసరం లేదు! మానవ సంబంధాలలో విశ్వజనీనతే నిజమైన గ్లోబలైజేషన్!

రామారావు కవితలో కళ్ళు వింటాయి. చెవులు చూస్తాయి! మెదళ్ళు ఈ రెంటికీ చెందని విషయాల్ని శోధిస్తుంటాయి! దృశ్యాన్ని శబ్దంగానూ, శబ్దాన్ని దృశ్యంగానూ మలచగలిగిన నేర్పు ఈయనకి ఉన్నట్టు తోస్తుంది. నిశ్శబ్దం నుంచి కూడా శబ్దాన్ని పిండగల శక్తీ, యుక్తీ ఉన్న వాడీయన. రాజకీయాలు నేరమయమయిన

చోట, నేరమే రాజకీయంగా మారిన చోట ''కళేబరాల మీద కాసుల వేటను'' కళ్ళకు కట్టి చూపించిన వాడు రామారావు. ఆ వేటలో ఉన్నవాడు ఎందుకు దొరకడో కవి చెబుతున్నాడు వినండి : ''ఎవరికి వారు ప్రకటించుకుంటే తప్ప/ఆచూకీలు ఆనవాళ్ళు దొరకవెక్కడా/నీదేకాదు నిన్ను లేకుండా చేసిన వాడిది కూడా/రహస్య స్థావరంలో వాడెక్కడో/రక్తాన్నం తింటూ రంగుల తెరమీద హాహాకారాల ఆర్తానాదాల నేపథ్య సంగీతాల మధ్య/సజీవ దహనాల్ని ఖననాల్ని/ప్రాణ స్పర్శకు పాకులాడుతున్న చిట్లిపోయిన రక్తనాళాల్ని/రసాస్వాదన చేస్తుంటాడు/ఎలా పట్టుకోగలవు'' అని ఎదురు ప్రశ్నిస్తాడు. అయినా నేటికీ ఈ ప్రశ్న ప్రశ్నగానే ఉంది, శ్రీశ్రీ అన్నట్టు ''అలలు కదిలి మరలి చనగ శిల మాత్రం మిగిలినట్టు''!! ఈ దేశంలో సామాన్యుడి బతుకు, సగటు మానవుడి గతుకు అడుగడుగునా ''మరణంతో యుద్ధం చేయడమే''నన్నది ముకుంద రామారావు ముక్తాయింపు! ఈ నిత్య జీవన సమరంలో ''బతికించే నాథుడే ఉండాలిగాని శవానికి కూడా కాస్సేపైనా బతకాలని ఉంటుం''దన్నప్పుడు కవిలో ఆశావాది కనిపిస్తాడు. అవిరళంగా కురిసే ఆకాశం కూడా ఎప్పటికైనా తెరిపివ్వకమానదని అతని విశ్వాసం. రామారావు 'బుజ్జి కుక్క' శ్రీశ్రీ ''బుక్కుల్ని'' గుర్తుచేస్తుంది. ఆదరణలేని చోట ఎవరూ ఉండలేరు, గజ్జి కుక్కే కాదు చివరికి బుజ్జికుక్క కూడా! మనిషిలో అంతరంగ మథనానికి ప్రతీక ''రహస్య ప్రక్రియ'' జీవన సంబంధాలన్నీ వ్యాపార సంబంధాలే కనుక, ఆత్మ ప్రకంపలన్నీ దానిచుట్టూనే తిరుగుతాయన్న సత్యాన్ని మరొకసారి గుర్తు చేస్తుంది ''ఆఖరి మజిలీ'' కవిత! క్రిమినల్ జస్టిస్ గురించి జింబో ఇటీవల రాసిన 'హాజిర్ హై' విశిష్ట కవితలాంటిదే ముకుందరామారావు ''మరణశిక్ష''. కారణం ఏదైనా కానీ / ఖాకీ బూట్లు/ నల్లకోట్లయినా/ప్రాణానికి ప్రాణమే న్యాయం'' అని తేల్చిన కవిత! ఇక కవి ''వలసపోయిన మందహాసం'' కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలంలోని కణ్వాశ్రమంలో శకుంతలను అత్తవారింటికి పంపుతూ కణ్వుడు ఈదిన దుఃఖ సముద్రానికి నకలు. ముకుంద రామారావు కన్న బిడ్డను భర్త వద్దకు సాగనంపుతూ పడిన మనోవేదన, రేపటి ఆమె కాపురం ఎలా సాగుతుందో, ఇప్పుడా చేతిలో వేసిన చెయ్యి అభయహస్తమవునో కాదో మందహాసమై మెరుస్తోందన్న ఆశా సంశయాల మధ్య ఆ క్షణంలో ఊగులాడే తల్లిదండ్రుల మనస్సుకు దర్పణం ఈ కవిత. తండ్రి మనస్సులోని ఆ సుందర చైతన్యాకృతి (కూతురు) తనకు వీడ్కోలిస్తున్నప్పుడు తెలిసి తెలిసీ ఏ కొల్లేరు సరస్సుకో వలసపోయే సైబీరియన్ పక్షిలా కన్పించడం - ఓ సుందరమైన భావచిత్రం! ''విడిచిపోలేని

బాధ/విడదీస్తున్న చేతుల కంటకి''పోవడం గుండెలను పిండుకొనే మరో బరువైన దృశ్యం! సుఖంగాసాగిన ముకుందరామారావు వచన కవితా ఖండికలు ఒక విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి: డి.హెచ్.లారెన్స్ అన్నట్టు కవితాత్మను పరిపూర్ణంగా ఆవిష్కరించడానికి మడులూ దాడులు లేని వచన కవిత అవసరం. ఛందోబంధాలు గుదిబండలు కాకుండా, మానవుడి పూర్ణత్వాన్ని ప్రతిబింబిస్తూ అతని రాగద్వేషాలను, సంఘర్షణలను, వైరుధ్యాలనూ వ్యక్తం చేసే కవిత మాత్రమే నిజాయితీకి నిలువుటద్దం అన్నాడు! అలా సాగిందే ''వలస పోయిన మందహాసం''. అంత వెసులుబాటు ఉండబట్టే జేమ్స్ లాంగెన్‌బాక్ అనే కవి **"The image of the mother"s face receding / On the far edge of the broken bed"** అనగలిగాడు! అలాగే ''వీడని ముడి'' అనే కవితలో రామారావు కుటుంబాల మధ్య బంధాలు అనుబంధాలు ఎంత బలీయమైనవో ప్రవాసాంధ్రుడుగా అనుభవాలను అందించాడు. కనుకనే పాత జ్ఞాపకాల దొంతర్లు పెనవేసుకొని ''పొట్ట కోసం చెదిరిపోయిన పిట్టలన్నీ / కాకతాళీయంగానైనా కలుసుకున్నప్పుడు'' పొందే అనుభూతి ఏవిటో కళ్ళు చెమర్చేలా చెప్పాడు! సోవియట్ యూనియన్ పతనమైనప్పుడు రిపబ్లిక్ గుండె బద్దలై యూనియన్ ముక్కలు చెక్కలైనప్పుడు - ఆ అగమ్యగోచర స్థితిలో వ్యోమగామి అంతరిక్షంలోనే గడిపిన ఘడియల్ని తలచుకొంటూ ముక్కలవుతున్న భూమిపైన ఎక్కడ దిగాలో తెలియని స్థితిలో ఆవేదనతో కవి ఊహించిన ఓ సన్నివేశం ''భూమికీ-ఆకాశానికీ మధ్య''! విశ్వాసాలు సడలినప్పుడు మనిషైనా, పక్షులైనా ఒకటే. ''కాలం ఖరీదు పెరుగుతున్నప్పటి నుండి/ నమ్మకాల సంతకాలు చెరిగిపోతున్నప్పటి నుండి/ఇంటిముందు పక్షులు సైతం/ ఎందుకైనా మంచిదని / ఇంకోచోట కూడా / గూళ్ళు కట్టుకోవడం'' ద్వారా పట్టాలు తప్పిన జీవితాన్ని చిత్రించాడు కవి!

ఒక్క ముక్కలో ఆచార్య చేకూరి రామారావు చెప్పినట్టు ముకుంద రామారావు కవిత్వంలో స్పష్టాస్పష్టత ఉంటుంది. పారదర్శకత్వం ఉండదు. పదౌచిత్యం ఉంటుంది, పదాడంబరం ఉండదు. భావ గాంభీర్యం ఉంటుంది, భాషాక్లిష్టత ఉండదు. అనుభవం వైయక్తికం. దృక్పథం విశ్వజనీనం. అయితే ఆ కళాత్మకత తెలిసి ఉండాలి రాయగలగాలి గాని పద్య కవితకన్నా వచన కవిత రాయడం ఎంత కష్టమో, రాసి ఒప్పించడం మరింత కష్టం! శైలి, భావుకత, సందేశం ముప్పేటగా సాగినప్పుడే ఇది సాధ్యం. అందుకే డోనాల్డ్ దావీ పదాలతో పొదిగే కవితా కళను కళా శైలిలోనే తీర్చిదిద్దుకోవాలంటూ ఇలా అంటాడు:

"The practice of an art/is to convert all terms/into the terms of art/By the end of third stanza/death is a smell no longer / it is a problem of style"!!

*(ఆదివారం 1, జూన్ 1997)*

# కులవ్యవస్థ : హైందవ 'కాలధర్మ సూత్రం'

**భా**రతీయ సమాజాన్ని పట్టిపీడిస్తున్న కులవ్యవస్థ గురించి ఉప రాష్ట్రపతి కె.ఆర్.నారాయణన్ హైదరాబాద్‌లో ఒక సందర్భంలో ప్రసంగిస్తూ వెల్లడించిన ఆందోళనను విజ్ఞులయిన వారంతా పంచుకోవాలి. స్వాతంత్ర్యానంతరం చాలావరకు వ్యక్తులు తమ పేర్లకు కులాన్ని ఒక ఆభరణంగా తగిలించుకోవడం అన్నది చట్టం అవసరం లేకుండానే వెనుకడుగువేసిందనీ, అయితే కులం పేరుతో ఇప్పుడు కుల సంఘాలు బాహాటంగా తిరిగి తలెత్తుతున్నాయనీ ఆయన విమర్శించారు. ఈ పరిణామంతో పాటు యజ్ఞయాగాదులు కూడా మితిమీరుతున్నాయన్న బాధను వెల్లడించారు. నిజానికి ఒక విధంగా నారాయణన్ చెప్పినదాంట్లో కొత్త ఏమీ లేదు. కాని పాత వదిలించుకోలేకుండా ఉన్నందున కుల నిర్మూలన విషయంలో స్పష్టమైన లక్ష్యాన్ని కొత్తగా నిర్వచించుకోలేకపోతున్నాం. జనాభాలో నూటికి 60 మందికి పైగా ఇంకా అక్షర జ్యోతికి దూరంగా ఉన్నంతకాలం మనల్ని వెన్నాడుతున్న ''వర్ణాశ్రమధర్మ'' వ్యవస్థ మనస్సులనే కాదు, ఎముకలను కూడా కొరుక్కుతింటూనే ఉంటుంది. వేదాల్ని గౌరవిస్తున్న మనం ఋగ్వేదంలో కుల ప్రస్తావన లేదంటే నమ్మలేని దుస్థితిలో ఉన్నాం. ఋగ్వేదం వర్ణవ్యవస్థకు దూరమంటే విశ్వసించని వాళ్ళున్నారు. ఋగ్వేదానికి ఉన్న కొన్ని భాష్యాలు కొందరు స్వార్థ ప్రయోజనాల కోసం చెప్పినవేనని అంటే గొంతుచించుకునేవాళ్ళున్నారు. సత్యవ్రతులు, విజ్ఞాన సంపన్నులయిన ప్రాచీన మహర్షులు కూడా నేడు మనం అనుకొంటున్న కులవ్యవస్థ (వర్ణ వ్యవస్థ) గురించి పట్టుబట్టలేదు ఎందుకంటే సింధు నాగరికత కాలం నాటికి స్థిరపడింది వర్ణవ్యవస్థ కాదనీ, వర్గ సంఘర్షణ మాత్రమేననీ ఒక్కళ్ళుకాదు - అంబేద్కర్‌తో పాటు - బాషెం, శ్రీవాత్సవ, డి డి కోశాంబి, ఛటోపాధ్యాయలాంటి ఉద్దండులెందరో అధ్యయనం తరువాత అభిప్రాయానికి రావలసివచ్చింది. దళితుల చరిత్ర కూడా ప్రారంభమైనది అప్పటినుంచేనని తెలుసుకుంటే ఆశ్చర్యపోనక్కరలేదు. మనిషి, తోటి మనిషిపట్ల అమానుషత్వ సరిహద్దులను విస్తరించడం కూడా ఆనాటినుంచేనని తెలుసుకుంటే - ఇది కలవారికీ - లేనివారికీ మధ్య లేదా

కడుపునిండిన వారికీ కడుపుమండిన వారికీ మధ్య నిరంతరంగా సాగుతూ వచ్చిన సమరమనీ భోధపడకమానదు. ఈ ఘర్షణను కనిపించకుండా ఉంచడానికే 'వర్ణం' అవసరమయింది. మనం ఇన్ని చెప్పుకుంటున్నాం కదా - విశ్వసృష్టిని గురించిన ఋగ్వేదంలోని పదవ మండలంలో ఉన్న వర్ణన చూస్తే కుల వ్యవస్థకు సంబంధించి ఋగ్వేదం చెప్పని అర్థాన్ని కొందరు పండితమ్మన్యులు ఎలా వక్రీకరించగలరో స్పష్టమవుతుంది. విశ్వసృష్టికి కారకుడు ఎవరో తేల్చలేని ఋగ్వేదానికి వింత భాష్యాలు చొప్పించారు. కాని ఋగ్వేదం మాటల్లో చెప్పాలంటే - ''సృష్టికి ముందు సత్తు, అసత్తు (ఉంది, లేదు) అనేవి లేవు. వాయువు లేదు, ఆకాశం లేదు, మరి ఏముంది? ఎక్కడ ఉంది? ఎవరి రక్షణలో ఉంది? ముందు నీళ్ళ సృష్టి జరిగింది. దాని నుంచి వేడిద్వారా మనస్సు పుట్టుకొచ్చింది. ఇంతకూ సృష్టి దేని నుంచి ప్రారంభమయిందో చెప్పడం కష్టం'' అని ఒక రసాయన ప్రక్రియను మన ఊహకు వదిలేసింది!

అందువల్ల కుల వ్యవస్థ ప్రారంభ, వికాసాల గురించిన అతి మీమాంసలోకి వెళ్ళకుండా, హైందవం చెప్పిన ''కాలధర్మం'' ప్రకారం పరిశీలిస్తే మనం అందరం ఏ పేరు పెట్టుకున్నా మన బుద్ధులను మార్చుకొనక తప్పదని స్పష్టమవుతుంది. పరిణామ క్రమాన్ని అంగీకరించేవారంతా కాలధర్మాన్ని తలదాల్చుకున్న వారే. మార్పు తప్పదన్నది పాశ్చాత్యుల సిద్ధాంతమే కాదు, హైందవ సూత్రీకరణ కూడా. ఎందుకని? వేదాలతోనే పరిణామం ఆగిపోలేదు. వేదాల వెంట ఉపనిషత్తులు, వాటి వెంట ఇతిహాసాలు, పురాణాలు పుట్టుకొచ్చినట్లే, ఏదీ శాశ్వతం కాదు గోరక్‌నాథ్‌గానీ, 24 మంది తీర్థంకరులుగానీ, మరి 24 మంది బుద్ధిస్టులుగానీ చేసిన పని కాలానికి ఎదురీదడమే కాదు, కాలానుగుణంగా తమనుతాము సంస్కరించుకొని మారడం కూడా; ''సిద్ధ'' సంప్రదాయం హైందవంలో భాగమని మరవకండి. మార్పు సహజమనీ, దానిని అడ్డుకొనగల శక్తి ఏదీ ఉండబోదనీ చెప్పడానికి హైందవంనుంచే కాదు, ఇతర ప్రాచీన మహానాగరికతల నుంచి కూడా ఉదాహరించుకోవచ్చు: మెసపటోమియన్, బాబిలోనియన్, ఈజిప్షియన్, ఇరానియన్, మినోవన్, గ్రీక్, కెల్టిక్, చైనీస్, మాయన్, అజెటక్ నాగరికతల ప్రాభవ పతన దశలన్నీ అందిస్తున్న గుణపాఠాలు ఇవేనని మరవరాదు.

ఇప్పుడు చెప్పుకుందాం - ఈ కుల వ్యవస్థను కాపాడుతున్న దెవరో! దేశంలోని రాజకీయ వేత్తలూ, మత ఛాందసులూ, పాలకవర్గాలూను మతాన్ని అడ్డుపెట్టుకొని, హైందవంలో ఉన్న మంచిని పాతిపెట్టి వోట్ల కోసం, స్వార్థప్రయోజనాల కోసం కులవ్యవస్థ

మరింతగా వేళ్ళూనుకోవడానికి తగిన కృత్రిమ ఎరువును వేస్తున్నారు. గతంలో మాక్డనోల్డ్ అవార్డు, గాంధీపూనా ఒడంబడిక ఈ క్రమంలో భాగమే. ఇతర చట్టాల మాదిరిగానే బ్రిటిష్ పాలకులు షెడ్యూల్డ్ కులాల పట్ల, తెగల పట్ల అనుసరించిన విభజించి పాలించే విధానాన్ని సమర్థించే 1936 నాటి పునాదుల మీదే పాలకులు ఇంకా బతుకుతున్నారు. స్వాతంత్ర్యానంతరం కూడా ఈ కీలకమైన సమస్య గురించి కొత్త పుంతలు తొక్కలేకపోయారు. కులాన్నే గాక మానవుణ్ణే బానిస బంధాలలో ఉంచేందుకు మతాన్ని కమండలంగా స్వీకరించారు! ఫలితం? ''హిందూ మతా''నికి భిన్నమైన మతాన్ని అనుసరించే ఏ వ్యక్తి అయినా ''షెడ్యూల్డ్ కులం''లో సభ్యుడు కావడానికి వీలులేదన్నారు. ఇది ఎప్పటిదో కాదు 1950 నాటి ప్రెసిడెన్షియల్ ఉత్తర్వు (''ది కాన్స్టిట్యూషన్ ఆర్డర్ 1950''). దానిని 1956లో పార్లమెంటు ద్వారా సవరించి ''హిందూమతం లేదా సిక్కుమతం లేదా బౌద్ధమతం''కు సంబంధించినవారు తప్ప మిగతా వారెవరూ షెడ్యూల్డ్ కులాల్లో సభ్యులు కావడానికి వీల్లేదన్నారు. షెడ్యూల్డ్ కులాల విషయంలో 1936 నాటి చట్టాన్నే రాజ్యాంగమూ తలదాల్చింది! ఇది గురుపరంపర కాదు, చెడు పరంపర! ఏతావాతా ఇటు పార్లమెంటూ, అటు ప్రెసిడెంటూ అనుసరించింది 1932 - 1936 నాటి బ్రిటిష్ వాడి నిర్ణయాలనే! షెడ్యూల్డ్ కులానికి నిర్వచనం చెప్పడానికి మతాన్ని ఎప్పుడయితే పునాదిగా ఆమోదించారో ఆనాడే పాలకులు పప్పులోకాలు వేశారు. మతాన్ని రాజకీయాల నుంచి వేరుచేయాలని ఒక వైపున బోధించిన రాజ్యాంగ నిర్ణయ సభ పెద్దలు, అదే మతాన్ని 'కులా'న్ని నిర్ణయించడానికి ఒక 'కుదురు'గా మార్చుకోవడం వింతలలో వింత! ఈ లొసుగును కనిపెట్టబట్టే బి.జె.పి. నేత అద్వానీ ఇటీవల ప్రత్యేక హక్కులకోసం ఉద్యమిస్తున్న క్రిస్టియన్ దళితులను ఉద్దేశించి మాట్లాడుతూ 'ఇస్లామ్నో క్రైస్తవాన్నో ఆశ్రయించిన వారికి రిజర్వేషన్లు' విస్తరించవద్దని చెప్పారు బౌద్ధాన్ని స్వీకరించిన షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగలకు మాత్రం రిజర్వేషన్లు వర్తింపజేయడాన్ని అద్వానీ సమర్థించారు. ఎందుకని? వర్ణవ్యవస్థపై ధ్వజమెత్తిన బౌద్ధాన్ని ఎలాగూ దేశంనుంచి తరిమివేసి భారతదేశం ఆత్మహత్య చేసుకుందని మహాకవి గురజాడ అన్నాడు.

అలాంటి బౌద్ధాన్ని బలవంతంగానైనా హైందవంలో ఇముడ్చుకోగలిగారు! విగ్రహారాధనను నిరసించిన బుద్ధుణ్ణే హైందవం తనలో మరొక అవతారంగా మార్చింది అప్పుడు బౌద్ధం కూడా సిక్కు, జైన మతాలతో పాటు హైందవంలో చేరడానికి అర్హురాలయింది! కనుక ఇతర మతాలలోకి మారడం రాజ్యాంగ నిర్ణయ సభ సిఫారసులకు విరుద్ధం! ఇదీ మన లాజిక్కు!

అయితే ఈ మతాంతరీకరణ వల్ల ఎవరి సాంఘిక, ఆర్థిక పరిస్థితులూ మారవనేది అనుభవం. 1956లో డాక్టర్ అంబేద్కర్ ఆధ్వర్యంలో బౌద్ధంలోకి జరిగిన మత మార్పిడి వల్ల కూడా ఆశించిన ఫలితం కలగలేదనేది అక్షర సత్యం. దళితుల ప్రధాన సమస్య - వర్ణవ్యవస్థను మార్చడానికి చేసే ప్రయత్నంతో పాటు వర్గవ్యవస్థను కూడా మార్చుకోవడం ఎలా అన్నదే. భారత దేశానికి సంబంధించినంతవరకూ ఈ రెండు అంశాలు పడుగుపేకల్లా అల్లుకుపోయాయి. ఈ చిక్కుముడి - పేర్లకు ముందు పెట్టుకునే కులనామాలను చెరిపివేస్తేనో, లేదా పాడి అక్షరాలకు పరిమితం అయితేనో విడిపోయేది కాదు. భారత దేశం దాటి వెడితే ప్రపంచంలో మరెక్కడా ఇంత మాలోకం, వర్ణవ్యవస్థ పేరిట ఇంతటి అవమానకరమైన, లజ్జాకరమైన విషయం మనకు కనిపించదు. ఇంక సెక్యులర్ వ్యవస్థకు రక్షణ ఎక్కడ? కులవ్యవస్థను మతం ఏలుతున్నంతకాలం మనకీ దుస్థితి తప్పదు.

*(సోమవారం 12, ఫిబ్రవరి 1996)*

# ''వజ్రసూచి'' - కుల వ్యవస్థపై వజ్రాయుధం!

**కు**లానికి కులం తెగులు, నీటికి పాచి తెగులు అన్నారు! ఈ తెగులింకా భారతీయ సమాజాన్ని పట్టి పీడిస్తూనే ఉంది. చాతుర్వర్ణ్య (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర) వ్యవస్థను పెంచి పోషించడమేగాక, ఆపైన పంచమ వర్ణాన్ని సృష్టించడమేగాక ప్రపంచంలో ఏ దేశంలోనూ ఏ దిక్కులోనూ లేనన్ని దిక్కుమాలిన కులాలకూ, ఉపకులాలకూ ఉసురుపోసి పరివ్యాప్తం చేసుకుంటున్న ఒకే ఒక్క దేశం మన భారతం కావడం దురదృష్టకరం. ఇది స్వర్ణభారతి ఉత్సవాలు జరుపుకున్నా అణగిపోని జాడ్యం. కాని ''పురుషులలో పుణ్య పురుషులు'' వేరు. అలాంటి వారు కొందరు కులాలకు మతాలకు అతీతులు అయినందుననే, వర్ణాతిశయాన్ని విసర్జిస్తే తప్ప మానవ జాతికి మనుగడ ఉండదని గ్రహించి తాముగా ముందు వర్ణాతిశయాన్ని వదులుకున్నారు. దీన్ని వామపక్ష పరిభాషలో ''డీ-క్లాసిఫై'' కావడం అంటారు. అలాంటివారు 'సవర్ణు'లయినా, 'అవర్ణు'లయినా, 'అగ్ర' వర్ణాలకు చెందినా, నేటి ఉగ్రవర్ణాలయిన దళితులకు చెందినా మనం ఆహ్వానించవలసిందే. వర్ణ వ్యవస్థ గురించి నేటికీ మాట్లాడుకోవడమే సిగ్గుచేటైన పనికాగా, నేటికి 1500 ఏళ్ళ క్రితమే 'అగ్ర' కులస్థుడనుకున్న బౌద్ధమతాచార్యుడు అశ్వఘోషుడు వర్ణాతిశయాన్ని త్యజించి వర్ణ వ్యవస్థపై నిర్మొహమాటంగా ధ్వజమెత్తిన ''వజ్రసూచి'' గ్రంథాన్ని 37 సూత్రాలు పొదిగిన ఓ గొప్ప సామాజిక దర్శనంగా అందించిన ఘటన చూచి 'కులగుల'తో తీసుకొంటున్న మనందరమూ మరింతగా తలలు వంచుకోవలసి ఉంటుంది. తాను ఏ వర్ణంలో (బ్రాహ్మణ) జన్మించాడో ఆ వర్ణాధిపత్యాన్ని తిరస్కరించి ''వజ్రసూచి'' (కఠినమైన సూది - దీనినే మహాపండిత రాహుల్జీ 'వజ్రఛేది' అని వాడాడు) రచన ద్వారా కుల నిర్మూలన సిద్ధాంతానికి బలమైన ప్రాతిపదికలు వేసినవాడు అశ్వఘోషుడు అలాగే వీరేశలింగం, గురజాడ, జ్యోతిబా పూలే, అంబేద్కర్, రామ్‌మనోహర్ లోహియా తమ వర్ణాతిశయాన్ని విసర్జించి నిజమైన కుల రహిత వ్యవస్థ నిర్మాణం కోసం కలలుకన్నవారే, తపన పడ్డవారే, కార్యదీక్షతో అకుంఠితంగా ఆందోళన చేసినవారే అశ్వఘోషుని ''వజ్రసూచి''కి ఇంతకుముందు

ఏ మేరకు ఎంత విస్తృతంగా ప్రచారం లభించిందో, లభించి ఉండకపోతే ఏందుకు అలా జరిగిందో మనకు తెలియదుగాని యువ తాత్వికుడు, నిత్య అనుశీలనతో పరిశీలనతో తలమున్కలై హేతువాద దృష్టిని సామాజికులకు అబ్బించడం కోసం శ్రమిస్తున్న రవిచంద్ (మిళింద ప్రచురణలు - గుంటూరు) కృషి ఫలితంగా అశ్వఘోషుని సామాజిక దర్శనం మనకు తొలిసారిగా అందమైన తెలుగులో లభించింది. రవిచంద్ కృషికి తోడుగా సంస్కృత మూలానికి చక్కని అనువాదం అందించిన డాక్టర్ మలయశ్రీ కూడా అభినందనీయుడు. ఎందుకంటే వర్ణ వ్యవస్థపై నిరసన అశ్వఘోషుని మహా కావ్యమైన ''బుద్ధ చరితం''లో కూడా ఉన్నప్పటికీ వర్ణ వ్యవస్థను మూలముట్టుగా వ్యతిరేకించి సామాజిక శాంతిని, సమతా ధర్మాన్ని ప్రతిష్ఠించడానికి జరిపే రాజీలేని పోరాటానికి అతని ''వజ్రసూచి'' తిలకప్రాయం అయింది. ఈ చిరుపొత్తం ఆధారంగానే, ఆ ప్రేరణతోనే హడ్గసన్‌లాంటి పాశ్చాత్యులూ, రాహుల్ సాంకృత్యాయన్‌లాంటి భారతీయ మహా పండితులూ వర్ణవ్యవస్థ మూలాలను వెదకసాగారు. చివరికి తెలుగునాట ప్రొఫెసర్ లక్ష్మీనరసు, డాక్టర్ కె.బి. కృష్ణలాంటి మేధావులు కూడా ప్రభావితులయ్యారు. ఆచార్య ఆత్రేయ అశ్వఘోషునిపై ఒక నాటకమే రాశాడు. లక్ష్మీనరసు బౌద్ధం గురించి రాసిన గ్రంథం సాంఘిక విప్లవానికి దోహదం చేసిన డాక్టర్ అంబేద్కర్‌కు ప్రేరణ కల్పించింది. ఎందుకు? ఆది బౌద్ధం దైవాన్ని, పరలోకాన్ని, ఆత్మవాదాన్ని నిరసించింది. మానవుని కర్తవ్యాన్ని తెలిపింది. ఆ వాగురలో బుద్ధుని తర్వాత ఎదిగివచ్చిన అశ్వఘోషుడు సామాజిక పరిస్థితులను కళ్ళారా చూసి తన వర్ణాన్నే నిరసించి మతాతీత వ్యక్తిగా, మానవతావాదిగా ప్రజాబంధువయ్యాడు. ఇక్కడొక సత్యాన్ని మరవరాదు. సమాజానికి కేవలం బ్రాహ్మణ వాదం ఎంత చేటో, కేవలం గుడ్డి బ్రాహ్మణ ద్వేషం కూడా అంతే అనర్థమని గుర్తించాలి. ఎందుకంటే రవిచంద్ ఒక సమన్వయంలో పేర్కొన్నట్టుగా ''వర్ణాతిశయాన్ని విసర్జించే వారెవరైనా నిజమైన కుల నిర్మూలన వాదులకు మిత్రులే. ఎవరు ఏ వర్ణంలో, ఏ కులంలో పుట్టారన్నది ప్రధానం కాదు. ఎవరు ఏ భావజాలానికి ప్రతినిధులనేది ముఖ్యం. ఇది రెండు విరుద్ధ భావజాలాల మధ్య పోరాటమేగాని వ్యక్తుల మధ్య పోరాటం కాదు బౌద్ధ భిక్షు సంఘాలలో .. వర్ణాతిశయ విసర్జన ఏదో ఒక వర్ణానికే పరిమితమైన చర్యకాదు కుల నిర్మూలన వాదం ఏదో ఒక వర్గం గుత్త సొమ్ముకాదు. మానవ ప్రగతిని, వికాసాన్ని ఆశించే ప్రతి వ్యక్తికీ అది తక్షణ సామాజిక బాధ్యత'' రవిచంద్ ప్రతిపాదనకు ఒక ఉదాహరణ ఒకే వర్ణానికి చెందిన కాళిదాసు వర్ణ వ్యవస్థను సమర్థిస్తే, అశ్వఘోషుడు

నిరసించినవాడు. నన్నయ్య కుల వ్యవస్థను సమర్థించగా, గురజాడ వ్యతిరేకించినవాడు! అయితే రవిచంద్ ఇక్కడొక అంశాన్ని మరవరాదు : ''వేయిపడగల నాగుబాము''గా మారిన వర్ణ వ్యవస్థా చట్రంలో నలిగిపోతూ వచ్చిన దళిత వర్గాలను, మహిళలనూ, కుల వ్యవస్థ ముసుగులో ఆధిపత్యంలో ఉన్న 'అగ్ర' వర్ణాలనూ ఒకే గాటను కట్టలేము. అయితే అదే సమయంలో అటు అశ్వఘోషుడు, ఇటు అంబేద్కర్ విభిన్న కులాలకు చెందినా కుల వ్యవస్థ కూలిపోతేగాని సమతకూ, మానవతకూ పెద్దపీట పడదని మనసారా గుర్తించినవారు. మనిషి ఉన్నతుడు, మహోన్నతుడు (Great man) ఎప్పుడవుతాడు? వ్యక్తి ప్రయోజనం గాకుండా సామాజిక ప్రయోజనం అతని మనస్సుకు చోదక శక్తి కాగలిగినప్పుడు అని అంబేద్కర్ చాటాడు ("A great Man must be motivated by the dynamics of a social purpose") ఈ ఉద్దేశంతోనే అంబేద్కర్ సామాజిక ప్రయోజనమే, ఆ స్పృహే కులరహిత వ్యవస్థకు పునాది కావాలన్నాడు ("Social endosmosis")! అయితే పాత ఫ్యూడల్ వ్యవస్థపైన, అగ్రవర్ణ కాపట్యంపైన అవిశ్రాంత పోరాటం జరుపుతూ వచ్చిన జ్యోతిబాపూలే ఉద్యమంగానీ, అంబేద్కర్ అనుభవంగానీ - కుల దోపిడీని ఎదిరించగల మేర దళితుల్లో చైతన్యాన్ని తేగలిగిందే గాని బడుగు వర్గాల ఉనికికి ఆధారమైన వ్యవసాయక సంబంధాల్లో మార్పు కోసం, ఆ పెను పరివర్తన కోసం పేద రైతాంగాన్ని సమీకరించలేకపోయింది. ''హైందవ'' సమాజంలోని సాంఘిక దురన్యాయాల నుంచి విమోచనకు ఎక్కుపెట్టవలసిన సైద్ధాంతిక ఆయుధాన్ని పలాయన మంత్ర దండంగా మార్చడం వల్లనే అంబేద్కర్ బౌద్ధాన్ని ఆశ్రయించ వలసి వచ్చింది! బడుగు జీవులను దోపిడీ చేసే వ్యవస్థకు మూలాలైన భూస్వామ్య, అర్ధభూస్వామ్య వ్యవస్థల్లోని భూ సంబంధాలపై తమ ఆగ్రహాన్ని ఎక్కుపెట్టడంలో వీరు విఫలమయ్యారు. చివరికి పెరియార్ ఇ.వి. రామస్వామి నాయకర్ నాయకత్వాన సాగిన ద్రావిడ ఉద్యమం కూడా అంతే. కుల దోపిడీపైన ధ్వజమెత్తిన నాయకర్ ఈ దోపిడికి ఆశ్రయమిస్తున్న మౌలికమైన ఆర్థిక పునాదులపై ఎక్కుపెట్టలేకపోయాడు. కనుకనే సంకుచిత చట్రాన్ని అధిగమించి ఆ ఉద్యమాలు ఎదుగలేకపోయాయి, తిరిగి సంపన్నవర్గాల వలలో ఏదో రూపంలో చిక్కుకుపోతున్నాయి!

అయితే ఈ ఆర్థిక పునాదితో పాటు ఇంతకూ ''బ్రహ్మన్'' శబ్దాన్ని కొందరు అగ్రవర్ణులు భ్రష్టుపట్టించారు. ''బ్రహ్మ'' అంటే విద్య అనిగాక 'బ్రాహ్మణం' అని దురర్థాలు తీశారు ''బ్రహ్మ''కు ఋగ్వేదం, ఐతరేయ ఉపనిషత్‌లు చెప్పిన అర్థం

ఒకటి, ఆ తరువాత ప్రక్షిప్తంగా బ్రాహ్మణ్యంలో కొందరు కల్పించి ప్రచారంలోకి తెచ్చిన అర్థాలు వేరయ్యాయి. 'బ్రహ్మ'ను తపస్సు, వేదం, యోగం అన్నారు. ఉపనిషత్తులు ప్రజ్ఞానమే బ్రహ్మ అన్నాయి (''ప్రజ్ఞానం బ్రహ్మ'') గాని ఆ శబ్దాన్ని ఒక జాతికిగాని, ఒక కులానికి గానీ అన్వయించలేదు. 'ప్రజ్ఞ' అంటే బుద్ధి, సామర్థ్యం. మంచి చెడులను గ్రహించడమే 'ప్రజ్ఞ'గా, ఆ విజ్ఞానాన్నే 'ప్రజ్ఞ'గా, చైతన్యంగా, అదే 'బ్రహ్మ'గా వర్ణించాయి. కాని అహంకారాన్నీ, వర్ణాతిశయాన్నీ 'బ్రహ్మ'గా ఋషులు గానీ వర్ణాతిశయాన్ని విసర్జించిన అశ్వఘోషుడు గానీ భావించలేదు. ప్రచారం చేయనూ లేదు. ఇందుకు విరుద్ధంగా కొందరు తమ పురఃపతనాన్ని ఊహించలేక ''అహంబ్రహ్మోస్మి'' (నేనే బ్రహ్మను) అని భ్రమించారు! ఈ తప్పుడు ఆలోచన వల్లనే భారతదేశంలో నాడున్నది చాతుర్వర్ణ్య వ్యవస్థ కాగా, నేడు అమలులో ఉన్నది - శత సహస్ర బహు వర్ణ వ్యవస్థ! అలాగే డాక్టర్ రాధాకృష్ణ తరువాత కుల వ్యవస్థను మనఃపూర్వకంగా నిరసించిన హైందవ తాత్వికులూ లేరు. ''కులం అన్నది ఒక సాంఘిక దురాచారంగా భావించకపోవడం దురదృష్టకరం'' ఇప్పుడది రాజకీయ, పాలనా వర్గ జాడ్యంగా కూడా అవతరించింది. **(Unfortunately Caste has ceased to be a social evil and now it has become a political and Administrative evil)!** అన్నాడు రాధాకృష్ణ. అలాగే అశ్వఘోషుని ''వజ్రసూచి''తో పాటు ''వజ్ర సూచికోపనిషత్తు'' కూడా వర్ణ భేదాల్ని నిరసించింది, తృణీకరించింది. ''పుట్టుకపై ఆధారపడి నిర్ణయించిన భేదాల్ని'' ఈ ఉపనిషత్ ఏవగించుకోవడాన్ని రాధాకృష్ణ సమర్థించారు. సామవేద శాంతి పాఠంలో భాగమైన ఈ ''వజ్ర సూచికోపనిషత్'' వర్ణాధిక్యతను, వర్ణాతిశయాన్ని తీవ్రంగా వ్యతిరేకించింది. ఎందుకంటే, ''జాతి'' ప్రసక్తి లేకుండానే, వర్ణంతో నిమిత్తం లేకుండానే జ్ఞానులైన అనేకమంది మహర్షులు (ఋష్యశృంగుడు, కౌశికుడు, జంబూకుడు, వాల్మీకి, వ్యాసుడు, గౌతముడు, వశిష్ఠుడు, అగస్త్యుడు) ఉన్నారు కాబట్టి వర్ణాతిశయానికి అర్థమే లేదన్నది ఉపనిషత్ సారం! అందువల్ల ఈ 'అతిశయా'నికి ఎల్లలు లేవు, కులం లేదు, అన్ని వర్ణాలకూ, అన్ని వర్గాలకూ వర్తిస్తుంది! అందువల్ల ఒక మార్గం నుంచి మరో మార్గంలోకి మళ్ళడం అన్నది అన్ని ధర్మాలకూ సమంగానే ఉంది. అలా వర్ణాతిశయాన్ని వదులుకుని బౌద్ధంలోకి చేరినవాడు అశ్వఘోషుడు. కనుకనే అతను ''బుద్ధిమంతులు తమకు యుక్తమని తోచినదాన్నే స్వీకరించండి'' అని చెప్పాడే గాని ఆదేశపూరకంగా హుకుమ్‌లతో, ఫర్మానాలతో బలవంతపు బ్రాహ్మణార్థానికి దిగలేదు!

అందుకే అశ్వఘోషుని ''వజ్రసూచి'' అగ్రవర్ణాతిశయాన్ని ఆ వర్ణపు ప్రామాణిక గ్రంథాల (శృతులు, స్మృతులు) ఆధారంతోనే ఖండించింది; అవశేష వ్యవస్థ అడుగుజాడలను చెరపడానికి యత్నించింది; హేతువాద, మానవతావాదాలను ప్రబోధించి ఆచరణకు పురిగొల్పింది. సామాజిక అసమానతల తీవ్రతను గమనించిన అశ్వఘోషుడు సమానతా సూత్ర ప్రతిపాదన చేశాడు. మానవులంతా సుఖ, దుఃఖ, జీవన, బుద్ధి, వ్యాపార, వ్యవహార, సంభోగ, సంతాన, భయ, మరణాది ఉపచారాల విషయాల్లో సమానులని, ఏ ప్రత్యేకతలూ వేరుగా లేవనీ మహత్తరమైన విశ్వమానవ వాదాన్ని ప్రతిపాదించాడు. ''బ్రాహ్మణత్వం'' ఒక వర్ణ లక్షణం కాదన్నాడు. జాతి, జన్మ ప్రత్యేకతలు దానికి లేవన్నాడు. విద్య, విజ్ఞానం సాధన ద్వారానేగాని జన్మ కారణంగా రావన్నాడు! నిజానికి మనమూ మన పాలకులూ నికార్సయిన లౌకికవాదులమే అయితే ఈ ''వజ్రసూచి''ని విద్యాలయాల్లో తక్షణం పాఠ్య గ్రంథం చేయాలి! ఎందుకంటే, లోహియా చెప్పినట్టు ఈ కుల వ్యవస్థ ఎదుగూబొదుగూలేని సామాజిక వ్యవస్థకు దారుణమైన ప్రతినిధి, మార్పుకు బద్ధ విరోధి, అన్ని రకాల లంపటానికి, అగౌరవానికి అష్టావక్ర అబద్ధాలకూ నిలయం! ఈ కులవ్యవస్థ వల్ల సంపద ఉత్పత్తి కార్యక్రమాల్లో పాల్గొనవలసిన తొంభై శాతం సామాన్య ప్రజల, కష్టజీవుల శక్తి యుక్తులు ఎదుగుదలకు అవకాశాలు లేక కుంచించుకు పోతాయనీ అన్నాడు లోహియా! అలాగే, వర్ణాశ్రమ ధర్మాల్ని భుజాన వేసుకుని ఉత్పత్తి కారకులైన శ్రమజీవుల్ని (దళితుల్ని) అస్పృశ్యులుగా చిత్రించడాన్ని నిరసిస్తూ స్వాతంత్ర్య సమర దినాలలోనే మంగిపూడి వేంకటశర్మ రాసిన ''నిరుద్ధ భారతం'' కూడా ఈ సత్యాన్నే నిరూపించింది. ''పవలు రేల్కష్టించి వ్యవసాయ మొనరించి/ ఉర్విని పండించు చున్న'' ఈ కష్టజీవులకు, సమాజం అభివృద్ధిని కాంక్షించే దళితులకు, ఉత్సాహశక్తి, తెలివితేటలు, దీక్షాదక్షతలున్న దళితులకు మనం కలిగిస్తున్న అంతరాయాల వల్లనే వారి శక్తియుక్తులు ఫలవంతం కావడం లేదని మంగిపూడి ఆనాడే ఆక్రోశించాడు. ఈ ''అంతరాయాల'' వల్ల, వారు వృద్ధిలోకి రావాలన్న ''భగవంతుడి ఉద్దేశం'' కూడా దెబ్బతినిపోయిందని, ఫలితంగా ''మన స్వార్థపరతవల్ల'' మొత్తం ''భారతభ్యుదయానికే అపారమైన భంగం'' వాటిల్లిందనీ దురపిల్లవలసి వచ్చింది ఈ కుల వ్యవస్థ భారతం మూల్గులను పీల్చి ఉండకపోతే, సమానావకాశాలు అందిరకీ లభ్యమై ఉంటే - చరిత్రలో ఇండియా ఈసరికే అన్ని రంగాలలోనూ మహోన్నత స్థానంలో ఉండి ఉండేది కాదా? సంఘజీవనానికి, పాలనా పద్ధతులకు కుల వ్యవస్థ

నిర్ణేతగా ఉన్నచోట సర్వ కళలకే కాదు, సర్వ మానవుల వికాసానికే చెరుపు. కడచిన భారతంలో జరిగిందీ అదే, నడుస్తున్న చరిత్రా ఇదే. గురజాడ అన్నట్టు కుల వ్యవస్థను నిరసించిన బౌద్ధాన్ని సరిహద్దులు దాటించి భారతదేశం ఆత్మహత్య చేసుకున్నది నిజం కాదా?!

*(ఆదివారం 25, జనవరి 1998)*

# చెమరించిన కన్నుల నుంచి చివురించిన కవి చెమన్!

**అ**తను ఆర్భాటపు మెట్లమీదుగా ఆకాశాన్ని దించలేదు; అసందర్భపు చూపుల మీద భావాన్ని దించలేదు; గుండె గదిని తడపకుండానే తడారిపోయిన నాలుకతో నినాదాన్ని రాయలేదు; భావం రసగుళిక కానిదే కాగితం మీద భౌతికాకృతిని దాల్చలేదు; సంకుచిత సరిహద్దులలో సంచరిస్తూ మెదడును మూటగట్టుకోలేదు; ఇంతకూ మరి అతగాడెవరు? ''సార్వజనీయ సారాన్ని పిండుకునేందుకు'' అక్షరాన్ని అర్థవంతపు శిఖరమ్మీద పాతి అరుగు తేలిన ఆయుధాన్ని చేయనివ్వమంటున్న వాడు; తనలోని తనను వెతుక్కునేందుకు (తత్త్వమసి) కవిత్వం తన చూపుడు వేలుమీద దీపమై వెలగనివ్వమంటున్నవాడూ! అతడే యువకవితా నవకిశోరం చెమన్! ఒకప్పుడు ఆస్కార్ వైల్డ్ ప్రసిద్ధ ఇంగ్లాండ్ కవి కీట్స్‌ను మాతృభూమి కవి చిత్రకారుడని కీర్తించాడు. ("O! Poet-painter of our Land")! గోదావరి లోయ సాక్షిగా ప్రకృతి సంపదకు కాణాచిగా ''కోల్‌బెల్ట్''గా ప్రసిద్ధి చెందిన నల్ల బంగారు గనుల సాక్షిగా రెక్కాడించుకుని డొక్కాడించుకుంటున్న అసంఖ్యాక బొగ్గుగని కార్మికుల జీవన విధానానికి కవితా రంగంలో ప్రత్యక్షర ప్రతినిధిగా ఎదిగి వస్తున్న కవి చెమన్. ''ఎడారి స్వప్నం మధ్య'' నివసిస్తున్న కవిమాత్రుడేకాదు, ఎడారిలో అనేక నిర్బంధాల మధ్య, క్రీనీడల మధ్య, క్రేనీడల మధ్య 'ఒయాసిస్సు'గా కూడా తన ఉనికిని కాపాడుకుంటున్న యువకవి! ఇతిహాసానికి అందని అనుభూతి వాక్యాలు ముందుతరానికి పేర్చుకువస్తున్న కవి; ఎడారి స్వప్నాలను ఫలింపజేసే ఒయాసిస్సులు కూడా ఉంటాయని నిరూపించదలచుకున్న కవి చెమన్! అతి ప్రమాదకర పరిస్థితుల్లో పనిచేస్తూ మనందరికి విద్యుత్ వెలుగులు పంచుతున్న 'కోల్‌బెల్ట్' కార్మికుల కన్నీళ్లూ, కడగండ్లూ పూర్వరంగంగా కళ్లారా చూస్తూ కరిగి పోయిన చెమన్ ''ఎడారి స్వప్నం మధ్య'' కవితా సంపుటి రూపంలో తన ఆశయాలను, ఆదర్శాలను, ఆక్రోశాలను, కలలను, జీవన సమరంలోని ఎగుడు దిగుళ్లనూ మన కళ్లముందు పరిచాడు. ఎడ్విన్ మోర్గాన్ అన్నట్టు పరిసరాలను పట్టించుకుని కవితాత్మలో పొదిగిందే కవిత్వం ("Poetry should acknowledge its environment") అయితే అందుకు చెమన్

న్యాయం చేకూర్చాడని చెప్పాలి అనేక కారణాల రీత్యా ఆశా నిరాశల మధ్య కొట్టుమిట్టాడుతూ వచ్చిన ఈ యువకవి జనం నుంచి వేరుపడినవాడు కాదు; అతనికి తన ఊరి గుండె మంటలు తెలుసు. కండలు కరిగించుకుని పంటలు పండించే సామాన్య రైతు బిడ్డల కడగండ్లు తెలుసు; కలల రాత్రులు చెరిగిపోయి, కలత నిద్దురలే మిగిలి పోయినప్పుడు - దేశ సౌభాగ్యానికి పచ్చని కొమ్మైన ఊరు కాస్తా నేడు రెక్కలు తెగిన పావురంగా మారడం భరించలేడు. అంతర్మథనం అతనిలో కల్లోలతరంగాలు రెక్కవిప్పిన దాని ఫలితమే తానెరిగిన పరిసరాలలో జరుగుతున్న మార్పులకు స్పందన. చెమన్‌లోని రియాక్షన్ ఎంత బలీయమైనదో తన కవితా సంపుటిని అచ్చువేసి వదలడంలో సహకరించిన వారందరికి చెప్పిన ''కృతజ్ఞతలు''లో ప్రకృతిని కూడా ఆవాహనం చేస్తూ చెప్పిన వాక్యాలే నిదర్శనం. కృతజ్ఞతా భావంలో కూడా ఓ అందమైన మలుపు; ఖాళీ కడుపుతో రోడ్డెంట తిరుగుతున్నప్పుడు కడుపునింపిన రోడ్డుపక్క పంపులకూ, లోకం ఆదమరిచే వేళ తనను మేలుకొలిపి పెదాలపై ముద్దాడే నక్షత్రాలకూ కూడా నమస్సుమాలు అర్పించాడు! భూగర్భంలో దాగుండేది ఖనిజ సంపదే కాదు, విస్మృత గాథలతో నిండిన మానవ జీవితాలు కూడా భూమి కడుపులో బొగ్గు గుట్టలు, ఆ సంపదను వెలికితీసే భూమి పుత్రుల అనుక్షణ బాధామయ జీవనగాథలూ, గోదారి సరసనే పారే సాధారణ కార్మికుల ఆక్రందనా ప్రవాహాలు - కోల్‌బెల్ట్ కవుల కవితల్లో అక్షర రూపాలు తొడుగుతున్నా చెమన్‌లో నిక్షిప్తమై ఉన్న కాల్పనిక శక్తి యథార్థ జీవితంతో కలగలసిపోయి వచన కవితా రూపానికి ఓ రసమయ సృజనాత్మకతను సమకూర్చి పెట్టింది. కవితా రంగంలో దశాబ్దాలుగా సాగుతూ వచ్చిన అనేక ఉద్యమాల ప్రభావం ఇతనిపైన ఉంది. అయినా మోడుబారిన చెట్లు చిగురించినట్టుగా చప్పగా ఉన్న నేటి అనేక వచన కవితా ఖండికలకు 'గుణపాఠమా' అన్నట్టు చెమన్ కవిత వచన కవితా మార్గాన్ని కొత్త పుంతలు తొక్కించేదిగా ఉంది. భావ, అభ్యుదయ, దిగంబర, విప్లవ కవితా ఛాయలన్నింటినీ సొంతం చేసుకుంటూనే చెమన్ వాటి నిరుపయోగమైన నీడలను విడనాడాడు. భావనలో, భాషలో, శైలిలో, ఇతివృత్తంలో, భావచిత్రాలలో, అలంకారాలలో రసరమ్యంగా ఇతను సొంత గొంతుకతో దూసుకువచ్చాడని చెప్పాలి. ఈ గొంతును, ఈ కలాన్నీ విస్మరించడానికి వీలు లేదు. పరిసరాలను పట్టించుకున్నందుననే సాగరతీర జీవితం హెమింగ్వేను 'ఓల్డ్‌మాన్ అండ్ ది సీ' రాయించేట్టు చేసింది, నూనె గనుల కార్మికుల జీవితానికి సన్నిహితంగా జరిగిన అప్టన్ సింక్లయర్ ''ది ఆయిల్'' నవల రాశాడు; యుద్ధానుభవాలకు ప్రతిరూపం

చెమరించిన కన్నుల నుంచి చివురించిన కవి చెమన్!

స్టీన్ బెక్ ''గ్రేప్స్ ఆఫ్ రాత్'', కరిబియన్ ప్రాంతం తీర ప్రజాజీవనం డెరిక్ వాల్కాట్ రాసిన ''ఓమరోస్'' కావ్య సృష్టికి పూర్వ రంగం. మన యువకవి చెమన్ కవితానుభవానికి వేదిక గోదావరి కోల్‌బెల్ట్ జీవితాలు అందుకే చెమన్ మనసులోని మాటను విప్పిచెప్పుకొన్నాడు: ''కొంత చెప్పాలి...... నన్ను నేను కాస్త విప్పుకోవాలి. అనుభవం నేర్పిన కాలాన్ని ఆవిష్కరించాలి. కాలం రేపిన గాయాలను పాడాలి....'' ఆ గాయాలు పాడిన పాటలే, ఆ నిట్టూర్పులే, ఆ కేకలే, ఆ మూలుగులే, ఆ ఆశాపలుకులే ములుకులుగా రూపొందిన చెమన్ ''ఎడారి స్వప్నం మధ్య'' కవితా ఖండికలు! సమస్యలెన్ని ఉన్నా చెమన్ నిండుకుండ అని అతని కవితలు నిరూపిస్తాయి; ప్రకృతి దృశ్యాలకు చెలించినవాడు; అనిశ్చల జీవితంలో నిశ్చలతకు తావులేదని చెప్పి, నిత్యం చలనంలో ఉన్న కవి చెమన్. జీవితం అర్థమవుతున్నకొద్దీ తనలో తనకేగాక, తనకూ సమాజానికీ మధ్య కూడా యుద్ధం మొదలైంది. అతనిలోని ఆందోళనకారుడు, అచేతనుడు కాడు. శ్రీశ్రీ 'కవితా! ఓ కవితా' భావఛాయలు, స్ఫూర్తి ఇతనిలోనూ కొన్ని పట్టుల్లో తొంగిచూశాయి. సరియలిజం, సింబాలిజం ఛాయలూ ఉన్నాయి; సాల్వడార్ డాలీ, డిలాన్ థామస్‌ల ఉపఛాయలూ ఉన్నాయి. నన్నయ్య నుంచి నగ్నమునిదాకా ఏ ఛాయలూ లేనివాళ్లు ఎక్కడా ఉండరు. అయినా ఎవరికి వారు స్వతంత్రమైన పోకడలు పోయినవారే. ప్రకృతికి, మానవుడికి ఉన్న సంబంధాలకు, అతని కష్టసుఖాలకు భావార్థాలు తొడగడంలో, ప్రయోగించిన అలంకారాలలో చెమన్ ఎవరికీ తీసిపోలేదనిపిస్తుంది. డిలాన్ థామస్ గురించి రాస్తూ మైకేల్ ష్మిట్ "Poetry and Landscape are extension of language" అన్నాడు. ఈ విశృంఖలతను చెమన్ కవితల్లో మనం చూడవచ్చు! డిలాన్ థామస్ జీవితానుభావాలు అమోఘమైన భావచిత్రాలకూ, పదసృష్టికీ దారితీశాయి. (ఉదాహరణకు Vowelled beeches, syllabic blood, oaken voices, water's speeches, meadows signs etc)! చెమన్ కవితల్లో మనం వెన్నెల మైదానాలు, కలల నౌకలు, ఆవిరవుతున్న ఆశలు, ఆకాశపు చెవులు, గాయాల కొలుములు, గేయాల తోటలు, స్వేచ్ఛాగింజలు, కళ్లు కట్టిన ఎడారి పాటలు లాంటివి ఎన్నింటినో చూస్తాం. చెమన్‌లో అన్నింటికీ మించి అందరూ మెచ్చదగింది - ఎన్ని ఇబ్బందులు ఎదురైనా అతనిలో చెక్కు చెదరని ఆశ, ఆత్మస్థైర్యం! మౌనంలోనే జ్వాలాతోరణాలు కడతాడు. సందేశానికి సంకెళ్లు వేయని భావుకత, నినాదాలూ, పదాడంబరమూ లేని చైతన్య స్రవంతీ, అశ్లీలతకు చోటులేని అద్భుతమైన కాల్పనికతల విశిష్ట సమాహారమే చెమన్ కవిత!

శిల్పాన్ని అనల్పం చేయకుండానే వస్తు వైవిధ్యాన్ని పాటించడంలో కొత్త పోకడలు పోయిన సరికొత్త తరహా వచన కవి చెమన్. కష్టాల కారడవిలో, సమస్యల తుఫాను హోరులో ఆత్మీయతలు బద్దలై చెల్లాచెదరైన వారికి భరోసా ఇతను. మౌనం అర్ధాంగీకారం కాదు, అనర్థం అని చెప్పి చైతన్య జ్వాలలు రగిలిస్తాడు : ''మౌన ప్రవాహతల్పం నుండి మరో కెరటమై ఎగిసి పడాల్సి ఉంది / మనలోని మనం వెయ్యి మనంలా / విస్తరించాల్సి ఉంది / వూపిరై / వూరటై / వూటల చెలమగా / ప్రవహించాల్సి వుంది''! సంఘర్షణ జరుగుతున్నప్పుడు నిశ్శబ్ద రాగాలు, పాయలై చీలిపోయే కలల దోసిళ్లు, జారిపోతున్న స్వప్న కలశాలు, విచ్ఛిన్నమైపోతున్న ఆశావీధులూ పాఠకుడి కళ్లముందు ఒక 'రీల్'లా కదిలిపోతుంటాయి! చెమన్‌కు వెన్నెలను గుండె గదుల్లోకి చల్లుకోవాలనే తాపత్రయమూ ఉంది, రాత్రిని కళ్లకొలకుల్లో బంధించాలనే తపనా ఉంది! అయినా అతను నిట్టూర్పు గీతాలకూ, అడ్డు గోడలుగా వచ్చిపడే అసందర్భ గీతాలకూ చెలించే రకం కాదు! అవసరమైనప్పుడు చిరుగాలుల్ని దారుల్లో పరచుకుంటాడు. కొత్త రాగాలకు పందిళ్లు వేస్తాడు; అతను చరణదాసుడు కాడు, ఆచరణదాసుడు! మనస్సు సరిహద్దుల్ని సంరక్షించుకుంటూనే యుద్ధ క్షేత్రాలను నిర్మించుకోగల సత్తాగలవాడూ! ప్రజాహితమే కవి అభిమతం కాబట్టి, ఈ కవితా శిల్పి పీడిత జనపక్షపాతి కాగలిగాడు. అయితే ఇతను వస్తువులో ప్రజాకవి, శిల్పంలో కొంచం దూరబంధువు. అందరూ అందుకోలేని లోతులు చెమన్ కవితారీతులు! విధ్వంసానంతర విరామం ఎలాంటిదో చెబుతూ ''అనుభవం ఆవిరై రెటీనా (కనుపాప) నిండా/నిశ్శబ్ద హిమధూమమై పరచుకొంటుందం''టాడు! అయినా బతుకు శిఖరం మీద శిశిరం శివమెత్తినప్పుడు ఆశ కోల్పోవద్దని మన వెన్నుతడతాడు! ఎక్కడో ఒకచోట ఎప్పుడో ఒకప్పుడు ఒక శోకగీతం అలా విరామం లేకుండా ఆలపిస్తూనే చీకటి రాత్రిని మోస్తూంటుందనీ, ఇది సహజమనీ అంటాడు. అయితే ప్రజాయోధుడైన వాడికి మాత్రం ''నిశినిండా రాలిన కళ్లు శిథిలాలు/నిగూఢ ప్రయాణాన్ని ప్రకటిస్తాయి/ఘనీభవించిన దుఃఖాశ్రువు మీద/ ఆయుధం అంకురమై లేస్తుంది''. అతను నిస్పృహ పొరల్ని చీల్చాడు; అలా అని ప్రశాంత ప్రవాహంపైన బాయ్ నెట్ గుచ్చుకోవడాన్ని సహించడు; కాని సమస్తం సర్వనాశనమవుతున్నప్పుడు మానవులు సమష్టిగా చేయగలిగిందొక్కటేనంటాడు - అవి రెండే రెండు మార్గాలనీ, మూడో మార్గానికి చోటులేదన్నది అతని భావన. ఆ మార్గాలు : మనిషి ''చేతనారహిత మృత కళేబరమవడమో'', లేదా ''చేతుల కొసలకు

ఆయుధాన్ని మొలిపించడమో''! ''అక్షరం మీద ఆశను'' వ్యోమగామిగా (ఆస్ట్రోనాట్) చేసుకున్న చెమన్‌లో దారితప్పిన వాక్యాలను అందుకొని వాటి ఆనవాళ్ళు వెదుక్కుంటూ వెళ్లి ప్రజాహితం కోరి దిశాగతిని నిర్ణయించే తాత్వికుడు కూడా దాగి ఉన్నాడు! ఒక నిరుద్యోగి బాధ, భర్తను కోల్పోయిన ఓ సోదరి కన్నీటి గాథ ఇందులో ఉన్నాయి; దారి తప్పిన ఉద్యమాలూ, ఉద్యమనేతలూ ఇందులో కనిపిస్తారు. పిరికి గుండెలపై ఎక్కుపెట్టిన కఠోర కుఠారాలూ ఉన్నాయి; మమతను, మానవతను పెంచడం కోసం చెమన్ ఆధిపత్యపు ఎత్తుగడల అడుగుల కిందపడి నలిగిపోయే ఆప్యాయతలను కాపాడుకోవాలన్న సందేశమూ అందించాడు; జీవితాన్ని జీవించడం కంటే బతుకును నిలబెట్టుకునేందుకే ఉన్న కాలం అంతా ఖర్చయిపోతున్నందుకు వగచాడు; ''జారిపోయిన ఆశ కోసం'' పీటర్ సీగర్‌లా చెమన్ కూడా గుండెను గిటారుగా దిద్దితీర్చాడు ("Guitar is my machine gun")! విషాదశృతుల్ని గుండె గిటారుపై పల్లవింపజేశాడు; ఒక్కో సమయంలో నిరాశకు లోనైనప్పుడు గుండెను చిక్కబెట్టుకుని తానో ఒంటరి గేయమై ప్రయాణించాలనుకుంటాడు గాని బతుకు మీద ఆశ చిగురిస్తుంది. కనుకనే చెమన్ ''నిశ్శబ్దాన్ని వెలిగించేందుకు నేనుండాలి/వేల వేల ఆశల ప్రక్షాళనా ప్రయత్నాల్లో/ ఆశయాన్ని తేల్చేందుకు ఈ గేయముండాలి'' అని నిర్ణయించుకుంటాడు! అంతేగాదు, కలలే కనలేని ఒక అశక్తుడ్ని గురించిన కవిత ''కలలు ఘనీభవించక''. అలాటి వారికి ఆశ ఉండదు, ఆశయం మిగలదు, రేపు ఉండదు, రూపు మిగలదని చెబుతూ వ్యూహం మార్చుకోమంటాడు, ఎత్తుగడలు తీర్చిదిద్దుకోమంటాడు! జీవిత నాటకంలో కాల్పనిక పాత్రల స్థానే సజీవ పాత్రల్ని ప్రవేశపెట్టుకోమన్నది అతని ఆదేశం. జ్యూలియస్ ప్యూజిక్ అన్నట్టు ప్రత్యక్ష జీవితానికి వేరే ప్రేక్షకులుండరు. నేడిక్కడ ఆరిపోయేదీ జీవితమే. రేపక్కడ వెలిగేదీ జీవితమే! ఈ రక్తాక్షరాలు చెమన్ కూడా లిఖించాడు! సర్వత్రా క్షీణ సంస్కృతీ నిరసన ఉంది; అల్లులైన వంచనా శిల్పులను ఎండగట్టడం ఉంది; మందబారిన మబ్బులను స్పృశించి నిద్రమేల్కొల్పే దాకా చెమన్‌లోని ఆరాటం తగ్గదు! ఆకాశ వీధుల్లో వీచే కొత్తపాటను నేలకు దించేదాకా అతని గుండె గొంతుకలో కొట్లాడుతూనే ఉంటుంది. తిరిగి ''మూగిన గుండెల్లో/మువ్వల సవ్వడి వినిపింప'' జేసేదాకా, తిరిగి అచేతనంగా స్తబ్దంగా పడి ఉన్న ''అధరాల నుండి మరో చరణమై ప్రవహించేదాకా'' చెమన్ అవిశ్రాంత మనస్సు పూరట చెందేట్టు లేదు! అణువు అణువు మనిషిలో ఆశను మొలకెత్తించేందుకు అగాధాన్నైనా ఆలింగనం చేసుకోవాలంటాడు! ప్రతి కవితలోనూ చెమన్ కొసమెరుపులతో

కవ్విస్తాడు. ప్రశ్నతో పుట్టిన ప్రపంచానికి ప్రశ్న పరమార్థాన్ని విప్పిచెప్పాడు, మానవుడి ఉనికికి దాని అవసరం చెప్పాడు : ''సంధించిన స్వప్నం చివర/విడదీసిన పద్యమై విశదపరచుకుంది.../చూపుడు వేలు చివరన పుష్పించిన గొంతుకై / నిశ్చల గేయాన్ని ఆలపిస్తుంది. అంతేగాదు, ''ప్రశ్న'' అన్నది కోకిల గొంతులోనే కాదు, మూసిన కనురెప్పల మీద కూడా నిశ్శబ్ద సాధన చేస్తుందన్న ఊహను చెమన్ చాంపేయమాలగా మార్చాడు! కవి డేవిడ్ గాస్కోని అన్నట్టు ఇక్కడ ప్రతి పద్యమూ ఒక తూటా, ప్రతి పాదమూ ఒక శరాఘాతం ("Each Stanza is a round / and every line a blow")!

*(ఆదివారం 8, జూన్ 1997)*

# పీడిత పోలీసుల వ్యథార్థ జీవన దృశ్యం ''ఖాకీ బతుకులు''

''ఈ డిపార్టుమెంటులో ఇంతకాలం నేనున్నా, నాబోటివాళ్ళు ఎంతమందిమి ప్రయత్నం చేసినా ఇది (పోలీసు శాఖ) ఇలా ఎందుకుందో అర్థం చేసుకోలేకపోయాం. ఇక నువ్వైనా ప్రయత్నించు, నీ ఉనికికి దెబ్బతగలనంతవరకు. ఒకచోట పనిచేసేవాళ్లు ఎందుకు ఒకళ్ళ మీద ఒకళ్ళు చాడీలు చెప్పుకుంటూ, ఒకళ్ళనొకళ్ళు దొంగదెబ్బ తీయాలనుకుంటూ ఉంటారో, ఆఫీసర్లెందుకు తమకన్నా తక్కువ వాళ్ళని హీనంగా చూస్తారో కనుక్కోలేకపోయాను. వ్యక్తిగతంగా ఎదురు తిరగడం ద్వారా అయిదు శాతం మార్చినా, నేను పూర్తిగా నష్టపోయాను. నువ్వు చదువుకున్నవాడివి. జీవితాన్ని ఎలా మలుచుకుంటావో, ఇంతకన్నా చెప్పేదేమీ లేదు. మన క్షేమాన్ని కాంక్షించేవాళ్ళెవరూ ఈ సంఘంలో తారసపడలేదు. ఇప్పటి వరకూ నువ్వు తండ్రిచాటు బిడ్డవే. ఈ లోకంలో ఎలా నెగ్గుకొస్తావో నీకు నువ్వే నిర్ణయించుకోవాలి''.

తెనాలి స్పెషల్ బ్రాంచి హెడ్ కానిస్టేబుల్ జి. మోహన్రావు పోలీసు వ్యవస్థలోని అట్టడుకు వర్గాలైన అతి సాధారణ కానిస్టేబుల్స్, ఆర్డర్లీల బతుకుల గురించి వారి వ్యథార్థ జీవిత యథార్థ గాథల గురించి నిష్ఠతో చేసిన సాహిత్య సమారాధన ఫలితమే ఈ ''ఖాకీ బతుకులు'' నవల. చరిత్రలో ''స్పార్టకస్'' బానిసల తిరుగుబాటుకు నాయకత్వం వహించినవాడు. కాని ''స్పార్టకస్'' నవలాకారుడుగా మోహన్రావు మారు పేరుతో ఈ నవలా రచనకు ఉపక్రమించడం విశేషమే కాదు, సాహసం కూడా. ఎందుకంటే, సామాన్యుడు ఒక పోలీసు అధికారిని ఎదురు ప్రశ్నించలేని చోట మోహన్రావు తన ఉద్యోగ భద్రతకు భిన్నంగా ముందుకు వెళ్ళి సామాన్య పోలీసులు జీవన సమరంలో ఎదుర్కొంటున్న అనేక ఈతిబాధల గురించి పోలీసు వ్యవస్థనూ, ఉన్నతాధికార గుణగణాల్ని ఇందులో ప్రశ్నిస్తున్నాడు పైన ఉదాహరించిన ఒక అనుభవం ఈ నవలలోదే ఒకటి ఉద్యోగ నిర్వహణలో ఎదురవుతున్న సమస్యలు కాగా, వేరొక

అంశం ''కులం'' వేస్తున్న వెర్రితలలు. ''ఖాకీ బతుకులు''లోని కథా నాయకులలో ఒకరైన ప్రకాశం నవలాకారుడి తండ్రిలాంటి వాడే. ఆయన ముప్పయి ఐదు సంవత్సరాల కానిస్టేబుల్ ఉద్యోగంలో ఉద్యోగరీత్యానే గాక, సాంఘికంగా పడిన అగచాట్లు, చివరికి ఇందిర ''ఎమర్జెన్సీ'' హయాములో ఉద్యోగం కోల్పోయిన వైనం ఈ నవలకు ప్రాథమికమైన పూర్వరంగం సమకూర్చింది. ఒకప్పుడు ప్రసిద్ధ కథకుడు, నవలా రచయిత పతంజలి రాసిన ''ఖాకీవనం'' సంచలనం రేకెత్తించడమే గాక ఈనాడు ఉన్నత స్థానంలో ఉన్న ఒక పోలీసు అధికారి ఆ పుస్తకం తాలూకు వంద ప్రతులను కొని తన తోటి ఆఫీసర్లకు పంచిపెట్టారు! అయినా ''ఖాకీబతుకులు'' రాసిన మోహన్రావుకు కొందరు ఉన్నతాధికారుల నుంచి ఉద్యోగం కోల్పోయే ప్రమాదం ఉందని, సివిల్ సర్వీసు రూల్స్ పేరిట, అధికారుల అనుమతి లేనిదే రచన చేయకూడదన్న ఆంక్ష పేరిట ఈ ప్రమాదం ఉన్నట్టు వార్తలు వస్తున్నాయి. కాని ఒక రచనను, లేదా ఒక కళాఖండాన్ని ఆస్వాదించడానికీ, ఆనందించడానికీ సంస్కారం కావాలి. చిత్రకారుడు గీసిన ప్రతి రేఖలో లేదా బొమ్మలో నవలాకారుడు ప్రవేశపెట్టిన ప్రతీ పాత్రలో తన బింబ ప్రతిబింబాలను చూసుకొని బెంబేలు పడేవాడూ, భయపడేవాడూ పరమ అరసికుడి కింద సాహిత్య విమర్శకులు ఏనాడో జమకట్టారు. ఈ లెక్కన ఏ సాహిత్య ప్రక్రియా (నవల, నాటకం, చిత్రలేఖనం, కవిత) తన ఉసురును కాపాడుకోలేదు. రచనను అర్థం చేసుకోడానికి పెద్ద మనసు ఉండాలి. మనం పెట్టుకున్న సంకుచిత మానసిక పరిధులను బద్దలుకొట్టి మనస్సును విశాలం చేసుకున్నప్పుడు రచనా పఠనం ద్వారా కలిగే ఆనందానుభూతి, ఆర్ద్రత వేరు. ఎందుకంటే, ఎన్నో కథలు, నేరకథలు, స్వీయ చరిత్రలు రాసిన, రాస్తున్న గౌరవనీయులైన పోలీసు ఉన్నతాధికారులూ మనకు లేకపోలేదు. రిటైర్డ్ ఉన్నతాధికారి సుబ్రహ్మణ్యం ''కమ్యూనిజం ఈజ్ హ్యూమనిజం'' అన్న పుస్తకం రాశారు; అరవిందరావు నక్సల్స్ గురించి రాశారు. వీరుగాక నేర కథలు, గాథలూ విమర్శనాత్మకంగా (అందులో పోలీసు పాత్రలతో సహా) రమ్యంగా చిత్రిస్తున్న రామకోటి, సీతారామారావులాంటి చేయితిరిగిన పోలీసు ఉన్నతాధికారులూ ఉన్నారు. సదాశివరావు ఎన్నో ఉత్తమ కథలు, సజీవ కథలూ రాస్తున్నారు. అయినా హెడ్ కానిస్టేబుల్ మోహన్రావు రాసిన నవలకు అభ్యంతరం ఎందుకో అర్థ కాదు! సివిల్ సర్వీస్టు రూల్స్‌లోని 13వ నిబంధన ప్రకారం చూసినా ''ఖాకీ బతుకులు''లోని పాత్రలు కల్పితాలు. (తండ్రి ప్రకాశరావు జీవితం నవలాకారుడిపై ప్రభావం నెరపిన సందర్భం మినహా)! కల్పితమూర్తి కానిస్టేబుల్ కావచ్చు, కరడు కట్టిన

ఉన్నతాధికారీ కావచ్చు. పైగా సాహిత్య, కళాత్మక, శాస్త్రీయ సంబంధమైన సృజనశక్తితో చిత్రించిన పాత్రలున్న పుస్తకాలను తప్ప మరే ఇతర రచననయినా ప్రభుత్వోద్యోగి ముందుగా అనుమతి పొందిన తర్వాతనే ప్రచురించాలని 13వ రూల్ నిర్వచిస్తోంది. నవలగాని, కథగానీ సృజనా సాహిత్యం అని ఆ నిబంధనే అంగీకరిస్తున్నది. సృజన రూళ్ళకర్రలకు లాఠీ కర్రలకు లొంగేదికాదు. అంతర్మథనం వల్ల పుట్టుకొచ్చే సాహిత్యం. స్పందన సృజనకు జీవగర్ర. చేయని హత్యకు యావజ్జీవ శిక్షపడిన 'పాపిలన్' (హెన్రీ చారియెర్) జైలుకు వెళ్ళిన 42 రోజుల్లోనే పారిపోవలసి వచ్చింది. స్వేచ్ఛను దారుణంగా కోల్పోయిన చారియెర్ పోలీసు, న్యాయ వ్యవస్థలపై చరిచిన చరుపులే, అతని స్వీయ చరిత్రే తిరిగి ''పాపిలన్'' గ్రంథంగా విడుదలయింది. అదే సృజన. సుప్రసిద్ధ ఫ్రెంచి నాటక రచయిత యూజినీ అయోనెస్కో అంటాడు: ''పుస్తకాలు చదవని వాళ్ళు బ్రూట్స్ కింద లెక్క. యుద్ధాలు చేయడం కన్నా రచన ద్వారా మానవుల మనస్సుల్ని సంస్కరించడం మేలు'' అంటూ, ''చావు మాత్రమే నన్ను మూగవాణ్ణి చేయగలుగుతుంది. చావు మాత్రమే నా పెదాలను మూయగలుగుతుంది'' ("Only death can silence me/Only death can close my lips") అని గాద్గదిక స్వరంతో చాటాడు! అంతేగాదు, తెలుగునాట ఒక పోలీసు ఉద్యోగిగా కుదురుకుని ఎన్నో అనుభవాలతో వృత్తి ధర్మంలోని ఎగుడు దిగుళ్ళ గురించి, న్యాయాన్యాయాల గురించి సందర్భాసందర్భాల గురించి రాసిన నవల ''ఖాకీ బతుకులు''. సాధారణ పోలీసుల బతుకుల వెనక ఉన్న గుండె చప్పుళ్ళకు ఈ రచన స్పందన, ప్రతిస్పందన. సాధారణ పరిస్థితుల్లో అతను బహుశా రచయిత అయి ఉండకపోవచ్చు. కాని తాను పుట్టి పెరిగిన వాతావరణంలో ఎదురైన చేదు నిజాల వడపోతగా ఈ నవలను భావించాలి. సాల్ బెల్లో ("In my innocence I had decided to become a writer") అన్నట్టు మోహన్రావు అమాయకత్వంతో కాకపోయినా అనుభవమే ఉచ్ఛ్వాసనిశ్వాసంగా రచన సాగించి ఉండవచ్చు. ఇటీవల రిటైర్డ్ పోలీస్ ఆఫీసర్ ఎం.వి. థామస్ రాసిన ఒక స్వీయ చరిత్రలో రాజకీయ వేత్తల, వ్యాపార వర్గాల, ఉన్నతాధికారుల చేష్టలను ఎన్నింటినో 'జల్లెడ' పట్టారు! అనుభవం సృజనగా, సృజన రచనగా రూపాంతరాలు పొందుతుంది. ఏ సృజనాత్మక రచనతోనూ నిమిత్తం లేని ధర్మవీర అధ్యక్షతన ఏర్పాటైన ''నేషనల్ పోలీస్ కమీషన్'' సమర్పించిన నివేదిక యావత్తూ దేశంలో ఆచరణలో పోలీసు ప్రవర్తన గురించి, వృత్తిధర్మ నిర్వహణలో లోటుపాట్ల గురించీ చేసిన బృహత్ సమీక్ష అని

మరచిపోరాదు. 1902 నాటి కమిషన్ సిఫారసుల చట్రంలోనే ఈ రోజుకీ కానిస్టేబుల్స్, ఆర్డర్లీల బతుకులు సాగుతున్నాయని శరించింది. ఇంతకూ కానిస్టేబుల్స్ ''నిపుణ కార్మికుల'' (SKILLED LABOUR) కిందికి వస్తారా లేదా ఒట్టి కార్మికుల కిందికొస్తారా అన్న సమస్యను ఇంతవరకూ ఏ కేంద్ర పే కమీషన్‌లూ తేల్చలేకపోయాయి. అందుకనే ధర్మవీర కమిషన్ పోలీసు వ్యవస్థలో అట్టడుగు స్థాయి అయిన కానిస్టేబుల్స్ ప్రవర్తన, వారి స్పందన సక్రమంగా ఉన్నప్పుడే ప్రజల మనస్సులను వారు ఆకట్టుకోగలుగుతారని చెప్పింది. అయితే ఈ ఆకట్టుకోవడం అన్నది - కానిస్టేబుల్స్ జీవనానికి, వారి వృత్తి గౌరవానికి అనుకూలమైన పరిస్థితులు కల్పించినప్పుడు మాత్రమే సాధ్యం. ఈ సాధ్యాసాధ్యాలను వితర్కించుకుంటూ వింగడించిన రచనే మోహన్‌రావు ''ఖాకీ బతుకులు''!

ఈ సంపాదకీయం మొదట్లో పేర్కొన్న వాక్యాలు కానిస్టేబుల్ ''ప్రకాశం'' తన వారసుడుగా అదే ఉద్యోగానికి వెడుతున్న తన కొడుకు ''సూర్యం''కు అందించిన అనుభవ పాఠం. రెండేళ్ళకు మించి అంతకుముందు ప్రకాశం ఏ స్టేషన్‌లోనూ ఇమడలేకపోవడానికి కారణాలు ఒకటి కావు, సవాలక్ష. ప్రకాశం 'బావిలో కప్ప' జీవితమూ చూశాడు, బావి వెలుపల జీవితమూ చూశాడు, కానిస్టేబుల్ వృత్తిలో ఉద్యోగ ప్రవేశం నుంచి ఉద్యోగం విడిచేదాకా 'పైవారి' చేతులు తడపడానికి ఎంత ఖర్చు చేయాల్సి వస్తుందో చెబుతాడు. ట్రైనింగ్ పూర్తయిన తరువాత ప్రొబేషన్ రావడానికి, వచ్చిన ప్రొబేషన్‌ను నిలబెట్టుకోడానికి, ట్రాన్స్‌ఫర్ కావడానికి, దానిని ఆపించుకోడానికీ ఎంతెంత ఎవరికి చెల్లించాలో కూడా అనుభవ నైవేద్యం! ఈ వ్యవస్థలో పెద్ద చేప చిన్న చేపను ఎలా మింగుతుందో నవలా రచయిత తన పోలీసు జీవితమే కథా వస్తువుగా నిరూపించడానికి ప్రయత్నించాడు. ఇందులో జీవితాన్ని రచయిత యథాతథంగా చూపుతూనే పరోక్ష పాత్రల ద్వారా నిజపాత్రధారుల పేర్లను మాత్రం వెల్లడికాకుండా కప్పిపెట్టాడు! అంతేగాదు, ఆర్థిక స్థితికీ, మానసిక స్థితిలో రావలసిన మార్పునకూ అవినాభావ సంబంధం ఉందన్న స్పృహ కూడా రచయితకు ఉండడం విశేషం. అందరూ కష్టపడేవాళ్ళే, కుల విభజన కుళ్ళును పెంచింది, చివరికి రైలు, బస్సు ప్రయాణాలు కూడా కులం కంపు కొడుతున్నాయంటాడు! కులాల్ని చెరిపివేసే ఉద్యోగ శాఖలలో పోలీసు శాఖ ఒకటి. కాని అక్కడ కూడా కులం అడుగంటలేదు పోలీస్ బ్యారెక్కులలో 'అన్నం పళ్ళాలు' కూడా కులం చెబుతున్నాయన్నాడు! ఉప్పులో, పప్పులో కూడా

కులం చూసే వాళ్ళున్నచోట ఏ ప్రగతిని సాధిస్తాం అన్నది మోహన్రావు సూటి ప్రశ్న. ఈ రచనలో రిక్రూట్‌మెంట్ నుంచి, ట్రైనింగ్ పూర్తయ్యేదాకా సాధారణ కానిస్టేబుల్స్ ప్రొబేషన్ కాలంలోనూ, ఆ తరువాత పడే ఇబ్బందుల గురించీ, అవసరమైన అధికార వృత్తి చాకిరీతోపాటు ఆఫీసర్ల ఇళ్ళవద్ద చాకిరీ, వంట చాకిరీలో కూడా వాళ్ళు ఎలా నలిగిపోతుంటారో మానవీయంగా చిత్రించాడు మోహన్రావు. రిక్రూట్‌మెంట్, ట్రైనింగ్ శిక్షణా పరిభాష యావత్తూ - అందులో పరిచయం లేనివారందరికీ ఈ నవల ద్వారా వెల్లడవుతుంది. దళితులకు ప్రతినిధిగా ప్రకాశం నిలిస్తే, గ్రామాలలో మోతుబరుల కుటుంబాలలో వస్తున్న మార్పునకు ప్రతినిధిగా గురవయ్య నిలుస్తాడు! ప్రకాశం దళితుడైనా క్రైస్తవాన్ని ఆశ్రయించడానికి ఇష్టపడడు. ఎందుకని? కొందరు ఫాదరీల మోసాలు, దోపిడీ అతను తన ఊళ్ళో కళ్ళారా చూశాడు కాబట్టి. అతని మాటల్లోనే చెప్పాలంటే ''రోజూ పేర్దనకి చర్చికి రమ్మంటాడు ఫాదరీ, కాని ఆయన సెప్పేదేంటో సరిగా అర్థం కాదు. పేర్దన లేనప్పుడు కూడా రమ్మంటాడు. ఆడికి పోయిందగ్గర్నుంచి ఊపిరాడకుండా పనులు సెపుతూంటాడు. మనం సెడు అన్నదాన్ని వాళ్ళు ఔనంటారేందో...'' ప్రకాశం, గురవయ్య కులాలు వేరు. అయినా ఇద్దరూ ఆర్థికంగా దరిద్రులే. అందుకే వారిరువురూ ఒక నిర్ణయానికి రావడం : ''కులానికీ స్నేహానికీ సంబంధం లేదు. ఇపుడు మనిద్దరం స్నేహంగా ఉండాలంటే ఉంటాం. అంతే. మనుషుల మధ్య ఉండే భావాలు ఒకే రకంగా ఉంటే, స్నేహం పెరుగుతుంది. కులం అడ్డురాదు...'' ''వాస్తవానికి మనం అందరం దరిద్రులమే, అందుకే ఈ నౌకరీకి వచ్చాం'' అన్న జ్ఞానోదయం కలిగింది ఇరువురికీ!

మోహన్రావు ఈ నవలలో కొందరు భావిస్తున్నట్టు పోలీసు అధికారులను ఏహ్యమైన పదజాలంతో తిట్టడానికి ప్రయత్నించలేదు. పైగా ట్రైనింగ్‌లో, రోజువారీ గొడ్డు చాకిరీతో సాధారణ పోలీసులు పడే చెప్పరాని బాధల్ని వర్ణిస్తూ రచయిత వారికి వకల్తాపడుతూ అసలు ఫిర్యాదును ఇలా బయటపెట్టాడు . ''శరీరానికి సంబంధించి ఇలాంటి బాధలన్నీ ఒక ఎత్తయితే, ఆఫీసర్లు వీళ్ళని అనే మాటలు ఒక ఎత్తు. మానవ సహజమైన చిన్న చిన్న పొరపాట్లకు కూడా బండబూతులు తిడతారు అరక దున్నేప్పుడు గొడ్లను తిట్టినట్టే తిడతారు ఆ తిట్లు మనస్సుకు ఎంత బాధకలిగిస్తాయి'' అందుకే పోలీసు వ్యవస్థ కూడా ఇతర శాఖలతో పాటు మానవీయమై సంస్కారం పొందవలసి ఉంటుంది ఇందుకు పోలీస్ మాన్యువల్‌లో సంస్కరణ జరగాలి అందుకు ఈ నవల

దోహదం కావాలి. గాల్స్‌వర్దీ రాసిన ''జస్టిస్'' ఇంగ్లాండ్ న్యాయ చరిత్రలో అమూల్యమైన సంస్కరణలకు నాంది పలికిందంటారు. పోలీస వ్యవస్థలోని ఉన్నతాధికార వర్గం మనస్సును పెద్ద చేసుకొని ''ఖాకీ బతుకులు''లో అసంతృప్తి జ్వాలకు అందరూ అభిలషించదగిన సంస్కరణలతో పరిష్కారం వెదకగలరని విశ్వసిస్తున్నాం. రచనా శక్తినీ, సృజన శక్తినీ చంపరాదని, రచనలో అభ్యంతరకర అంశాలుంటే వాటికి చూడవలసిన పరిష్కారం వేరనీ సుప్రీంకోర్టు అనేక తీర్పుల్లో చెప్పింది. 1994లో జీవన్‌రెడ్డి బెంచ్ ''ఆటోశంకర్'' స్వీయచరిత్ర ప్రచురణకు ఆటంకం చెబుతూ (అందులో పోలీసు ఆఫీసర్ల పాత్ర గురించి కూడా ఉంది) వచ్చిన రిట్ పిటీషన్‌ను కొట్టి వేసింది. విశ్వసమాచార వ్యవస్థ శరవేగాన విస్తరిస్తున్నకొద్దీ పరువునష్టం దావాలకు చెందిన 'డిఫమేషన్‌లా'ను కూడా తిరగదోడవలసిన అవసరాన్ని ఆ బెంచ్ స్పష్టం చేసిందని మరవరాదు. ఎందుకో మరి, ఈ సందర్భంగా బెర్నార్డ్ షా పోలీసు వ్యవస్థ గురించి తడిమిన రచన ''మేజర్ బార్బారా'', బైరాగి ప్రశ్నకు హెడ్ కానిస్టేబుల్ ద్వారా సమాధానం చెప్పిన గురజాడ ''కన్యాశుల్కం'' గుర్తుకొస్తున్నాయి : ''మీ ఇన్‌స్పెక్టర్‌కి సూపరెంటు పని కావాలని ఆశుంది. తహశీలుదారికీ వాడికీ బలవద్విరోధం ఉంది. ఆ విరోధమే, మధ్యలో నన్ను కొట్టేస్తుంది'' అంటాడు హెడ్! బుద్ధి చెప్పేవాడు గుద్దితే మాత్రం తప్పేమిటన్నది మన వేమన వేదం!

*(ఆదివారం 11, మే 1997)*

# ముద్రణా రంగానికి మురిపాల మూట ''చెలువ కన్నడనాడు''!

''ఎచ్చట జూచినన్ పచ్చ పచ్చగా రచ్చలనెక్కు కన్నడ సరస్వతి''కి తోడబుట్టిన తెలుగువాడు సహా కైమోడ్పులు చెప్పని భారతీయుడు ఉండడు. ఆ వైశిష్ట్యం కేవలం సంగీత, సాహిత్యాలకే పరిమితమై లేదు. కర్నాటక సహజ సంపదలకూ, నదీ జలరాశికీ, వ్యావసాయిక క్షేత్రాలకూ, పారిశ్రామికకేంద్రాలకూ, కళలకూ, పర్యావరణానికీ, వన్య రక్షణ ప్రాంతాలకూ కూడా పరివ్యాప్తమై ఉంది. ఇటీవల నాగార్జున గ్రూపు ఒక సాహసం చేసింది. ''సాంఘిక బాధ్యత'' మకుటధారిగా సమాజ శ్రేయస్సును పారిశ్రామిక ప్రగతి ద్వారా సాధించాలన్న లక్ష్యంగా పెట్టుకున్న ఈ గ్రూపు కన్నడ భారతికి ముద్రణా చరిత్రలో నిలిచిపోగల ఒక పుస్తకాన్ని - ''చెలువ కన్నడనాడు'' హారతిగా సమర్పించింది. దక్షిణ భారతంలో ప్రింటింగ్ చరిత్ర పూర్వాపరాలు తెలుసుకున్నప్పుడు, భారత చరిత్రలో ఈ ప్రత్యేక శాఖ దక్షిణాదిన మొలకెత్తి బెంగాల్‌లో ఎలా పూత పూసిందో గ్రహించగలుగుతాం. రీ సైకిల్డ్ పేపర్ మీద ముద్రించిన ఈ పుస్తకం అతిలోక సుందరంగా ఉందంటే అతిశయోక్తి కాదు. ప్రసిద్ధ రచయిత్రి, కార్పొరేట్ కమ్యూనికేషన్స్ వ్యవస్థలో ఉద్దండురాలు, కవీ, నాగార్జున గ్రూప్ జనరల్ మేనేజర్‌గా ఉంటున్న సునీతా బుద్ధిరాజా సంపాదకత్వాన కన్నడ రాజ్యోత్సవాల సందర్భంగా వెలువడిన వ్యాస - చిత్రదర్శిని ఈ గ్రంథం. 172 మంది రచయితలతో 180 పేజీలలో విస్తరించి ఉన్న సమాచారం కర్నాటక సర్వస్వంగా భావించుకోవచ్చు! ప్రపంచ సుగంధరాశికి తలమానికంగా భావించే 'మంచి గంధం'-పువ్వుకు తావి అబ్బినట్టు ఈ గ్రంథాన్ని కూడా సుగంధ తుందిలం చేసింది! కర్నాటక చరిత్రకు సంబంధించిన అన్ని అంశాలతో, సంప్రదాయ దేవాలయ వాస్తు శిల్పకళా రీతులతోపాటు ''ఆధునిక దేవాలయాలు''గా పండిట్ నెహ్రూ కీర్తించిన ఆధునిక పారిశ్రామిక ప్రగతి వరకూ సమీక్షా పరంపర సాగింది. అందమైన అచ్చేకాదు, సుందరమైన ఛాయా చిత్రాలు పూర్వరంగంగా ఓ చిరువిజ్ఞాన సర్వస్వంగా నడిచిన

కర్నాటక చరిత్ర ఇది. కనుల పండువైన ముద్రణ. వీనుల విందుచేసే వస్తు విశ్లేషణం. రాసిక్యంతో కావ్యస్ఫూర్తితో కూడిన ముద్రణగా దీనిని భావించాలి! అందుకు ప్రగతి ప్రింటర్స్ చేదోడు కావడం ముద్రణారంగాన్ని మరింత రసమయం చేసినట్టయింది! భారతదేశంలో పురా ముద్రణ చరిత్రకు సాధికార వ్యాఖ్యాత డాక్టర్ గ్రాహం షా (లండన్ లైబ్రరీ); కాగా ప్రింటింగ్ టెక్నాలజీలో ముందుచూపున్న తొలి ముద్రాపకులు, లిపి సంస్కారులూ బాపూరావ్ నాయక్, వి.సాఫ్ట్వే ఎం.ఎన్.నాగరాజ్, పి.ఎన్.వెంకటాచారి బైబిల్ ప్రచురణ కోసం అబిసీనియా, జపాన్‌లకు ముద్రణా యంత్రాలను పంపాలన్న తలంపు కలిగిన సెయింట్ ఫ్రాన్సిస్ జేవియర్ పోర్చుగల్ ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకువచ్చి ఉండకపోతే - గోవాకు మొదటి ముద్రణా యంత్రం దిగి ఉండేదేకాదు! భారతీయ భాషల్లో క్రైస్తవ మతసాహిత్యాన్ని వ్యాప్తిచేసేందుకు ఈ యంత్రాలు అవసరమయ్యాయి. గోవాలో ఫాదరీలు ఈ అవసరాన్ని గుర్తించారు. కొంకణిలో ముద్రణకు ఆద్యులు గోన్ సాల్వేస్, జార్జి మొరేస్. తమిళ లిపిలో నమశ్శివాయ కొత్తప్రయోగాలు చేశాడు. విలియం కారీ లెటర్ ప్రెస్ ప్రింటింగ్‌తో తొలినాటి అచ్చుట ముచ్చుట తీర్చుకున్నాడు. దేశంలోని ముద్రణా సంస్కృతి ద్వీపకల్పంలోని కోస్తా ప్రాంతాలనే ఆశ్రయించడం గమనించదగ్గ విషయం. పశ్చిమ కోస్తాలో గోవా, కొచ్చిన్, పున్నయ్ కయాల్, వైపికొట్టాయ్‌లూ; తూర్పు కోస్తాలో ట్రాంక్విబార్, మద్రాస్, ఫోర్ట్ విలియం, కలకత్తా, సీరాంపూర్‌లూ - భారతీయ ముద్రణా వ్యవస్థలో తొలి మైలురాళ్ళు. ఈ పూర్వరంగంలోనే కన్నడ భాష, ముద్రణా వ్యవస్థా తమ రూపురేఖలు దిద్దుకున్నాయి. కన్నడ ముద్రణా వ్యవస్థలో ఆద్యులుగా పేర్కొనదగినవారు రివరెండ్ హాండ్స్, రీవ్స్, కృష్ణమాచారి. తొలి కన్నడ పుస్తకం కర్నాటకలో ప్రచురించలేదు. దానిని సీరాంపూర్(బెంగాల్)లో ముద్రించారు.

కృష్ణ, కావేరీ నదుల సాక్షిగా వర్ధిల్లుతున్న కర్నాటక రైతుల కాయకష్టంతో, పారిశ్రామిక కార్మికుల శ్రమజీవనంతో పెనవేసుకుని సర్వకళల వికాసం తన సంస్కృతీ వారసత్వంగా కర్నాటక ఎలా వృద్ధి చెందుతోందో రేఖా మాత్రంగా ఈ పుస్తకంలో చర్చించారు. సహజ సంపదలోనేకాదు, సహజ కళలలో కూడా అందెవేసిన చెయ్యి కన్నడిగులది ఆంధ్ర-కన్నడ రాజ్యలక్ష్మల చరిత్ర ఏకజాతి చరిత్రగా ఒకనాడు భాసిల్లింది తెలుగు మహాభారత మూర్తిత్రయమైన నన్నయ, తిక్కన, ఎర్రనలకు కన్నడ 'రత్నత్రయం'గా పేరొందిన ఆదికవులు పంప, రన్న, పొన్న కవులు. మధ్య యుగాల్లో బసవ, ఆధునిక యుగంలో బెంద్రె, కరంత్, పుట్టప్పల సాహితీ దిశాగతిని తీర్చిదిద్దిన

కర్నాటక పునరుజ్జీవనోద్యమ దశలను మరవలేము. భక్తి ఉద్యమాలు కన్నడ సాహి సంస్కృతులను ప్రభావితం చేశాయి. సుందరమైన ప్రకృతి రామణీయతకు కాణా అయిన పశ్చిమ కనుమలలోని బందీపూర్, నాగర్‌హోల్, వన్య ప్రాణుల రక్షణ క్షేత్రాలు కూర్గ్ తోటలూ మానవ విహార వికాస కేంద్రాలు. మైసూర్ విశ్వవిద్యాలయం, భార శాస్త్ర పరిశోధన సంస్థ, రోదసీ పరిశోధన కేంద్రం, అమెరికాలోని 'సిలికాన్ వాలీ' గుర్తుచేసే కంప్యూటర్ టెక్నాలజీ సంస్థ- విజ్ఞాన వికాస కేంద్రాలు. వీటిని గురించేగాక నిన్నమొన్నటిదాకా ప్రధానమంత్రిగా ఉన్న దేవెగౌడ కుగ్రామమైన స్వగ్రామం హర్దన్‌హళ్ళి శైవకేంద్రం. ఈ చరాచర ప్రపంచం నిత్య చలన హితమని నిరూపించిన తాండ నృత్యాలకు ఆదిగురువైన శివుడికి కట్టిన ప్రత్యేకమైన ఆలయం అక్కడ ఉంది. కర్నా గౌరవానికి, కరుణావతరానికి నిలయం. చాళుక్యుల దేవాలయ నిర్మాణం, విజయనగ పాలకుల వాస్తుశిల్పకళారీతులు ఈ గ్రంథంలో చర్చించారు. అంతేగాదు, మన కొడాలి సుబ్బారావు ''శిలలు ద్రవించి ఏడ్చినవి తుంగభద్రలో'' అన్నట్టు రాతిని నాతిగా మలచి ఉలుల చేతిలో కవిత చెప్పిన శిలల గురించి ఇందులో కథలున్నాయి. శాస్త్ర, విజ్ఞా సంప్రదాయాలు పుణికి పుచ్చుకున్న నాలుగు వేల సంవత్సరాల కర్నాటక చరిత్రక సునీతా బుద్ధిరాజా ఈ గ్రంథంలో పలు దృక్కోణాల నుంచి వ్యాయం చేశారు. గుహ శిల్పాలకు కాణాచి కర్నాటక. బాదామి చాళుక్యులు గొప్ప దేవాలయ నిర్మాతలు. కల్యా చాణక్యులు ఈ నిర్మాణ చాతుర్యాన్ని మరింత పెంచి పోషించారు. ఆలయ శిల్పకళక అర్థం మలాప్రభ లోయ. ఆనాటి బౌద్ధులు, జైనులు తొలినాటి గుహాలయ శిల్ప కళన తీర్చిదిద్దినవాళ్ళు. ఇక్కడ గమనించవలసిన విశేషం - ప్రాచీన హైందవ/వైది సంప్రదాయంలో విగ్రహారాధనకు బొత్తిగా తావులేకపోవడం! కాగా బౌద్ధ యుగాని పూర్వం హిందువులు ప్రార్థనలు చేయడం, యజ్ఞ యాగాదుల కోసం యజ్ఞశాలల నిర్మించడం కద్దు. కర్నాటకలో ఏ మూలకు వెళ్ళినా సర్వత్రా దేవతా నిలయాలే బెల్గాం, బీజాపూర్, బీదర్, రాయచూర్, షిమోగ జిల్లాలు వందలాది దేవాలయాలక నిలయాలు. మధ్వాచార్యుడి ద్వైతం, శంకరుడి అద్వైతం, రామానుజుడి భక్తిమార్గ (విశిష్టాద్వైతం) కర్నాటక నలుమూలలా అల్లుకుపోయిన తాత్త్విక చింతనా స్రవంతి విజయనగర సామ్రాజ్యం సెక్యులర్ వాస్తుశిల్పాన్ని ఆదరించిందంటారు. రాయ గోపురాల ఈ కోవకు చెందినవే ఇది చోళ, పాండ్య శిల్పకళారీతుల నుంచి స్ఫూర్తి పొంది ఆలయ శిల్పకళ. బహమనీల బీదర్, ఆదిల్ షాల బీజాపూర్, టిప్పు శ్రీరంగపట్నం

వడయార్ల మైసూర్ చరిత్రలు కర్నాటకకు ఊపిరిచ్చాయి, ఊపిరితీశాయి! అయితే మతాతీతమైన (సెక్యులర్) శిల్పకళకు నిదర్శనంగా మైసూర్ ప్రాసాదాన్ని పేర్కొంటారు. దాని వాస్తుశిల్పి ఇంగ్లీషువాడు. దాని ఆకృతి (బాహ్యరూపం) ఇండో-సార్సెనిక్, అందలి ఆర్చీలు గోపురాలు ఇస్లామిక్ వాస్తు, లోపల పానెల్స్ హైందవ శిల్పరీతులూ! ఒకనాడు ''స్వర్ణయుగం''లో మునిగితేలిన మైసూర్ రూపురేఖావిలాసాలకు ఇందులో అక్షర రూపమిచ్చారు.

సామాజిక మార్పులకు అనుగుణంగా మారేదే ధార్మికం. ఇదే ''కాలధర్మం''. కాబట్టే సాంస్కృతిక, ధార్మిక పునరుజ్జీవనోద్యమానికి కర్నాటక ఏనాడూ దూరంగా లేదు. క్రీ.పూ.6వ శతాబ్దినాటి బ్రాహ్మణ్యం యజ్ఞయాగాదులలో కూరుకుపోయి ప్రజలకు విజ్ఞాన వెలుగులు పంచలేకపోయింది. అయితే ఈ సవాలును ఎదుర్కొని ముందుకుసాగి సంచలనం కలిగించినవి - జైనం, బౌద్ధం, భక్తి ఉద్యమాలు. హైందవంలో కూడా సంస్కరణ కొంతవరకు తలెత్తి భక్తి ఉద్యమానికి దారిచూపింది. మతం ముసుగు తొలగించి ధార్మిక (న్యాయ) బుద్ధిని పెంచి సామాన్యుల బతుకులకు దగ్గరగా చేరింది భక్తి ఉద్యమం. భాషా విప్లవం కూడా అప్పుడే తొంగిచూసింది - వైష్ణవం తేలికైన వచన సాహిత్యాన్ని పెంచి కుల, వర్గ తారతమ్యాన్ని తెంచడానికి తోడ్పడింది. ఈనాటి దళిత సాహిత్యంలానే ఆనాడు వైష్ణవం కూడా 'దాస సాహిత్య' సృష్టికి కారకురాలైంది. ఈ సామాజిక సంచలనం నుంచి పుట్టుకొచ్చిందే సర్వమత సామరస్యాన్ని బోధించి కులభేదాలపైన ధ్వజమెత్తిన బసవేశ్వరుడి ఉద్యమం. ఇది సాంస్కృతిక విప్లవం ఫలితం. ఆనాటి ప్రమాణాల దృష్ట్యా చూసినపుడు నాడు ఆధ్యాత్మికం కవనంతో కరచాలనం చేసింది! పద కవితలను, కీర్తనా సాహిత్యాన్ని (హరిదాస) ముందుకు నెట్టింది. పురందరదాసు, కనకదాసు కర్నాటక భక్తి సాహిత్యాన్ని కీర్తిశిఖరాలకు చేర్చారు! జైన సంస్కృతికి బాహుబలి విగ్రహం మరపురాని చిహ్నమయింది.

4000 రకాల వృక్షజాతులతో, వనమూలికలతో, అపారమైన ఖనిజ సంపదతో దీపిస్తున్న కర్నాటక పచ్చనాకు సాక్షిగా పచ్చదనానికి మారుపేరు. కర్నాటక పర్యావరణం చూపరులకు కళ్ళు కుట్టిస్తుంది! లక్నో మాదిరే బెంగుళూరుకూ 'నందనోద్యాననగరం' అన్న పేరు సార్థకనామం. లాల్‌బాగ్, కబ్బన్ పార్కులు పూలగుత్తులతో దోబూచు లాడుకుంటాయి. 300 రకాల పక్షులు విదేశీ పర్యాటకులకు కనువిందు చేస్తాయి. ఇండియాలో 30 రకాల ఖనిజాలతోకూడిన కర్నాటక సంపద్విలసితమైన రెండవ రాష్ట్రం.

ముద్రణా రంగానికి మురిపాల మూట ''చెలువ కన్నడనాడు''!

ఇండియాలో బంగారం ఉత్పత్తి చేసే రాష్ట్రం ఇదొక్కటే (కోలార్, హత్తి గనులు)! ఈ గనులు రూ.36,000 కోట్ల విలువగల 800 టన్నుల బంగారాన్ని ఉత్పత్తి చేస్తున్నాయి. కుంద్రేముఖ్ కాకిరాయి నిక్షేపాలు ప్రపంచంలోని పెద్ద నిక్షేపాలలో ఒకటిగానూ, ఆసియాలోకెల్లా పెద్ద నిక్షేపంగానూ వాసికెక్కాయి. పారిశ్రామిక రంగంలో కూడా - కర్నాటక 1800 సంవత్సరం నాటికే చక్కెర పరిశ్రమను నెలకొల్పుకుంది. ''శివసముద్రమూ, నయగరావలె ఉరకండి'' అని శ్రీశ్రీ కీర్తించిన శివసముద్రం నేడు ఉరకలు వేస్తున్న విద్యుత్ కర్మాగారం! సన్‌ఫ్లవర్ పంటలో, ఆయిల్ ఉత్పత్తిలో రెండవ పెద్ద రాష్ట్రంగా ఉన్నది కర్నాటక. పత్తి పంటకు ధార్వాడ, బీజాపూర్, రాయచూర్, పొగాకుకు మైసూర్, సుగంధ ద్రవ్యాలకు కూర్గ్, షిమోగ, కాఫీకి కూర్గ్, చిక్‌మగలూర్, జీడిపప్పుకు కోస్తా ప్రాంతాలు ప్రసిద్ధాలు. ఇంజనీరింగ్‌లో విశ్వేశ్వరయ్య, సాంస్కృతిక, కళా, సాహిత్య, శాస్త్ర, సాంకేతిక, క్రీడా రంగాలలో డాక్టర్ శివరామకరంత్, మాల్గుడి కథాచరితుడు ఆర్.కె.నారాయణ్, రాజ్‌కుమార్, శంకర్‌నాగ్, జి.వి.అయ్యర్, రాజారామన్న, మైసూర్ దొరైస్వామి అయ్యంగార్, డాక్టర్ అనంతమూర్తి, గిరీష్ కర్నాడ్, ప్రకాష్, ఆర్.కె.లక్ష్మణ్ మొదలైన ఉద్దండులు కర్నాటక ప్రజా జీవితాన్ని నవం నవం చేస్తున్నారు. ఇన్ని రంగాలను సమీక్షించిన ఈ ''చెలువ కన్నడనాడు''కు వెలగట్టడం కష్టం. నిజానికి పుస్తక ప్రచురణకర్తలు ఈ విషయాన్ని కూడా 'అమూల్యం'గానే అట్టి పెట్టడం మరో విశేషం!

*(ఆదివారం 18, మే 1997)*

# నిరాశావాదుల నిఘంటువు

ప్రకృతిలో మోడుపోయిన చెట్లు మళ్ళీ చిగురించదా? తప్పకుండా చిగురిస్తుంది; బతుకు వెతల మధ్య చితికిపోయిన జీవితం మళ్లీ ఆశలు తొడగదా? మానవుడి ప్రయత్న లోపం లేకపోతే జీవితం పునర్నవం చూసి తీరుతుంది. కాని కొందరి దృష్టి ఎందుకనో నిరాశా నిస్పృహల సంకెళ్ల నుంచి విడివడదు. మానవ స్వభావం గురించి ఒక రోజు కాదు, మూడు వందల అరవైదు రోజులూ నిరాశను, నిస్పృహను, విద్వేషాన్ని వెళ్లగక్కుతూ కాలక్షేపం చేయడం కొందరికి అభ్యాసం కాదు, కూసు విద్యే. అలాంటి వాళ్ళు తమకూ, తమ స్నేహితులకూ తరచు వెలిపడినట్టే, అసలుసిసలు అస్పృశ్యులుగానే ఉండిపోతారు. వీరు ఎదుటి వారి సుఖశాంతుల్ని చూసి ఓర్వలేరు. ఒకవిధంగా ఏడుపుగొట్లనే ''సినిక్స్'' అంటారు కూడా. 'సినిక్' నిస్పృహవాది అయితే ''స్కెప్టిక్'' సంశయవాది. కాని తాను లక్షించిన ఆదర్శం నెరవేరనప్పుడు నిరాశకు గురయ్యే వ్యక్తినీ, మంచి కోసం పరితపించి ఆదర్శం అందిరానప్పుడు ధర్మాగ్రహంతో కూడిన నిరాశావాదిని కూడా ''సినిక్'' అనడం కద్దు; కొంతమంది పిసినారులను (Curmdgeons) కూడా ''సినిక్స్'' అన్నవాళ్లున్నారు. ఇలాంటి ''సినిక్స్'' పరిభాషా నిఘంటువును మొదటిసారిగా సరదాగా, చతురోక్తులతో ఇటీవలనే రూపొందించిన వ్యక్తి రిక్ బయాన్ (The Cynics Dictionary). మనం సర్వసాధారణంగా ''సినిక్'' అంటే నిరాశావాది అనో, మానవ ద్వేషి అనో అర్థం చెప్పి ఊరుకుంటాం. కాని ఈ పదానికి నిఘంటుకారులు ఒక్క అర్థం కాదు, పలు అర్థాలు చెప్పారు: క్షుద్రుడు, మూర్ఖుడు, విరసుడు, క్రూరుడు, తాంత్రికుడు, సన్యాసి, బైరాగి పదాలతో సరిపెట్టుకోలేక 'సినిక్' అంటే చివరికి ''కుక్కబుద్ధి కలవాడ''ని కూడా అర్థం తీశారు! నిజానికి నిరాశావాదుల పట్ల అంత కర్కశంగా ఉండవలసిన అవసరం లేదు. ఎందుకంటే ఇతర సామాజికుల మాదిరే ''సినిక్స్'' కూడా సంఘ పరిణామాలకు, చారిత్రక పరిణామాలకూ ప్రభావితుల వుతుంటారు. ఆదర్శం కుంటుపడినప్పుడో, చచ్చుబారినప్పుడో, లేదా తాను ఊహించిన

విధంగా లక్ష్యం నెరవేరనప్పుడో బుద్ధి వక్రమార్గం పట్టే అవకాశం ఉంది. అందుకే 'నిరాశావాదుల నిఘంటువు' (సినిక్స్ డిక్షనరీ) నిర్మాణాన్ని తలకెత్తుకున్న రిక్‌బయాన్ తన గ్రంథాన్ని పరిణామాలతో విసుగెత్తి సమాజాన్ని నిరాశతో నిరసించుతూ భగ్న ప్రేమికుల్లా భగ్న హృదయులైన ఆదర్శవాదుల మానిఫెస్టోగా వర్ణించుకున్నాడు. నిరాశావాదిని, తద్వారా మానవ విద్వేషిగా మారిన వ్యక్తినీ ఎవరూ నిండు మనసుతో ప్రేమించరనీ, అతని వేర్పాటుతనం చూచి అతని స్నేహితులు కూడా దూరమవుతుంటారని, అతనిది వొంటరి బతుకైపోతుందనీ బయాన్ ఆవేదన చెందుతాడు. తరచుగా ''సినిక్స్'' హృద్రోగాల వాతపడుతుండడం కూడా కద్దని మానవతా దృష్టితో చెబుతూ అలాంటి వారిపట్ల సామాజికులకు ఆర్ద్రత ఉండాలని ఆశిస్తాడు; రకరకాల గుంపులతోకూడి భిన్న భావాలు, విభిన్న ధోరణులతో, పలు ఆదర్శాలతో పలు ఛాయలతో అనేకపాయలుగా ఉన్న మానవ సంస్కృతి - ఒక్కపట్టాన అంతుచిక్కని మహార్ణవంగా బయాన్ భావిస్తాడు. ఈ దృష్ట్యానే అతను 900 రకాల ధోరణులను ఎంపిక చేసుకుని, తెలిసిన పదాలకే చిత్రవిచిత్రమైన కొత్త అర్థాలతో చతురంగా ఈ నిఘంటువులో వ్యాఖ్యానం అందించాడు. మన 'సినారె' అన్నట్టు, ''భయాలను పీల్చుకునే బతుకుల్లో మృత్యువిషం/పాదరసంలా పరుగెడుతున్న'' పరిణామాన్ని అడ్డుకోవాలని బయాన్ ప్రయత్నిస్తాడు! లిబరల్ ఆర్ట్స్ పట్టభద్రుడుగా రిక్‌బయాన్ ఎన్నో అసాధారణ పదవులు నిర్వహించిన వాడు; అతని ఈ విచిత్ర నిఘంటు నిర్మాణానికి తగినట్టుగానే ''రబ్బర్ ఏజ్'' పత్రికకు అసిస్టెంట్ ఎడిటర్‌గా ''కంటైనర్ న్యూస్'' పత్రికకు మేనేజింగ్ ఎడిటర్‌గా పనిచేసినవాడు, వ్యాపారం అన్నా, జీవితం అన్నా, ''స్తబ్దం''గా స్పందించే బయాన్ అడ్వర్టైజింగ్‌లో మాత్రం అయిదు అవార్డులు కొట్టుకోగలిగాడు! ఆదర్శవాదులైన భగ్నజీవులందరికీ, కలతచెందినవారికి, కలగుండు పడిన వారికి, జీవితంతో విసుగెత్తిపోయినవారికీ, కాలపరిణామాలకు విస్మయపడిన వారికీ తన నిఘంటువు ఒక సహచరి అనీ, 'సంజీవిని' అనీ బయాన్ భావిస్తాడు! నడతను, నాణ్యతను, నైతిక విలువలను క్షుద్రస్థాయికి దిగజార్చిన యుగానికి బయాన్ వ్యక్తిగత స్థాయిలో పలికిన ఛీత్కారమే ఈ నిఘంటువు! కళా రంగంలో అశ్లీలతను తలకెత్తుకున్న శకానికి నిరసనే ఈ ప్రయత్నం; స్త్రీ పురుషులు పరస్పరం ద్వేషించుకునే సన్నివేశాలు కల్పించిన శకంపై ఎత్తిన ధ్వజమే ఈ నిఘంటువు. ఒక్కముక్కలో - సంప్రదాయ నిరసనలో కొత్త అర్థాలతో రూపు తొడిగిన చిరుపాత్రమే ''సినిక్స్ డిక్షనరీ''! బయాన్ కూడా

ఆదర్శవాదే, తానూ దగాపడిన వాడే, నిరాశ చెందిన వాడే, విసుగెత్తిపోయినవాడే. అయినా ఆయని క్రోధం ఎవరిపైన? మాయపొరలు కప్పిన కళ్లతో ఈ లోకాన్ని సందర్శించరాదన్న జ్ఞానం ఉన్నవాడు బయాన్. అలాంటి మోసాలకు, జీవితానికి చెప్పే వక్రభాష్యాలకు ఆయన వ్యతిరేకి ("Who view life through a melodious cloud of Cigarette smoke)"! ''నిజానికి మానవ జీవితం శ్రావ్యమైన సంగీతంలా తాండవ నృత్యంలా'' సాగాలని బయాన్ కోరుకున్నవాడే ("wanted life to be a melodious waltz...") బయాన్ ఇందులో కొన్ని పదాలకిచ్చిన అర్థవివరణ చిత్రంగా ఉంది: ''గుండెపోటు'' కోపోద్రేకం అవధులు దాటినప్పుడు వస్తే, ''క్యాన్సర్'' వ్యాధి ఉద్రేకం అణుచుకోవడం వల్ల వస్తుందంటాడు! ''కాపిటలిస్టు'' (పెట్టుబడిదారు) పదానికిచ్చిన అర్థంలో - ఇతరుల శ్రమతో షడ్రసోపేతంగా భోజనాలు సిద్ధం చేయించి, అందులో మెట్టు వాటాను మాత్రం తానే ఆరగించేవాడని నిర్వచిస్తాడు! నిరాశలో కూడా నిప్పురవ్వ! ఎందుకంటే ''వర్ణముద్రల కుంచిత పరిధుల్లేని/ అచ్చ తెలుపు హృదయాలు స్వచ్ఛంగా కలుసుకుంటాయి/ కన్నీటి చుక్కలను రొట్టెముక్కలను కలిసి పంచుకుంటాయి'' కాబట్టి! రిక్ బయాన్ వ్యక్తిగతంగా ఎవరిమీదా దుమ్మెత్తిపోయలేదు - తనను మోసగించిన వ్యవస్థ మీద, తన ఆశలను అడియాసలు చేసిన వ్యవస్థ మీదా తప్ప! కేవలం వ్యక్తివాదంపై కూడా (ఇండివిడ్యుయలిజం) ఆయన దండెత్తాడు. రిక్ బయాన్ తాజా రచనకు ముందు ప్రసిద్ధ నీతిప్రవక్తలలో ఒకరైన అంబ్రోసి బియర్సి ''డెవిల్స్ డిక్షన రీ'' (దెయ్యాల నిఘంటువు) రాశాడు; ఒక శతాబ్దం పాటు అది సినిక్స్‌ను అలరించింది; అందులో తన కోపాన్ని మానవాళిపైన కక్కాడు. అలాగే రిక్ బయాన్ కూడా తన రచనలో మానవుడి స్వభావంలోని మాలిన్యంపై దండోరా వేశాడు, దేవుళ్లను నిరసించాడు; ఆధునికయుగంలో తనకు నచ్చని పరిణామాలను వ్యతిరేకించాడు; భీతావహమైన దౌర్జన్యాలను నిరసించాడు; బయాన్ ఉద్దేశంలో మానవాళిలో అసంఖ్యాకులు తమతమ జన్యుకణ స్వభావాలను బట్టి ఏవో తెలియని శక్తులు నడిపిస్తే నడిచిన అమాయకులు, కాలం చెక్కిన బొమ్మలూ! ఆయని నిశిత దృష్టినీ, కలం పోట్లనూ తప్పించుకున్న వారు అరుదు; ప్రత్యేక ప్రయోజనాల కోసం పాకులాడే గ్రూపులూ, ఫాక్షన్లూ, లాబీలూ, పదాడంబారాలతో సరిపుచ్చుకునే (Jargoneering) వృత్తి నిపుణులూ, కౌమారదశలో ఉన్న అల్లరిమూకలు, పత్రికల వాళ్లూ (Media taskmakers) డంబాచారులూ, అడుగడుగునా మడం తిప్పే మడత పేచీరాయుళ్లూ - ఇలా ఎందరో బయాన్ విమర్శనా దృష్టిని

తప్పించుకోలేకపోయారు! ఈ ఇరవయ్యో శతాబ్దపు ఘాతుకాలను ఆయన తూర్పారబట్టాడు; అయితే మరి రిక్ బయాన్ పడే తపన దేనికోసం? ఈ నిఘంటువు గతంలోని మంచికీ, సుఖానుభూతులకూ స్మృతిగీతంగా చెప్పుకొన్నాడు; అదే సమయంలో ఆయన మానవాళి మౌలిక ప్రయోజనాల్ని పరిరక్షించడానికి నిరాటంకంగా దూసుకువెళ్లే పాశుపతాస్త్రం లాంటి భావధారను దిద్దితీర్చాలన్నాడు (Shaping each idea into a compact winged missile)!! ఆధునిక యుగంలో పర్యావరణ స్పృహతో కొన్ని పదాలకు బయాన్ కొత్త టీకాటిప్పణి చెప్పాడు : ''యాసిడ్ రైన్''ను వర్ణిస్తూ అది పరిశ్రమల కాలుష్యాన్ని ప్రకృతి ప్రతిఘటిస్తున్నందుకు నిరసనగా పరిశ్రమలే ప్రకృతిపై తీసుకుంటున్న ప్రతీకారం అన్నాడు! అంతేగాదు, సురూపిగా ఉన్న సుందరమైన వసుంధరను కురూపిగా మార్చే యత్నంగా కూడా అభివర్ణించాడు! అలాగే ''మరణశిక్ష'' గురించి కూడా వ్యంగ్యంగా కొత్త నిర్వచనం చెప్పాడు: ఉరికంబమెక్కే వ్యక్తి భవిష్యత్తులో నేరాలు చేయకుండా అడ్డుకునే అస్త్రమే మరణశిక్ష అన్నాడు (against future crimes by same individual!) ఇలా ఎన్నో పదాలకు విచిత్రార్థాలూ, విశేషార్థాలూ ఇచ్చాడు! "CEO" అన్న పదానికి మనం ఏ చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ అనో వాడుతుంటాం. కాని బయాన్ కలం "Corporate Ego in Overdrive"గా చిత్రించింది! ఇలా ''సినిక్స్'' పేరిట వెలువడిన ఈ నిఘంటువులో ఎన్నో చోద్యాలు పోయాడు బయాన్. హెల్మన్ దృష్టిలో నిజాన్ని నిష్ఠురంగా పలికే వాడే 'సినిక్' అయితే, హెచ్.జి.వెల్స్ భావనలో అనారోగ్యంలో ప్రగల్భించే హాస్యమే 'సినిసిజం'! కాని అదే రసెల్స్‌లైన్స్ ఆలోచనలో ''సినిక్'' అంటే - దేన్నీ విశ్వసించని వాడు, అయినా తనను మాత్రం అందరూ నమ్మాలని కోరుకునేవాడూ! అదీ ఇదీ కాదు, దొంగిలించిన లాంతరు పుచ్చుకొని నిజాయితీపరుడి కోసం వెతుకులాడే వాడే 'సినిక్' అని ఎడ్గార్ షోఫ్ చరుపు! ఇవన్నీ కాదు, బాంబుల ద్వారా మనం మనల్నే ఎంత ఘోరంగా ధ్వంసం చేసుకోగలమో 'సినిసిజం' ద్వారా (నిరాశ ద్వారా) కూడా అంతబలంగానూ సర్వనాశనం తెచ్చుకోగలమని కెన్నెత్ క్లార్క్ చెప్పిన కాలజ్ఞానం! అందరికన్నా ఒకడుగు ముందుకు వెళ్లి మెంకెన్ ''పువ్వుల వాసన గ్రోలుతున్నప్పుడు శవపేటిక కోసం వెతుకులాడే బాపతే'' సినిక్ అన్నాడు! పీత బాధలు పీతవి, 'సినిక్' బాధలు సినిక్‌వి. దోపిడీ వ్యవస్థ ఉన్నంత కాలం - మనుషుల్లో కొందరు నిరాశావాదులుగా, నిహిలిస్టులుగా ఇంకొందరు బందిపోట్లుగా, దొంగలుగా మారతారు. వారి సంఖ్య అల్పం కాని అదే సమయంలో తప్పుడు వ్యవస్థను

ప్రతిఘటించే శక్తులూ పుడుతుంటాయి, వీరు అసంఖ్యాకులు. చలనశీల చైతన్యంతోనే వీరి ఆరాధన, సమాజ సమారాధనా. ఒక కవికుమారుడు చెప్పినట్టు ఇలాంటి వారి ఆదర్శం - ''పొగలా ఏళ్ల తరబడి మూల్గడమెందుకు/నిప్పులా కొన్ని క్షణాలైనా గుప్పుమనాలి గానీ/...వాకిళ్లు తెరుచుకున్నప్పుడే హృదయానికి పలుకొస్తుంది/విశ్వాన్ని ఒడిలో చేర్చుకున్నప్పుడే/ మనిషి శిరస్సు మబ్బుల్ని స్పృశిస్తుంది''!

*(ఆదివారం 27, ఏప్రిల్ 1997)*

# సామాన్యుడి రోదనే అల్లం ''అరణ్యఘోష''

మహాభారతం ఉద్యోగపర్వంలో సంజయుడికి శ్రీకృష్ణుడి బోధ విన్నప్పుడు ప్రకృతికి జీవరాశికి మధ్య ఉండవలసిన అవినాభావ సంబంధం ఏమిటో మనకు తెలిసి వస్తుంది: ధృతరాష్ట్రుడూ అతని కొడుకులూ కలిసి వెరసి - ఒక అడవి అనుకొంటే, పాండురాజు కొడుకులు పులులు. అందువల్ల అడవి నుంచి పులుల్ని తరిమికొట్టకండి. అడవి విడిచిన పులిని మనుషులు చంపడం తేలిక. అలాగే పులిలేని అడవిని కూల్చేయడమూ తేలికే. కాబట్టి పులి అడవికి రక్షణ. అడవికి పులికి రక్షణ! ప్రకృతిలో కాపాడుకోవలసిన ఈ సమతుల్యతను మానవుడు చెదరగొట్టడం రాజుల, రాణుల, అధికారుల మృగయా వినోదంతోనే ప్రారంభమయింది! ఒకడి తీపి, వేరొకడికి చేదు. కడుపు నిండినవాడి బేరం వేరు, కడుపు మండినవాడి బేరం వేరు! ధనం మదించినవాడు కులాసాకీ, జల్సాకీ, గొప్పగా వేట చేస్తాడు, ఇతడు బతకడానికి వేటకు దిగనక్కర్లేదు. మరొకడు పొట్టకోసం వేట సాగిస్తాడు. వేట లేకపోతే వీడు బతకలేడు కనుక! ఒకడు పులుల్నీ, బాతుల్నీ తుపాకీతో చంపేస్తాడు, మరొకడు పిట్టను కత్తితో పీకకోసి చంపేస్తాడు. ఇద్దరూ చేసేది హింసే అయినా కలవాడికున్న స్వేచ్ఛ, గోచిపాత్ర రాయుడికి ఉండదు. ఈ జీవన సత్యాన్ని అడుగడుగునా నిరూపించే కథలు - అరుదైన కథా వస్తువుతో, దూసుకుపోయే విలక్షణమైన శైలితో సుప్రసిద్ధ కథకులు అల్లం శేషగిరిరావు ''అరణ్యఘోష''. సామాన్యుడి రోదనకు అక్షర రూపమే 'అరణ్యఘోష'. రూడ్యార్డ్ కిప్లింగ్ చిరంజీవుల కోసం రాసిన ''జంగిల్ బుక్''లో అడవిని ఆశ్రయించి పెరిగే మానవ, మానవేతర ప్రకృతి మధ్య పెనవేసుకున్న బంధాలు, భాషా సామ్యాలు ఎంతటి రూపచిత్రణను సంతరించు కున్నాయో అల్లం వేట కథలూ అంతే. లోకంలో ఎన్ని రుచులు! ఒకరు యాత్రాసాహిత్యంలో తలపండిన వారైతే, మరొకరు మధ్యతరగతి జీవితాలను వెలార్చడంలో అందెవేసిన చెయ్యి. హెమింగ్వేలా ఒకరు యుద్ధభూమి గాథలను అక్షర బద్ధం చేయడంలో లేదా సాగరవాసులతో ఉన్న అనుభవాలను అచ్చుకెక్కించడంలో అపారమైన శక్తియుక్తులు ప్రదర్శిస్తే, ఇంకొకరు వలసపిట్టల చేతనా స్రవంతికి అర్థం

పడతారు. సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలకూ ఈ చరాచర ప్రకృతిలో రచయిత అయిన ప్రతివాడూ - ఏదో ఒక కోణం నుంచి తన దృక్కోణాన్ని పాఠకులకు ప్రదర్శించడానికి కలాన్ని సునిశితం చేసుకుంటూనే ఉంటాడు. వేట రహస్యాల్ని పలు విధాలుగా 13 కథలలో విప్పిచెప్పిన అల్లం సీరియస్ కథా రచయితలలో ఏ పాశ్చాత్యుడికీ తీసిపోడు. అల్లం ఎంచుకున్న ప్రత్యేక కోణం - వేటకథలు కాగా వాటి శైలి సత్యం, శివం, సుందరంగా సాగిపోయింది. ఒక్కొక్కరికి ఒక్కో 'అబ్సెషన్'. దాన్ని అభిమానం అనండి, వెర్రి అనండి, పిచ్చి అనండి. తనదైన మార్గాన్ని ఏ రచయితా వదులుకోడు. కనుకనే సుప్రసిద్ధ మెక్సికన్ కథా రచయిత, నవలాకారుడూ అయిన కార్లోస్ ఫ్యూనెట్స్ దృష్టిలో ఒక ఇతివృత్తంపట్లగానీ, ఒక కథా వస్తువుపట్ల గానీ ఆ ప్రత్యేక అభిమానం అన్నది చారిత్రక ఘట్టాల నుంచో, వ్యక్తినిష్టమైన ఆసక్తి వల్లనో పుట్టుకొస్తుంది. ("All writers live off of obsessions. Some of these come from history, others are purely individual, and still others belong to the realm of the purely obsessive, which is the most universal thing a writer has in his soul" అంతేగాదు, ఫ్యూనెట్స్‌కు అభిమాన వస్తువు భయం (fear). అందుకే అతను all of my books are about fear అని చెప్పుకున్నాడు)! అలాగే అల్లం 'అరణ్యఘోష'కు ముందు కూడా అనేక వేటకథలు రాశాడు. ఆయన వేటకథా రచయితేగాని, ఎవరినీ వేటాడిన వాడు కాదు! బహుశా 1960లలో కాబోలు శేషగిరిరావులానే డాక్టర్ పి. సీతారామారావు కూడా వేటకథల పుస్తకం వెలువరించినట్టు గుర్తు. ఆయనకూ అల్లంలాంటి ఆబ్సెషన్ ఉంది. నిజానికి ఓ ప్రత్యేక అంశంపైన రచయితకు ఆ ఆబే లేకపోతే సాహసాలకు అర్థంలేదు. వేటలాంటి సాహసానికి దిగేవాడికున్న చొరవలో సగమన్నా లేకపోతే వేట రహస్యాల్ని గమనించి, అందులోని సాధకబాధకాల్ని, జీవరాశితో జరిపే ఎన్‌కౌంటర్లనూ రచయిత అక్షరబద్ధం చేయలేడు. బ్రిటిష్ పరిపాలనా కాలం పూర్వరంగంగా శేషగిరిరావు రాసిన 'అరణ్యఘోష'లోని రాకుమారుడు రవీంద్ర (''ప్రిన్స్ హెమింగ్‌వే'') నుంచి ఈనాటి వీరప్పన్ దాకా వేటగాళ్ళు చేస్తున్నవి సాహసయాత్రలూ, దుస్సాహస యాత్రలే! చరిత్రలో సాహసయాత్రలకు, భావితరాలకు ఉపకరించిన యాత్రలకు ఉదాహరణగా పరిణామవాదకర్త చార్లెస్ డార్విన్‌ను పేర్కొనవచ్చు. విశాల ప్రకృతి దర్శనానికి, సునిశితమైన పరిశోధనకూ సాహసించిన ''వాయేజ్ ఆఫ్ ది బిగిల్'' డార్విన్ కీర్తికిరీటంలో తొలి తురాయి. అడవులలో అతని సంచారం, పర్వత యాత్రలు, ప్రకృతి దర్శనంలో రకరకాల వృక్ష, జీవరాశుల పరిశీలన, శిలల అధ్యయనం

- డార్విన్ సాగించిన విజ్ఞాన విహార యాత్ర. ఆనాటి విక్టోరియన్ ప్రపంచంలో అతని ''జీవరాశుల పుట్టుపూర్వాలు'' (Origin of Species) గ్రంథం కల్లోల తరంగాలు రేపింది ధ్రువప్రాంత పరిశోధనల్లో జాన్ ఫ్రాంక్లిన్ ఆనాడు మెకంజీ నదినుంచి ఆర్కిటిక్ సముద్రం దాకా ''పోలాఫేమస్'', ''ప్రిన్స్ ఆఫ్ వేల్స్'' నౌకల మీద జరిపిన సాహసయ త్ర మరపురాని మరోఘట్టం. భౌగోళిక విజ్ఞాన శాస్త్రానికి అతని పరిశోధనలు అమూల్య కానుకలుగా గుర్తించి (The most important acquisition to geographical knowledge) స్వర్ణపతాకం ఇచ్చారతనికి! ముప్పయ్యేళ్ళు కృషి చేస్తే గాని చీకటి ఖండాన్ని వెలుగులోకి తేలేకపోయాడు డేవిడ్ లివింగ్ స్టోన్. ఆయనదీ ఓ సాహసయాత్రే! మహ్మద్ జన్మస్థలమైన మక్కాకు యాత్రలు జరిపి, మార్గమధ్యంలో బర్బర జాతుల, తెగల నుంచి ఎదురైన సవాళ్ళను తట్టుకుని, సెంట్రల్ ఆఫ్రికా పటంలో ప్రశ్నార్థకాలుగా మిగిలిపోయిన అనేక ఖాళీలను నామకరణాలతో పూరించిన రిచర్డ్ బర్టన్ మరో సాహసి. ''అరేబియన్ నైట్స్'' కథలకు ఆద్యుడితను. కేవలం సువర్ణ సంపద కోసం సాహసయాత్రలు చేసినవాడు హెన్రిక్ స్కీల్‌మాన్. పురావస్తు సంచయం కోసం అతడు చేసిన యాత్రలు నామమాత్రం! ప్రపంచంలో అంతవరకూ తెలియరాని వేలకొలది వృక్ష, పశుపక్ష్యాదులను గుర్తించిన సాహసి విక్టోరియన్ యుగం ప్రాకృతిక శాస్త్రవేత్త వాల్టర్ బొట్స్. దక్షిణ అమెరికాలోని అమెజాన్ నదీలోయలోని అతని సాహస యాత్రల సంపుటీకరణమే అద్భుత యాత్రా సాహిత్య దీపశిఖ ''ది నాచురలిస్ట్ ఆన్ ది రివర్ అమెజాన్'' గ్రంథం. అలాగే 16 కనుమలు దాటుకుంటూ 600 మైళ్ళ పర్యంతం ఆల్ప్స్ పర్వతాల్లో సొరంగాలు తవ్వి రాస్తాలు వేయడం మరో సాహసం!

ఇన్ని సాహసాల మధ్య మృగయా వినోదం పేరిట సాగే 'సఫారీ' గురించి అల్లం శేషగిరిరావు వినిపించే 'అరణ్యఘోష'కూ ఒక ప్రత్యేకత ఉంది. ఆ రాణుల ప్రేమ పురాణం, ఈ ముట్టడికైన ఖర్చులూ, కథలూ, క్రైమ్‌యతులూ చరిత్ర సారం కాజాలవని, వేటలో కూడా సామాన్యుడి బతుకు తెరువుకు మూడిన చేటు గురించి కూడా తేటతెల్లం చేసి సంచార జాతులలో సామాన్యుడి వేదనను వినిపించిన కథా చిత్రాలివి. ''ప్రిన్స్ హెమింగ్వే'', ''వఊడు'', ''చీకటి'', ''నరమేధం'' కథల్లో ప్రిన్స్ రవీంద్ర, రాణి చంద్రకళ, వేట ఏనుగు సీజర్, కంట్రాక్టర్, కెప్టెన్ శర్మ, రొటేషన్ పద్ధతిలో ఎమ్.ఎల్.ఏ.లు అయ్యే వెంకునాయుడు, గంగరాజు - చింత చచ్చినా పులుపు చావని రాజరిక, ఫ్యూడల్ వ్యవస్థలకు భూస్వామ్య సంస్కృతికీ ప్రతినిధులు; కాగా నౌకరు

రసూలు, అడవికి సెంట్రీగా ఉన్న చిన్నయ్య, వేట అనుపానులు తెలిసి, కెప్టెన్ శర్మకు పాఠాలు చెప్పగల నిశిత పరిశీలనా శక్తిగల బివిరిగాడు, ఆకలి బాధతో రేపటి బతుకు భయంతో జగన్నాథుడి రథానికి కండువాతో ఉరిపోసుకున్న ధక్కు వాడూ - దీనజనాలకు ప్రతినిధులు. తప్పుడు కేసులు పెట్టడంలోనే గాక బెదిరించి అబద్ధాలు చెప్పించడంలో కూడా నేర్పరులైన పోలీసులూ ఈ కథల్లో తరచుగా తారసిల్లుతారు. ''రాబందుల రెక్కల చప్పుడూ, పయోధర ప్రచండ ఘోష'' వినగలవాళ్ళే అల్లం అరణ్యాఘోషనూ చదవగలుగుతారు! ఇందులోని వేటకథలు చదువుతున్నప్పుడు వాల్మీకి 'మా నిషాద గీతం' మరొక్కసారి గుర్తుకు రావలసిందే. అక్కడ క్రౌంచ పక్షుల జంట, ఇక్కడ జల్సారాయుడయిన రాకుమారుడి మృగయా వినోదంలో జంటను కోల్పోయిన ఒంటి బాతు కథ ఒకటే! స్వార్థ ప్రయోజనాలు మితిమీరగా కొందరు, అడవి తల్లిని నమ్ముకున్న సంచార జాతుల్ని ముద్దకీ, ముద్దు ముచ్చటలకూ దూరం చేసి సమాజాన్నుంచి వెలివేసి, వారిని దొంగలుగా చిత్రించిన దొరల కామాటాన్నీ వేట గుట్టునూ రట్టుచేసిన రచన అల్లం అరణ్యాఘోష! సంచార జాతుల వాళ్ళ బతుకు చితుకుల గురించిన విషాద చరితకు అద్దం ''చీకటి'' కథ. వాళ్ళు వస్తుతహ కష్టజీవులేగాని అబద్ధం ఆడరని చెప్పిన రచన. వేటలో పిల్లలు, నక్కల చర్మాల్ని ఒలిచి, కౌజు పిట్టల వెంట్రుకలు దూసి అమ్మి వాళ్ళు జీవనం ఎలా సాగిస్తారో మనకు కళ్ళకు బొమ్మ కట్టించి చూపాడు శేషగిరిరావు. దొంగతనం ఆపాదించి, అనుమానం మీద వారిని శాశ్వత నేరస్థులుగా చేసి, వారి జీవనాన్ని దెబ్బతీసిన పోలీసు వ్యవస్థమీద చరుపు ''చీకటి''. చావకుండా బతికుండాలంటే చచ్చేదాకా పనిచెయ్యక తప్పదన్న దశరథరామయ్య (''వటుడు'') సూక్తి ఈ దోపిడీ వ్యవస్థ స్వభావానికి మచ్చుతునక. మిలిటరీ వోళ్ళు తమ దేశం కోసం ఫైట్‌చేస్తే, సివిలోళ్ళు (అంటే మనం) తమ పొట్టకోసం దేవిరిస్తారు''ని చెప్పిన సెంట్రీ చిన్నయ్య మాటను కాదనగల సాహసమూ మనకులేదు! ''మా పుట్టుకలు గుర్తుండవు. చావులు తప్ప'' అన్న డిబిరిగాడు ఎండ, వానలకీ, చలిగాలికి, ఆరుబయట జీవితానికి అలవాటుపడిన సంచార జాతివాడు. వాళ్ళకో ఊరులేదు, సంసారాలు చిందరవందరై, అడవి జంతువుల్లానే జనారణ్యంలోనే వారి సంచారం. అనామకులుగా రాలిపోతారు. అనుభవించేది దరిద్రమని వాళ్ళకు తెలియదు. వాళ్ళ శరీరంలాగే వాళ్ళ జీవితాలు కూడా దరిద్రానికి అలవాటు పడిపోయాయని చెప్పినప్పుడు నిజమైన విశ్వమానవులు ''రిజర్వేషన్లు'' లేని ఈ సంచారజాతులేనేమో అనిపిస్తుంది! ఎక్కడుంటే అదే వారి

ఊరూ, వాడా; ఈ భూమంతా వారిదే, పిట్టల్లాంటి జీవితం వాళ్ళది. తాగిన కైపులో డిబిరిగాడి పెళ్ళాం కేసి మోజుపడుతున్న కెప్టెన్ వర్మకి తెగించిన సంచార తెగ స్త్రీ శౌర్య ప్రతాపాల గురించి డిబిరిగాడు ఏకరువు పెట్టి శర్మ గుండెల్లో రైళ్ళు పరుగెత్తించడం చీకటిని చీల్చిన వెలుగు దివ్వె! కొడుకు (డిబిరిగాడు) ఆకలి తీర్చడానికి తండ్రి ఉరికంబం ఎక్కాడు. తన ఆకలి తీర్చుకోడానికి తన చేతుల్లో పెంచిన పిట్టను గొంతు కోశాడు కొడుకు. ఆకలి ఎంతపనైనా చేయిస్తుంది. అందుకే కడుపు నిండినవాడి వేటకూ, కడుపు మండిన వాడి వేటకూ ఉన్న తారతమ్యాన్ని గమనించాలి! డిబిరిగాడి తండ్రి ఉరి కాబోయేముందిచ్చిన సందేశం హృదయ విదారకం, వాస్తవ చిత్రం! ''నువ్వు నా కోసం బెంగెట్టుకోకు.... బాగా వేట చెయ్యి.... బాగా తిను. వంటి నిండా కండలు పెరగాలి. బలంగా ఉండాలి. దెబ్బలు తిని తట్టుకోడానికి బలం కావాలి - మనవి దెబ్బలు తింటూ బతికే బతుకులు...''! గాయపడిన గొంతు గాద్గదికం కావడమే కాదు, దీర్ఘ స్వరంతో నినదిస్తుంది. దెబ్బతిన్న బెబ్బులి ప్రళయ భీకరంగా గాండ్రిస్తుంది. వేట కథల్లో పాఠకుల వీనులకు విందూ, కనులకు పసందూ చేయగల పిట్టలు ఎన్ని రకాలో - బాతులు, గూడ బాతులు, పరద పిట్టలు, స్నాయిపులు, దుమ్మలగొండ్లు, దాసరి కోళ్లు, కొంగలు, గూడ కొంగలు, నత్తగొట్లు, కొండంగోళ్ళు, మచ్చల పిట్టలు, బురదదుమ్ములు, ఒకటా అరా - వేట శాస్త్రాధ్యయనానికి శేషగిరిరావు సమకూర్చిన అనువైన సంభారాలెన్నో! అంతేగాదు, ఆంగ్ల సాహిత్యంలో సామాజిక స్పృహతో చారిత్రక డాక్యుమెంటరీలాగా రచనలు చేసిన జాన్స్‌గాల్స్ వర్దీ ''జస్టిస్'' నాటకం ఇంగ్లాండులో క్రిమినల్ జస్టిస్ వ్యవస్థలో జైలు సంస్కరణలలో పెనుమార్పులకు కారణమయ్యింది. అలాగే అతని ''సిల్వర్ బాక్స్'' సంస్కరణోద్యమానికి తోడునీడయింది. తెలుగునాట అల్లం శేషగిరిరావు ''అరణ్యఘోష'' కూడా క్రిమినల్ జస్టిస్ వ్యవస్థలో మార్పులకు అంకురార్పణ చేయగలగాలి!

*- ఆదివారం 25, మే 1997*

# సదా అమ్మై ప్రవహించిన కవితా సెలయేరు 'అమ్మ'!

సాహితీ క్షేత్రంలో సెంటిమెంటును కడుపారా కొల్లగొట్టుకుని సార్వకాలికమైన సమ్మోహన శక్తితో నిలబడగలిగిన అక్షరాలు రెండే రెండు - వాటికి మారు పేరే 'అమ్మ'! అప్యాయత అన్న పదానికి రెండు పెదవులతో అపూర్వ సమన్వయం సాధించిన ఏకైక పదం అమ్మ! ఆ పేరులో సాంత్వనం ఉంది, సాధికారత ఉంది, ఆప్యాయత ఉంది, ఆదరణ ఉంది, అణకువ ఉంది, ఆత్మీయత ఉంది, లాలించినా అదిలించే శక్తి ఉంది, పాలించకుండానే బెదిరించే త్రాణ ఉంది, ఒక్క ముక్కలో ఆ రెండక్షరాలు అయస్కాంత ధ్రువాలు! నిత్య నైమిత్తికాలలో మానవుడు అమ్మను ఎన్ని రూపాలలో తలచుకుంటాడో, స్తుతిస్తాడో చెప్పలేం. 'అడ్డాలనాడు బిడ్డేగాని, గెడ్డాలనాడు బిడ్డ'గాడన్న సామెతలో కొంత నిజం లేకపోలేదు. కాని 'మాతృదేవో భవ'తో ప్రారంభమయ్యే బాలకాండ మనిషి భావి జీవితాన్ని తీర్చిదిద్దే పెద్దబాలశిక్ష! శిశువుకు పాలివ్వడంతోనే తన కర్తవ్యం పూర్తయిందని తల్లి అనుకోదు. క్రమశిక్షణా రాహిత్యం వల్ల వాడిలో మొలకలెత్తే పశుత్వాన్ని ఆదిలోనే తుంచి మానవత్వాన్ని పెంచి, అమృతత్వాన్ని పోషించే దశ వరకూ ఆవేదనల మధ్య జీవించే అవిశ్రాంత జీవి అమ్మ! ఆమె బతుకుకు సార్థకత నేర్పుతుంది, అనుభవాల ఆస్తులు పంచుతుంది, స్మృతి పుస్తకాలను పేర్చుతుంది, అనురాగాలను వారసత్వంగా అందజేస్తుంది. అందుకే పోతనామాత్యుడు ''అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ'' అన్నాడు. అమ్మలో కవులు దేవిని చూశారు, శారదా దేవిని చూశారు, భారత మాతను దర్శించారు, తెలుగు తల్లిని ఆవాహనం చేశారు, చివరికి ఆంధ్రమాత పేరును ''గోంగూర'కూ తగిలించి తన్మయం చెందారు! అలాంటి అమ్మ గురించి, అమ్మతనం గూర్చి తనివితీరా వివిధ కోణాల నుంచి, భిన్న సైద్ధాంతిక దృక్కోణాల నుంచి, విభిన్న ఉద్యమాల స్ఫూర్తి నుంచీ కేవలం తల్లి విశ్వరూపాన్ని ప్రదర్శించిన సరికొత్త కవితా సంకలనం 'అమ్మ' సుమారు మూడున్నర దశాబ్దాలుగా ''రంజని'' తెలుగు సాహితీ సమితి విభిన్న ప్రక్రియా రూపాలలో తెలుగు భాషకు, తెలుగు సంస్కృతికి సేవలందిస్తున్న సంస్థ దానికి మరొక కలికితురాయిగా వెలువడిందే 'అమ్మ' సంకలనం.

సదా అమ్మై ప్రవహించిన కవితా సెలయేరు 'అమ్మ'!

సుమారు పాతికేళ్ళుగా తెలుగు సాహిత్యాన్ని రకరకాలుగా ప్రభావితం చేస్తూ వస్తున్న విప్లవవాద, స్త్రీవాద, దళితవాద, ముస్లింవాద, స్వీయానుభూతివాద ప్రక్రియలలో చోటుచేసుకున్న మాతృమూర్తి గురించిన ప్రస్తావనల సంపుటీకరణగా ఈ సంకలనాన్ని చెప్పుకోవచ్చు. ''రంజని'' తరపున వెలువడిన ఈ ప్రత్యేక సంపుటికి సంపాదకులుగా వ్యవహరించిన వారు సుధీర్ కుమార్, శిఖామణి, చీకోలు సుందరయ్య. నేడు అనేక మంచి విలువలు పతనమవుతున్న దశలో ఈ సంకలనాన్ని వెలువరించడం సాహసం కాదు, సామాజిక బాధ్యతగా గుర్తెరగడం సంతోషించదగ్గ విషయం. ఎందుకంటే అమ్మని తలవని రోజు ఉండదు. అలాగే స్త్రీకి జన్మించి, స్త్రీని అవమానించడం ఒక్క నరజాతికే చెల్లు! కట్టుకున్న భర్తతోనే గాదు, పేగులు తెంచుకుని, వాటిని కుట్టుకుని కన్న బిడ్డలతో కూడా అవమానాలు భరిస్తూంటుంది తల్లి. బహుశా సోక్రటీస్ అందుకే అని ఉంటాడేమో : "Once made equal to man, woman becomes his superior' అని! కాని మగవాడు పడనివ్వద్దూ! రంజని సంస్థ భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భంగా చంద్రునికో నూలుపోగులా ఈ కవితా సంకలనాన్ని సాహితీ ప్రియులకు అందించింది. సకల నదులూ సాగరంలో కలిసినట్టుగా భిన్న వాద ప్రతివాదాలలో నిగ్గుతేలిన కవితా ఖండికలు (ప్రధానంగా వచన కవితలు) సుమారు వందదాకా ఇందులో ఉన్నాయి. ఇందులో డాక్టర్ సినారె నుంచి శివకుమార్ దాకా, నగ్నముని నుంచి నాళేశ్వరం శంకరందాకా, అడిగోపుల వెంకటరత్నం నుంచి ఆశారాజు వరకూ, ఇస్మాయిల్ నుంచి ఇంద్రగంటి జానకీబాల దాకా, అల్లం నారాయణ నుంచి ఆప్త చైతన్య వరకూ, కత్తి పద్మారావులగాయతు కత్తుల కిషోర్ కుమార్ వరకు, ముకుంద రామారావు నుంచి కల్లూరి ఆనందరావు దాకా, నాయని కృష్ణకుమారి నుంచి కొండేపూడి నిర్మల వరకూ, త్రిపుర నుంచి తంగిరాల సుబ్బారావు దాకా, శివసాగర్ నుంచి సతీష్ చందర్, ఎండ్లూరి సుధాకర్,. దేవీప్రియ వరకూ, విమల నుంచి పాటిబండ్ల రజని దాకా - ఇలా ఎవరిని కదిపినా 'అమ్మ'లోని అమృతతత్వంతో పాటు అమెకు జీవన సమరంలో ఎదురయ్యే కడగండ్లకూ నూతనార్థాలతో, కొత్త ఉపమానాలతో, నవ్యభావాలతో అక్షర రూపమిచ్చి పాఠకులలో చైతన్యదీప్తిని కలిగించడానికి ప్రయత్నించారు. క్షేత్రయ్య మువ్వగోపాల పదాలు, అన్నమయ్య 'జో అచ్యుతానంద జోజో ముకుందా', 'తారంగం తారంగం తాండవ కృష్ణ తారంగం' - తల్లికి ఒకనాడు స్ఫూర్తిదాయకలయితే, అమ్మ లాలిపాటలు బాలచంద్రులకు దిద్దిన భావి కీర్తిచంద్రికలయ్యాయి కాగా పితృస్వామిక

వ్యవస్థలో స్త్రీలలో, విద్యావంతులైన స్త్రీలలో వివాహ వ్యవస్థలో బుగులుకొని రగులుకొంటున్న అసంతృప్తికీ, ఎదుర్కొంటున్న అన్యాయాలకూ ప్రతీకలు నేటి ఈ కవితలు. మన స్వేచ్ఛ కోసం ఇంటికే పరిమితమైపోతున్న జీవిత ఖైదీగా అమ్మను ఆధునిక కవి చూస్తున్నాడు. గోర్కీ 'అమ్మ', బెర్టోల్ట్ బ్రెష్ట్ (జర్మనీ) నాటకాలూ నేటి కవికి స్ఫూర్తి చిత్రాలయ్యాయి. అభిప్రాయ వ్యక్తీకరణలో, 'చేరా' అన్నట్టు వస్తుదర్శనంలోనే విలక్షణమయిన పోకడలు పోతున్నారు నేటి కవులు. వీరు 'అమ్మ'కు చెప్పు నిర్వచనం వేరు. అది సెంటిమెంటును దాటి వ్యవస్థా లోపాలను ఉతికి ఆరవేసే విశిష్ట నిర్వచనంగా రూపొందింది. ఒక కవి ''పగటి జీవన పోరాటానికి రాత్రి భూమిక / అమ్మకు నిండైన నిర్వచనం / పగలు, రాత్రి పరిశ్రమించే ప్రాణ యంత్రం'' అయితే, మరొక కవి దృష్టిలో : ''హృదయంతో ఎవ్వరూ మాట్లాడలేరు/ఒక అమ్మ తప్ప!/హృదయంతో ఎవరూ స్పర్శించలేరు / అమ్మకు అర్థం తెలిసిన వారు తప్ప'', మహాకవి జాషువా ఆనాడు తల్లి ఎవరంటే ఎన్నటికీ 'ఆరిపోని దివ్వె' అన్నాడు! ఆ చైతన్యంతోనే భరతమాతను ఆయన ఆవాహనం చేస్తూ ''సింధు గంగా నదీ జల క్షారమెప్పుడు / కురిసి బిడ్డల పోషించుకొనుచున్న / పచ్చి బాలెంతరాలు మా భరతమాత / మాతలకు మాత, సకల సంపత్సమేత'' అన్నాడు. అలాగే మాతృస్తవంలో పరసీమలు చూపిన నవలాకారుడు వామిని సుబ్రహ్మణ్యంనాయుడు నుంచి నామాడి దాకా 'కన్నీళ్ల చూపుకి కానరాక / వెక్కిళ్ళ పిలుపుకి మారు పలకక / బతికి బావురమనుజ్ఞాపకాలను' తల్లిపరంగా ఒలకబోసుకున్నారు. కోల్పోయిన తల్లి కోసం, దొరకని 'అమ్మ బొమ్మ' కోసం డాక్టర్ నారాయణరెడ్డి పడిన తపనను చిత్రకారుడే కాదు, మనసున్న ప్రతి మనిషీ పంచుకుంటాడు. కవి, గీసే చిత్రకారుడు కాలేక అల్లే పద చిత్రకారుడయ్యాడు. అయితే ''మనసు చట్రంలో పొదుగుకుని / అమ్మరూపం నిలుపుకొంటాను / జన్మ మూలం పదిల పరచుకుంటాను'' అనడంతో పాఠకుడికి ఊరడింపు కలుగుతుంది! 'సినారె' ''అమ్మబొమ్మ''కు అక్షర సత్యంగా సమానమైన కవిత అని చెప్పలేకపోయినా దానికి దాదాపు తుల్యమైన కవిత హిబ్రూ కవయిత్రి లే గోల్డ్ బెర్గ్ (Leah Goldberg) రాసిన "My Mother's House"ను పేర్కొనవచ్చు. "Her daughter would not remember her father / Her portrait inserted in my grand father"s heart../ was expunged from the world of images / After his death / Only her mirror was left! / Today look into it as into / A lake hiding treasures under the water / ...And the Mirror maintains / The family tradition / That she was very beautiful!"

సదా అమ్మై ప్రవహించిన కవితా సెలయేరు 'అమ్మ'!

అంతేగాదు, ఈ సంపుటిలోని అల్లం నారాయణ కవిత (అమ్మ) చదువుతున్నప్పుడు ఆఫ్రికన్ - అమెరికన్ కవయిత్రి జార్జియా డగ్లస్ జాన్సన్ రాసిన "The Heart of a Woman" స్ఫురణకు వస్తుంది. అల్లం కలం ''పొద్దుతో పాటు/ పంట పొలంలో పొడిచే'' అమ్మను చూపిస్తాడు. ''అమ్మా ఆకలే అనడం తప్పు / అమ్మ కడుపులో కాసిన ఎర్రెటెండను పట్టించుకున్నవాడెవడు?'' అని బొడ్లో చేయివేసి ప్రశ్నిస్తూ ''మా అమ్మ వంటింటి గడప మీద శిలువ పడింది'' అని గుండెకోత పెడతాడు! అలాగే కవయిత్రి జాన్సన్ కూడా సీమాంతరాలలో కలాన్ని కదిలించిన తీరు చూడండి :

**"The heart of a woman goes forth with the dawn / As a lone bird, soft winging, so restless by on / After over life"s turrets and vales does it roam / In the wake of those echos the heart calls home / The heart of a woman falls back with the night / And enters some alien cage in its plight / And tries to forget it has dreamed of the stars / While it breaks, breaks, breaks on the sheltering bars"!**

ఇలా ఎన్నో జీవితాలకు పునాది దీపంగా మారిన అమ్మ ''కన్నీటి సరస్సును శాశ్వతంగా మిగిల్చి'' అందని ఏ దూరతీరాలకో వెళ్ళిపోతే మన మనస్సు ఎలా ఉంటుంది? అంతేగాదు, కొందరు కవులు ''నువ్వు తాపిన పాలలో లేని పిరికితనం / నాకెలా వచ్చిందో అర్థం కావడం'' లేదని ఆత్మవిమర్శ చేసుకోవలసి రావడం హర్షించదగిన పరిణామం! అమ్మకున్న అపరిమితమైన ఆత్మశక్తిని, ఓర్పునూ గణిస్తూ డాక్టర్ ఎస్వీ చెప్పిన నిర్వచనం చక్కగా ఉంది. ఇంతకూ ఆమె ఎవరు? నిట్టూర్పులను నిబ్బరంగా మోస్తున్న సముద్రం; ఒడిదుడుకులను ఓపిగ్గా భరిస్తున్న పర్వతం; అనుభవాలతో తలపండిన ముగ్గుబుట్ట; శిలలకు తలబాదుకునే ఓ జలపాతం; చీకటి చప్పరిస్తూన్న ఓ కొవ్వొత్తి; అగ్ని కణాలను గుండెలో దాచుకొని పెదాలపై వెన్నెల కురిపే దయామయి; ఒక్క పిలుపుకే పులకరించిపోయే ఓ మమతల చెట్టు! ఆ తల్లి రక్తమాంసాలు కరిగిస్తుంది, ఆ అమ్మ ''చెమట నదులు దొర్లిస్తుంది''! ఇస్మాయిల్ మరో బరువైన అమ్మ రూపాన్ని కళ్ళకు చూపుతున్నాడు: ''అలల అల్లకల్లోలంపై సాగే తెలి తెరచాప నీచేయి''! ఆశారాజు 'జ్ఞాపకంగా మిగిలిన స్వప్నం' ఓ మంచి భావనా కలశం : చల్లపల్లి స్వరూపారాణి కొత్త ఉపమానలతో అమ్మను కొలిచింది, పితృస్వామిక వ్యవస్థలో ఉన్న పొగరుబోతుతనాన్ని

చూపి, దాన్ని ఎలా అణచవచ్చునో ప్రతీకలతో కవిత్వీకరించింది : ''అమ్మా! అనాటి సూర్పణఖ నుంచి చలమర్తి ముత్తవ్వమీదుగా / సజ్జల గూడెం మహదేవమ్మ వరకు / ఒక్కళ్ళు... ఒక్కళ్లన్నా మాట్లాడారా? /.... నిన్ను తన బాబుగాడి సొమ్ములా వాడుకునే / పెట్టుబడిదారీ పెనిమిటిని / సర్ఫ్‌లో నానబెట్టి పై నుండి కిందికి జాడిద్దాం''. అలాగే ఊరందరికీ బానిసగా ఉండే అయ్యకు అమ్మ బానిస కావడానికి, బానిస కింద బానిస కావడానికీ యువ కవులు ఒప్పుకోవడంలేదు! కొన్ని ముస్లిం కుటుంబాలలో పరిస్థితిని ఖాజా యాకుబ్, జావేద్‌లు శరిస్తున్నారు : ''అమ్మ మెడలో వేలాడే హరియత్ గుదిబండ / ఏనాడూ అమ్మని తలెత్తికానీ / కనీసం కళ్లెత్తి కానీ ఈ లోకాన్ని చూడనివ్వలేదు''! అందరికీ 'ఆదివారం' విశ్రాంతి అయితే, అమ్మ బతుకు ఆ రోజానా అవిశ్రాంత చాకిరీగా మారడాన్ని (రంగనాయకమ్మ చెండాడినట్టే) ఒక కవి ప్రతిఘటిస్తున్నాడు : విశ్వమంతా గాలించి ఎక్కడెక్కడివాళ్ళనో అవార్డులతో కొలిచే మనం / మన మధ్య మహోన్నత శిఖరంలా ఎదిగిపోయిన అమ్మను గుర్తించలేం / అమ్మంటే గృహిణి ముఖం తగిలించిన పనిమనిషైనప్పుడు అమ్మను గుర్తించలేం / పిలిస్తే జలపాతమై దూకే అమ్మలో మనం అలసట హోరు వినలేం / అమ్మకు ఆదివారం లేదు! కనుకనే డాక్టర్ ఎన్.గోపి అన్నట్టు ''అమ్మ రుణం తీరదు / అమ్మకు అమ్మవై పుడితే తప్ప''! ఎందుకని? ఉనికిని మింగినవారిక్కూడా ఉపకారం చేయగల శక్తి ఒక్క అమ్మకే ఉంటుంది కాబట్టి (రజని)! అమ్మ గురించి ఎంత చెప్పినా తరగని చరిత్ర. ఇందులోని అన్ని కవితలూ - అద్భుత ప్రతీకలతో, భావ చిత్రాలతో కూడిన ''మనః ప్రాగల్భ్య నిర్వాహముల్'' అంటే అతిశయోక్తి కాజాలదు. ఇది అమ్మే ప్రవహించిన కవితా సెలయేరు. భైరవ కవి శ్రీరంగమహాత్మ్యంలో చెప్పినట్టుగా ''కలకంఠ మధుర వాగ్వైఖరీ కారణ మహిత సారస్వత మంత్ర విద్య''లన్నీ - ఈ మాతృశ్రీముఖంగా జాలువారవలసిందే. లోకంలో అమ్మ ఉన్నంత కాలం శారదాస్తుతి తప్పదు. ఆ శారద తన అస్తిత్వాన్ని కోల్పోనంతకాలం మన అమ్మా నీడలా మనల్ని వెన్నంటి ఉండకా తప్పదు!

*(ఆదివారం 24, ఆగస్టు 1997)*

# ఫెమినిస్టు కథాసాహిత్యంలో ఓ 'పద్మ'వ్యూహం!

స్త్రీవాదంగాని, స్త్రీవాద సాహిత్యంగానీ ఉబుసుపోక సరదాగా పుట్టుకొచ్చిన ఉద్యమాలూ, ఊకదంపుడూనా? లేక ఆ వాదానికీ, ఆ సాహిత్యానికీ లక్ష్యమూ, గమ్యమూ ఉందా? ఏదీ గాలిలో పుట్టదు, గాలిలో ఎదగదు. ప్రపంచ ప్రసిద్ధ మహిళా ఉద్యమకారిణి, స్త్రీవాద రచయితలలో అగ్రశ్రేణి నవలా రచయిత రెబెక్కా వెస్ట్ ఉద్దేశంలో- ప్రకృతి సిద్ధమైన జననంలో అవ్వగా అవతరించిన ' ఆవిడ' ఆదాముతో సమంగా కాకుండా అసమంగా ఎందుకు ఎదగవలసి వస్తోందన్నది ఎడతెగని ప్రశ్నగా మారింది! స్త్రీ-పురుష సంబంధాలలో పురుషుడి కరుణ భావానికీ, స్త్రీ దయారస గుణానికీ మధ్యచాలా తేడా ఉందని చెప్పింది. ఎందుకని? హేతుబద్ధమైన మైత్రీబంధం ఉభయుల మధ్య సువ్యవస్థితం అయ్యేదాకా, అహంకారపు మంత్రనగరి సరిహద్దులు చెరిగిపోయి ఆలోచన పెరిగేదాకా ఈ ఇరువర్గాల మధ్య మానసికమైన అగాధం పూడవలసినంత వేగంగా పూడదు. మనుషులు చంద్రకాంతిలో మాత్రమే ఈ లోకాన్ని చూస్తుంటారట. ఇది నిండు వెలుగులో జరిపే లోకదర్శనం కాదుకాబట్టి, అది పరిపూర్ణం కాదు! ప్రతి వస్తువును స్థూలంగా చూడ్డమే జరుగుతుందిగాని, వాటి స్వరూప స్వభావాల లోతుపాతులు అంతుచిక్కవు (... **outlines of every object but not the details indicative of their nature)** అంటుంది రెబెక్కా. అలాగే మానవ స్వభావం గురించి ముచ్చటిస్తూ ఆమె మానవ ప్రకృతిని ఇలా నడుచుకోమని గిరిగీసి శాసించలేమనీ, నిరంతర పోరాటం ద్వారానే జీవనసరళిలోని నిమ్నోన్నతాలనూ, ఒడిదుడుకుల్ని సవరించుకొంటూ పోగలమనీ, జీవన సమరంలోని రహస్యమిదే'నని అంటుంది! వంటవార్పులూ, తోమడాలు, కడగడాలు, ఉతకడాలూ లాంటి సంప్రదాయ బంధాలతో స్త్రీని ఇరికించి మగవాళ్ళు శాసనాధికారులవుతున్నారంటుంది. ఎదుటివాడు క్రిమినల్ అయినాసరే తోటి మగవాడు అతని పట్ల మెత్తగానే ఉంటున్నాడనీ, కాని స్త్రీపట్ల కానరాని దార్ఢ్యాన్ని ప్రదర్శిస్తున్నాడనీ అంటుంది. మళ్ళీ అదే ప్రశ్న. ఇది ఉద్యోగ సద్యోగాల్లో రిజర్వేషన్లకు సంబంధించిన 33 శాతం కోటా సమస్య కానేకాదు- జీవిత సమస్య. ఆదాము- అవ్వ

సమంగానే పుట్టినా స్త్రీపట్ల సర్వత్రా ఈ వివక్ష ఎందుకుండాలి అని? స్త్రీవాదాన్ని నిరసించే వారుగానీ, నిప్పులు చెరిగేవారుగానీ ఈ ప్రశ్నకు సమాధానం చెప్పగలిగిన స్థితిలో లేరు. ఎందుకంటే స్త్రీల సమస్యల్ని (శారీరకంగానూ, మానసికంగానూ) గుర్తించి నిర్మొహమాటంతో, నిష్కాపట్యంతో ఆమెకు చేదోడువాదోడుగా అవగాహనతో ఆలోచించడానికి ఆపోజిట్ సెక్స్ సిద్ధంకానంత కాలం ఈ ఘర్షణకు ఆటవిడు ఉండదు. ఇది ఇక్కడే కాదు, ప్రపంచ వ్యాపితంగానే సాగుతున్న చర్చ. ముగింపులేని నిండైన, మెండైన చర్చ. నిజానికి ఇందుకు ఎజెండాను కొందరు అపార్థం చేసుకొనకపోతే అర్థశతాబ్దంనాడే హేతుబద్ధమైన ప్రతిపాదన ద్వారా చలం ముందుకునెట్టాడు. అక్కడ కూడా అతివేలంగా సాగిన చలం ఇతర వాదనలలోకి వెళ్ళకుండానే ఆయన స్త్రీని సవ్యంగా అర్థం చేసుకున్న తీరుకు ఒక ఉదాహరణ: ''స్త్రీకి శరీరం ఉంది, దానికి కసరత్తు కావాలి. ఆవిడకూ మెదడు ఉంది, దానికి విజ్ఞానం కావాలి. ఆమెకూ గుండె, మనస్సు ఉన్నాయి, వాటికి అనుభవం కావాలి'' అన్నాడు చలం! ఇది 'ఆమె' సహచరుడైన 'అతడు' కూడా ఆమెతోపాటు విజ్ఞానవంతుడయితేనే సాధ్యం. కాని అతడు పితృస్వామిక వ్యవస్థను కవచంగా మార్చుకుని ఆమెను అనేక రూపాలలో వేధిస్తూనే ఉన్నాడు. అతడిది నూరు దోషాలలోని ఒక సుగుణం కాగా, ఆమెది నూరు సుగుణాలలోని ఒక దోషం! స్త్రీ-పురుష సంబంధాలలో వస్తున్న మార్పులకు ప్రధాన కారణం వివాహ వ్యవస్థను ప్రపంచ మహిళా ఉద్యమానికి ఆద్యురాలైన ఊల్‌స్టోన్ క్రాఫ్ట్ అన్నట్లు ''**a poor advertisement of a married state**''గా దిగజార్చడమేనని మరవరాదు. మనిషి ఎప్పుడూ కార్యకారణ సంబంధాన్ని గుర్తించి హేతువుకు లొంగిపోవాలిగానీ, మనిషికి లొంగిపోకూడదు.కాని ప్రతిదానికీ లొంగదీసుకొనే ప్రయత్నంలోనే పితృస్వామిక వ్యవస్థ మానవకోటిలో అర్థభాగంగా ఉన్న స్త్రీని 'ఆకాశంలో సగభాగం నీదే'నని గప్పాలు కొడుతున్నా ఆచరణలో అవకాశాలు ఇవ్వకుండా ఈ రోజుకీ జాగ్రత్తపడుతూనే ఉంది. సంసారంలో ఆరళ్ళు, ఆస్తిహక్కు ఆధారంగా చెలరేగుతున్న తగాదాలు, కుటుంబ నియంత్రణలో స్వేచ్ఛారాహిత్యం, అబార్షన్ నుంచి ఆపరేషన్ల దాకా స్త్రీ స్వేచ్ఛకు భంగకరంగానే ఆమె మనస్సును అతడు అతలాకుతలం చేస్తున్నాడు. విశ్రాంతి లేకుండా చేస్తున్నాడు. కట్నాలు, కానుకలే పలుపు తాళ్ళుగా పసుపుతాళ్ళకు ముడిపెట్టి అల్లరి చిల్లరిగా వ్యవహరిస్తున్నాడు. అవసరాన్నిబట్టి ఆధునిక టెక్నాలజీని (గ్యాస్‌స్టవ్) ఆమె ఆత్మాహుతికి అందుబాటులో ఉంచుతున్నాడు. వంటవార్పులతోపాటు పిల్లల పోషణ

బాధ్యతను ఆమె మీదకే నెట్టడం వల్ల, ఆమె తనకు ఆసక్తికరమైన విషయాలపై ( లలిత కళలు, ఉద్యోగాలు వగైరా) మనోవిజ్ఞాన పరిధుల్ని పెంచుకోడానికి లేదా సాంస్కృతిక స్థాయిని కాపాడుకోడానికీ వ్యవధి విరామం లేకుండా ''విధి నిర్ణయం''గా మారుస్తున్నాడు. ఇది తన తప్పిదం కాదని వో(ట్రిస్తున్నాడు, బుకాయిస్తున్నాడు, బెదిరిస్తున్నాడు, అవసరమైతే చేయి చేసుకుని రక్తం కళ్ళ చూస్తున్నాడు. ఆకర్షణకూ, ప్రేమకూ, మోహానికీ, మమతానురాగానికి తేడా తెలియని మూర్ఖులుగా మారి వైవాహిక జీవితంపై స్త్రీలో ఏవగింపు కలిగించే అవకాశం కల్పిస్తున్నారు. సవరించుకొని సజావుగా మైత్రీబంధాన్ని పెంచుకొనే అవకాశాలను కూడా కాలదన్నుకుంటున్నారు. సరిగ్గా- ఈ సమస్యలనే భిన్నదృక్కోణాల నుంచి విభిన్న మనస్తత్వాల ద్వారా స్త్రీ-పురుష సంబంధాలలో పొడసూపుతున్న రకరకాల వికృత కోణాలను ఎత్తిచూపుతూ, వాటిని సవరించడానికి, స్త్రీ విమోచనకూ కథల రూపంలో చేసిన విశిష్ట ప్రయత్నమే స్త్రీవాద రచనగా వెలువడిన కుప్పిలి పద్మ ''ముక్త'' సంపుటి! వస్తు వైవిధ్యంతో ఉన్న ఈ స్త్రీవాద కథలు, రచనా సంవిధానంతోపాటు పేరుకు తగ్గట్టుగానే సంభాషణ నిర్వహణలో కూడా 'ముక్త'సరి పాటించడం విశేషం. ఇంగ్లాండ్‌లో ముప్పయిలలో సాహితీ క్షేత్రంలో ఒక వెలుగు వెలిగి తారాజువ్వలా వయస్సు నడిపొద్దుకు చేరకుండానే రాలిపోయిన యువ కవయిత్రి సిల్వియా ప్లాత్. విశ్రాంతి, ప్రశాంతి లేని జీవన సమరంలో సాంసారికమైన బరువు బాధ్యతలను పురుషుడికన్నా ఎక్కువగా మోస్తూ వంటిల్లే సాంస్కృతిక కేంద్రంగా వర్థిల్లుతున్న వాతావరణంలో స్త్రీకి మనో, వైజ్ఞానిక వికాసం అవసరం ఏమిటో సిల్వియా ప్లాత్ అనేక స్త్రీవాద కవితలలో వినిపించింది! పుట్టడం, పెరగడం, పెళ్ళి, శోభనం, పిల్లలు, ఆరోగ్యం దెబ్బలుతినడాలు, విడాకుల కిందకు మానవ జీవితాన్ని, వివాహ వ్యవస్థను దిగజార్చడాన్ని ప్లాత్ నిరసించినట్టే పద్మ కూడా నిరసిస్తుంది. ఎన్ని ప్రతిబంధకాల మధ్య, మరెన్ని అడ్డుగోడల మధ్య, ఇంకెన్ని లక్ష్మణరేఖల మధ్య సమాజం పురుషునికన్నా స్త్రీనే ఎక్కువగా బంధించిందో ప్లాత్ తెలిపింది. జీవమున్న జీవితం కోసం చేసే ప్రయత్నాన్ని నిర్వీర్యం చేసే కృత్రిమ బంధాలను ఆమె ''the sheath of impossibles'' అంది. గుండె, మనస్సు ఉన్న తను నిండైన అనుభూతి కోసం ఎదురుచూస్తూనే ఆర్థికపరమైన రక్షణ కోసమూ, అవగాహనతో ఆర్ద్రతతో పరస్పరం అర్థం చేసుకొని వ్యవహరించగల శక్తినిచ్చే అనుభవం కోసమూ ప్లాత్ ఎదురుతెన్నులు కాచి ఓడిపోయింది. అందరిలా వివాహం అంటే మోజుపడుతూనే భయపడింది కూడా

వివాహం ద్వారా కూడా అవగాహన వల్ల మమేకతను పెంపొందించుకోవచ్చుననీ, తన తెలివితేటలు అక్కరకు వచ్చే అవకాశాలు మెరుగుకాగలవన్న భరోసా ఆమెకు లభించనందుననే ప్లాత్ భయపడింది. స్త్రీగా పుట్టడమే ఓ విషాదం'గా నిరాశ చెంది ఒక తీర్పు చెప్పిపోయింది. కొందరు మనుషులు ఎలా ఉంటారో శరించిపోయింది: **"Most of the males worship woman as a sex machine and... as a painted doll ("small jewelled doll') who should not have a thought in her pertty head other than cooking a steak dinner and comforting in bed... some pale, hueless flicker of sensitivity is in me, God, must I lose it in cooking scrambled eggs for a man... hearing about life at second hand" ("Journals of Sylvia Plath")**

''ముక్త''లోని పదిహేడు పద్దెనిమిది కథలలో ఇంతకుముందు ప్రస్తావించుకున్న అంశాలతోపాటు, సింగిల్ ఉమన్ జీవితం గడుపుతున్న స్త్రీల సమస్య కూడా ఒక భాగమయింది. ఈరోజే పెళ్ళి, రేపే విడాకుల తంతుగా మారిన వివాహ వ్యవస్థ యువతులలో భీతావహ మనస్తత్వాన్ని ఎందుకు ప్రవేశపెడుతుందో, ఈ అవిశ్రాంత జీవన సమరంలో ఎందుకు దిశలు మారుతున్నాయో, గతులు మారుతున్నాయో పద్మ కథలలో ఆసక్తికరమ్మైన చర్చ జరిగింది. పక్కవాళ్ళు ఎదుటివాళ్ళ జీవితాలలోకి తలకాయల్నేకాదు, శరీరాల్ని కూడా ఎలా దూర్చగలరో, ప్రేమికుల మధ్య బంధాల్ని తెంచగల కట్టుకథల్ని ఎలా అల్లగలరో ఒక కథ వివరిస్తుంది. సొంత ఆస్తిని పెంచుకోవాలనే తహతహలేని, మనసులో **ఇంటివాళ్ళ** గొడవల్లేని జీవితం కోసం తాపత్రయపడిన కల్యాణి-చైతన్యలు మనకు తారసిల్లుతారు. వామనరావు, అనసూయ, ప్రియంవద, ఫణిశర్మలు అనుమాన పిశాచాలై ఇతరుల జీవితాలపై బురద జల్లేబాపతు. స్త్రీ స్వతంత్రంగా సింగిల్ ఉమన్గా బతకడానికి వీల్లేని పరిస్థితుల్ని కల్పించే దుర్మార్గులు ఒకవైపు, స్నేహానికి కొత్త అర్థాలు చెప్పగల కళ్యాణి, వైష్ణవి, అవివాహిత తల్లిగా దుర్గ, మైత్రి, జానకి, విజయ, చైతన్య మరోవైపు నాలుగంచులూ తీరి నిలబడతారు! కొందరు తల్లుల కన్నీళ్ళు, తండ్రుల కాఠిన్యం, అన్నల మూర్ఖత్వం స్త్రీ-పురుష సంబంధాల్ని కదదొక్కలేవనీ, సమస్యలను తీర్చజాలవనీ ఈ కథలు నిరూపిస్తాయి. మగవాడి దార్ఢ్యకం మీద, అహం మీద దెబ్బకొట్టాలేగానీ చెక్కలు మార్చినట్టు అడుగడుగునా 'చేతులు' మార్చే పద్ధతి కూడా సమాజానికి ఎలాంటి చేటు తెచ్చిపెడుతుందో ఈ కథలు సూచనమాత్రంగా హెచ్చరిస్తాయి. అయితే స్త్రీ స్వయం నిర్ణయాధికార హక్కును హరించే హక్కు

ఎవరికీ లేదు, అదే సమయంలో స్వయం పరిధుల్ని ఆమె స్వచ్ఛంద నిర్ణయానికే వదలాలన్నది అంతస్సూత్రం. కట్టుబానిస వ్యవస్థ రద్దుకావాలని ఆశించేవారు ఏ రంగంలోనైనా ఆ వ్యవస్థను ప్రతిఘటించవలసిందే. ఆ పనిని ఇందులో ఒక మహిమ, ఒక మైత్రి, ఒక రేవతి, ఒక వసుధ, ఒక మమత, సరళ, కవిత, ఒక నాగమణి (పాత్రలు)లాంటివాళ్ళు సాధించగలుగుతారు. అలాంటివాళ్ళకు చేయూతనివ్వాలన్నదే ఈ కథా సంపుటం సారాంశం. అక్కరలేని బంధాలు ఎలా నచ్చవో, సంతోషం ఇవ్వని స్నేహాలు కూడా నిలవవన్నది తాత్పర్యం. స్త్రీ-పురుషులు పరాయివారైనా మాట్లాడుకోడమే తప్పనీ, అన్నాచెల్లెళ్ళను కూడా ప్రేమికులుగా భావించి వేధించే రోమియోల ప్రవర్తనకు విద్యావ్యాప్తితో, సాంఘిక బహిష్కరణతోగాని ఆటవిడుపు కాదు. రేయింబవళ్ళు పిల్లల అవసరాల కోసం శ్రమించి, ఒంట్లో సత్తువని కాస్తా కుటుంబానికి ధారపోసి మసిగుడ్డలా చివికిపోయిన అమ్మ కడగండ్లకు నిలువుటద్దం ''మసిగుడ్డ''కథ! అలాగే, వివాహవ్యవస్థకు ప్రత్యామ్నాయం లేనంతమాత్రాన అందులో పాటమరిస్తున్న అనేక సమస్యలకు పరిష్కారం వెతకకుండా కట్టడిచేయడం కూడా ఆధునిక నాగరికతలో సాధ్యపడదని గ్రహించాలి. సానుభూతి, సహానుభూతి మాత్రమే దృష్టిని నిశితం చేయగలుగుతుంది. ఇందుకు ఉదాహరణ అవివాహిత తల్లి సమస్య. ఒక బలవంతపు స్థితిలోనో, లేక బలహీన స్థితిలోనో ఉత్పన్నమయ్యే ఈ సమస్యను మానవీయ దృక్పథంతో మాత్రమే పరిష్కరించాలి. ''కసాయితల్లి'' కథలో ఆ సందేశం స్పష్టం: ''తల్లులు అంటే పెళ్ళి అయినవాళ్ళే కాదని, అవివాహిత తల్లులుంటారని, వాళ్ళని గుర్తించి, వాళ్ళకి ప్రత్యేకమైన సదుపాయాలు అందించాలని ప్రభుత్వాలు శాసనాలు చెయ్యాలి. చట్టాలు తీసుకురావాలి''. అవివాహిత తల్లులు, వారి పిల్లలు భయపడకుండా తలెత్తుకుని బతికే సౌహార్ద వాతావరణాన్ని కల్పించాలన్నది మానవీయ స్పర్శ. అంతేగాదు, ఈ కథలలో కొన్ని కొందరికి వివాదాస్పదంగా కనిపించినా, అభ్యుదయకరమైన సందేశాలు, పాఠాలూ కూడా ఉన్నాయి. పిల్లలను కనలేదని ఒకడు భార్యను విడిచిపెడితే, పిల్లని కనడానికి ఇంకొకడు ఇష్టపడడు. మూడునెలలు తనకన్నా పెద్దదని చెప్పి ప్రేమిస్తున్న ఆడపిల్లని నట్టేట ముంచినవాడు మరొకడు! ఈ గాలి వాతావరణంలో ''ముక్త'' రచయిత్రి కొన్ని విలువైన మౌక్తికాలను అందిస్తోంది: ''రూపంలోనేకాదు, ప్రవర్తనలో జీవన విధానంలో ముద్దొచ్చే సంస్కారం కావాల''ని చెప్పింది. ఎదిగిన ఆలోచనల్లో ''క్యూట్‌నెస్'' ఉండాలిగాని అందంలో, వయస్సులో కాదని హితవు చెప్పింది. విలువల వ్యత్యాసం ఏ

స్థాయిలో ఉందో చూడ్డానికి తెగించి శ్రీధర్ అహాన్ని దెబ్బతీసిన విజయ ఆదర్శమూర్తిగా అవతరించింది. అంతేగాదు, స్త్రీ సమస్యలను తోటి స్త్రీ మాత్రమే అర్థం చేసుకోగలదని నిరూపించిన విజయ చెప్పిన మాటలు తరాల అంతరాన్ని మరచిపోయే శ్రీధర్ లాంటివారికి ఓ సవాలు: ''పురిటికి పుట్టింటికి వెళ్ళినప్పుడల్లా మీరు నన్ను మిస్ అవుతున్నానని గోల చేయలేదా? ఈ రోజుకి కూడా మీకు అన్ని సుఖాలూ కావాలికాని, అవేవీ జానకికి అక్కరలేదా?'' అని నిలదీసింది. కాపలాల వల్ల కాపురాలు నిలబడవనీ, సదవగాహన వల్ల అందుకు తగిన వాతావరణాన్ని కల్పించడం వల్లనే అనుబంధాలు, అనురాగాలూ అసలు తొడిగి కొనలు సాగుతాయనీ తెలుసుకోవాలి. కనుకనే ఊల్‌స్టోన్ క్రాఫ్ట్ (ఫ్రెంచి విప్లవ ప్రభావంతో దూసుకువచ్చిన తొలి స్త్రీవాది) సహేతుకమైన ప్రేమనీ, వాత్సల్యాన్నీ, స్నేహాన్నీ స్త్రీపురుషుల మధ్య ఆశించి ప్రచారం చేసింది. బానిస సంబంధాలు భార్యా భర్తల మధ్య పనికిరావని చెప్పింది. సొంత చెల్లెలికి రెండుసార్లు వివాహాల ద్వారా జరిగిన అన్యాయాన్ని కళ్ళారా చూసింది. దేశదేశాల స్త్రీల కథలూ, గాథలూ తెలుసుకున్న తర్వాతనే ''విండికేషన్'' అనే విశిష్ట మానిఫెస్టో ప్రకటించింది. హేతుబద్ధమైన ప్రవర్తనకు, పరస్పర మైత్రికీ పురుషులు సిద్ధపడిననాడు ఎలాంటి మార్పు వస్తుందో చక్కగా హితవు చెప్పింది. అప్పుడు స్త్రీలు మరింత నమ్మదగిన కూతుళ్ళుగా, మరింత ప్రేమానురాగాలతో వ్యవహరించే తోబుట్టువులుగా, అత్యంత విశ్వసనీయమైన భార్యలుగా, మరింత హేతుబద్ధమైన తల్లులుగానే పురుషులు చూడగలుగుతారు. నిజమైన అనురాగంతోనే పురుషుల్ని ప్రేమిస్తాం. ఎందుకంటే- మనల్ని మనం పరస్పరం గౌరవించుకోవడం నేర్చుకోవాలి గనుక! అంతవరకూ కనురెప్పలు కాపలా కాస్తూనే ఉంటాయి, ఆత్మ రక్షణ మార్గాలు వెతుక్కుంటూనే ఉంటాయి! కవయిత్రి ప్లాత్ అనలేదూ- స్త్రీ ఆటబొమ్మగాదు, సింగారాల అంగార వల్లరీ కాదు, పులి, ఆడపులి, బెబ్బులి అని! ("I shall unloose/ From the small jeweled/ Doll he guards like a heart/ The liones,/ The shriek in the bath,/ The cloak of holes"!

*(ఆదివారం 31, ఆగస్టు 1997)*

# అలుపెరుగని ఆందోళనా గీతం 'అరుణ'

''మహోద్యమాలకు, మహావిప్లవాలకు కర్తలందరూ వీరుల సంప్రదాయానికి వారసులే. దురదృష్టవశాత్తూ ఈ ఉత్తమ సంప్రదాయాలను, ఉద్యమ ఉద్ధతినీ కాపాడుకోలేని తరంకూడా ఒకటి తరచుగా పుట్టుకొస్తూంటుంది. అలాగే అప్పుడప్పుడూ ఉద్యమాలలో పతన దశకూడా ఉంటుంది. బహుశా చారిత్రికంగా ఈ పరిణామం అనివార్యమేమో, నాకు తెలియదు. కాకపోతే ఏమిటి చెప్పండి- దేశ స్వాతంత్ర్యోద్యమ దినాలలో మన నాయకులు మన మనస్సుల్లో నిలిపిన స్వేచ్ఛా భారత సుందర స్వరూపమెక్కడ? స్వాతంత్ర్యానంతరం కడచిన దశాబ్దాలు మన కళ్ళముందు పరుస్తున్న పరిస్థితులెక్కడ? ఈ రెండు దశలకూ మధ్య గుణాత్మకంగానే ఎంత వ్యత్యాసం ఉంది! ఈ పరిస్థితులలో భారతదేశ సాంఘిక, రాజకీయ జీవితం ఉత్తమ విలువలకూ, ఉత్తమ సంప్రదాయాలకు దూరం కాకుండా రక్షించుకోవలసిన అవసరం ఉంది''. ఈ మాటలు మరెవరివో కావు, సోమవారం నాడు అస్తమించిన భారత జాతీయోద్యమ ప్రియ పుత్రికలలో ఒకరైన అరుణా అసఫాలీ చెప్పినవి. 1989లో అబ్దుల్ కలామ్ అజాద్ స్మారకోపన్యాసం యిస్తూ అరుణ అన్న మాటలివి. దేశ స్వాతంత్ర్యోద్యమంతో పెనవేసుకొని ఎదిగివచ్చి, జీవితాన్ని ప్రజాసేవకు అంకితం చేసుకొని కట్టకడపటి దాకా మచ్చలేకుండా తరతరాలకూ గర్వకారణంగా నిలిచిన కొసమెరుపులలో అరుణ ఒకరు! ఆమె కార్యరంగాలు ఒకటా, రెండా! సాంఘిక, రాజకీయ, ఆర్థిక, సాహిత్య, పత్రికారంగాలన్నీ 'అరుణ'కాంతులు వెదజల్లినవే. వీరనారిగా, రాజకీయ కార్యకర్తగా, మహిళా ఉద్యమ నాయకురాలిగా, సంఘసేవికగా, నాయకుల మధ్య విశ్వసనీయ సంధానకర్తగా, రచయితగా, ప్రచురణకర్తగా అరుణ మెట్టిన, చేపట్టిన ప్రతీ రంగమూ ఉత్సాహ పూరితం, ఉద్వేగభరితం. కాంగ్రెస్‌వాదిగా, తరువాత సోషలిస్టుగా, కమ్యూనిస్టుగా, చివరికి విశ్వమానవతావాదిగా, అలుపెరుగని ఆందోళనా గీతంగా అరుణ జీవితం ఝరీ వేగంతో దూసుకుపోయిన జలపాతం. ఇది వాస్తవంకాకపోతే, ఈ ఆందోళనా గీతం ఆగిపోకముందు- స్వాతంత్ర్య సమరం మధ్యలో, ముఖ్యంగా 1942 ఆగస్టు ఉద్యమ

(క్విట్ ఇండియా) కాలంలో తాను ఆదర్శమూర్తిగా అభిమానించే గాంధీజీ ఆదేశాన్ని సహితం తిరస్కరించి ఉండేది కాదు. గాంధీ- ఇర్విన్ ఒప్పందం విప్లవయోధుడైన భగత్సింగ్ మెడకు ఉరితాడు తగిలించినప్పుడు యావద్భారతం అట్టుడికిపోతున్న రోజులవి. జవాహర్‌లాల్ నెహ్రూ సహా పెక్కుమంది కాంగ్రెస్ యువకులు గాంధీ- ఇర్విన్ సంధిని వ్యతిరేకిస్తూ నినద శంఖాలు పూరిస్తున్న ఘడియలవి. ఆ సమయంలో అజ్ఞాతవాసంలో ఉన్న అరుణను ఆరోగ్యం పేరు చెప్పి బ్రిటిష్‌వాడికి లొంగిపొమ్మని నూరిపోయడానికి ప్రయత్నించిన గాంధీమాట చెవిని పెట్టని పెంకి ఘటం అరుణ! ఆమెను పట్టి అప్పగించినవారికి బహుమానం ప్రకటించిన బ్రిటిష్ వాడికి లొంగిపోతే, ఆ డబ్బును హరిజనోద్ధరణకు జమకట్టవచ్చని గాంధీ ఇచ్చిన సలహాను పక్కకునెట్టి ఉద్యమ విలువలను కాపాడిన వీరవనిత, ధీర చరిత అరుణ! అంతమాత్రాన, గాంధీలోని ఇతర సద్గుణాలకు ఆమె వారసురాలు కాకుండాపోలేదు. ఆ మాటకొస్తే ఉద్యమకారిణి, విప్లవమూర్తీ, సంస్కర్తా- ముగ్గురూ చివరిదాకా అరుణలోనే జీవిస్తూ వచ్చారు. నిరంతరం ఆశాజీవిగా, ఆదర్శమూర్తిగా, సెక్యులర్ శక్తిగా, ప్రజాస్వామ్య వాదిగా, సోషలిస్టుగా ఆమె జీవితాన్ని దశలవారిగా దిద్దితీర్చడానికి తోడునీడలుగా ఉన్న ఘట్టాలు ఎన్నో, ఎన్నెన్నో. జాతీయ సమైక్యతా మండలి విశిష్ట సభ్యురాలిగా, కార్మికోద్యమ నాయకురాలిగా, మహిళల్లో వయోజన విద్యావ్యాప్తికి, 'బాలికా ఫౌండేషన్' నిర్మాణ కార్యక్రమానికి అగ్రగామిగా, పేదసాదల ప్రాథమిక ఆరోగ్య రక్షణకు ఉద్దీపనశక్తిగా, భారత మహిళా సమాఖ్య అధ్యక్షురాలుగా, పీడకలగా మారిన దేశవిభజన దశలో కాందిశీకుల పునరావాస పథకాలను అమలుజరిపే ఐక్యరాజ్యసమితి విద్యాసాంస్కృతిక సంఘంలో భారత ప్రతినిధిగా అరుణ అందించిన సేవలు- అందరికీ శిరోధార్యాలు! ఆమెకు ఈ ''ఏనుగు బలం'' ఎక్కడి నుంచి వచ్చింది? ఆ శక్తి గాలినుంచి పుట్టుకురాలేదు. బ్రహ్మసమాజభావాల నుంచీ, ఫ్రెంచి విప్లవ సంప్రదాయాల నుంచీ, జాతీయ కాంగ్రెస్ తొల్లింటి అనుభవాలనుంచీ, ప్రపంచ సోషలిస్టు ఉద్యమాల నుంచీ, విశ్వకవి టాగోర్ విశ్వజనీనత నుంచీ విభిన్న పాయలుగా సాగిన జాతీయోద్యమం నుంచీ, రాడికల్ భావాలనుంచీ ఈ శక్తి ఆమెను ఆవహించింది. కుల, మతాలకు దూరంగా, విజ్ఞాన శాస్త్ర ప్రపంచానికి హితంగా, సెక్యులర్ భావాలకు సన్నిహితంగా ఉండడంవల్లనే అరుణకు ఈ ధైర్య, స్థైర్యాలు అబ్బాయి కనుకనే ఆమె భారత ప్రజలను కూలాలకు అతీతంగా, స్త్రీ పురుష వివక్షకు దూరంగా సమీకరించడానికి, సమతా సమాజాన్ని ఆవిష్కరించడానికి తనవంతు

బాధ్యతను నిర్వహించింది. స్వాతంత్ర్యానంతరం దేశంలో వచ్చిన కొన్ని పరిణామాలు, రాజకీయాలలో ప్రబలిన స్వార్థ చింతన, పరిపాలనా రంగంలో అవినీతి, అధికార గణాలలో పెచ్చుమీరిన అహంకారం అరుణలో మనస్తాపం కలిగించాయి. ఆమె పదవుల్ని కాలదన్నిన వ్యక్తి. అందరి పట్టుదల మీద ఢిల్లీ మేయర్ అయి, పౌర పాలనలో కొన్ని ప్రధాన సంస్కరణలకు శ్రీకారం చుట్టగలిగినా, బురాక్రసీ అడ్డుగోడలను ఛేదించలేక మేయర్ పదవిని విడిచిపెట్టింది. ఒక్కసారి బురాక్రసీ బంధాలు తెగతెంచుకున్న అరుణ మళ్ళీ అధికార 'మంత్రనగరి' పరిహద్దుల్ని ఆఖరిశ్వాస విడిచే దాకా తాకలేదు! సైన్స్, సోషలిజం, విశ్వమానవత- ఈ మూడింటినీ ఆమె జీవితాంతం ఆదర్శాలుగా ప్రకటించుకుంది. గాంధీ రామరాజ్య ఆదర్శం, అజాద్ ఇస్లామ్, నెహ్రూ ప్రజాస్వామిక సోషలిజం- ఈ మూడింటినీ ఆచరణ సాధ్యం చేసుకుంటే నవభారత యాత్ర సుఖాంతం కాగలుగుతుందని అరుణ ఆశ. ఈ దేశంలో ఒక్క సంపన్న వర్గాల మహిళలను మినహాయిస్తే ప్రజాబాహుళ్యంలో హెచ్చుమంది మహిళలు విద్యాగంధానికి ఇప్పటికీ దూరంగా ఉన్నారన్న వేదన ఆమెలో చివరిదాకా ఉంది. జనాభా నియంత్రణకు విద్య అవసరమనీ, సార్వత్రిక విద్యావ్యాప్తి జరిగేదాకా జీవన ప్రమాణాలు పెరిగేదాకా ''చిన్న కుటుంబం చింతలు లేని సంసారం'' అన్న ప్రమాణం అందరి మన్ననలూ పొందజాలదని కూడా అరుణ అభిప్రాయపడేవారు.

అంతేగాదు, భారతదేశం భౌతికావసరాలు తీర్చుకోవడంలో ప్రగతి సాధనకు నైతిక విలువలను కూడా జోడిస్తే తప్ప ప్రజా బాహుళ్యం స్థితిగతులను మెరుగుపరచలేమనీ, ఇందుకు రాజకీయవేత్తలు ఆదర్శమూర్తులుగా వ్యవహరించాలనీ అరుణ ఆవేదన. వేర్పాటువాదులు సాంఘిక అశాంతిని ఆసరా చేసుకుని ఆగడాలు సృష్టించకుండా, నైతిక విలువలు ఆధారంగా ప్రజలనూ, యువతరాన్నీ రక్షించుకోవడమే నేడు దేశం ముందున్న సవాలుగా ఆమె భావిస్తూ వచ్చారు. నైతిక సూత్రాలు అన్ని మతాలకూ ప్రాథమిక ధర్మాలుగానే ఉన్నందున విద్యాలయాలలో విశ్వమానవతా సూత్రమొక్కటే బోధనకు అర్హమని అరుణ చాటి చెప్పింది ఈ దృష్ట్యానే ఆమె ''బేసిక్ విద్యావిధానా''నికి గాంధీ రూపొందించిన వార్ధా స్కీమును మెచ్చుకుంది నాగరికతా చరిత్రలో మానవతా దృక్పథాన్ని పెంచిపోషించడంలో మార్క్సిజం, సోషలిస్టు భావజాలం సహా అన్నిరకాల అభ్యుదయ పాయలూ, శాస్త్ర విజ్ఞాన సాంకేతిక ప్రగతిలో కలగలిసి ఒక మహాస్రవంతిగా ముందుకు సాగాలన్నది ఆమె తాపత్రయం. అంతేగాదు,

దారిద్ర్యభారాన్ని మరిచిపోయేందుకు మతం మత్తుమందును తలకెక్కించుకోవాలని గాంధీజీ ఎన్నడూ శ్రమజీవుల్ని కోరలేదని చెబుతూ, ''పేదవాళ్ళకు ఆర్థికమే ఆధ్యాత్మికం'' అని గాంధీ అన్నారనీ ''దేవుడంటే రొట్టెముక్క'' అనీ అరుణ బోధించింది. పనిపాట్ల ద్వారానే తిండి అమరాలనీ, జీవనోపాధికి మరోమార్గం లేదనీ చెప్పి, కష్టించి పనిచేసే వర్క్ కల్చర్‌ను సామాజికులకు అబ్బించేదాకా, శ్రమను గౌరవించే దాకా మానవుడికి నిజమైన విముక్తి లభించదని చెప్పింది. శ్రమైక జీవన సౌందర్యానికి సమానమైనది లేనేలేదని శ్రీశ్రీతోపాటు గొంతు కలిపిన మహిళ అరుణా అసఫాలీ! సైన్స్ ప్రయోజనం సర్వులకూ పనీ, రొట్టె అందినప్పుడు మాత్రమే తెలిసివస్తుంది. సైన్స్‌నూ, సోషలిజాన్నీ మానవతా దృక్పథమే శాసించగలదని అరుణ విశ్వాసం. విభిన్న తాల మధ్య సమన్వయ సాధన సౌహార్దంతో, సౌభ్రాతృత్వంతో సాధ్యమని భావించిన అరుణకు విశ్వమానవతలో తొలి పాఠాలన్నీ రామమోహన్‌రాయ్, వివేకానందల అజ్ఞాత గురుత్వం నుంచే లభించాయని చెప్పాలి; బైబిల్, ఖురాన్, గీత సారాంశం, ఉపనిషత్తులు, సూఫీ కవుల అరబిక్ కవితా ఖండికల మధ్య భావ సారూప్యాన్ని గమనించిన అబుల్ కలామ్ అజాద్ బోధలు కూడా అరుణ తాత్త్విక చింతనను తీర్చిదిద్దాయి. కేవలం భోజన ప్రియుల తిండిపోతు నాగరికతలను పెంచిపోషిస్తున్న ఆధునిక ''కన్స్యూమరిజా''న్ని ఆమె ఈసడించుకొంది. సమాజం దైన్యస్థితినీ, ప్రజాబాహుళ్యం దారిద్ర్య స్థితినీ గమనించనివ్వకుండా ఇది కళ్ళు కప్పుతోందనీ అరుణ నిశిత విమర్శ. విలాసవస్తువుల, కులాసా సర్వీసుల గురించిన వ్యాపార ప్రకటనల ద్వారా మైనారిటీగా ఉన్న కొలదిమంది సంపన్నులు ఈ తిండిపోతు సంస్కృతిని వస్తువ్యామోహాన్నీ వ్యాప్తిచేస్తున్నారనీ, తిండిలేకపోయినా విలాసవస్తువులపై మోజు, 'ఆబ' సమాజంలోని కింది వర్గాలలో కూడా చొచ్చుకుపోయి పతనావస్థకు దారి తీస్తోందనీ అరుణ ఎంతో బాధను వ్యక్తంచేశారు. ఆమె వర్ణించిన ఈ పరిస్థితి- ''మింగ మెతుకులేదు, మీసాలకు సంపెంగనూనె'' అన్న సామెతను గుర్తుచేస్తోంది! ఈ ఉత్తమ విలువలను పుణికి పుచ్చుకున్న విదుషీమణి అరుణ తొలి రాజ్యాంగ నిర్ణయసభలో నరేంద్రదేవ్, లోహియా, కమలాదేవి, అచ్యుత్ పట్వర్ధన్‌లతో పాటు సభ్యురాలుగా ఉండాలని నెహ్రూకు ప్రతిపాదించినవాడు జయప్రకాశ్ నారాయణ్. అరుణ రాసిన ''ట్రావెల్‌టాక్'' (1947) అన్న పుస్తకానికి పండిట్ నెహ్రూ ముందుమాటలో చెప్పినట్టుగా ''అరుణ నిద్రావస్థలో ఉన్న అనేకమందిని కుదిపి లేపి చేతనావస్థలోకి తీసుకువచ్చిన మహిళా మూర్తీ, మారుతున్న కాలానికి వేయి విధాల ప్రతీకగా నిలిచిన సజీవ చిత్రమూ ఆమెకు

ఆదర్శం ఉంది, అందుకోసం నిలబడగల శక్తి ఉంది. నిజమైన వీరులు, సమరశీల శక్తులూ కొద్దిమందే ఉంటారు. వారిలో ఒకరు అరుణ''. అలాంటి అరుణ అసఫాలీకి ఆంధ్రప్రదేశ్‌తో కూడా విడదీయరాని ఆత్మీయతా బంధాలున్నాయి. హైదరాబాద్ సంస్థాన ఉద్యమ చరిత్రలో సోషలిస్టు పార్టీ నెలకొల్పిన ''హైదరాబాద్ పోరాట సమితి''కి అరుణ ఛైర్మన్. హైదరాబాద్ స్టేట్ ఆత్మరక్షణ హక్కు గ్రామాలకు ఉందని సోషలిస్టులు భావించారు. అందుకు ఆయుధాలు కావాలని అరుణ, ఆమె సహచరులు ప్రతిపాదించగా నెహ్రూ అంగీకరించలేదు. అది వేరు చరిత్ర- ఇది అరుణ చరిత్ర!

*(బుధవారం 31, జులై 1996)*

# చిత్ర, సాహిత్య షావుకారు -
# చందమామ చక్రపాణి!

''అప్పుడు పుట్టి ఉంటే...''! బాగానే ఉంటుంది మరి. పులకరించే కొన్ని పురా చరితలను పఠించే ఈనాటి మానవుడు ప్రతి పుటకూ ఆనాటి సన్నివేశాలతో, ఉత్సాహభరితమైన సంఘటనలతో ఉత్కంఠతో తానూ పాలుపంచుకోవాలన్న తహతహకొద్దీ 'నేనూ అప్పుడు పుట్టి ఉంటే' అని ఊహించుకొని ఉవ్విళ్ళూరుతుంటాడు. అలాంటి ఒక సన్నివేశాన్ని, కృష్ణదేవరాయలు కవి దిగ్గజాలతో నిర్వహించిన భువన విజయాన్ని తలపునకొచ్చినదే తడవుగా దేవులపల్లి కృష్ణశాస్త్రి మనోమందిరంలో తళుక్కున మెరిసిన ఆలోచన, కోరికే- ''అప్పుడు పుట్టి ఉంటే...'' అన్న రచనకు దారితీసింది! అలాగే భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవాలు ప్రారంభమవుతున్న సమయంలో తెలుగునాట ఈ రోజున రెండు రకాల స్వర్ణోత్సవాలు కూడా జరుగుతున్నాయి. ఒకటి ముక్కు పచ్చలారని ముద్దుబిడ్డలను యాభై ఏళ్ళుగా ఆశీర్వదించి అలరిస్తున్న ''చందమామ'' పత్రిక స్వర్ణోత్సవం కాగా, వేరొకటి పిల్లల వికాసమే జాతి సౌభాగ్యంగా భావించి ఆదర్శాన్ని ఆచరణ సాధ్యం చేసుకున్న ''రామా రూరల్ కళాశాల'' (గురుకులం) స్వర్ణోత్సవం! ''అచట పుట్టిన చిగురు కొమ్మైన చేవ''గలదని అల్లసాని వాడు ఎందుకన్నాడోగాని తెనాలి గడ్డ సరసతకూ, రసగ్రహ పారీణతకూ, రచనా సౌభాగ్యానికీ, తేకువకూ, తెగింపునకూ చానాళ్ళు చలువ పందిళ్ళు వేసింది. తెనాలి పేరు చెబితే తరాలు కదిలివస్తాయి. ఆ గడ్డ నుంచి ప్రభవిల్లినవారే త్రిపురనేని రామస్వామి, చలం, రావూరి భరద్వాజ, గోపీచంద్, కొడవటిగంటి కుటుంబరావు, ధనికొండ హనుమంతరావు, జలసూత్రం, జి.వి.కృష్ణారావు, ఆవుల గోపాలకృష్ణమూర్తి. ఈ కోవలోనివాడే, ఆ తెనాలి 'తాను'లోనివాడే మన చక్రపాణీనూ. చక్రపాణి ''చందమామ'' స్వర్ణోత్సవాన్ని పురస్కరించుకొని ఆయన 90వ జయంతి సందర్భంగా చక్రపాణి- కొలసాని ఫౌండేషన్ తరపున డాక్టర్ వెలగా వెంకటప్పయ్య సంకలనకర్తగా చక్రపాణి స్మృతి సంపుటిగా ప్రచురించిన పుస్తకం ''చక్రపాణీయం'' మూడున్నర దశాబ్దాలపాటు అటు సాహిత్య రంగానికి, పాతికేళ్ళపాటు

## చిత్ర, సాహిత్య షావుకారు - చందమామ చక్రపాణి!

ఇటు చలన చిత్రరంగానికి విశిష్ట సేవలందించి తెలుగువారి మనస్సుల్లో అమరజీవిగా మరపురాని మనీషిగా నిలిచిపోయినవాడు చక్రపాణి. రచయితగా, కథకుడుగా, చలనచిత్ర కథకుడుగా, అనువాదకుడుగా, సంపాదకుడుగా, చలనచిత్ర నిర్మాతగా, బహుముఖ ప్రజ్ఞను దశదిశలా చాటుకున్న వ్యక్తి ఆయన. సుప్రసిద్ధ రష్యన్ తాత్త్వికుడు పావెల్ గ్రెకోవ్ మానవ జీవితానికి కొత్త నిర్వచనం ఇస్తూ ఇలా అన్నాడు: ''మానవుడి జీవితం అతను ఏ కాలంలో జీవిస్తున్నాడో ఆ కాలంతోనే ముడిపడి ఉంటుంది. అది వెయ్యేళ్ళు కావొచ్చు, వందేళ్ళు కావచ్చు, ఒక్క సంవత్సరమే కావచ్చు- అలా అతని జీవితం కాలంతోనే పెనవేసుకొని ఉంటుంది. రాగద్వేషాలతో, జయాపజయాలతో, ఫలించిన కలలతో, ఫలించని స్వప్న ఘట్టాలతో కూడిన మానవ జీవిత చరమదశకు సంకేతమే సమాధి! బతికున్న రోజుల్లో అభివ్యక్తమయ్యే మానవుడి వ్యక్తిత్వం- మానవజాతి పరిణామ చిత్రాన్ని ఎప్పటికప్పుడు దిద్దితీర్చే అదనపు కుంచె మెరుగులతో దీపిస్తోంటుంది. తన జీవితకాలంలో చూసే నిమ్నోన్నతాలన్నింటికీ ప్రతి వ్యక్తీ ఒక కొలమానమే. అంటే- ఈ మానవుడు '' సర్వలక్షణసార సంగ్రహం'' **(Man is the Measure of All Things": Philosophical dialogues)!** అలాంటి మనిషి చక్రపాణి. అందుకే ఆరుద్ర ఆయనను ''చిత్ర సాహిత్య షావుకార''ని అభివర్ణించి ఉంటాడు! ఆయన నేతృత్వంలో, సంపాదకత్వంలో సాగిన అయిదు పక్ష, మాస పత్రికలలో ఆయన మూర్తిని చిరంజీవం చేసినవి ప్రధానంగా '' ఆంధ్రజ్యోతి'', ''చందమామ'', ''యువ'' అయితే అన్నింటికీ తలమానికం పిల్లల కోసం మేధస్సును రంగరించి నవనీతంలా కథా సరిత్సాగరంలో చిన్నారులను ఈదులాడించిన పత్రికా రాజం ''చందమామ''. ఇది నేడు పన్నెండు భాషలలో ప్రచురితమవుతూన్న బాల కథా విజ్ఞాన వేదిక. నాగిరెడ్డిగారితో కలిసి చేసిన ఈ సంయుక్త విన్యాసం క్రమంగా చలన చిత్ర రంగంలో కూడా ''విజయా'' పిక్చర్స్ అధినేతలుగా చక్రపాణి- నాగిరెడ్డిగా ఎన్నో ఏళ్ళు కలిసిమెలిసి, కలివిడిగా పనిచేసేవారు. రొడ్డకొట్టుడు చదువులు అబ్బకపోయినా, ఆసక్తికొలదీ సొంత అధ్యయనంతో, పట్టుదలతో, దీక్షతో, నిశిత వీక్షణతో పరిస్థితుల అవగాహనతో పరిసరాల పరిశీలనతో ఎదిగివచ్చిన సామాన్య రైతు కుటుంబీకుడు చక్రపాణి. లోక వ్యవహారాన్ని పరిశీలించడంలో, లోకవృత్తాన్ని తెలుసుకోవడంలో పల్లెపట్టుల్లోని సామాన్య రైతుకు ఉండే నిష్కాపట్యం, నిర్మొహమాటం ఆయని సొత్తు. సామాన్యుడు చక్రపాణి దృష్టి నుంచి ఏనాడూ తప్పుకోలేదు, అలాగే సామాన్యుడి దృష్టినుంచీ చక్రపాణి తొలగలేదు!

న(మత, చేసిన తప్పులను ఒప్పుకోవడం, పొరపాటు జరిగితే నిర్మొహమాటంగా తానుగా అంగీకరించడం, కరుణతోపాటు అవసరాన్నిబట్టి కరకుగా వ్యవహరించడం, తన అభి(ప్రాయాలను ఇతరుల మెరమెచ్చులకోసం మార్చుకోవడానికి 'ససేమిరా' అనడం, మిన్ను విరిగి మీదపడినా చలించని మొండితనం- ఆయన వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దిన అనితర సాధ్యమైన లక్షణాలుగా చెప్పుకోవచ్చు. కళాశాల చదువులు లేకపోతేనేం? నాల్గైదు భాషల్లో (ప్రావీణ్యం పొందడం అతని పట్టుదలకేగాదు, (క్రమశిక్షణకూ, వ(జదీక్షకూ నిదర్శనం. 'సుయ్' అంటే రోకటిపోటని పసిగట్టగల ఇంగితజ్ఞానం, లౌకిక విజ్ఞానం మెండుగా ఉన్న చ(క్రపాణి సృజనాత్మకత మూర్తీభవించిన వ్యక్తి కూడా. జాన్ స్టూవర్ట్ మిల్ అన్నట్లు ఒక్కొక్కప్పుడు సమష్టి శక్తితో మానవుడు సాధించలేని విజయాలను అద్భుత సృజన శక్తిగల వ్యక్తి సాధించగల అవకాశాన్ని కూడా కాదనలేం! అయితే ఈ శక్తి సాధనవల్ల కాని సాధ్యపడదు. అందుకే జాన్ పోప్ అంటాడు: (క్రమశిక్షణ, చైతన్యదీప్తి సృజనశక్తుల్ని ఉద్దీపింపచేస్తాయి ("Discipli ne and focussed awareness contributes to the art of creation")! నిర్వహణ శక్తికి అవసరమైన ఈ గుణగణాలే ఆయని చేతిలోకి ఎదిగివచ్చిన ''చందమామ'' జాతీయ స్థాయి పురస్కారానికి అర్హత పొందింది. అందులోని కథా విధానం, రచనాతీరూ, విషయాల ఎంపిక మూఢవిశ్వాసాల రూపంలో కాకుండా పిల్లల మనస్సులను గిలిగింతలు పెట్టే 'ఫాంటసీస్' రూపంలో పిల్లలనేగాక పెద్దవాళ్ళనూ ఆకర్షిస్తూ వచ్చాయి. విశ్వనాథ సహితం 'చందమామ' కోసం మార్కెట్‌కు ఎగబడేవాడంటే పిల్లలతోపాటు పెద్దవాళ్ళు కూడా ఎలా దానిని అక్కున చేర్చుకుంటారో అర్థమవుతుంది. చందమామను ఈ స్థాయికి చేర్చడంలో కుటుంబరావు కృషిని కూడా మరవలేం. నీషే చెప్పినట్లు నిర్మలమైన మనస్సుతో ఉండే (ప్రతీ మనిషిలోనూ ఓ బుడతడు దాక్కొనే ఉంటాడు, ఆడుకోడానికి ఉవ్విళ్ళూరుతూ ఉంటాడు ("In every real man a child is hidden that wants to play")! చ(క్రపాణి చందమామను అలా దిద్దాడు. ఆధునిక భావాలు, అభ్యుదయ భావాల వ్యాప్తి చ(క్రపాణి-నాగిరెడ్డిల నాయకత్వాన నడిచిన ప(త్రికలకు, (ప్రచురణలకు, వారు సంయుక్తంగా తీసిన చలన చి(త్రాలకు ఊపిరిపోశాయి. కులాతీతంగా, మతాతీతంగా లౌకిక భారతానికి తోడునీడగా చ(క్రపాణి చి(త్రాలు నిర్మించాడు. యువకుల మనోభావాలకు దగ్గరయ్యాడు. జీవితంలోని ఇం(ద్రధనస్సులు చూపించాడు. వెలుగునీడలు వెల్లడిచేశాడు. చమత్కారాన్ని, హాస్యాన్నీ పోషించాడు సామాజికుల అభిరుచులు ఆయనకు తెలుసు. (ప్రేక్షకుల

మనోభావాలనుబట్టి, వారి స్పందనను బట్టి చిత్రాలు తీయడమేగాదు, పిల్లల అభిప్రాయాలను బట్టి తన చలనచిత్రాల్ని ప్రామాణీకరించుకోవాలన్న పెద్ద మనసు ఉన్నవాడు చక్రపాణి!

''విజయా ప్రొడక్షన్స్'' సారథ్యంలో 1950లలో గొప్ప చిత్రాలు రావడానికి, ప్రేక్షకులు వాటిని అభిమానించడానికి కారణం చక్రపాణి ఆశయ ఆదర్శాలూ, నిర్మాణ దక్షతే. పెక్కింటికి ఆయన మాటగాడు, పాటగాడూ. రాసిన మాటలూ, పాటలూ తేనెల ఊటలై ముత్యాల మూటలుగా ప్రేక్షకులను మురిపించాయి. ఒక్క 'చంద్రహారం' చిత్రం తప్ప ఆయన షావుకారు, పాతాళభైరవి, మిస్సమ్మ, పెళ్ళిచేసిచూడు, గుండమ్మకథ, స్వర్గసీమ, అప్పుచేసి పప్పుకూడు, జగదేకవీరుడు చిత్రాలు ప్రేక్షకులు మరచిపోలేనివి. శంకరమంచి జానకి జీవితాంతం 'షావుకారి' జానకిగా స్థిరపడిపోవడమే ఇందుకు నిదర్శనం! కృష్ణశాస్త్రి ఒక సందర్భంలో అన్నట్టుగా ''గొంతు పాడితే చాలా?/ గుండెలో రాగం ఉండాలి/ మాటలాడగానే సరా?/ మనసులో నిజం పలకాలి''! అలా గుండెలో రాగాలు తీయించినవాడూ, మనసులో నిజాలు పలికించినవాడూ చక్రపాణి అని మరవరాదు. కాబట్టే, ఈ రోజుకీ సినీ ప్రేక్షకులు షావుకారులోని ''పలకవేలనే చిలకా/ సముఖములో రాయబారమెందులకె'' అన్న పాటనుగానీ, గుండమ్మకథలోని ''కోలు కోలుయన్న కోలోనాసామి'' పాటనుగానీ, తదితర చిత్రాలలోని సన్నివేశాలనుగానీ మరచిపోగలరా? ప్రతి చిత్రాన్నీ కనుల సొంపుగానే కాదు, వీనుల విందుగా కూడా మలచాడు. నేడు మనకు దర్శనమిచ్చే కొన్ని లల్లాయి పాటలు, లిల్లాయి గంతులూ ఆయన అనుమతించలేదు. శ్రీశ్రీ సాహిత్య రచనల్లో ఉరవడి తగ్గినప్పుడు ఆయనను ప్రోత్సహించి ఆయని వరవడిని గుర్తుచేసినవాడు చక్రపాణి. ఆయన దృష్టిలో సినిమా ప్రధానంగా వినోద సాధనం కావచ్చుగాని, ఆయనకి తెలియకుండానే అది సందేశ సౌరభాలు కూడా వెదజల్లింది. సరసతలో కూడా సౌకుమార్యం, లైంగికంలో కూడా లౌక్యతాముద్రలు- చక్రపాణి చేతిలో చిత్రసీమకు ఒజ్జబంతులయ్యాయంటే అతిశయోక్తికాదు. అంతేగాదు, ఆనాడు (1950లో) నిరక్షరాస్యత ఎక్కువగా ఉన్నప్పటికీ నేటికన్నా ప్రేక్షకుల పట్ల ఆనాటి దర్శక నిర్మాతలూ, రచయితలూ, కవులూ బాధ్యతతో ప్రవర్తించారని చెప్పాలి. 'జనం చూస్తున్నారుగాబట్టి, మేం వేషాలు వేస్తున్నాం, నటన చేస్తున్నాం, సినిమాలు తీస్తున్నాం' అనే ఈనాటి బాపతుకు ఆనాటి చిత్రాలు గుణపాఠం కావాలి. చక్రపాణి చిత్రాలు ప్రజల సమస్యలకు (ఇరుగుపొరుగు సంబంధాలు, వరకట్నాల

బెడద, నిరుద్యోగ సమస్య) ప్రాధాన్యం ఇచ్చి, ప్రజలలో చైతన్య స్థాయిని పెంచాయి. అలాగే చక్రపాణి ఎన్నో ఉత్తమ కథలూ రాశారు. బెంగాలీ శరత్‌బాబును తెలుగువాడేనని చాలామంది నమ్మేట్టు చేశాడు! భాషలో, భావంలో, కథాసంవిధానంలో శరత్ నవలలను అనువదించడంలో కొత్త బాణీలు సృష్టించాడు. ప్రసిద్ధి చెందిన శరత్ 'దేవదాసు' అనువాదం ద్వారా దేవయ్యను, పార్వతిని తెలుగింటి వాళ్ళుగా స్థిరపరిచాడు! శరత్ నవలలనేగాక రాయ్‌చౌదరి, పరశురాం, వనపూల్‌లాంటి ప్రసిద్ధ రచయితల నవలల అనువాదాలను కూడా అందంగా తెలుగుచేశాడు. బెంగాలీ అనువాదంగా ''పాంచ జన్యం''లాంటి రాజకీయ కథలు పుచ్చలపల్లి సుందరయ్యను కూడా కదిలించడం విశేషం. చలం, కొడవటిగంటి, దువ్వూరి, శిష్లా, గోఖలే, భానుమతి, ధనికొండ రచనలను, కాటూరి, సోమంచి యజ్ఞన్నశాస్త్రి నాటికా నాటకాలను చక్రపాణ ప్రచురించారు. వడ్డాది పాపయ్య, శంకర్, చిత్ర లాంటి చిత్రకారులను ప్రోత్సహించాడు. తాను రాసిన కథలలో సామాజిక సమస్యలు, పేదరికం, కలవాళ్ళకు, లేనివాళ్ళకు మధ్య అంతరాల దొంతరలు, సామ్యవాద ధోరణులూ- ప్రతిఫలిస్తూ ఉండేవి. అంతేగాదు, ''దేశద్రోహి'', ''కానీ కడగండ్లు'', ''కథ అడ్డం తిరిగితే'' అన్న అనువాద కథలు పాఠకుల్ని ఉర్రూతలూగించిన రచనలుగా ప్రసిద్ధి పొందాయి. ఈ కథలన్నింటిలోనూ సామాన్యులపై జరిగే అత్యాచారాల, దౌర్జన్యాల ఖండన ఉంది. మూఢ విశ్వాసాలపైన వేసిన దండోరా ఉంది. 'పనిలేని మంగలి' వ్యాసాలు ఓ కొత్త సృష్టి. అన్నింటికీ మించి ఆత్మగౌరవ పతాకను ఆనాడే ఆంధ్ర పాఠకుల చేతికి అందించినవాడు చక్రపాణి! ఈ ఆత్మగౌరవ ప్రబోధానికి పతాక సన్నివేశమే చక్రపాణి చరమ సందేశం, పరమ ఆదర్శం: ''పనిలో పట్టుదల, కార్యదీక్ష ముఖ్యం. అవి ఉంటే ఎవరి ఆశీస్సులతో పనిలేదు. అవి లోపిస్తే ఏ ఆశీస్సులూ పనిచేయవు''!

*(ఆదివారం 3, ఆగస్టు 1997)*

# పండిత పాత్రికేయ తరంలో కొసమెరుపు రామచంద్ర

సుమారు ఏడుదశాబ్దాలపాటు ప్రాకృత, సంస్కృతాంధ్ర సారస్వతాలలో మహాపండితుడుగా, ద్రావిడ భాషల అధ్యయనంలో అలుపెరుగని అకలంక పరిశోధకుడిగా వెలుగొంది తెలుగు సాహితీ చరిత్ర లో కీర్తి శిఖరాలందుకుని తెలుగు జాతికే నిండుదనం చేకూర్చిపెట్టిన తిరుమల రామచంద్ర అస్తమయం తీరని వెలితిగా భావిస్తున్నాం. పిట్టకొంచెం కూతఘనం అన్న నానుడి రామచంద్రకు వర్తించి నంతగా మరొకరికి నప్పదేమో! భాషాసాహిత్యాలపట్ల, పరిశోధనపట్ల, నూతనాంశాలను తెలుసుకోవడంలో ఆఖరి శ్వాసవరకూ ఆయన చూపిన శ్రద్ధాసక్తులు తపన, ఆబ వర్ణనాతీతం. లోకానుభవం, సత్యాన్వేషణ రామచంద్రను భాషా విషయాలలో ప్రజాబంధువుగా మలిచిపెట్టాయి. భవభూతి అభివర్ణించిన రసాలలో ఒక్క కరుణ రసమే ఆస్వాదనీయమైతే అది రామచంద్రలో ఆపాదమస్తకం నిండివుందనే చెప్పాలి; నిరాడంబరత, నిండుమనసు, ఓరిమి ఆయన వ్యక్తిత్వ వికాసానికి మెరుగులు దిద్దిన మురుగులు! ప్రజలపట్ల ముఖ్యంగా సామాన్య ప్రజలపట్ల రామచంద్ర ఆర్ద్రత అనుకంపనా నేటి యువతరం రచయితలకు ఆదర్శం కావాలి; ఆయనలో రచనా నిబద్ధతేకాదు, తీసుకున్న అంశాన్ని ''జీర్ణమంగే సుభాషితం'' అనుకోకుండా నలుగురికీ పంచిపెట్టే నిమగ్నత కూడా ఉంది. దిలీపుని వ్యక్తిత్వాన్ని గురించి వర్ణిస్తూ కాళిదాసు ''అప ధృష్యోభిగమ్యం:'' అనలేదూ! అలాగే రామచంద్ర క్షణం కూడా విశ్రమించని నిత్య పరిశోధకుడూ, మేధాకార్మిక జీవీ. ప్రచారానికి ఏనాడూ అంగలార్చినవాడు కాడు, ప్రలోభాలకు లోనై గజ్జెకట్టినవాడూ కాడు. వేటూరి ప్రభాకరశాస్త్రి వద్ద శిష్యరికమూ, ఆయనతో సాంగత్యమూ రామచంద్రుని దిద్దితీర్చి, మనిషినేగాక మనసునీ గుణశీలిగా మార్చాయి. సంస్కృతంలో సాహిత్య శిరోమణిగా, తెలుగు సంస్కృతాలలో విద్వాన్‌గా, హిందీలో 'ప్రభాకర'గా పట్టాలు పుచ్చుకున్నా రామచంద్ర సాధారణ పండితులతోనేగాక తన పొందుగోరి వచ్చిన సామాన్య విద్యార్థులతో, భాషాపరిశోధకులతో నిత్యం చెట్టపట్టాలు కట్టి తిరిగిన వ్యక్తి. పండిత సంపాదకుల తరంలో ఆయన కొసమెరుపు భాషావేశంలో, భావశబలతలో,

భావోజ్జ్వలతలో వ్యావహారిక భాషను కడు రమ్యంగా పాఠకులకు దించిన లేఖిని ఆయనిది. మూడు దినపత్రికలకూ, ''భారతి'', ''పరిశోధన'' మాసపత్రికలకూ రామచంద్ర ఒక్కచేతి మీదుగా చేసిన సేవలు అనితరసాధ్యాలు. అసూయాద్వేషాలకు అతీతుడు; కనుకనే ఆయని కలం నుంచి నాడు జాలువారిన ''మరపురాని మనుషులు''గాని ''అహంభో అభివాదయే'' రచనగానీ విభిన్నరంగాలకు చెందిన వ్యక్తులకు సంబ వైయక్తిక దృష్టితో రాసిన మహనీయుల లేఖినీ చిత్రాలుగా వాసికెక్కాయి. ప లతో సాంగత్యం, సంపాదక బాధ్యతలూ ర మచంద్రుని పాఠకులకు సన్నిహితం చేసింది. ఆయని ''తెలుగు వెలుగులూ'' అంతే. కట్టమంచి రామలింగారెడ్డి వద్ద అంతే వాసిత్వం (శిష్యరికం)తో స్వయం ప్రకాశానికి మరింత వన్నెతెచ్చుకున్న రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గురించి రాసినా, ప్రాచ్య కవితా కోకిల సరోజినీదేవి గురించి చెప్పినా, పుట్టపర్తి కృషిని పరామర్శించినా, తమిళనాడులో కొడిగట్టుతూన్న తెలుగుదీపానికి నూనెపోసి వత్తులుదిద్ది తెలుగు నిలిపిన సాధు వరదరాజం గురించి ప్రస్తావించినా, పుచ్చలపల్లి సుందరయ్య పార్లమెంటరీ జీవితాన్ని చిత్రీకరించినా, సంగీతలక్ష్మి సుబ్బలక్ష్మి, విశ్వనాథ, క్రొవ్విడి లింగరాజు, బూర్గుల రామకృష్ణారావు, నాదస్వర సుధాలహరి గాలిపర్తి పిచ్చిహరి, వాయులీన విద్యతో ఆనందలోకాలు చూపించిన ద్వారం గురించి వివరించినా- రామచంద్ర కళ్లముందు బొమ్మకట్టవలసిందే! సాహిత్య, సంగీత, నాటక, సాంస్కృతిక రంగాల గురించి రామచంద్రకు తెలియని అంశాలు తక్కువ. ఆయని ''మనలిపి : పుట్టుపూర్వోత్తరాలు'' రచన భాషా చరిత్రకు తలమానికం. స్వాతంత్ర్య సమరయోధుడుగా రామచంద్రుని వినమ్రతకు, విజ్ఞతకూ మరొక ఉదాహరణ- ఈ గ్రంథాన్ని సుప్రసిద్ధ పరిశోధకులైన మల్లంపల్లి సోమశేఖరశర్మకు అంకితమివ్వడంతో సరిపెట్టుకొనక ఆగ్నేయ ఆసియా ప్రజలకు అక్షరభిక్ష పెట్టిన విశాలాంధ్ర ప్రజాశక్తికే అంకితమివ్వడం! ఈ రచన దేశీయ, విదేశీయ లిపి పరిణామాలను సంకలనం చేసి సాకల్యంగా తీర్చిదిద్దిన రచన. ఇతర భాషలలో కూడా ఇలాంటి రచనలేదన్న విశ్వాసాన్ని 'ఆంధ్ర విశారద' తాపీ ధర్మారావు ప్రకటించడమే ఇందుకు నిదర్శనం. శాస్త్ర పరిభాష జోలికి పోకుండా అక్షరాస్యులందరికీ అతి సులభంగా అందివచ్చే ప్రజాభాషలో లిపి పరిమాణాన్ని వివరించిన దిట్ట మన తిరుమల రామచంద్ర ఈరోజుకీ లిపి సంస్కరణకు మన పాలకులు దూరంగా ఉన్నారుగాని తెలుగు లిపి సంస్కరణకు నలభై ఏళ్లనాడే విలువైన సూచనలు చేసినవాడు తిరుమల. ఇక ఆయన కీర్తి కిరీటంలో మరో కలికితురాయి ''నుడి-నానుడి''. ఇందులో

రామచంద్ర మనకు వాగర్థాల మేలు కలయికగా కనిపిస్తాడు. దాని పర్యవసానమే తెలుగువారికి ఆయని చేతిలో కమ్మెచ్చులాగినట్టు అందివచ్చిన అద్భుతమైన పద పదార్థ చర్చ. ఇది మాట చరిత్ర, మాటల ధ్వనుల చరిత్ర, అర్థ పరిణామాల చరిత్ర, ఉచ్చారణలు మార్చుకున్న శబ్దరూపాల చరిత్ర! ''చెంబు-కంచం''నుంచి 'చారు'దాకా, 'తూర్పు-పడమర'లనుంచి 'దిక్కు- దివాణం'దాకా, 'కోమటి-గోమతి'నుంచి 'కోటలోపాగా'వేసే దాకా పుట్టు వెంట్రుకలులాగి, మాటల పుట్టుపూర్వాలు అందంగా, రసనిష్యందంగా తెలిపాడు. అంతేగాదు, విషయ వైవిధ్యంగల మరెన్నో వ్యాసాల కదంబమాల రామచంద్రుని ''సాహితీ సుగతుని స్వగతం''. ఇది తెలుగుసాహిత్య వనంలో పూచిన గులాబీల, మల్లెలపై విమర్శలూ, పరామర్శలూ! ఎందరి రచనలనో, వాటి పోకడలనో అరటిపండు వొలిచిపెట్టి చూపాడు, ఆరగించమన్నాడు; కొరకరాని కొయ్యల్ని కొరికి చూపించాడు! రామచంద్రలాంటి వాళ్లు, అందులోనూ పత్రికా రచనా వ్యాసంగంతో విశేష పరిచయం కలవాళ్లు ఎంతోమంది లేనందువల్లనే తెలుగు అందచందాలు తెలియక తెలుగు పరీక్షలలో మన విద్యార్థులు అనేకమంది అత్యుత్తమంగా ఎదిగి రాలేకపోతున్నారని గుర్తించాలి. అంతేగాదు, రామచంద్ర రాయలసీమబిడ్డే అయినా ప్రజాసంబంధాల్లో ప్రాంతీయతను దరిచేరనివ్వని మనస్సు ఆయనిది. ''అచ్చ తెనుంగు కబ్బమున కాది పదంబయి పొల్చు భాగ్యమున్ హెచ్చుగనున్న దేశం''తెలంగాణమని చాటినివాడు రామచంద్ర.

అంతేగాదు, ''తెలుగు పత్రికల సాహిత్య చరిత్ర''ను అందించిన మన తిరుమల **1835** నుంచీ **1980**ల దాకా సుమారు నూట ఎనభై సంవత్సరాల పరిణామాన్ని ఆరు విభాగాలలో వివరించి చెప్పాడు. ఇది తెలుగు పత్రికల ఆవిర్భావ చరిత్ర. చివరికి '' ఆంధ్రభాషా సంజీవిని''కి సంపాదకత్వం వహించిన కొక్కొండ వెంకటరత్నం పంతులు పత్రికా లక్షణాలుగా చెప్పిన ''నవలక్షణాలను'' రామచంద్ర వెల్లడించాడు. ప్రచురణ సంస్థలు, సాహిత్య విమర్శల తీరు, వ్యవహార భాషావాదనం, బాలసాహిత్యం, స్త్రీ సమస్యలు, తెలంగాణా సాహిత్య పత్రికలు, నవ్య, భావ, అభ్యుదయ, దిగంబర కవిత్వాల మలుపులు, పత్రికా భాష, వ్యాసరచన వగైరా ప్రక్రియల గురించి ఎన్నో విషయాలు చర్చించిన రచన ఇది. తను సహా ''మానవుడు సర్వజ్ఞుడు కాడ''ని ఆయన ప్రకటించాడు! నేర్చుకొనవలసింది ఎంతో ఉందన్న స్పృహను కోల్పోనివాడు కాబట్టే ఈగ్రంథాన్ని శనివారంనాడు మద్రాసులో దివంగతుడైన మరో సాహిత్యవేత్త సెట్టి ఈశ్వరరావుకు

అంకితమిచ్చినప్పుడు రామచంద్ర ఇలా ఈశ్వర్రావు కృషిని అంచనా వేశారు. ''మీది మానససరోవరం. కనుకనే మీ ఆలోచనలు, భావాలు, వాటికి శ్రవ్యారూపాలైన మాటలు, వాటికి దృశ్యరూపాలైన వ్రాతలు రాజహంసలు. మీరు అజాత శత్రువులు. మీ రచనలు మీతో ఏకీభవించని వారిని కూడా మురిపిస్తాయి''. ఆ మురిపించడం ఈశ్వర్రావే కాదు, రామచంద్ర సొత్తుకూడా! ప్రతిభాపాటవంకన్నా ప్రచార వాగురకు లొంగిపోయేవారికి ఈ నమ్రత అసాధ్యం. కనుకనే ప్రచారం అంతగా గిట్టని పింగళి లక్ష్మీకాంతం ఒక సందర్భంలో పేర్కొన్న మాటలు రామచంద్ర వ్యక్తిత్వానికీ వర్తిస్తాయి. ''నికరమ్మై అకలంకమ్మైన సరకుల్/నిర్దిష్టముల్ నీ పరీ/క్షను తాళంగల మేటి క్రొందినుసు మీ/కన్గప్పు మోసంపు వర్తకుడ నేగాను... భాషా కుమా/రకులారా కొనరండు భవ్య కవితారంభ, ప్రియంభావకుల్''!

నిజాం సంస్థానంలో అడివి బాపిరాజుగారి ఆధ్వర్యంలో నడిచిన తెలుగు ''మీజాన్'' పత్రిక రామచంద్ర సాహితీ రచనా వైవిధ్యానికి ఒక వేదికగా మారింది. అప్పటికి వర్ధిష్ణువులుగా ఉన్న వారందరూ బాపిరాజు సంపాదకత్వంలో చలువ పందిళ్లు వేయించుకొన్నవారే. మన తిరుమల భాషాశాస్త్రం, సాంఘిక శాస్త్రం, చరిత్రాంశాలపై కేంద్రీకరిస్తే, రాంభట్ల కృష్ణమూర్తి 'మిర్చిమసాలా' వ్యంగ్య రచనలతో, శ్రీనివాస చక్రవర్తి నాటక సాహిత్య విమర్శలతో,రంగస్థల సమీక్షలతో భాషాసేవకూ భావ విప్లవానికీ దోహదం చేశారు. ఆరోజులు అలాంటివి కాబట్టే బాపిరాజు ''ఓ పలనాటి ఎలమందా/ పలవరిస్తావా జైలు కొట్లల్లో'' అని పాడినా, ''లేపాక్షి బసవయ్య లేచి రావయ్యా'' అని గొంతెత్తినా పరిసరాలన్నీ మారుమోగేవని రాశాడు రామచంద్ర! అజ్ఞానమనే సముద్రాన్ని దాటితే తప్ప రామచంద్రునిలాంటి వాళ్లని చేరుకోడం మనకు దుస్సాధ్యం! ఎందుకంటే, కాళిదాసు అన్నట్టు ప్రతివాడికీ తానూ పండితుడిని కావాలనో కవిగావాలనో ఆశ ఉంటుంది; కాని అందని పళ్లకోసం అర్రులు చాచే పొట్టివాడు నలుగురిలో నగుబాటు పాలవుతాడు. కాళిదాసులాంటివాడు వాల్మీకిని దృష్టిలో పెట్టుకుని తన్నుతాను తగ్గించుకున్నాడు. మనమూ అంతే!రామచంద్ర ప్రాపంచిక దృక్పథం మానవతావాదం; ''ఈ విశ్వం వైవిధ్య విలసితం. ప్రతి వ్యక్తిలోనూ ఏదో మంచి ఏదోమించు (మెరుపు) కనిపిస్తుంది, సహృదయతతో చూస్తే. నేను పత్రికా రచయితగా ఈ మంచినీ, మించునూ చూడడం నేర్చుకున్నాను .. నేను ఎవరి స్వేచ్ఛనూ అడ్డుకోదలచలేదు. నా లక్ష్యం మానవత్వం. అది చిరంజీవి, నేనూ చిరంజీవిని'' అన్నాడు. అవును. అతని పేరు రామచంద్రుడు,

చిరునామా తిరుమల! కనుకనే అతను చిరంజీవి, భాషాప్రియులకు బంధువు, అనురాగ సింధువు!'' ఎవరు పెద్దమనిషి?'' అని ఒకసారి ప్రశ్నించుకున్న రామచంద్ర ఆ ప్రశ్నకు సమాధానంగా పేర్కొన్న 13 లక్షణాలు ఉన్నవాడిని వెతికి పట్టుకు రావాలంటే ఈ అవినీతి భారతంలో సాధ్యమా? ఆ లక్షణాలు ఏవి? ఉత్తమవీరుడు, మనుష్యోచితమైన ప్రవర్తన, నెమ్మదితనం, మర్యాద తెలిసి ప్రవర్తించేవాడు, తనది మానవజన్మ అనే విషయాన్ని విస్మరించని వాడు, ధనాగారంకన్నా విశాలమైన హృదంతరాళం కలవాడు, పిల్లలను, వృద్ధులను మర్యాదచేసి దయగా చూసేవాడు, స్త్రీలను గౌరవించేవాడు, పేద సాదలను సమాన దృష్టితో చూసేవాడు, తన లోపాలను గుర్తించి ఇతరులలో ఆలోపాలు కన్పించినప్పుడు వాటిని బయటపెట్టనివాడు, ధర్మసంరక్షణలో ముందంజ, దాని లాభాలను పొందడంలో వెనుకంజ వేసేవాడు, ఉపకారం చేసి మరిచేవాడు, ఉపకారంపొంది మరవనివాడు'' - ఇవి ఉన్నవాడు పెద్దమనిషి రామచంద్రదృష్టిలో! ఆ తరంవేరు; ఆ భావతరంగంవేరు, వారి అంతరంగం వేరు. ఇదే ఆదర్శవాదం అయితే ఈ రోజున మనం కోరుకునేదీ అదే కావాలి. ఆనాడు కావ్య కొమ్మనెక్కి ''రామరామ''అని వాల్మీకి తీయని పలుకులు పలికాడు. నేడు తెలుగు నుడికారపు వంపుసొంపుల సాహితీ శాఖనెక్కి మనమూ 'రామ రామ రామచంద్రా' అని తిరుమలను తలచుకోలేకనూ ఉండలేము. ఆంధ్రసాహితీ లోకంలో ప్రాత:స్మరణీయుల కోవకు చెందిన చిరంజీవి తిరుమల రామచంద్ర!

*(సోమవారం 13, అక్టోబరు 1997)*

# మానవసేవలో తరించిన ''మదర్'' ప్రార్థనాగీతం!

**జీ**వితంలో ''క్షీర-నీర'' న్యాయం అంటే మరేంలేదు. పాల నుంచి నీరు వేరు చేయడం! అలాగే జీవితాదర్శాన్ని సునిశితం చేసుకోడంలో స్త్రీ-పురుషులు మంచి-చెడుల మధ్య విచక్షణ పాటించడం కూడా అంతే అవసరం. ధర్మం ప్రార్థనలో ఉందని భావించేవారు ఈలోకంలో కొందరుంటే, కాదు ధర్మం పేదలకు సేవ చేయడంలో ఉందనీ తద్వారా సామాజిక శాంతి సాధ్యమని విశ్వసించేవారు మరికొందరున్నారు. ఈ రెండు రకాల భావజాలానికి ఆత్మశిక్షణ, ఆత్మవిశ్వాసమూ అవసరం. అయితే రెండవదానినే ప్రపంచంలోని ప్రజాబాహుళ్యం (ఆచరణలో ప్రజాసేవను, పేదల సేవను) సమాదరిస్తుంది. ఈ సేవాధర్మాన్ని ఒక్క క్రైస్తవమేకాదు, హైందవం, ఇస్లామ్, జొరాస్ట్రియనిజం, బౌద్ధం ప్రబోధిస్తూ వచ్చాయి. అదే మన పంచతంత్రం చెప్పిందీ, భోజ చరితం విప్పిందీ. మనస్సు, మాట, పనులు మూటికి యేకరూపతగలవాళ్ళే అసలుసిసలు సాధుమూర్తులని మన పెద్దలూ చెప్పారు. (''చిత్తేవాచి క్రియాయాంచ/ సాధూనామేకరూపతా'')! కనుకనే విజ్ఞులు ఇతరులకు బోధించడమే పాండిత్యంకారాదన్నారు. పరోపదేశంలో అందరూ పండితులేగాని స్వయంగా తామూ నియమాలను (ధర్మాలను) అనుష్ఠించడం అరుదుగా ఎవరో మహానుభావులుగాని చేయలేరని చెప్పారు! అలాగే తాను పశువులా ప్రవర్తిస్తున్నానా, లేక మనిషిలా వ్యవహరిస్తున్నానా అని ప్రతివాడూ తనకుతానై రోజూ ప్రశ్నించుకుంటూ ఉండాలని మహాభారతం చెబుతోంది! ఆ ప్రశ్నవేసుకొని సత్ప్రవర్తకులుకాని వారు పరిపూర్ణమైన మనుషులుగా రూపొందలేరన్నది తాత్పర్యం. అంటే, ఆ పనిచేయనివాళ్ళు స్వార్థపరులుగా ఉండిపోవలసి వస్తుందేగాని ఇరుగుపొరుగు మంచిచెడులనూ, పేదసాదల బతుకు చితుకులనూ పట్టించుకోగల విశ్వచింతనా మూర్తులు కాలేరు. కాబట్టే ''హితోపదేశం''కర్త ఉదార హృదయులకు లోకమంతా సొంత కుటుంబమేనన్నాడు ('' ఉదార చరితానాం తు వసుధైవ కుటుంబకమ్'')!! ఆ ప్రపంచ మహిళామూర్తి, విశ్వమాత దివంగత థెరిసా, మదర్ థెరిసా, ''సెయింట్ ఆఫ్ గట్టర్స్''- పేదల పాలిట కరుణామయి!

అవిభక్త యుగోస్లావియాలో ఆల్బేనియన్ రైతుబిడ్డగా జన్మించి, ఖండాంతరాలు దాటి ఇండియాలో నిలబడి, భారతీయ పౌరురాలుగా స్థిరపడి విశ్వవ్యాపితంగా అథోజగత్ సహోదరుల పాలిట విశిష్ట సేవికగా ఖ్యాతికెక్కిన మదర్ థెరిసా నుంచి పౌరులు, పాలకులూ నేర్చుకోవలసిన పాఠాలూ, గుణపాఠాలూ ఎన్నో ఉన్నాయి! నిరాడంబరతలో, నమ్రతలో, ప్రజాసేవలో, పరిత్యాగంలో ఆమె ఓ బుద్ధుడికీ, ఓ గాంధీకి, ఓ హోచిమిన్‌కు మాత్రమే దీటురాగలిగిన ఉత్తమ స్త్రీ. స్థానిక వేదికల నుంచి సప్త సముద్రాలు దాటించిన ఆమె సేవా నిరతికి హారతిగా ప్రపంచ వ్యాపితంగా ఎన్ని విశిష్ట పురస్కారాలు (నోబెల్ సహా) లభించినా ఆమె ఉబ్బితబ్బిబ్బైన మనిషికాదు. ప్రతి పురస్కారం థెరిసాలో అణకువను పెంచడంతోపాటు బాధ్యతలను కూడా రెట్టించింది! సీమ దాటిన తరువాత ఆమె తొలి మజిలీ కలకత్తాకాగా, మలి మజిలీ అనంత ప్రపంచం అయింది! క్రైస్తవ వ్యవస్థలోనేకాదు, డెబ్బయ్యేళ్ళ పేదల సేవలో ఆమె ''మాట''కు ప్రపంచమే విలువ ఇచ్చింది. కలకత్తాలోని లోరెంటో నన్స్ ఆర్డర్‌ను ఆమె ఎందుకు త్యజించవలసి వచ్చింది? తన తల్లినుంచి పుణికి పుచ్చుకున్న సేవా ధర్మం,పేదల పట్ల ఆదరణే థెరిసాచే నాలుగుగోడల మధ్య ఇరుకు ప్రపంచానికి చెల్లుచీటీ ఇప్పించింది. లోరెట్టో సరిహద్దులు చెరిగిపోయాయి. థెరిసా నేత్రాలు విచ్చుకున్నాయి, ఆమె మనో నేత్రమూ తెరుచుకుంది. విశ్వకవి టాగోర్ దేవుడు గర్భగుడిలోలేడు బయట రాళ్ళు కొట్టే కూలీల మధ్య ఉన్నాడు, తలుపులు తెరుచుకుని బయటికి వచ్చి కళ్ళుతెరిచి చూడమన్నాడు! అలాగే థెరిసా కూడా దైవభక్తి మధ్యనే సంప్రదాయ ఉల్లంఘన కూడా చేసింది. ఆ ఉల్లంఘనకు దారితీసిన జాతీయ ఘటనలు పూర్వరంగం సమకూర్చాయి. మహమ్మారిలా విరుచుకుపడిన బెంగాల్ కరవు, ఆ వెంటనే ఉపఖండాన్ని ఊగించి శాసించిన దేశ విభజనా కాన్వెంట్, క్రైస్తవ వ్యవస్థల ఇరుకు సందులలో నుంచి థెరిసాను బయటపడవేశాయి. ఆమె ఆదర్శం వేరు, లక్ష్యం వేరు, ఆమె చూడగోరుతున్న ప్రపంచంవేరు, విమోచన ఆశయంవేరు- వీటన్నింటి సమాహారమే విశ్వమానవతావాదం,అనాథజీవుల, సంఘ పరిచ్యుతుల, బహిష్కృతుల, ఒక్కముక్కలో రకరకాల బాధలకు, కష్టాలకు గురవుతూ, కనీస ఆహార, ఆరోగ్య సౌకర్యాలకు దూరమైపోయిన అట్టడుగువర్గాలను ఆదుకోవడం, వారి సేవలో తరించడమే ఆమె ఏకైక అజెండా! కాన్వెంట్ ప్రిన్సిపాల్ హోదా నుంచి తప్పుకొని ''దైవమిచ్చిన పిలుపు'' మేరకు ఇరుకుసందుల నుంచి బయటపడేనాటికి థెరిసా వయస్సు నలభై సంవత్సరాలే. ఆమె ప్రార్థన వేరు, ఆమె ప్రార్థనా గీత రచనా సరళేవేరు! అక్కడి నుంచి

నిరుపేదల సేవలోని ప్రతిఘట్టమూ నిత్యమంగళంగా ఆమె జీవితాన్ని నిర్దేశిస్తూ వచ్చింది. మురికివాడలు కర్తవ్యాదీక్షను నూరిపోశాయి. అసలామె సేవకు బయలుదేరిన తీరేవేరు- కాన్వెంట్ కాంపౌండ్ దాటిన మరుక్షణం ఆమె ఆలోచనేకాదు, ఆహార్యమూ మారిపోయిందీ. మూడు చీరలు; ఒక్క అయిదు రూపాయల నోటుతో సేవా యాత్ర ప్రారంభించి నేడు తాను 'కోటీశ్వరి' కాకపోయినా కోటానుకోట్ల తాడిత పీడిత లోకపు వైతాళికగా పేదసాదల బతుకులను తన చేతి చలువైన ఛారిటీస్ కింద కోటాను కోట్ల రూపాయలను సమకూర్చిపెట్టింది. ఆచరణ ఆమెకు ప్రధానం. ఆ లక్ష్యమే థెరిసాను ప్రజా సముద్రంలోకి నెట్టింది. సేవలందింపజేసింది. ఈ జన ప్రవేశం రోజుకొక వాగ్దానాలపై గడుపుతూ చేసిన బాసలను మరుక్షణం మరిచిపోయే రాజకీయవేత్తల స్వార్థ ప్రవేశంలాంటిది కాదు. ఆమె నిజమైన సేవిక- రుగ్మతల నుంచి సమాజాన్ని కడతేర్చడానికి ఉద్యమించిన స్త్రీ. ఒక చిన్న అల్పాహార భరిణి తగిలించుకొని అలామైళ్ళకొలదీ పాదయాత్రలు చేసిన విశ్వమాత! ''అంటరానివారు మావెంటరానివార''ని ఓ కవి చెప్పినట్టుగానే థెరిసాకు అస్పృశ్యులు లేరు. అనాథలే తనకు వైతాళికులయ్యారు. కలకత్తాలోని మోతీఝిల్, తిల్జాలా మురికివాడల్లో, కాళీఘాట్ పరిసరాలలో కుష్టురోగులకు, క్షయరోగులకు, తదితర రోగగ్రస్తులకు ఆమె అందించిన సేవలు మరపురానివి. వీధివీధిన కనిపించిన అనాథ బాలబాలికలను, అర్ధనగ్న శరీరాలతో వస్త్ర దారిద్ర్య స్థితిలో తారసిల్లిన బాలలనూ అక్కున చేర్చుకుని తోటి సిస్టర్స్‌తో కలిసి విద్యా వైద్య సదుపాయాలు సమకూర్చి ప్రభుత్వాల ఉనికిని కూడా సవాలు చేసిన మహిళ థెరిసా! ఆమెకు దైవం సాక్షాత్కరించిందో లేదో మనకు తెలియదు- కాని మానవ జీవితాన్నే ప్రార్థనా మందిరంగా మార్చుకుని, మానవ సేవనే మాధవసేవగా ఎంచుకోవడమే మనకు తెలుసు! తన కార్యదీక్ష ద్వారా, తన సచర్యల ద్వారా, తన సేవాతత్పరత ఆధారంగా థెరిసా ప్రతి అత్యవసర సమయంలోనూ హాజరుకాని వాడలేదు, మురికివాడలేదు, కాలుమోపని పేద గుడిసెలేదు. ఆమె కులమతాలకు అతీతంగా వ్యవహరించిందనడానికి ఉదాహరణ- నలభై ఏళ్ళకుపైగా ఆమె నెలకొల్పిన ''మిషనరీ ఆఫ్ ఛారిటీ'' ఉచిత సేవా సంస్థ విశ్వవిఖ్యాతమై శాఖోపశాఖలు కావడమే! ఏకాంతవాసంలో దిక్కుతోచని అనేకమందికి థెరిసా ఏడుగడై నిలిచింది. ''తమసోమాజ్యోతిర్గమయ'' (చీకటి నుంచి వెలుగులోకి నడిపించు) అన్న మన ఉపనిషత్ వాక్యానికి అక్షర సత్యమై నిలిచిన మహోన్నత మహిళ థెరిసా!

## మానవసేవలో తరించిన ''మదర్'' ప్రార్థనాగీతం!

ఈరోజున మనం స్వచ్ఛంద సంస్థల పేరిట రకరకాల సంస్థలను (ఎన్.జి.వోస్) చూస్తున్నాం. పుబ్బలో పుట్టి మఖలో అంతరిస్తున్నాయవి! ఇలా విశ్వవ్యాపిత ధర్మసంస్థలెన్నో అవినీతిపాలై పతనమవుతున్నాయి. కాని గంజాయి వనంలో తులసిమొక్కలా నవం నవంగా ఏళ్ళతరబడిగా విస్తరిస్తూ జగజ్జేగీయమానంగా వర్ధిల్లుతున్న ఛారిటీ మిషనరీలు థెరిసా అమలినమైన వ్యక్తిత్వ వికాసం వల్లనే సాధ్యమని మరవరాదు! ఈమె నీడ పేదలకేకాదు, సంపన్నులకూ అవసరమైంది. వెనకటికో అజ్ఞాతకవి నిరుపేద అగచాట్లను పేర్కొంటూ ''తమరు చేసే కుట్ర దాచుకోవచ్చునని కలగినోరిచ్చారు బొచ్చా/ దాన్ని కలవారి ఇళ్ళకేతెచ్చా'' అన్నట్లుగా కొందరు ధనికులు వ్యవహరించడాన్ని థెరిసా కూడా గుర్తించింది. సంపన్నుల దృష్టి దోషాన్ని, మనస్తత్వాన్ని సవరించడానికి అవసరమైనపుడు మెత్తగానూ, కొన్ని సందర్భాల్లో కటువైన లౌక్యంతోనూ వ్యవహరించవలసి వచ్చింది. తోటి మానవుల పట్ల ఆర్ద్రత అవసరాన్ని గుర్తింపజేయడానికి ప్రయత్నించింది. ప్రజలు దైనందిన జీవితంలో పడుతున్న కష్టాలను చూడలేక ''కాళ్ళకు బలపాలు'' కట్టుకుని విశ్వదర్శనం చేసింది. ఇథియోపియాలో కరవుకాటకాలొస్తే, నిమ్మకు నీరెత్తినట్టే కూర్చున్న అమెరికన్ ప్రెసిడెంట్ రీగన్‌ను మందలించి ఆకలిదప్పులతో చావుబతుకుల మధ్య కొట్టాడుతున్న అన్నార్తుల ఆర్తిని తీర్చడానికి ప్రయత్నించింది. పిట్టంత మనిషి సమాజం పట్ల, మానవుల పట్ల రాజ్యాధినేతలు సామాజిక బాధ్యతలు విస్మరించకూడదని బుద్ధిచెప్పవలసి వచ్చింది! ''మాట'' శక్తితోనే, దాని విలువతోనే అధినేతల మెడలు వంచడానికి ప్రయత్నించింది. ఎవరిస్థాయిలో వారు పేదల సేవలకు తోడునీడ కావాలని పాఠం చెప్పింది. ఇండియాలో, టాంజానీయాలో సేవలందుకున్న కుష్టురోగులూ, కైరోలో చెత్తాచెదారం ఎత్తిపోసే కార్మికులూ, లీమా మురికివాడలలో ఇళ్ళూ, వళ్ళూ గుల్లచేసుకుంటున్న తాగుబోతులూ, న్యూయార్క్‌లో 'ఎయిడ్స్' వ్యాధిపీడితులూ, ఆర్మీనియా భూకంప బాధితులూ, బంగ్లా వరద బాధితులూ- ఈ విశ్వమాతకు వినమ్రతతో కైమోడ్పులర్పిస్తారు! ఇంతటి ఆర్ద్రతగల వ్యక్తి కనుకనే థెరిసా సేవాధర్మం ఆమె బ్రదర్ రోజర్‌తో సమకూర్చిన ప్రార్థనా గీతంలో కూడా ప్రతిఫలించింది. దగాపడిన పేదసాదలకు ప్రతి ఒక్కరూ ప్రేమానురాగాలు పంచిపెట్టమని ప్రపంచ మానవులందరి తరపునా ఆమె ఈశ్వరుణ్ణే ప్రార్థించింది. విలువలలో పతనమైన దైవమందిరాల వద్ద శాంతినీ ఆనంద వికాసాలను పంచమన్నది. పొరపొచ్చాలతో చీలుబాటలు పట్టిన ప్రజలను సమాధానపరచమని వేడుకొన్నది. ఒక్కమొక్కలో

తాడితపీడిత జనావళికి శుభం పూచేలా, యావత్తు మానవ కుటుంబానికీ మంచి సమకూడేలా మార్గాన్ని సుగమం చేయి తండ్రీ అని ఈశ్వరుణ్ణి ఆవాహనం చేసింది.("O God, the Father of all / You ask every one of us to spread/ Love where the poor are humiliated /... And reconciliation where people are divided... You open the way for us... for the poor of the earth and in the/ Whole human family"- "The Taize Prayer")!! థెరిసాలోని ఈ విలక్షణ వ్యక్తిత్వమే విశ్వమానవతా శిఖరాలను ఆమె అధిరోహించేట్టు చేసింది. సుశిక్షణతో మెసలే ఉల్లాసవంతమైన కుటుంబ జీవనం మానవాళికి అవసరమని చెప్పింది థెరిసా. ఎందుకట? ''ప్రపంచ శాంతికి విఘాతమంతా సొంత కొంపలోనే ప్రారంభమవుతుంది కాబట్టి'' అన్నది థెరిసా! శ్రమజీవనం, ప్రార్థన, దాతృత్వం, ఉదారదృష్టి, సేవాధర్మం, జీవించే హక్కును గుర్తించడం, ప్రేమించడం- ఇవన్నీ బేషరతుగా, పరిపూర్ణంగా అమలులోకి రావాలన్నది ఆమె ఆకాంక్ష. ఈ సమాజం మానసిక ఔన్నత్యాన్ని ఎపుడు చేరుకుంటుంది? సేవా నిరతిని పరసీమలకు చేర్చుకోవడంలో స్వచ్ఛందంగా మనం నిరాడంబరతను ఎప్పుడు ఆశ్రయిస్తామో అప్పుడు సామాజిక ఔన్నత్యం సిద్ధిస్తుందంటుంది థెరిసా! అంతేగాదు, తన తొలి శిష్యురాలైన సుభాషిణీదాస్ (బెంగాలీ)కు జీవిత సాఫల్యానికి ఏడు సూత్రాలు చెప్పింది థెరిసా. అవిః ఆరోగ్యవంతమైన శరీరం, ఎదుటివారు చెప్పేది వినిపించుకొనే ఓర్పు, నేర్చుకోవాలన్న తపన, జీవితంపట్ల ఉత్సాహం, అపారమైన ఇంగిత జ్ఞానం, నవ్వుముఖంతో ఉండడం, ఎంత క్లిష్టమైన, అనిష్టమైన పనినైనా చేయడానికి సిద్ధంగా వుండడం! థెరిసా ఇంకా ఎంతకు తెగించగలదంటే '' ఒకవేళ చంద్రలోకంలో నిరుపేదలున్నాసరే అక్కడికీ మన సేవలు విస్తరించవలసిందే''నని భావితరానికి కూడా బ్లూప్రింట్ సిద్ధంచేసింది! దానగుణం ఒక అలంకారంగా మారకూడదనీ, అది మానవుడి అవసరాన్ని తీర్చే పరుసవేదిగా ఉండాలనీ ఆమె బోధ. రోగి దారుణ మరణావస్థలో కూడా తన సేవా స్పర్శతో థెరిసా ప్రశాంత మరణాన్ని ప్రసాదించగల దిట్ట! అందుకేనేమో మహాత్ములలో మైత్రీభావం తాత్కాలికం కాదు శాశ్వతం అంటారు పెద్దలు (''ఆమరణాంతాః ప్రణయాః'')!! థెరిసాను మరిచి ఈ విశ్వం ఉండలేదు, ఈ ప్రపంచాన్ని మరచి థెరిసా అక్కడా ప్రశాంతంగా ఉండలేదు!

*(ఆదివారం 7, సెప్టెంబరు 1997)*

# శ్రీనివాస్ విధించుకున్న స్వయం ఖైదు- ''హో''!!

ఆంధ్రదేశంలో ''కవిత్వం ప్రచురణలు'' అంటే చాలు- యువకవి త్రిపురనేని శ్రీనివాస్ గుర్తుకు వస్తాడు, లేదా అతని పేరు తెలిసినా అతని ప్రచురణలయినా జ్ఞప్తికి రావలసిందే. కాని సాహిత్యంలో వక్రోక్తులకూ, వంకర దృష్టికీ తేడా తెలియనివాడు శ్రీనివాస్. అస్పష్టత కవిత్వంలో కాదు జీవితంలోనే ఉందని ఊహించిన శ్రీనివాస్ తన కవితా ఖండికలలో తరచుగా దర్శనమిచ్చేది అస్పష్టత అనే మాధ్యమంలోనే అని మరచిపోరాదు. అప్పుడప్పుడూ శకలాలుగా కొన్ని అద్భుత భావ చిత్రాలు చూపించగల శక్తి ఉన్న శ్రీనివాస్ స్త్రీ-పురుష సంబంధాలపై తప్పుడు ధోరణులు వ్యాప్తి చేయడంలో కూడా దిట్ట. దారితప్పిన ఈధోరణి పరిశీలనే ప్రస్తుతాంశం.జీవితం నడిపొద్దుకు చేరకముందే అకాల మరణం చెందిన చిరంజీవి శ్రీనివాస్ అముద్రిత రచనలను అతని మిత్రులు కొందరు ''హో'' సంపుటంగా వెలువరించారు. కాని సమాజంపట్ల, వివాహ వ్యవస్థ పట్ల శ్రీనివాస్‌కు ఉన్న కొన్ని అవాస్తవిక, అధివాస్తవిక, అరాచకపు అభిప్రాయాలను ఆసరా చేసుకొని, వాటి నీడలలో ఈ సంపుటిలో కొందరు 'గ్రాఫితీ' పేరుతో దాని కొన్ని ప్రక్షిప్తాలను పేర్చారు. ఇవి జుగుప్సాకరమైనవేకాదు. వైయక్తికంగానూ,సామాజిక పరంగానూ పనికిమాలిన నినాదాలుగా ఉన్నాయి. బూతులతో 'గ్రాఫితీ'ని అలంకరించారు. గతి తార్కిక భౌతికవాదాన్ని ''రతి తార్కిక భౌతికంగా''మార్చారు! అతి స్వేచ్ఛా ప్రియత్వం ముసుగులో తమలో మగ్గుతున్న వక్రభావాలను వెల్లడించుకున్నారుః ''ఈ రాత్రికి నీ ఇంటికి కన్నం వేస్తా/ పోతూ పోతూ నీ పెళ్లాన్ని లేపుకుపోతా'' అని చెప్పి అరాచకానికి ఎత్తుపీట వేశారు. ''హో''లో ఇలా అజ్ఞాతంగా, అందులోనూ అసలు కవితకు ఏమాత్రం సంబంధం లేకుండా గ్రాఫితీని చొప్పించిన వారికి ప్రోత్సాహం అసలు శ్రీనివాస్ కవితల్లోనే ఉంది! లేకపోతే ''మిత్రులు'' ఈ సాహసానికి ఒడికట్టరు! ''స్త్రీవాదులం'' అని చెప్పుకొనే మగవాళ్ళు కొందరు స్త్రీవాదులు కారనీ, 'స్త్రీవాదం' పేరిట చేస్తున్న పని స్త్రీని అవమానించడమేనని, కుటుంబ వ్యవస్థను సర్వనాశనం చేయడం, దారీ తెన్నూలేని అరాచక ప్రేమను ప్రోత్సహించి స్త్రీని ఒక ఆటవస్తువుగా

మలచుకోవడం కొందరి లక్ష్యమనీ ఈ పుస్తకం చదివితే అర్థమవుతుంది! ఈ ''హో''లో శ్రీనివాస్ చేసిన పని- చెడు సంప్రదాయాలను ఉల్లంఘించే పేరిట అరాచక ప్రవృత్తికి దారితీసే విశృంఖల ప్రేమకు వాకిళ్ళు తెరవడం. ''కొన్ని కొత్త సంగతులను/ పాతగా చెబితేనే కొత్తగా అర్థమవుతాయి''ని మొదట్లోనే శ్రీనివాస్ ప్రకటించి, అర్థంపర్థంలేని సంగతులను అర్థంగాకుండా చెప్పాడు! ''సత్యం దారి తప్పుతోంది'' అని భావించినప్పుడు ఆ దారి తప్పిన సత్యమేదో ఎందుకు స్పష్టం చేయడు? సమాజాన్ని చూసి భయపడి ఉంటాడు, అందుకే స్పష్టతాస్పష్టతల మధ్య ఊగిసలాడాడు, అస్పష్టతా మాధ్యమంతో అరాచక భావాలకు ఆహ్వానం పలికాడు! ''చర్మపు సరిహద్దులేని ప్రేమను చూపొచ్చుగాని'' అతని అసలు ఉద్దేశం వేరు!

ఆంక్షలనూ, అలవాట్లనూ అతిక్రమించగలిగిన పట్టుదల ఈరోజు కాంక్షలకూ, వాంఛలకూ ''బాధ్యతగా'' ఎందుకు లొంగిపోవలసి వచ్చిందో మనకు ఆచూకీ దొరకదు. శ్రీనివాస్ దృష్టిలో ''బాధ్యత అందమైన పలాయనవాదం''గా మారిపోయింది. కనుకనే గురజాడ ప్రేమకు ఇచ్చిన నిర్వచనం శ్రీనివాస్ చేతిలో విశృంఖలతకు తలుపులు తెరిచే తలపుగా మారింది! ''బాధ్యత'' శ్రీనివాస్ చేతిలో పలాయనవాదం కావడం బాల్యచాపల్యం! '' ఆడలూ- మగలూ'' అనే కవిత ఈ''హో''సంపుటికి అసలు సిసలు ఎజెండా! ప్రబోధించే అసలు తత్వం-ఫ్రీసెక్స్, కాని అతను అలా అని చెప్పకుండా చెబుతాడు. ఇతనికి ఫ్రాయిడ్ థీరీ ఒంటబట్టినట్టుంది. మానవ జీవితంలోని అన్ని వ్యాపకాలనూ (రాజకీయ,సాంఘిక, ఆర్థిక) 'సెక్స్' చట్రంలోకి దించి, నిత్య నైమిత్తికాలన్నింటినీ 'సెక్సే' నిర్ణయిస్తుందన్న తప్పుడు భావనకు ఇది స్వాగతం పలుకుతుంది. కొందరు పురుష రచయితలు,కవులూ 'ఫెమినిజాన్ని' (స్త్రీవాదం) తప్పుగా అర్థం చేసుకోడమేగాదు, ఆ పేరుతో స్వార్థచింతనతో, తమలో అజ్ఞాతంగా ఉన్న లైంగిక వాంఛలతో విశృంఖలతకు దారితీయాలని చూస్తున్నారు. ఈచూపుతో తమ తల్లుల్ని, అక్కచెల్లెళ్ళను వారి భవితవ్యాన్నీ వారు మరచిపోతున్నారు. అణగారిన జీవితాన్ని సుఖమయం చేసుకోవడం కోసం,తరతరాలుగా అబలగా,అసహాయ శక్తిగా పడి ఉన్నస్త్రీమూర్తి తన బాటలోని ముళ్ళకంచెలను తొలగించుకొని మార్గాన్ని సుగమం చేసుకోవడానికి, మనుషుల మధ్య సాధారణ సంబంధాలే స్త్రీపురుషుల మధ్య సంబంధాలను కూడా శాసించాలనీ, సమానత్వాన్ని ఆచరించాలనీ కోరుకుంటుంది జీవనం సాఫీగా సాగాలనీ, విద్య, ఆరోగ్యం, ఉపాధి సౌకర్యాలు పొందడం కోసం దోపిడీ వ్యవస్థ రద్దు

కావాలనీ కోరుకుంటున్న స్త్రీ తపనను మరోలా వక్రీకరించే హక్కు మనకులేదు.'అతడి' వాంఛను ' ఆమె' వాంఛగా ఫోర్జరీ చేసే హక్కు మనకు లేదు. కాని సైద్ధాంతిక 'నిబద్ధత'ను కోరే శ్రీనివాస్ సాంసారిక జీవితంలో ప్రేమికుల 'నిబద్ధత'ను ఆవహేళన చేస్తాడు! సంప్రదాయకుల 'నిబద్ధత' పరమ స్వార్థంతో ఛాందసంతో కూడుకు న్నదయితే, శ్రీనివాస్ ప్రేమిస్తున్నానని చెప్పుకొనే 'నైతికతత్వం' (మరోపేరు విచ్చలవిడితనం లేదా విశృంఖలత్వం) అంతకన్నా పచ్చి స్వార్థంతో కూడుకున్నది!! మహిళ వ్యక్తిత్వానికి, స్వతంత్రబుద్ధికీ దివిటీలు పట్టిన ప్రపంచ స్త్రీవాద తాత్వికులలో ప్రసిద్ధురాలైన సిమన్ ది బోవిర్ స్త్రీని ఒక్కో పురుషుడు ఎలా ప్రలోభ పెట్టజూస్తాడో చెప్పింది. తన అహాన్ని చాటుకోడానికి ఎన్ని ఎత్తులువేస్తాడో చెప్పింది: **"Men profit in many... subtle ways from the otherness, the alterity of woman... indeed no one is more arrogant- toward women, more aggressive or scornful, than the man who is anxious about his virility".** ఈ అహంకారమే వ్యక్తిని బరితెగించేటట్టు చేస్తుంది. మగవారిలోని కుహనా 'స్త్రీవాదుల' తంతు కూడా ఇదేనని గుర్తించాలి. స్వేచ్ఛ చాటున, ప్రేమ మాటున కాపుకాసి ఉన్న కొందరు కాటు వేయజూసేది ఈ దోపిడీ వ్యవస్థను కాదు, స్త్రీలనేనని మరవరాదు! ''.ఒక స్త్రీకి ఒక పురుషుడ''నే నైతికతత్వంపై కుహనా మగ స్త్రీవాదులు చేస్తున్న దాడి స్త్రీకి నిజమైన స్వేచ్ఛను వాంఛించి మాత్రం కాదు. జీవితం క్షణికమని భావించి క్షణికానందం పేరిట మంచి కట్టుబాట్లను కూడా తెంచడం వీరి ఆశయంగా, ఆదర్శంగా కనిపిస్తోంది. స్వార్థపూరిత విశృంఖల లైంగికానందం వీరి ధ్యేయం. ఒక స్త్రీకి ఒక పురుషుడనే నైతికతత్వాన్ని ''మురికి రక్తంగా'' భావించే అభినవ మగ స్త్రీవాదులు అసలు వివాహ జీవితాన్నే ఈసడించుకుంటున్నారు. మనస్సులో పుట్టిన ఈ 'ఎయిడ్స్'కు ఇక మందులేదు! యువత ఆలోచనా స్వేచ్ఛ రెక్కలు తొడగవచ్చుగాని అదుపు తప్పి, మానవ సంబంధాలలోని మంచి నియమాలను కాలదన్నే కల్లోల తరంగాలను ఆహ్వానించకూడదు. మానవ సంబంధాలన్నింటినీ ఒక్క 'సెక్స్' నిర్ణయించి ఉంటే- సమాజ చరిత్ర వేరుగా ఉండాలి! కేవలం లైంగికానందాన్నే మొత్తం జీవితానికి, జీవన సరళికీ పరమ లక్ష్యంగానూ చరమ సందేశంగానూ అందించలేము. అలా జరిగే ఉంటే- మానవాళి ఇంత ప్రగతిని సాధించడానికీ, ఇంతటి వస్తుజాలాన్ని సృష్టించడానికీ, ఇంతగా ఉత్పత్తుల సముదాయాన్ని పెంచడానికీ, సంపదను కూడబెట్టడానికీ తగిన వ్యవధి ఉండేదేకాదు! ఇదొక్కటిచాలు, మానవ పురోగతిలో 'సెక్స్' పరిమిత పాత్రను ధ్రువపరచడానికి! ''వన్ ప్లస్ వన్

వైభవాన్ని'' ద్వేషించి సాధించే ఆ వైవాహిక సమతుల్యత ఏమిటో కుహనా మగ స్త్రీవాదులు చెప్పలేరు! వీరు వాదన కోసం ఆధారపడుతున్న శ్రీనివాస్ అంతకన్నా చూపలేడు! ఆ కంట్రోల్ వారికి లేదు. అందుకే ఎర్నెస్ట్ జోన్స్ అంటాడు: మనిషి ప్రకృతిపై కంట్రోల్ సాధించినంతగా తనను తాను అదుపు చేసుకోలేకపోతున్నాడని! అనేక రకాల ప్రలోభాల నుంచి బయపడజూస్తున్న మహిళతో చేతులు కలిపి ఆమె విమోచనకు చేదోడు వాదోడు కావలసిన మగ స్త్రీవాదులు ఆమెను కొంటె చూపులతో, తుంటరి ఆలోచనలతో కవ్విస్తూనే ఉన్నారు! ఈ అతివేలంలో కొందరు స్త్రీవాద యువతులు కూడా పాలుపంచుకోవడం దురదృష్టకరం హెన్రీ మిల్లర్ (మారుపేరు ''వాల్'') ఈ 'స్త్రీవాదం' పేరుతోనే తన మిత్రుడైన బిల్ ఊడ్రఫ్ భార్య ఇడా వెర్లీన్‌ను ప్రలోభపెట్టి లొంగతీసుకోడానికి ప్రయత్నించినపుడు- ఆ చర్యను విమర్శకులంతా **"Intercourse in the service of power"** అని శరించవలసి వచ్చింది! అందుకే ఒకప్పుడు మిల్లర్ రాసిన ''సెక్సస్'' పుస్తకాన్ని వివాహేతర సంబంధాలనూ, విశృంఖలతను ప్రోత్సహిస్తున్నందుకు నిషేధించారు కూడా. అంతేకాదు ''సెక్సువల్ పాలిటిక్స్'' ''గ్రంథం రాసిన ప్రసిద్ధ స్త్రీవాద రచయిత కాటే మిలెట్ కూడా మిల్లర్, డి. ఎన్. లారెన్స్, జీన్‌జెనే రచనలలోని అతిలోలతను, విశృంఖలతనూ ఖండించవలసి వచ్చింది. ప్రపంచ తొలి స్త్రీవాదులలో ఒకరైన ఊల్‌స్టోన్ క్రాఫ్ట్ సహితం స్త్రీపట్ల పురుషుడి దృక్పథాన్నిబట్టే స్త్రీ తన కర్తవ్యాన్ని నిర్వచించుకోవలసి ఉంటుందని చెప్పింది. స్త్రీ విద్యావంతురాలైతే ఆమె తరఫున అసలు ఎవరూ వకల్తా పట్టవలసిన అవసరంగాని, వారు ఇతరుల వయువంచనకు గురికావలసి అవసరంగానీ లేదని కూడా స్పష్టం చేసింది.

కొందరు మగ స్త్రీవాదుల గాడి తప్పిన మనసూ, దారితప్పిన వాదనలూ ఎలా ఉంటాయెూ కార్ప్‌మన్ ''ది సెక్సువల్ అఫెండర్''లోనూ, గట్మాచర్ ''సెక్స్ అఫెన్స్‌స్''లోనూ వివరించారు · **Perversity is a sexual act that defies the biological goal of procreation!** మానసికమైన ఈ వక్రగతిలోనే శ్రీనివాస్ ఆలోచనలు కూడా సాగాయి. స్త్రీని పంజరంలో బంధించి ఉంచడం ఎంత తప్పో, పురుషుడి విశృంఖలత్వం (శ్రీనివాస్ మాటల్లో) ''చప్పుడు చేయని సైగలు'' కొట్టడం కూడాఅంతే తప్పుకాదా? కుటుంబ వ్యవస్థ అనుబంధాలకు దూరంగా కూలిపోతు న్నందుకు అమెరికన్లు కుంగిపోతుండగా, ''వన్ ప్లస్ వన్ వైభవా''న్ని ద్వేషించి ఎంతోమంది పిల్లల్ని అభినవ కుంతులుగా చేసినవాళ్ళు చిరునామాలు లేకుండా అక్కడే కాదు ఇక్కడా

ఉడాయిస్తున్నప్పుడు బాధ్యతలేకుండా మనం ''బాధ్యతను అందమైన పలాయనవాదం''గా ప్రకటించవచ్చా? ఇది నకిలీతనమా? వెకిలితనమా? ఈలెక్కన 'ఫ్రీ సెక్స్' వాదన ప్రభంధ కాలం నాటి క్షీణయుగానికి దారితీస్తుంది. ప్రజల్ని కేవలం కాముకత్వ పరాయణులుగా మార్చడానికి ఆ యుగపు సాహిత్యం తోడ్పడింది కనుకనే, కేవలం శబ్దాల హోరుతో బాధ్యత లేకుండా చమత్కారీ చమత్కారాలతో కవులు పాఠకులను మురిపింపజూశారు కాబట్టే, సుప్రసిద్ధ విమర్శకులు పింగళి లక్ష్మీకాంతం ఇలా వ్యాఖ్యానించవలసి వచ్చింది. ''ఒక అర్ధశతాబ్దంలో తంజావూరు ఆస్థానం మన్మథుడి కొలువు కూటం'' అయిందని! ఆ కొలువులు ఇప్పుడు మనకొద్దు. రసానందానికి అర్థం ''వన్ ప్లస్ వన్'' జీవితాన్ని చిందరవందరచేసి 'టూ-ఇన్-వన్'గానో, ''మల్టిపుల్- ఇన్-వన్''గానో మార్చుకోడంకాదు! 'ఫ్రీ-సెక్స్' పేరిట విశృంఖలతను సమాజ బాధ్యతలకు దూరంగా ప్రాపంచిక దృక్పథంగా ప్రచారం చేయకూడదు. ఊహాలోకంలో జీవిస్తూ స్వచ్ఛంద సంచారిణీ వ్యవస్థగా సమాజం రూపుదిద్దుకోవాలనుకొని భావిస్తున్నారా వీరు? తన నిర్వచనతో విభేదించేవారు శ్రీనివాస్ దృష్టిలో ''ప్రేయసీ ప్రియులే కాదు'', అసలీ ''దేశంలో అందరూ భార్యాభర్తలే''. ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును, ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును అన్నాడు గురజాడ. ప్రేమ నిలిచినప్పుడు ఈ తేడాలకు ఆస్కారమేలేదు. ప్రేమ నిలవదూ- అప్పుడూ వ్యక్తులు భార్యాభర్తలయినా ఒకటే, ప్రేయసీ ప్రియులైనా ఒకటే! అప్పుడు తెరుచుకొనేది విడాకుల పర్వమే. చడీచప్పుడూ లేకుండా ఒకరి నుంచి మరొకరు దూరం కావడమే, కొత్తదారులు వెతుక్కోడమే! శ్రీనివాస్ దృష్టిలో ప్రేమ అంటే 'సరిహద్దులు లేని స్వేచ్ఛా మానసం'. ఒప్పుకుందాం. కాని ఆ తర్వాతి మాట- ''ఇనుప ముళ్ల ఫెన్సింగులులేని''వాతావరణం కావాలని కోరడం స్వార్థపూరిత వాంఛలను ఈడేర్చుకోడానికి ఉద్దేశించిన తత్వం! పెద్దనగారి ''వరూధిని'' ఇనుపకచ్చడాల గురించి ఇంతకన్నా ఘాటుగానే వదరినప్పుడు అందుకోసం శ్రీనివాస్‌ను ఇప్పుడు ప్రత్యేకించి పాఠకులు ఆశ్రయించాల్సిన అవసరంలేదు! ఆ 'ఫెన్సింగ్‌లు లేని' 'ప్రేమ ఏవిటో నిర్వచించడు! కాని అదేమిటో మనం అర్థం చేసుకోగల రీతిలో చెబుతున్నాడు వినండిః '' ఇంతకీ ఎవరిని ఇష్టపడటం ఇంతమందిని ప్రేమిస్తూ'' అంటాడు; ''ఒకే పైకప్పుకింద నివసించే ప్రేమల్లో/కిలోమీటర్లు ఎక్కువ'' అనుకొంటాడు. అటు పెళ్ళినీ, ఇటు సంతాన వైభవాన్నీ చీదరించుకుంటూ చేస్తున్న పని- విచ్చలవిడితనం, ఎవరితోపడితే వారితో తిరగ్గలిగిన 'స్వేచ్ఛ' కావాలి ఇతనికి. ఒప్పుకోళ్ళూ, విన్నపాలూ అందరికీ

సాధ్యమయ్యేపనికాదు- ఏ ప్రకాశం పంతులుకో, శ్రీశ్రీకో, ఏ ఫ్రాంక్ హారిస్‌లాంటి వాళ్ళకో మాత్రమే 'కన్‌ఫెషన్స్' సాధ్యం. వివాహాన్ని శ్రీనివాస్ రోజువారీ సరుక్కి అమ్మకం లైసెన్సులా భావిస్తాడు. బేరం కుదిరితే శరీరం చేతులు మారుతుందని మగ స్త్రీవాదులు స్త్రీమూర్తినే అవమానిస్తున్నారు. స్త్రీ రుతు సమస్యను వ్యంగ్యార్థంలో చిత్రించాడు శ్రీనివాస్. పెళ్ళీగిళ్ళీ అని సహజీవనం (ఫ్రీ సెక్స్) చేస్తే న్యూసెన్స్ అన్నారని చెప్పి, ''న్యూసెన్స్''నే తన కొత్త భావంగా మార్చుకున్నాడు! ఎప్పటికప్పుడు ఇతరుల స్వప్నాలను సందర్శించాలనే కోర్కె, కట్టలుతెంచుకొనే తన శరీర వాంఛకు ఎవడు ఆక్షేపణ తెలిపినా అది అతనికి ''ముట్టడి''గానే తోచడం మరో వింత ప్రకృతి. సిమన్ ది బోవర్- జాపోల్ సార్త్, ఉప్పల లక్ష్మణరావు- మెల్లీ షోలింగర్‌లు ప్రేయసీ ప్రియులుగానే బతికినా పక్కచూపులు లేకుండా బతికారు! పదిమందికీ ఒప్పుదలయ్యారు. ఈ జీవితానికి కావలసింది ప్రధాన విషయం- ఆవేశమూ కాదు, ఆబాకాదు, అవగాహన, సదవగాహన! శ్రీనివాస్ కవితలో అరాచకానికి పరాకాష్ఠ: ''భార్య కాదు, ప్రియురాలు కావాలి. సంసారం కాదు సాగరం కావాలి- కుటుంబం కాదు ఛిన్నాభిన్నం కావాలి... అందుకే నేను బ్రహ్మచారిని''! నిజానికి కొందరు బ్రహ్మచారులు కారు, ఘోటక బ్రహ్మచారులు! అందుకే అన్నదేమో వర్జీనియా ఉల్ఫ్: "Shut the eyes that rain influence' అని! కనుకనే శ్రీనివాసే చెప్పినట్టు తనను తానే స్వయం ఖైదు చేసుకున్నాడు! ఎవరో ఒక ఆమె అందం ఎప్పుడూ తన కళ్ళలో నీడలా వెన్నంటుతున్నంత కాలం ఎవరికైనా ఆ ఖైదు తప్పదేమో!

*(ఆదివారం 10, ఆగస్టు 1997)*

# జీవనజ్యోతిగా వెలుగుతున్న సాహితీదీపం 'సందేవ్'

"రవీంద్రుని గీతాంజలికి సందేవ్ రాసిన పీఠిక ఎక్కువ సత్తా కలిగి ఉన్నది, ఏట్స్ రాసిన పీఠిక కంటే అనే దానితో నేను వినయంతో అంగీకరిస్తాను. ఆయన నాకంటే అనేక విధాలుగా గొప్పవాడు. అయినప్పటికీ ఒక్కోసారి కొద్దివాళ్లు కొన్ని సందర్భాల్లో గొప్పవాళ్లను మించుతారు. అంతమాత్రాన ఆ కొద్దివాళ్లు గొప్పవాళ్లు కారు". ఇంతకూ ఇంత దమ్ములతో ఈ మాటలు రాసిన తెలుగువాడెవరు? మరెవరోకాదు, లేఖా విద్యలో, చిత్రరేఖా విన్యాసంలో వింత పోకడలు పోయిన, పోతున్న, ప్రసిద్ధ చిత్ర కళాకారుడు, కవీ, కళా విమర్శకుడూ అయిన సంజీవ్‌దేవ్. మిత్ర రచయితలకు, చిత్రకళాకారులకు, సహృదయులకు ఆయన రాసే సుహృల్లేఖల్లో అప్పుడప్పుడూ తనకు తానై తగిలించుకునే ముద్దుపేరు 'సందేవ్'. అతని ముందు మరణమృదంగాలు చప్పుడు చేయడానికి సాహసించవు! శబ్దాన్ని రూపంతో ఛేదించగల సంజీవ్‌దేవ్ జీవితాన్ని ప్రేమించినవాడు, ప్రేమించి ఆరాధించినవాడు కాబట్టి తనను జీవన 'సంజీవి'నిగా చెప్పుకొన్నాడు! కనుకనే ప్రపంచంలో మరణించేవాళ్లను అతను మరణించనివ్వడు, బాధపడేవాళ్లను బాధపడనివ్వడు. ఎందుకని? బాధ, మరణం అన్నవి అతని దృష్టిలో చీకటికి సంకేతాలు, వాటికి వ్యతిరేకమైనవన్నీ వెలుగుకు చిహ్నాలు! అతనికి ప్రకృతి, మానవ జీవితం ఆరాధ్యదైవాలు. రూపానికి స్వరూపం తెచ్చినవాడు, స్వభావం అబ్బించినవాడు. రసస్పష్టికే కాదు, రసదృష్టికీ వైజ్ఞానిక స్పృహ కల్పించినవాడు! లలిత కళారాధనను 'ఖుషీ'లోకపు వ్యాపక చాపల్యంగా కాకుండా ప్రజాయుక్తర చేయవలసిన బాధ్యతగా భావించి సామాన్యుల అభిరుచిని పెంచినవాడు. "లలితకళలన్నింటికీ జనని మానవ జీవితం. దాన్నుంచే సకల కళలూ, సమస్త శాస్త్రాలూ ఉద్భవిస్తాయి. కాబట్టే వీటన్నిటికంటే జీవితమే గొప్పది." ఈ తాత్త్విక చింతనతో తన తనాన్ని దిద్ది తీర్చుకుంటూ వచ్చిన మన 'సందేవ్' కుంచె మెరుగులేకాదు కలం మెరుపులూ చూపినవాడు. కలం కల కూజితాలలోనూ రచనా ప్రక్రియలలోనూ కూడా వైవిధ్యం చూపాడు. కవనంలో, చిత్రకళా దవనంలో అతిసూక్ష్మాతి సూక్ష్మమైన విషయాలె

న్నింటినో దర్శించి, రచనల ద్వారా గోష్ఠి కార్యక్రమాల ద్వారా, ఉపన్యాసాల ద్వారా వివేచనతో విపులీకరించిన కళాతపస్వి సంజీవ్‌దేవ్. జీవితంలో సర్వత్రా ఆయనది స్వాధ్యాయనమే. మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్ ''లోకసంచారి''లోని కథానాయకుడు సాక్షాత్తూ సందేవ్ కాకపోవచ్చుగాని, నిజమైన లోకసంచారి. కుమావ్ హిమాలయ ప్రాంతంలో బెంగాలీ సంపాదకులతో సాహచర్యం, అక్కడి రామకృష్ణ మిషన్ పత్రికా కార్యాలయమూ, అక్కడి సువిశాల గ్రంథాలయమూ పదహారేళ్ల 'సందేవ్' భావికి పరసువేది కావడం- అతని మూర్తిమంతాన్ని సుసంపన్నం చేసిన గొప్ప పరిణామం. విద్యలోనేకాదు, చిత్రకళా విద్యలోనూ తనకు గురువు తానే అయ్యాడు. ప్రసిద్ధ చిత్రకారులు, శిల్పులూ ప్రొఫెసర్ అసిత్‌కుమార్ హల్దార్, నికొలస్ రోరిక్‌లతో (కులూ లోయలో) ఏర్పడిన పరిచయాలు ఆయనిలో సరిహద్దులు లేని ప్రాపంచిక దృక్పథాన్ని పెంచాయి. విశ్వమానవునిగా తీర్చాయి. లలిత కళా సంస్కృతులతో, సాహితీ చిత్ర కళామూర్తులతో ఏర్పడిన సంబంధాలు క్రమంగా ఆయనను కవి, కళాకారుడుగానే కాదు, సుప్రసిద్ధ లేఖకుడుగా కూడా తీర్చిదిద్దాయి. కేవలం స్వయంకృషితో ఎదిగివచ్చి ఆంధ్రాంగ్ల సాహితీ స్రవంతిలో కలగలసిపోయాడు. ఈ పరిణామం ఫలితం- ఆయన కలం నుంచి జాలువారిన ''రసరేఖలు'', స్మృతిబింబాలు, తేజోరేఖలు, దీప్తిధార, తెగిన జ్ఞాపకాలు, లోగడనే వెలువడిన ''గ్రే అండ్ గ్రీన్'', ఇటీవల వచ్చిన ''హర్ వైఫ్'', ''డస్ట్ అండ్ మిస్ట్'' ఆయని ఆంగ్ల కవితలూ, రచనలూ కాగా లేఖా సాహిత్యలో సంజీవ్‌దేవ్ తన తనాన్ని ప్రత్యేకంగా ముద్రవేసుకున్న రచయిత. ఇవి ''పోస్టు చేయని ఉత్తరాలు'' కావు, పోస్టు చేసిన ఉత్తరాలు! వివిధ స్థాయిలలోని ప్రముఖ రచయితలతో, విశిష్ట వ్యక్తులతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు అనుభవ పూర్వకంగా రసజ్ఞులకు పంచిన సాహితీ మాధుర్యాలు. ''సంజీవ్‌దేవ్ లేఖలు'', ''లేఖల్లో సంజీవ్‌దేవ్''అన్న రచనలు ఇంతకుముందు వెలువడగా, తాజాగా విడుదలకు సిద్ధమవుతున్న మరో లేఖాసాహితి ఆయని ''లేఖాలాస్య''! పద్యకవీ, కళా విమర్శకుడూ అయిన జాషువాతో (హిల్ కాలనీ జాషువా) సంజీవ్‌దేవ్ సాగించిన ఉత్తరాలే ఈ ''లేఖాలాస్య''. అచ్చుకూర్చినట్టు కనిపించే అతి సుందరమైన దస్తూరీతో సందేవ్ వ్రాసే లేఖలు మనోపర్వంగానే కాదు, నేత్రపర్వంగా కూడా ఉంటాయి. అంతకన్నా ఈయని లేఖల్లో గొప్పదనం- అవి లోక విజ్ఞానాన్ని మూటకట్టుకోవడం. పరిసరాల వర్ణన, మానవ సంబంధాలు, ఆ సంబంధాలలోని మంచిచెడులూ, సాహిత్య, కళాచర్చ, సాధారణ విషయాలు, మానవీయ

స్పర్శ, ఆప్యాయతలు, అనురాగాలు, అనుబంధాలు, పలకరింపులు, మర్యాదలూ, సాంద్రమర్యాదలూ- ఇన్నింటికి ఆశ్రయాలు ఆ లేఖలు. అపజయాలను కూడా జీవితంలో కాంతిరేఖలుగా భావించిన ఆశావాది, దార్శనికవాదీ కనుక ఆల్డస్ హక్స్‌లీకి ఒకప్పుడు రాసిన లేఖలో సంజీవ్‌దేవ్- భేదాభిప్రాయాలు మానవాళిని చీల్చుతాయంటారు కాని, అవే మానవాళి మధ్య సమైక్యతను కూడా సాధిస్తాయంటాడు. భిన్నత్వంలోనే మానవాళి ఏకత్వం ఉందని విశ్వసించిన సంజీవదేవ్ లేఖా సాహిత్యం విశ్వసాహిత్యంలో ఉద్దండుల లేఖలకు ఏమీ తీసిపోవని చెప్పొచ్చు. ఆ మాటకొస్తే లేఖాసాహిత్యంలో పాశ్చాత్య సంప్రదాయం ప్రభావం ఆయనమీద లేకనూ పోలేదు. సంజీవ్‌దేవ్‌కు సూక్ష్మ పరిశీలన జాస్తి. చిత్రకారుడు శల్య పరీక్షకుడు. అతనిలోని కవి మనస్తత్వ శాస్త్రవేత్త. అందువల్ల సామాన్య మానవులలోని ఎత్తుపల్లాలు చిత్రకారుడిలోనూ, కవిలోనూ కూడా ఉంటాయి. ఎందుకంటే ఆంటోమీ కాస్టగ్నరీ అనే కళాకారుడు చెప్పినట్లు "The painter of our own time will live our own life, with our own habits and our own ideas". మన సందేవ్ కూడా ఎమిలీ డికిన్సన్‌లా స్వయం ప్రతిభతో, నిరాసక్తంగా సాహితీ, కళా గిరిశిఖరాలందుకున్న వ్యక్తి, సర్వ స్వతంత్రుడు, స్వేచ్ఛాప్రియుడు, నిష్కాగరిష్ఠుడు. చలం లేఖలు, వజీర్ రహ్మాన్‌తో ఉత్తరప్రత్యుత్తరాలు, ఖలీల్ జిబ్రన్ ప్రేమలేఖలూ, ఇందిరకు నెహ్రూ లేఖలు, యాండ్రూస్‌కు టాగూర్- లేఖలు సాహితీరంగంలో, మానవ సంబంధాలలో, తాత్విక చింతనలో ఉప్పెనలేపిన రచనలు. సందేవ్ లేఖలూ రసగంగాధరాలు. పాశ్చాత్య సాహితీ ప్రపంచంలో ఎమిలీ డికిన్సన్ లేఖలు మూడు సంపుటాలుగా (Edited by Thomas Johnson 1958) వెలువడ్డాయి. రచయిత మనోమందిరాన్ని నాలుగంచులూ తీరి ఈ లేఖలు కళ్లముందు ఆవిష్కరిస్తాయి. చర్చ ఒకచోట ఆగదు. స్థలకాలాలకు పరిమితంగాని స్వకపోల దృశ్యాదృశ్యాలు ఎన్నో గొప్ప రచయితల లేఖల్లో ఆవిష్కరించుకుంటాయి. సంజీవదేవ్ తాజా ''లేఖాలాస్య''లో జీవనతత్వాన్ని గురించిన దృక్పథం, దృశ్య వర్ణనం, ప్రవృత్తి, నివృత్తి సమస్యలూ, రచనా కౌశలం గురించి, రచనా వైచిత్రి గురించీ, పాజిటివ్ ఫీలింగ్స్ గురించీ అభివ్యక్తి ఉంది. రచయిత మనఃక్లేశాలను కాదు, వ్యక్తిత్వ వికాసం తాలూకు నిమ్నోన్నతాలను ఈ లేఖలు ప్రతిబింబిస్తాయి. ఇంగ్లండ్‌లో బిర్కెన్ హెడ్ ''లా, లైఫ్ అండ్ లెటర్స్'' అన్న పుస్తకం రాసిన తర్వాత ఆంగ్ల సాహిత్యంలో ఉత్తమంగా భావించిన అయిదు వందల ఉద్దండుల లేఖలను సంకలనంగా తెచ్చాడు ("The Five hundred Best English Letters")! ఈ సంపుటికి ముందుమాట రాస్తూ బిర్కెన్ హెడ్ "...their letters, even then

they donot smell of the lamp, have a slightly artficial perfume. They are rarely native wood- notes wild" అన్నాడు. గతించిన సంవత్సరాలకు ముకుర ప్రాయంగా ఒక్కో శతాబ్దానికి ప్రతినిధులుగా స్త్రీ,పురుష రచయితలను ఎంపికచేసి మరీ ఈ ఉత్తమ సంకలనం ముద్రించాడు. ఈ సంపుటిలోని ప్రతిలేఖా- ఆయా కాలాలలోని మానవ సంబంధాలకు, కళా, సాహిత్యాలకు ప్రతిబింబంగా, పతన దశలకూ, ఉద్ధతికీ అద్దంగా ఉంది. ఈ లేఖన కళలో (epistolary art) జాన్‌మిల్టన్, వాల్టర్ ర్యాలీ, అలెగ్జాండర్ పోప్, జొనాథన్ స్విఫ్ట్, చార్లెస్ లాంబ్, కోల్‌రిడ్జ్ ఘనాపాఠీలూ, హాస్యచతురులూ.

ఆంగ్ల సాహిత్యంలో చార్లెస్ డికెన్స్‌లా, అలెగ్జాండర్ పోప్‌లా లేఖా సాహిత్యానికి విలువలు సంతరించి పెట్టినవారు ఎక్కువమందిలేరని విమర్శకుల భావన. సమకాలీన పరిస్థితులను, భావజాలాన్ని ప్రతిబింబించిన అలెగ్జాండర్ పోప్ లేఖలు సుప్రసిద్ధ ''కళాఖండాలు''గా ఈరోజుకీ చెప్పుకుంటారు. ("his epistles are often gems of art")! లేఖ ప్రాశస్త్యాన్నీ, పరిమితులనూ కూడా పోప్ పేర్కొన్నాడు. రాసినవన్నీ బాగుంటాయని ఆయన చెప్పలేదు. కనుకనే ''లేఖ'' అన్నది ఆయన ఉద్దేశంలో ఒకవిధంగా ప్రయోజనకారీ, మరోవిధంగా ప్రమోదశక్తీ అన్నాడు. విషయ వివేచనాశక్తిగానూ తోడ్పడుతుంది, హృదయోల్లాస పత్రంగానూ సాయపడుతుంది ("useful as well as an amusing thing)! మనిషి గుండెకు వెలితిరానివ్వకూడదని, గుండె గొంతుకలో సుస్పష్టంగా పలికేదాకా, ఆశావహమైన సందేశాలతో నింపేదాకా, ఆశను పురిగొల్పడం మానవుల ధ్యేయంగా ఉండాలని ఎన్నో కష్టాలు కాచి వడపోసిన రాబర్ట్ సౌదీ కవి ఒక లేఖలో అంటాడు. ఈ సమన్వయం ప్రకృతిలోనే ఉందని చెబుతూ జీవితాన్ని చిగురింపచేయడం అవసరమంటూ- "It is not in the order of nature that there should ever be a void in the heart of man- the old leaves should not fall from the tree till the young ones are expanding to supply their place" అంటాడు. అలాగే ఫ్రాన్సిస్ బేకన్ లేఖల ద్వారా అధ్యయనం మీదా, యాత్రా చరిత్రమీదా ఎంతో సాహిత్యం సృజించాడు. అలాగే పెర్సీషెల్లీ తామస్ పీకాక్‌కు రాసిన లేఖలూనూ. ఇలాంటి వాతావరణాన్ని మన సంజీవదేవ్ కూడా లేఖా సాహిత్యం లోకి జయప్రదంగా తీసుకురాగలిగాడు. చివరికి తాను ఎక్కడ క్యాంప్ చేస్తే అక్కడి పరిసరాలను, ప్రకృతి వాతావరణాన్ని 'సందేవ్' వర్ణించాడు. 'మే' మాసంలో పరిస్థితుల గురించి ఒక లేఖలో ''మీ తావున చాలా ఎండలు రాత్రుల్లో కూడా. కాని

మా తావున పగళ్లలో మాత్రమే ఎండలు, రాత్రుల్లో మాకు సూర్యుడు కనిపించనే కనిపించడు. మా రాత్రులకు సూర్యుడు భయపడతాడు''! మరో లేఖలో (జనవరి) ''ఒక మాదిరి చలి సుఖమయంగా తడుతుందికాని ఎక్కువ చలి కష్టమయంగానే తడుతుంది. అయినా చలికాలం పోతుందంటే బాధ అనిపిస్తుంది. కారణం చలికాలంలోని ఆకాశం, భూమి, మంచు, తెల్లని ఎండ ఆకర్షకంగా ఉంటాయి, అక్కడకూడా తెల్లని దూది మబ్బులతో కలిసి. ప్రత్యేకించి మన దాక్షిణాత్యపు చలికాలం భయంకరంగా ఉండదు, ఉత్తరపు చలికాలం వలె''! ఈ వర్ణనను షెల్లీ మహాకవి వాతావరణ వర్ణనతో (పీకాక్‌కు రాసిన లేఖ) పోల్చి చూడండి, ఎంత సామ్యం ఉందో : **"The climate is delicious. The weather is usually like what Wordsworth calls first fine day of March... sometimes very much warmer, with each minute sweeter than before which gives intoxicating sweetness to the awakening of the earth from it winter sleep"!** అయితే సంజీవదేవ్ లేఖలు కేవలం ప్రకృతి వర్ణనతో సరిపెట్టుకున్నవి కావు. ఈ ''లేఖాలాస్య''లో చలం గురించి, జిడ్డు కృష్ణమూర్తి గురించి నిర్మొహమాటంగా ఆయన అభిప్రాయాలు వ్యక్తం చేశాడు! ''జిడ్డు'' చెప్పేది చేసేది ఒకటే గనుక, పట్టుదల కల మనిషి కాబట్టే ఆయన జిడ్డు కృష్ణమూర్తి అయ్యాడని సంజీవదేవ్ చమత్కరించాడు. హిల్‌కాలనీ 'జాషువా' కవి ప్రస్తావించిన కొన్ని అనుమానాలకూ సమాధానం ఇచ్చాడు సందేవ్. జీవితాదర్శాన్ని, బతకడంలో ఉన్న మాధుర్యాన్నీ వివరించాడు. అక్కడక్కడా కొన్ని పునరుక్తి దోషాలు ఉన్నా ఆయని శైలి ఆయనది. అతి సూక్ష్మమైన విషయాన్ని అతి వర్ణనలతో చర్విత చర్వణ కళ ద్వారా చెప్పబూనడం కొందరికి విసుగు పుట్టించవచ్చు. కాని సంజీవదేవ్ భావధారను, అందలి నైశిత్యాన్ని అవగాహన చేసుకోడానికి ఈ 'నలుసులు' అడ్డుతగలవు! మనిషి మంచి మిత్రుల కోసం పడే తపనను సంజీవదేవ్ అందంగా చెప్పాడు : ''మనిషి మంచి రాతి బండను చూడటానికి, మంచి చెట్టును చూడటానికి, మంచి జలపాతాన్ని, మంచి జంతువును, మంచి పక్షిని చూడటానికి ఆనందించినట్టే మంచి మిత్రులను చూడటానికి ఉవ్విళ్లూరతాడు. మనం కులంలేని మతంలేని మానవులుగా'' రూపొందాలంటాడు! నేడు యోగ్యతను కొలిచే కొలబద్దలు కరువైనందున యోగ్యత అనేది సాపేక్షకమై నిలిచిందంటాడు. అలాగే తనలో గత పదేళ్లుగా వస్తున్న మార్పుల్ని కూడా ప్రస్తావించాడు. సత్యానికి అంతంలేనందున, మరోసారి తను నవ్య మార్గం వెతుక్కుంటున్నానంటాడు యోగానికి, కలలకూ కొత్త అర్థాలు చూపాడు; ''కులం

లేని కులం గురుకులం'' అని చాటాడు; తత్వచింతన మాత్రమే చాలదు, తాత్వికాచరణ ఉండాలన్న సంజీవదేవ్ ప్రబోధం వివేకానందుడి ప్రాక్టికల్ వేదాంతాన్ని గుర్తుచేస్తుంది! ప్రేతాత్మవాదాన్నీ, మరణానంతర వాదాన్నీ, పురాణాలనూ తూర్పారబట్టాడు; మనకు ఉపకరించేది మానసవాదం (మనో విజ్ఞానం) మాత్రమేనని స్పష్టం చేశాడు. అభిమానం అనేది గ్రుడ్డితనంలో ఉండకూడదు. అంధ అభిమానం కంటే దృష్టి ఉన్న వ్యతిరేకత చాలా గొప్పదని చాటాడు సంజీవదేవ్. ఇలా ఎన్నో భావచిత్రాలను అందించాడు. అందుకే భావాలు ఏ శైలిలో ప్రత్యక్షమయినా భావాలు అవే- సముద్రంలో ప్రతిబింబించినా, సరోవరంలో ప్రతిబింబించినా, సెలయేరులో ప్రతిబింబించినా సూర్యుడు ఒకే సూర్యుడు. జలాధారలను బట్టి రూపం విభిన్నంగా గోచరిస్తూంటుంది అన్నపుడు పోతన గుర్తుకొస్తాడు: '' ఒక సూర్యుండు సమస్త జీవులకున్ తానొక్కండై తోచు...'' విభిన్న 'రూపారూపాల' సమన్వయ కర్త సూర్యదేవర సంజీవదేవ్!

*(ఆదివారం 14, సెప్టెంబరు 1997)*

# స్త్రీవాదంలో కమలాదాస్ సరికొత్త ముద్రలు

''సంసార విషవృక్షస్య/ ద్వే ఫలే అమృతోపమే/ కావ్యామృత రసాస్వాదః/ సంగమః సజ్జనైస్సహ,'' సంసారమనే ''విషవృక్షా''నికి రెండేరెండు అమృత ఫలాలున్నాయట. అందులో మొదటిది కావ్యామృత రసాస్వాదమూ, రెండవది సత్పురుష సహవాసమూ అని ఒక ప్రాచీన సూక్తి. కాని సుప్రసిద్ధ స్త్రీవాద కవి, రచయిత అయిన కమలాదాస్‌కు జీవనయాత్రలో దక్కింది మాత్రం కావ్యామృత రసాస్వాదమే కాని ఆమె కలలుకన్న సత్పురుష సహవాసం కాకపోవడం దురదృష్టకరం! స్త్రీ విద్యావతి కాకూడదు, అందంగా అలంకరించుకోకూడదు, వేదాలు చదవకూడదు, భర్తకు దాసీగా మాత్రమే బతకాలి, వంట ఇంటికే పరిమితమై ఉండాలి- ఈ సూక్తులను తరతరాలుగా వ్యాప్తిలోకి తెచ్చిన పురుషాధిక్య సమాజంలో, పితృస్వామిక వ్యవస్థలో కమలాదాస్‌లాంటి వ్యక్తులు స్వయంకృషితో ఎదిగి రావడానికి ఎన్ని ఇబ్బందులు పడి ఉంటారో మన ఊహకు అందని విషయం. ఎవరైనా ఒక వ్యక్తికి యాక్సిడెంట్‌లో నిలువెల్లా గాయాలైతే వాటిని మల్టిపుల్ ఇంజూరీస్ అంటాం. అలా కుడి ఎడమల దగాకు గురైన కమలాదాస్ జీవితం 'ప్లెంటిఫుల్ ఇంజూరీస్'తో సాగింది. నిలువెల్లా గాయాలే. స్కూలు టీచర్ల శాడిజానికి గురైంది, ఇంట్లో ఆరళ్ళకు గురైంది, రకరకాలుగా మగవాళ్ళు చేసే ' ఎన్‌కౌంటర్ల'కు గురైంది. చివరికి భర్తగా పాణిగ్రహణం చేయాలనుకున్న వ్యక్తి తాపులకూ తాకిళ్ళకూ, సెక్స్‌లో మొరటు ప్రవర్తనకూ, అదుపులేని విశృంఖలతకూ గురైంది. ఆ తరువాత పనీపాటా ఎరుగని, పరాన్నభుక్కులైన కొందరు పనిగట్టుకుని చేసే తప్పుడు ప్రచారాలకూ గురైంది. అయినా కమల చెలించలేదు. అప్పుడప్పుడూ నిరాశానిస్పృహలకు తాత్కాలికంగా లోనైనా ఆమెలో ఆత్మవిశ్వాస సూర్యోదయం అవుతూ రాబట్టే ఈ రోజు అనుభవ కవిగా, సుప్రసిద్ధ రచయితగా మన మధ్య నిలదొక్కుకోగలిగింది! ఇన్ని అనుభవాల మూలంగానే ఆవిడకు ఆదిలోనే వివాహ వ్యవస్థమీద ఏవగింపు కలిగినప్పుడు ఒక ప్రశ్న వేసుకుంది : ''వివాహితుడైన ప్రతివాడూ పడకగదిలో ఇలాగే మూర్ఖుడుగానూ, సర్కస్‌వాడుగానూ ప్రవర్తిస్తాడా'' అని! అది ఆమె అనుభవం. అంతమాత్రాన ఆమె

మగవాళ్ళందరినీ ఒకేగాటను కట్టలేదు. తన అనుభవ పాఠాన్ని మాత్రమే ప్రస్తావించింది. స్త్రీ ఎటువంటి ప్రేమను కోరుకుంటుందో చెప్పింది, చూపుల్లో ప్రేమకు, మనస్సులో వాత్సల్యానికి మధ్య ఉన్న వ్యత్యాసాన్ని కూడా తెలిపింది. ప్రతి రాత్రీ స్త్రీకి కాళరాత్రి కాకూడదనుకుంది. స్త్రీని వేధిస్తున్న సమస్యలను, ప్రత్యేక సమస్యలను కాచి వడపోసింది. ఆమె అనుభవసారంగా అయిదేళ్లనాడు వెలువడిందే ఆమె అద్భుత ఆత్మకథ- ''మైస్టోరీ'' ("My story"). అందులో ఆత్మశ్లాఘాలేగాని, అతిశయోక్తులు లేవు. భోళాతనమేగాని దాపరికంలేదు. పరిపూర్ణ వ్యక్తిత్వంతో దూసిన కరకు కత్తులేగాని, ఉత్తుత్తి విన్నపాలు కావు. అనుభవాన్ని ఆమె పాటలకు ఎక్కించింది, కథలుగా చెప్పింది. స్త్రీలలో చైతన్య దీప్తికి కృషిచేసింది. స్వీయానుభవాన్ని తోసిపుచ్చగల దమ్ములు ఎవరికీ ఉండవు. ఆమె అనుభవించిన కష్టాలతో పోల్చుకున్నప్పుడు ఆమె కన్‌ఫెషన్స్ (ఒప్పుకోళ్ళు)ను యథాతథంగానే పాఠకులూ స్వీకరించాల్సి ఉంటుంది. ప్రత్యక్ష అనుభవానికి వేరే సాక్షులు ఉండరు. ఏ పాట ఏ రచన ఎప్పుడు ఎందుకు కట్టాలో, చేయాలో వారి ఆత్మలకు తెలుసు. ఆ ఆత్మావిష్కరణే ఇటీవల కొట్టాయమ్ నుంచి ''డి.సి.కాంటెంపరరీ సీరీస్'' ఆధ్వర్యంలో వెలువడిన కమలాదాస్ రచనల తాజా సంకలనం "Only the Soul Knows How to sing". ఈ సంకలనం స్త్రీవాదిగా కమలాదాస్‌లో వచ్చిన, వస్తున్న మానసిక పరిణామానికి, తాత్త్విక చింతనకూ అద్దం పడుతోంది. ఒక పీడిత వర్గంగా భారత స్త్రీ విద్య, ఆరోగ్య, వైవాహిక, సాంసారిక, ఉద్యోగాది రంగాలలో ఎదుర్కొంటున్న సమస్యలకు సాధికార శక్తిగా కమలాదాస్ తనను తాను ప్రతినిధిగా ఎంచుకుంటూనే జీవితంలో సహచరులైన పురుషుల పట్ల వహించవలసిన వైఖరిలో రావలసిన సవరణలను కూడా పేర్కొంటోంది- ఈ రచనల్లో! అలాంటి భావనకు ఈ సంకలనంలో శ్రీకారం చుట్టిన రచన 'ఓ ఉపోద్ఘాతం'' (An Introduction) అన్న కవిత. నిజమైన ప్రేమకు నిర్వచనంగా కమల తొలి '' ఆత్మకథ''లోనే ఇలా చెప్పుకొంది: అనేకానేక కారణాలవల్ల ఒంటరిగా జీవించవలసి వచ్చిన తనను అక్కున చేర్చుకుని లాలించి ఆదరించే వ్యక్తికోసం తపనపడిందావిడ. ''నన్ను అతడు తన చేతుల్లోకి తీసుకొని, నా ముఖాన్ని నిమిరి, నా కురులను దిద్ది, నా చేతులను జోకాడి, ప్రేమతో నాలుగు అమృత వాక్కులు పలుకుతాడని ఆశించాను... ఆ అమృత హస్తాలతో ఒక్కసారిగా నా ఒంటరితనాన్ని పారదోలేస్తాడనుకొన్నా''. కాని తనను చేరినవాడికి ఆ సంస్కారంలేదు, ఆ తాహతూలేదు. కాని సంప్రదాయం, ఆచారం అడుగు దాటరాదని చెప్పి తన ప్రగతికి అడ్డుగోడలుగా

నిలిచినందున, స్త్రీ పాత పాత్రలనే పోషించాలని- భార్యగా, వంటపుట్టిగా, కుట్నీ, అల్లికలల్లే అమ్మగా, పనిమనుషులతో కీచులాడే గృహిణిగా గడపాలనే తత్వాన్ని పోషిస్తున్నందున కమల ఎదురు తిరగవలసి వచ్చింది. కనుకనే ఆమె 1991లోనే కొత్త మార్గం వెతుక్కోటానికి ప్రయత్నించింది. ఈ ఝంఝూటం నుంచి, మానవుడు విధించిన శృంఖలాల నుంచి విడివడి ఆధ్యాత్మిక లోకంవైపునకు మళ్ళింది ("Free from human bondage I turned to Krishna). ఇకనుంచి శారీరక భౌతిక విషయాలకు ప్రాధాన్యం ఇవ్వడంకంటే స్త్రీ అందుకు అతీతంగా ఎదగాలని (beyond the body) భావిస్తోంది కమల. అయితే అంతమాత్రాన స్త్రీల సమస్యల పట్ల నిర్లిప్తతను ఆమె ససేమిరా సహించదు. ఆ విషయాన్ని కూడా ఈ సంకలనం చదివినవారికి అర్థమవుతుంది. స్త్రీ అణచివేత పట్ల, పురుషాహంకారం పట్ల నిరసనలో, ప్రతిఘటనలో కమలలో ఇసుమంత మార్పు కూడా లేదు. ధర్మాగ్రహంలో ఆవిడ మార్గరెట్ యోర్సినర్, లెస్సింగ్, నాదిని గోర్డిమీర్‌లకు ఏమీ తీసిపోదు. నోబెల్ బహుమతి రానక్కరలేదు, ఆమెలో 'నోబుల్' ( ఉదాత్తమైన) భావాలున్నాయి. లండన్‌లో సౌత్ బ్యాంక్ సెంటర్ పొయెట్రీ సదస్సులో పాల్గొనివచ్చిన కమల దృష్టి స్త్రీ-పురుష సంబంధాలలో వైయక్తికంగా వచ్చిన కొన్ని అనుభవాలు ఆధారంగా ఏర్పడిన అభిప్రాయాలను సవరించుకునే వైపుగా సాగుతోంది. కుటుంబ సంబంధాలలో లైంగిక విషయాలలో 'వెట్టిచాకిరి'ని నిరసిస్తూనే శారీరక విషయాలకు అతీతంగా కూడా స్త్రీ ఎదిగిరావాలని కొత్తగా ప్రబోధిస్తోంది. అదే సమయంలో సామాజిక, రాజకీయ చైతన్యాన్ని ఆమె తక్కువ అంచనా వేయడంలేదు. ''ఇంట్రడక్షన్'' కవితలో ఆమె ''నాకు రాజకీయాలు తెలియవు, కాని ఈ పాలకులెవరో నాకు తెలుసు'' ("I do not know politics but I know the names of those in power") అనడం ద్వారా స్త్రీలకు రాజకీయాలు అనవసరం అని భావించే పురుషాహంకారాన్ని కమల దెబ్బతీసింది! తనకు మూడు భాషలొచ్చు, రెండు భాషల్లో రాయగలను. కాని ఒక్క భాషలో మాత్రమే కల కనగలను అంటుంది! అందుకని తన భాషలో తనను మాట్లాడనివ్వాలి, సుఖదుఃఖాలు, ఇబ్బందులూ సబ్బందులూ అన్నీ తనకు తెలిసిన మాధ్యమంలో అయితేనే, గుండె విప్పి చెప్పగలుగుతుంది. 'కావు కావు' కాకిభాష ఎలాగో, గర్జన సింహం భాష ఎలాగో అలాగే తన భాషా అంటుంది (It is useful to me as cawing is to crows or roaring to the Lion)! కనుకనే తన గొంతు పెకిలించుకున్న కమలాదాస్ ''పాపినీ నేనే, రుషినీ నేనే, ప్రేమకు

పాత్రమైనదాన్నీ నేనే. మోసపోయినదాన్నీ నేనే. నీకు లేని ఆనంద సుఖాలు నాకుండవు. నీకులేని తలనొప్పులూ బాదరబందీలూ నాకూ ఉండవు'' అని తాత్త్వికంగా చెబుతుంది.

కమలాదాస్‌లో కొత్తగా మోసులెత్తుతున్న ఈ తాత్త్వికతకు మూలం- భక్తి ఉద్యమానికి నేతలైన తమిళ 'సంగమ్' కవుల నుంచి, మధ్యయుగాల జానపద సాహిత్యం నుంచీ పుట్టుకొచ్చిన మలయాళ కవితా సాహితీ, దేశభక్తి ఉద్యమాలూ, మీరాబాయి, జానాబాయ్ భక్తి కవితలూ, మొల్ల, అక్కమహాదేవి, ముద్దు పళని, సంచయ హొన్నమ్మ రచనలు ఎలాగో, స్వయంగా కమల తల్లి బాలమణి అమ్మ సంప్రదాయం కూడా అదే. అలాగే మేనమామ నాలపట్ట నారాయణ మీనన్ ప్రభావమూ ఉంది. ''సంగమ్'' కావ్యరీతులు ఒకపక్క ప్రభావితం చేస్తుండగా దేశభక్తికి మారుపేరైన ప్రసిద్ధ ' ఆంగ్లో ఫైల్' తోరూదత్, దెరోజియోల జాతీయతాభావాలు మరోవైపు నుంచీ కమలను కదిలించాయి. కోర్నీలియా సోరాబ్జీ రచనలూ, షెకావత్ హుసాయిన్ ఊహాగానాలు, ''భారతకోకిల'' సరోజినీ, పండిత రమాబాయ్ జ్ఞాపకాలూ, కృపాసత్తి యానందన్ రచనలు కూడా కమలను ప్రభావితంచేసి ఉండవచ్చు! ఏది ఏమైనా ఈ కొత్త సంకలనంలో కమల శారీరక సంబంధమైన ఆధ్యాత్మిక రాజకీయాల గురించీ, శరీరాలకు అతీతంగా మానవ సమస్యల గురించీ మనం పట్టించుకోవాలని కోరుతోంది. అది మానవీయ సంబంధంగా నిర్నిబంధంగా రూపొందాలని ఆమె చెబుతుందేగాని కొందరు ఇటీవల స్త్రీవాదం పేరిట ప్రబోధిస్తున్నట్టు ఫెన్సింగులు లేని విశృంఖలతను చెప్పదు! ఈ మానవతాగిరి శిఖరాలను అందుకునే ప్రయత్నంలో భాగంగానే కమలాదాస్- కేవలం మగవాడినే ఆడిపోసుకునే మనస్తత్వం నుంచి బయటపడి తన సహానుభూతిని, ఆదరాభిమానాలను సకల తాడిత పీడిత జనావళికి అందజేయడానికి సంకల్పించింది. లింగభేదంలో కూడా ''వర్గ'' దృష్టి ఉంటుందని భావించిన కమల ఆధునిక జీవన పద్ధతులను అనుసరించే స్త్రీలనూ కొన్ని సంప్రదాయాలతో, తప్పుడు ఆచారాలతో విభేదించే స్త్రీలనూ మతి తప్పినవారిగా ఎలా సంప్రదాయకులు భావిస్తారో విమర్శించింది. ఆ మాటకొస్తే స్త్రీ జీవితమే ఒక పాఠ్య పుస్తకం అంటుందామె! దాని పుటలు మానవాళికి అనుభవ నైవేద్యాలు. తన శోధన, పరిశోధన దగాపడిన వర్గాల స్వప్న వీధుల్లోకి దూసుకువెళ్ళేదాకా ముగియదని దండోరా వేస్తుంది కమల! ఆత్మదర్శనం, ఆత్మాదేశం ఎప్పుడు అవుతుంది? తన లోలోపల ఆలోచనలాలోకించినప్పుడు, అంతరాత్మ సందేశాన్ని పెడచెవిన పెట్టనప్పుడూ! ఇతరత్రా యాత్రలు వేరు, అంతరాత్మలోకి

సాగించే యాత్ర వేరు అని చెప్పి "Our obsession with physicality (body) is a mistake" అంటుంది! సంస్కృతీ ప్రగతిలో, స్త్రీ, పురుష భేదాలను పెంచిన వర్గ వ్యవస్థలో, పురుషాధిక్యతా ప్రపంచంలో స్త్రీల శరీరాలు దుష్ట సంస్కృతీ తాడిత ముద్రలను కూడా వెంట మోసుకుపోతుంటాయని చెప్పింది (Women suffer cultural scripts- whip marks of culture- in their bodies). శరీరమే అక్షరాకృతి దాల్చాలిగాని శరీరాన్ని 'అక్షరాల' దర్శించడం కాదన్నది కమల నూతన సిద్ధాంతం! అందుకే ఆమెకు సమర్ధనగా ఈ సంకలనానికి ముందుమాట రాసిన కె.సచ్చిదానందన్ చెప్పినట్టుగా Identity of women's literary practice must be sought in the body of her writing and not the writing of her body! నేడు భారత స్త్రీ కేవలం దోపిడీపైన ఆధారపడిన సాంస్కృతిక నయా వలస పెత్తనం మోపుతున్న భారంతోపాటు, 'నవీన విశ్వవిద్యాలయాల్లో పురాణ శ్రవణం'లా ముమ్మరిస్తున్న కొన్ని సంప్రదాయపు ఉచ్చుల పునరుద్ధరణకు జరుపుతున్న ప్రయత్నాలను కూడా కమల ఏవగించుకుంటుంది. సంప్రదాయ రుగ్మతలను భరించడం పాతకాలంవారికి ఎలా సాధ్యం అయింది? స్త్రీల నోళ్ళు నొక్కడంవల్లనే! 'స్వర్ణయుగాల' పునరుద్ధరణ పేరుతో తగిలించే బంగారు సంకెళ్ళు కమలకు ఇష్టంలేదు. కమల ఫ్యూడల్ వ్యవస్థ శిలాక్షరాలుగా విధించిన నిబంధనలకు లొంగే ఘటం కాదు. కమలాదాస్ కన్ఫెషన్స్ స్త్రీవాదులు ఆలోచింపదగిన అంశాలు. ఒక సమగ్రమైన దృష్టి అలవడడానికి తమ అంతరాత్మల పట్లనేగాక ఇతర సామాజికుల ప్రయోజనాల పట్ల కూడా నిబద్ధత అవసరమంటుందామె. ''అనామలై కవితలు'' (Anamali poems) లో ఈ తాత్త్విక ధోరణి ఉంది. ''శరీరాలకు అతీతంగా'' అన్న రచనలో కూడా ఇదే భావన వ్యక్తమయింది. అంతమాత్రాన ఆమె భావ ప్రకటనా స్వేచ్ఛలేని మూగబోయిన మహిళ కాదలచుకోలేదు! సచ్చిదానందన్ అన్నట్టు కమల ఎప్పటికీ వీరనారేగాని వెన్నుచూపే వ్యక్తికాదు ("She is prometheus; one of the thieves of language with a manifesto of desire to escape being prisoner of hegemonic patriarchal discourse") కమలలో పరివర్తన ఎంతవరకు కొనసాగిందంటే- మానవాళిని స్త్రీ- పురుష వివక్ష పేరిట నిరంతరం సంఘర్షించుకునే పరస్పర విరుద్ధ శక్తులుగా విభజించి చూడడానికి ఇష్టపడడంలేదు కనుకనే ఇప్పుడామె పితృస్వామిక వ్యవస్థనే కాదు, మాతృస్వామిక వ్యవస్థను కూడా ప్రశ్నిస్తోంది! అయితే అదే సమయంలో పుక్కిటి పురాణ గాథలతో ఇక మాకు ముసుగులు తొడక్కండి'' అనీ ప్రకటిస్తోంది "Ancient virus nurtured in soul" అంటూ తప్పుడు

వారసత్వాన్ని మాత్రమే నిరసిస్తుంది. ఆమె మనస్సింకా సునిశితం కాలేదు కనుకనే ఇలాంటి కొన్ని వైరుధ్యాలు భావ ప్రకటనలో చోటు చేసుకుంటున్నాయా? కమల టెర్రరిజానికే కాదు, సర్కారీ దౌర్జన్యకాండకూ, హింసకూ, యుద్ధాలకూ వ్యతిరేకం. కామిగాక మోక్షగామి కాలేడని వేమన సిద్ధాంతం. కమల ''వోల్డ్ ప్లే హౌస్'' కవితలో తన వైఫల్యాలను ప్రకటిస్తుంది: "To be frank/ I have failed../ All I want now / is to take a long walk / into sea and lie there, resting..." అయినా, అలల రొదలకు, తాకిడికీ ఆ విష్ణుమూర్తికి దక్కని సుఖం కమలకు దక్కుతుందా?! జన సముద్రం నుంచి జారుకొని కేవలం సముద్రం వైపు పరుగుపెట్టేవారు సమస్యలకు పరిష్కార మార్గాలు వెతుక్కోగలరా? బాధల నుంచీ గాయాలు నిశ్శబ్దంగా స్రవించే రక్తధారల నుంచీ ధైర్యసాహసాలు పుట్టుకొస్తాయని చెప్పిన కవి కమల ("Courage is the blood's silent flowing out of wounds') గుండె నిబ్బరం కోల్పోతున్నదా?

*(ఆదివారం 5, అక్టోబరు 1997)*

# కలత మబ్బులూ, కన్నీటి చారికలూ ''డి.వి.'' కథలు!

''ఒరే బుద్ధి గడ్డితిని నిన్ను కథ(్రాయమన్నాం. నువ్వింక కథ(్రాయకు. నువ్వు కథ(్రాయలేవు'' అని సుబ్బారావు, ఆంజనేయులనే ఇద్దరు స్నేహితులు తమ మిత్రుడైన ఓ కథకుడ్ని చీవాట్లు పెట్టారు. ఈ పోటు భరించలేని ఆ మిత్రకథకుడు అనుకున్నాడు తనలో తాను: ''పనిమనిషి గురించీ, రిక్షావాడి గురించీ, గుమస్తా గాడి గురించీ, కథలు రాయమంటారేవిటి వీళ్ళు?'' ఇంతకూ కథ లక్ష్యం గురించీ, కథకూ జనానికి ఉన్న సంబంధం గురించీ, కథకు సమాజానికి ఉన్న అనుబంధం గురించీ- నిర్వచనానికి మించిన ఆశయాన్ని సుబ్బారావు పాత్ర ద్వారా వినవచ్చిన కథ ''కథ(్రాయకు''! జీవితం విలువ తెలిసినవాళ్ళూ, జీవిత ప్రయోజనం తెలిసిన వాళ్ళూ ఇతివృత్తాన్ని బతుకునుంచి మాత్రమే చేదుకోవాలంటూ ''సుబ్బారావు'' ఇలా పాఠం చెప్పాడు: ''నువ్వు చూసిన మనిషి జీవితంలో, రంగనాథం సంసారంలో, నువ్వు విన్న రిక్షావాడి గోడులో గొప్ప కథలున్నాయి. నిజమైన కథలూ, జీవమున్న కథలూ బ్రతుకులోంచి పుడతాయ్. అంతేగాని మల్లెపూలలోంచి, వెన్నెల్లోంచి, మీ ఆవిడ కళ్ళల్లోంచి పుట్టవు. ఇవ్వాళ కావలసింది అమర ప్రేమలూ, ప్రేమించినదాన్ని చివర్లో 'చెల్లీ' అని పిల్చేసి బావురుమని ఏడ్చే త్యాగాలూ కాదు. దేశంలో ఇవ్వాల్టి పరిస్థితుల్ని చూడు. కాస్త ఆలోచించు. నీ బ్రతుకు గురించేకాదు, నీ చుట్టూ ఉన్నవాళ్ళ బ్రతుకుల్ని కూడా పరిశీలించి చూడు. నువ్వు చూసింది రాయి, మసిపూసి మారేడుకాయ అనకు. నీకు తెలియంది రాయకు. మంచి కథ రాయాలంటే కథ రాయాలన్న దురద ఒక్కటే చాలదు. ఏ కథ రాయాలన్నది కూడా తెలుసుకోవాలి నీకది తెలియదు. తెలీనప్పుడు రాయడం అనవసరం'' అన్నాడు మిత్ర కథకుడితో! రచయిత దృష్టి ఆర్థిక పరిస్థితుల లోతుపాతుల్ని ఆశ్రయిస్తే కథావస్తువు కమ్మెచ్చులాగినట్టు బొమ్మకట్టి కూర్చుంటుంది. ఆర్థికమంత్రి చిదంబరం లెక్కప్రకారం దేశంలో 35 కోట్లకు పైగానే జనాభా కటిక

ధారిద్ర్యంలో నివసిస్తున్నారు. ఆ పరిస్థితుల్లో వస్తువు కోసం రచయిత ఎవరినీ దేబిరించాల్సిన అవసరంలేదు. ప్రత్యక్ష జీవితానికి ప్రేక్షకులుండరు, కళ్ళకు కనబడుతున్న జీవితాల్ని చిత్రించడానికి కలాలకు వేరే సాక్ష్యాలు ఉండవు! కనుకనే సామాజిక స్పృహ ఉన్న రచయితలు, కథారచయితలు తమ ఆకలి, కనీసావసరాలు తీరినా ముష్టివాళ్ళను, మురికిపేటలను సందర్శించి నప్పుడయినా- నిజమైన ఆకలంటే ఏమిటో తెలుస్తుంది, దరిద్రమంటే ఏమిటో అర్థమవుతుంది. ఆ ''జ్ఞానోదయం'' అయిన కథారచయిత ఇలా ప్రకటించాడు: '' ఆ రాత్రి నాకు అన్నం సయించలేదు, నిద్ర పట్టలేదు, కన్నుమూస్తే ఆకలి కేకలు, ఆర్తనాదాలూ వినబడుతున్నాయి. కన్ను తెరిస్తే కన్నీటి సముద్రాలు కనబడుతున్నాయి. కలం పట్టుకుంటే చెయ్యి గడగడ వణుకుతోంది. తెల్లటి కాగితం నల్లగా మారి నన్ను వెక్కిరిస్తోంది... ఇంకేమి రాయను?.. భారతదేశం బంగారు భూమి అనీ, ఆంధ్రదేశం అన్నపూర్ణ అనీ ఇంకెలా రాయను? ఎయిర్ కండీషన్డ్ గదుల గురించీ, ఫోమ్ పరుపుల గురించీ, కలలో కనబడ్డ అందగత్తె గురించీ, వెన్నెలవేడి గురించీ, మల్లెల పరిమళం గురించీ ఇంకెలా రాయను?'' ఇంతకూ ఈ మాటన్నది ఎవరో కాదు- కడచిన ముప్ఫైయేళ్ళుగా తెలుగు కథాసాహిత్యంలో తలమునకలైన తన తనాన్ని ముద్రవేసుకుని, రేడియో నాటికల్లో, రూపక రచనల్లో ప్రయోగ వైచిత్రిని ప్రక్రియా వైవిధ్యాన్ని చూపిన సుప్రసిద్ధ కథకుడు డి.వెంకట్రామయ్య. అయితే ఒక పాత్ర ద్వారా తన లక్ష్యాన్ని ఇలా ముద్రించుకున్న వెంకట్రామయ్య ఇప్పటికీ కథల్రాయడం మానుకోలేదు. రాసిన కథల్ని పాఠకులు చదవడమూ మానుకోలేదు! మూసిల్ "The Man Without Qualities" అని రాశాడు. కాని మన వెంకట్రామయ్య క్వాలిటీ రచయిత. వస్తు నిర్దేశంతో కథనంలో, శిల్పంలో, సంభాషణలో, వాక్య విన్యాసంలో, ప్రతి పదరచనా పొందికలో- విశిష్ట కథకుడుగా ఆరితేరినవాడు. గురజాడ, చలం, కొడవటిగంటి, రా.వి.శాస్త్రిలాంటి ఉద్దండుల రచనా ఛాయలు ఈయని కథలలో అలవోకగా కనిపిస్తాయేగాని- అవి ఛాయలుగానే కనిపించి వెంటనే కనుమరుగై వెంకట్రామయ్య వ్యక్తిత్వం కమ్ముకొస్తుంది. ఈయని కథలన్నీ ప్రజా జీవనానికి సంబంధించినవి. ఆవేదనాభరితాలే గాని అవకాశవాద రచనలు కావు; ఆదర్శ శిఖరాలేగాని, అక్కరకురాని అక్షర తూణీరాలు కావు; ధర్మాగ్రహానికి ప్రతినిధులేగాని అధర్మ వాదనలకు అద్దం పట్టినవి కావు! ఒక సామాజిక ప్రయోజనాన్ని లక్షించి కలంపట్టి కథన రంగానికి దిగిన రచయితగా వెంకట్రామయ్య ఈ కథల్లో కనిపిస్తాడు. ఈవర్గ సమాజంలో, ఈ

వర్గ సమాజంలో రచయిత ఎవరి ప్రయోజనాలు కాపాడాలో, ఆయనకి బాగా తెలుసు. అందుకే 'టార్గెట్స్' ఎంపికలో అతని దృష్టి నిశితం, అభేద్యం, అతని వ్యూహం స్పష్టం, ఎత్తుగడ సునిశితం. ''బుచ్చిబాబు స్మారక కథా కదంబం''లో మూడవ రచనగా- శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్ వెలువరించిన ''డి.వెంకట్రామయ్య కథలు'' సంపుటిలోని నలభై రెండు గాథలూ దేనికదే సాటిగా ఉన్నాయి. ఏవిటీ కథల గొప్పతనం? ఒక్కొక్కలో- సర్వత్రా సామాజిక స్పృహే. ఉబుసుపోని దళం ఒక్కటీ కనిపించదు. రచయిత కేంద్రీకరణలో అంతటి సాంద్రత ఉంది. నిరసన తప్ప రాజీలేని దృష్టి. ఒకప్పుడు అమెరికాలో నేషనల్ బుక్ అవార్డు పొందిన ''గుడ్‌బై, కొలంబస్'' అన్న కథా సంపుటి రచయిత అయిన ఫిలిప్ రాత్ గురించి ముచ్చటిస్తూ రాత్ రచనా వైశిష్ట్యాన్ని గురించి హెర్మొనీలీ (1984) చెప్పిన మాటలు ''డి.వి.''కి అక్షరసత్యంగా వర్తిస్తాయి: "...there is ferocious concentration and mental capacity; everything is grist for his mill, no vagueness is tolerated, differences of opinion are pounced on greedy, and nothing that might be useful is let slip..."

వెంకట్రామయ్య కథల్లో- సంపన్నుల ఆపన్నుల, మధ్యతరగతి బతుకులు ఆయా వర్గ లక్షణాలకు అనుగుణంగానే సాగుతుంటాయి. మధ్యతరగతి కృత్రిమ మందహాసాలూ ఉన్నాయి. ''సీలింగ్‌లేకుండా పెరిగిన ఆస్తిలాంటి బొజ్జ'' రాజారావుకు తోడు కొడుకు పండుబాబు, ప్రెసిడెంట్ రంగారావు, మునసబు రామచంద్రయ్య, కుళ్ళిన సంస్కృతికి, విశృంఖలతకు ప్రతదినిధిగా శేషావతారం, అవినీతికి పడగలెత్తిన స్వాహావతారం, గోవు వేషంలో ఉన్న 'పెద్దపులి' రామ్మూర్తి, ఊళ్లో పెళ్ళి కుక్కలకు హడావుడి అన్నట్టుగా అమ్మమ్మ మరణం దేశానికే మరణంగా అట్టహాసం చేసిన మంత్రీ, అప్పనంగా వచ్చిన డబ్బుతో వింత పోకడలు పోయిన షావుకారు నరసింహం, పేకాటే జీవనంగా మారిన ఓ కృష్ణారావు, బాబాలచుట్టూ తిరిగే మంత్రులూ, న్యాయమూర్తులూ, కోటీశ్వరులూ, వడ్డీవ్యాపారి సూరిబాబు, గ్రామాభివృద్ధికి కేటాయించిన ధనాన్ని నేతి మిఠాయిలా బొక్కి కూర్చున్న పంచాయితీ ప్రెసిడెంట్, గ్రామకక్షలతో పల్లెల్ని కలుషితంచేసే ప్రెసిడెంట్ రంగారావు, మున్సబు రామచంద్రయ్యలు, నలుగురు భార్యలు, నాలుగు మేడలూ ఉన్న నలభైయేళ్ళ చినబాబూ, అక్రమార్జనలో భాగంగా కోట్లకు పడగలెత్తిన ధనంజయరావ్, మురహరిరావు, మరో ఎన్నికల కోసం ఎదురుచూసే ఎం. ఎల్ ఏ పరబ్రహ్మం- దోపిడీ వ్యవస్థకూ, పతనమవుతున్న సంస్కృతికీ ప్రతినిధులు. కాగా మరోవైపున పిల్లల భారంతో

సంసారాలు నెట్టుకురాలేక అసమ ఆర్థిక చక్రంలో అప్పులూ తప్పులూ చేస్తూ రోగాలు, రొష్టులతో తీసుకుంటున్న అసంఖ్యాక ప్రజాబాహుళ్యానికి ప్రతినిధులుగా మధ్యతరగతి బుచ్చిబాబు, సుబ్బారావు, అట్టడుగు వర్గాలకు చెందిన పోలిగాడు, అతని తండ్రి నారిగాడు, రంగమ్మ, పీడిస్తున్న ఆర్థిక దుస్థితిలో కాలుజారక తప్పని మాణిక్యం, ఆ మార్గంలో దారుణ మరణానికి గురైన వరహాలు, వ్యవసాయ కార్మికులు వీరయ్య, పానకాలు, సుబ్బడు, గంగరాజు, రంగి, ఎంకి, లచ్చి, రిక్షావాలా రాజిగాడు- గమ్యనిర్దేశం కోసం కొట్టుమిట్టాడుతున్న సామాన్యులు. అంతేగాదు, గ్రామీణ వాతావరణాన్ని, పట్టణ సంస్కృతిని వర్ణించడంలో వెంకట్రామయ్య అత్యుక్తులకు పోకుండా అతి సహజంగా వ్యవహరించాడు. కటువైన సంభాషణతో పాటు అతి పటువైన చమత్కారమూ చూపించాడు. గ్రామ కక్షలు ఎలా ప్రగతి నిరోధకాలో 'వెలుగును మింగిన చీకటి'లో చూపాడు. మార్కెట్ ఎకానమిలో దారిద్ర్యం ఎలా పెరుగుతుందో చెప్పక చెబుతూ విలువలు పతనమై కునారిల్లిపోతున్న సాంఘిక పరిస్థితులపట్ల, పేదల దైన్యం పట్ల ఇకనెంత మాత్రం ఉపేక్ష వహించడానికి వీల్లేదన్న హెచ్చరిక ''ముగింపు మీరే చెప్పండి''! చలం ప్రభావమని పూర్తిగా చెప్పలేంగాని గురజాడలా 'స్త్రీల కన్నీటి గాథలకు కారణాలు నాకు తెలుసు, వారికి వకాల్తా వహిస్తానని' చెప్పగల దమ్ములున్న కథకుడు వెంకట్రామయ్య. పెళ్ళి చేసుకొని మోసగించే వాడొకడు, ప్రేమించి కూడా కట్నాల కోసం తపనపడే వాడింకొకడు. కోరుకున్నవాడు 'నేనున్నాన'ని ధైర్యం చెప్పలేక ''నా కులం, నా ఆస్తి, నా గౌరవం, నాకొచ్చే కట్నం ఎలా వదులుకుంటాను'' అని మనిషిని గాక 'మనీ'ని పెళ్ళిచేసుకోవాలనుకున్నందున- అందం, చదువూ చొరవా, ఉద్యోగం ఉండీ మోసపోయింది ఒక శ్యామల. భార్యను కురూపిగా భావించిన ఒక వెధవకు పరిస్థితులు వికటించిన కారణంగా కేవలం అందం పేరిట వేశ్యగా మారింది ఒక 'శకుంతల'. అయినా 'వేశ్య'కీ నీతి ఉందని నిరూపించిన గురజాడ వారి మధురవాణి శకుంతలకు ఆదర్శమై బేరానికి మించి డబ్బిచ్చిన మగాడికి తిరిగి ఆ డబ్బు ఇచ్చేసి నీతి బోధించింది! కేవలం పరిచయమైనా, పెంచుకున్న స్నేహమైనా నీతి నీతేనని నిరూపించింది! పెళ్ళిలేకుండా బిడ్డల్ని కన్న తల్లులకూ, వారికి పుట్టిన పిల్లలకూ సమాజంలో గౌరవ స్థానం ఉండాలని నిర్దేశించిన అంతర్జాతీయ మహిళా సంవత్సరానికి కానుకగా అందిచవచ్చిన జ్ఞాపిక- ''రేపటి కథ''. మాతృత్వంపై మమకారం సులోచన జీవితాన్ని దుర్భరం చేసిన ఘట్టం అది. ఈ సమాజంలో **love-triangle**లో ఉన్న అమ్మాయిలూ ఉన్నారు, మోసాల

చౌరస్తాలలో ఇరుక్కుపోయిన వారూ ఉన్నారు. జర్మన్ సినిమా ''మలీనా''లో ముప్పేట ప్రేమలో చిక్కుపడిపోయిన ఒక అమ్మాయి "I write about the essence of fire with my burnt hand" అంటుంది. అలాంటి ధైర్యవంతులయిన మహిళలూ ఉన్నారు మనకు.

అంతేగాదు, ఈ దేశంలో పెళ్ళిళ్ళు కూడా, ఆ చేసుకునే వాళ్ళకోసం కాక ఇంకెవరికోసమో జరగడాన్ని వెంకట్రామయ్య నిరసిస్తాడు. బతుకు భారం వల్ల కుటుంబ బాధ్యతల కోసం, కట్నం కోసం, డబ్బుకోసమే- పెళ్ళిళ్ళు చేసుకోవడాలు చూస్తున్న వెంకట్రామయ్య ఈ దేశంలో మగాడి కోరికలూ సరదాలూ తీరడానికుండే అవకాశాలు ఆడదాని కోరికలూ, సరదాలూ తీరడానికి ఉండవని తేగేసి చెప్పాడు! అలాగే, ఫెమినిస్టు పరిధిలోనే అవసరమైన హెచ్చరికలూ ఉన్నాయి. బాధ్యతల స్పృహలేకుండా వయసు కట్టలు తెగిన నదిలా పొంగులు వారినప్పుడు కుటుంబాలకు వచ్చే కష్టనష్టాలను కనిపెట్టి మెలగాల్సిన అవసరాన్ని గుర్తింపచేసే మందలింపులూ ఉన్నాయి. పరిచయస్తుడ్ని వదలలేని రాజ్యం (''నిన్నటి వెన్నెల'') ఆ పరిచయస్తుడి మనస్సును కనిపెట్టలేకపోయింది! భర్త గుమస్తా కోటీశ్వర్రావు రాజ్యానికి నచ్చకపోవచ్చు, కాని రాజ్యం పెళ్ళి తర్వాత కూడా ఆమెపై మమకారం వదల్లేని రాజ్యం పరిచయస్తుడు తాను చేసుకున్న ''భార్యా నాకు పాతబడిపోయింద''నీ అవసరం తప్ప సుఖమనేది దొరకడంలేదనీ వదరడాన్ని రచయిత ఎలా సమర్థించాడో అర్థం కావడంలేదు! ఒకచోట రాజ్యానికి జరిగిన అన్యాయానికి, మరోచోట పరిచయస్తుడు చేసిన అన్యాయం సమాధానమూ కాదు, పరిష్కారమూ కాదు, సమర్థనీయమూ కాదు! కాపురం కుదరనప్పుడున్న రాచమార్గం విడాకులు- ఆ మార్గం విడిచి అడ్డదారుల్లో ఆలోచనలకు రచయితలు ఉప్పు అందించడం అరాచక ప్రవృత్తికి ఆహ్వానం! తల్లిపాలకూ, పౌష్టికాహారానికీ ఉన్న సంబంధాన్ని నిగ్గుతేల్చిన రచన 'బియ్యం'. ఒక తెలివైన వాడు మోసకారిగా కూడా ఎలా వ్యవహరించగలడో ''సావిత్రి''ని మోసం చేసిన గాథ ''పైరుగాలి''. సుప్రీమ్ కోర్టు అత్యాచారానికి (''రేప్'') విస్తృతార్థంలో చెప్పిన నిర్వచనాన్ని (భార్య ఇష్టపడని సందర్భాల్లో భర్త బలవంతం కూడా నేరమేనని) పాపులరైజ్ చేయాల్సిన అవసరాన్ని గుర్తింపచేసే రచన, ''ది రేప్''. ''అవినీతి కథ''లోని కృష్ణమూర్తిలాంటి అనుమాన పిశాచులూ, స్త్రీ అంటే చులకనగా, కేవలం భోగ్యవస్తువుగా భావించే భడవారాయుళ్ళు సమాజంలో ఉన్నంతకాలం- స్త్రీల సంరక్షణ సమాజం బాధ్యతగానే భావించాలని వెంకట్రామయ్య కథల సారాంశం లక్ష్య నిర్వచనలో కూడా

ఎంతో నమ్రత: రచనవల్లనే సమాజాన్ని బాగుచేయొచ్చుననీ, దేశాన్ని ఉద్ధరించవచ్చుననీ నేను అనుకోవడంలేదు. కాని-ప్రజల్లో అధిక సంఖ్యాకుల మేలుకోరే వ్యవస్థని ఏర్పరచుకోడానికి అవసరమైన అవగాహననీ, చైతన్యాన్నీ పాఠకుల్లో కలిగించడానికి సాహిత్యం ఒక సాధనంగా చేతనైన వాడిచేతిలో ఆయుధంగా ఉపకరిస్తుందని వెంకట్రామయ్య విశ్వాసం. కనుకనే ఆయన తన కథల్ని ఆర్ద్రంగానూ, అభ్యుదయకరంగానూ, ఆవేశంతోనూ, ధర్మాగ్రహంతోనూ ఎంతో పటుత్వంగా మలిచాడు. అల్పాక్షరాలతో అనల్పార్థాన్ని చూపించాడు. వస్తువునూ, శిల్పాన్నీ సమపాళ్ళలో నడిపి రసరమ్యంగా దిద్దితీర్చాడు. కనుకే హౌస్‌మాన్ రచనల గురించి జాన్ స్పారో అన్నట్లుగా "It is classical and it is romantic, it is simple and it is sophisticated; it is derivative and it is original". కనుకనే మంచి కథల్ని అందరూ చదవాలి, కనీసం చదవడానికి ప్రయత్నించాలి. సాహిత్య సృష్టి సంస్కృతీ వర్ధనం కోసం. ప్రజల ఆలోచనకు, అది ప్రోద్బలం చేసే సమర్ధనీయమైన ఉద్యమాలకు చేదోడు వాదోడు కాగలిగిందే సాహిత్యం. అందుకే ఫ్రెంచి పౌరుడుగా ఉన్న ప్రసిద్ధ రుమేనియన్ రచయిత యూజినీ అయొనెస్కో అనలేదూ: "Literature can help people... people who do not read are brutes" అని!

*(ఆదివారం 28, సెప్టెంబరు 1997)*

# మనసులు ఇరుకైనవేళ మీ తోడు - నీడ రజని, సునీత!

''**తె**లుగు నేల నిలిచి వెలుగు సన్నని తీగ సోగమెరుపు రేక సొగసు...'' అని ఒక కవి అంటే-

''ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్'' అని మరో ఉద్దండుడన్నాడు!

ఆ వెలుగులు, ఆ మెరుపులు, ఆ సొగసులు మగవారి సొత్తు కాదు, ఆకాశంలో సగం తమదని దండోరా వేసి సర్వత్రా విస్తరిస్తున్న మహిళా చైతన్యానికి అభినవ ప్రతీకలుగా, అభ్యుదయ గాములుగా కఠోర సత్యాలనునిర్మొహమాటంగా నిండు మనస్సుతో ప్రమాద సూచికలుగా ఎగరేస్తున్న కవులు సునీత, రజని. ఈ ఇరువురు ఇటీవల వెలువరించిన వజ్రసమానమైన కవితా సంపుటాలు ''అన్వేషి'' (సునీత), ''ఎర్ర జాబిల్ల ఎరీనా'' (రజని) చూడ్డానికి స్త్రీవాద కవితలు అనిపించినా, వారి అంతరంగ మధనాన్ని అర్థం చేసుకోటానికి జండర్ అడ్డురానక్కరలేదు. ఎందుకంటే పురుషాధిక్య సమాజంలో స్త్రీల కన్నీటి గాథలకు హేతువులు వెదికి స్త్రీకి వకాల్తా పట్టిన గురజాడ అప్పారావు నుంచి గుడిపాటి వెంకటాచలం దాకా చెప్పిన పాఠాలు మరిచిపోని వాళ్ళంతా ఈ రెండు కవితా సంపుటాలను మహిళా ఉద్యమ దీపశిఖలుగా, వారి హక్కుల పత్రంగా భావించుకోవచ్చు. భాషలో, భావంలో తొట్రుబాటులేని కవితలవి. రావులపల్లి సునీత, పాటిబండ్ల రజని- సమాజ పరిశీలన నిశితం, దృష్టి ప్రయోజనకరం, వ్యక్తీకరణ కళాత్మకం. స్త్రీ సమస్యలను దోపిడీ వ్యవస్థ స్వరూప స్వభావాల నుంచి పరిశీలించడంలో సునీత, రజని కనబరచిన తెంపు, తెగువ బహుధా మెచ్చుకోదగింది. కర్తవ్య దీక్ష తప్ప కాలుష్యంలేని మనస్సులు, ధిక్కారాన్ని సహించని ధిషణ, రచనా దక్షత, తోటి స్త్రీల అనుభవాలు, స్వీయానుభవాలు దిక్సూచిగా నడిచిన ఇతివృత్తాలు, ఆచరణకు తగిన అణకువ- వీరి కవితా వస్తువులకు

మణిభూషణాలు. వస్తువైవిధ్యంతోపాటు, తాము దర్శించే నవ్య మానవ సమాజాన్ని బొమ్మకట్టి చూపగల వారి ఊహల, వ్యూహాల ఇంద్రధనస్సు, సరికొత్త ఉపమాన, ఉపమేయాలతో కూడిన కవన ఝరి అడుగడుగునా మన మనస్సులను కదిపి కుదుపుతాయి. ఈ ఇరువురి కవితల్లో ఆలోచన, ఆవేదన, ఆవేశం సమపాళ్ళలో దూసుకుపోయాయి. రజని, సునీతలవి దేబిరింపు చూపులు కావు, డేగచూపులు. ఉన్న సమాజ పరిస్థితుల పట్ల ఉత్తి ఆగ్రహం కాదు, ధర్మాగ్రహంతో కూడిన ఆశాభావాన్ని టానిక్‌గా ఎక్కించి, మహిళా చైతన్యాన్ని ఉద్యమశక్తిగా నిలపడం ఈ సంపుటాలలో రజని, సునీతల ప్రధాన లక్ష్యంగా కనిపిస్తుంది. నేడు సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో సామాజికులు భరిస్తున్న కల్మషాన్ని, దౌర్జన్యాన్ని, అరాచకాన్ని, దోపిడీని, నిస్తేజాన్ని, మహిళలపట్ల అత్యాచారాలను, సంఘ వ్యతిరేక శక్తిగా రూపాంతరం పొందుతున్న మతోన్మాదాన్ని, ఎంతసేపూ ''రాంక్‌లో ఎదగడం తప్ప కనీసం గాలిపటం ఎగరేయడమైనా నేర్పని'' చుట్టు చూపులేని తల్లిదండ్రులను, విద్యావ్యవస్థను, స్త్రీని వంటింటి కుందేలుగానే అట్టిపెట్టి పనిభారం నుంచి ఆదివారం కూడా తప్పించలేని వ్యవస్థను రజని, సునీత ఎండగట్టారు. ''కన్నీరు నాదైనప్పుడు కాఠిన్యం మాత్రం నాదెందుకు కాకూడద''న్న వీరి ప్రశ్నకు ఇంకా సమాధానం రావలిసే ఉంది! మానని గాయాలు సాక్షిగా అంతరంగంలో జ్వలిస్తున్న అందరం ఒక్కటన్న నినాదంతో ఈ కవయిత్రులు చేసిన పని- పురుష ద్వేషం పెంచడంకాదు, కేవలం ప్రకృతి పురుషుల మధ్య ఏ సమన్వయం కోసం మన 'సాంఖ్యం' (మన దర్శనాలలో ఇదొకటి) తపనపడిందో ఆ సమన్వయాన్ని గౌరవప్రదంగా సాధించడానికి చేసిన ప్రయత్నం. ఈ మేధోయజ్ఞంలో రజని, సునీతలు ప్రపంచ మహిళా ఉద్యమకారులుగా, స్థితప్రజ్ఞలుగా, ఉద్దీపకులుగా, బాధ్యతగల ప్రబోధకులుగా తమ తనాన్ని నిరూపించుకున్న ఊల్‌స్టోన్ క్రాఫ్ట్, వర్జీనియా ఉల్ఫ్, ఎమ్మాగోల్డ్‌మన్‌లకు దగ్గరబంధువులవుతారు! వీరు ఎవరి కలల్నీ చెడగొట్టరు, కళ్ళను పీకరు. తమ ఆశలను, ఆశయాలను ఎందుకు పురుషాధిక్య సమాజం గౌరవించదు, చేయూతనివ్వదు అన్నదే వారి ఆవేదన. రజని, సునీతల నిశిత దృష్టిలో ప్రకృతి ఆరాధన కూడా ఒక విలువైన వస్తువు; బిడ్డ మనస్సు కలుషరహితంగా ఉండాలని కోరే తల్లి సమాజం పరిసరాలు కూడా కాలుష్యానికి దూరంగా ఉండాలని కోరుకుంటుంది. ఆ ఆరాధన ఇరువురిలోనూ ఉంది. అంతేగాదు, బాధాచిత్రాలతోపాటు అద్భుత భావ చిత్రాలూ ఉన్నాయి. ఒకరు గుండెలు రగిలించే నిజాల నిప్పుసెగలు చూపితే మరొకరు

మనస్సు చితి ధూపంలో అస్పష్ట చిత్రాలు, గీయడం చూపారు. ఒకచోట కులికే మరుమల్లెల కమ్మదనం గుబాళిస్తే, వేరొకచోట మరణమందార గుచ్ఛాలు శుభాకాంక్షలు తెలుపుతాయి! ఒకరి కలం గారాలు పోతున్న కోయిలతో రాగాలు పలికిస్తే, మరొకరి కలం గాయపు గాలాలకు చిక్కిన గంటల్ని పేరుస్తూపోతుంది. ఒకరి దృష్టి రసస్పృష్టికి మనశ్శక్తిని ధారపోసే కౌశికుల్ని కీర్తిస్తే, వేరొకరి చూపు కడలికి కుంకుమ అద్దిన కల్లోల సూరీళ్ళను చూపిస్తుంది. జెండాలు నుదురు చిట్లింపులుగా/ ఎజెండాలు పెదవి బిగింపులుగా సాగే/ నిరసన ప్రదర్శనలు ఇందులో చూడొచ్చు! అహంకారాన్నే ఆత్మాభిమానమనుకునే వాళ్ళకు సరిపడా చీవాట్లు రజనీ, సునీతలు పెట్టారు! సమాజ పరిణామాన్ని గమనించక 'అంధ గంధం' పూసుకు తిరిగే వాజమ్మలను, ఆదర్శ దాంపత్యాల ముసుగులో మార్జాల దాంపత్యాలు సాగిస్తున్న కుహనా సంస్కృతినీ నిరసించారు. అదే సమయంలో మూడుపూవులకు ఆరుకాయల ఆశలు చెట్లు పెంచడం ఎలాగో నేర్పారు! ప్రేమ పేరిట నాలుగు గోడల మధ్య ముగ్ధత్వాన్నీ మానవతను చిదిమివేసే శాడిస్టుల బతుకుల్నీ తూర్పారబట్టారు; ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును, ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును అన్న గురజాడ వారసులుగా రజని, సునీతలు ఇందులో తగిన పాఠాలు చెప్పారు. తొడపాశాలు పెట్టారు, నీతి వచనాల అవసరం ఎంత ఉందో నిరూపించారు.

లైంగిక విషయాలలో, జండర్ వివక్షలో దాపరికంలేకుండా పారదర్శకంగా, కొన్ని సందర్భాల్లో కుండబద్దలు కొట్టినట్టు ఈ ఇరువురు కవయిత్రులు అభిప్రాయ ప్రకటన చేయగలిగారు. ఈ విషయంలో ప్రపంచ కవయిత్రులలో ప్రసిద్ధులైన ఆఫ్రా బెన్‌కు, హాస్యంలో వ్యంగ్య వైభవంలో ఆన్‌ఫించ్, అద్భుత ఊహాపోహాలలో పదచిత్రాలలో మార్గరెట్ కెవిండిష్‌లకు మన రజని, సునీతా దగ్గరగా వస్తారు. స్త్రీలో కళాత్మకత, మేధస్సు వికాసం పొందడం అవసరం అన్నది వర్జీనియా ఉల్ఫ్. అయితే అది ''ఆర్థిక దాస్యం నుంచి విమోచన'' ద్వారానే సాధ్యమని తేల్చి చెప్పింది. చిలకమర్తి ఆశించిన విద్యలన్నీ వారికి కరతలామలకం అయ్యేది అప్పుడే మరి! ఈ దృష్ట్యానే వర్జీనియా ఉల్ఫ్ మహిళా చైతన్యాన్ని పెంచడంకోసం ''తనకంటూ ఓ స్థానం'' (Room of her own") అన్న రచన చేసింది. ఈ విషయాన్ని ఇంకాస్త విస్తరిస్తూ ఒక సందర్భంగా కవయిత్రులు కరోల్ కాస్మాన్, జాన్ కెఫీ, కాత్లీన్ వీవర్‌లు ఇలా అభిప్రాయపడ్డారు: ''ఈరోజుకీ మహిళామూర్తులకు, కళాకారులకు వారి కళాఖండాల ప్రదర్శనకూ, సాధారణ మహిళ ఒక పరిపూర్ణ కళాకారిణిగా ఎదిగిరావడానికి, ఆ కళను అంగీకరించడానికి

ఆమెకు ఆర్థిక, సాంఘిక, మానసికమైన దడులూ, మడులూ అడ్డువస్తూనే ఉన్నాయి'' **("Women poets").** గంజాయివనంలో తులసిమొక్కలా కాకుండా మహిళా చైతన్యం ఏపుగా ఎదిగి విస్తరించడానికి ఈ కనీసపు గ్యారంటీ అవసరం కాదా? అంతేగాదు, రజని, సునీతలు ప్రేమ పారవశ్యానికి, వెర్రిబాగులతనానికి హద్దులు తెలిసినవారు, శాసించగలవారూ. ఈ విషయంలో 12వ శతాబ్దపు కన్నడ కవయిత్రి మహాదేవి అక్క, స్వీడిష్ కవి మేరియా వైన్‌ల రచనలతో వీరి కవితలను పోల్చుకోవచ్చు. మహాదేవి అక్క ( ఎ.కె.రామానుజన్ ఆంగ్లానువాదం) దృష్టిలో సమాజంలో ఏది మంచో ఏది చెడో తెలుసుకోగలిగిన జ్ఞానం వచ్చేదాకా ఎలా జాగరూకులై ఉండాలో చెప్పింది. ఏ ప్రలోభాలు ఆకర్షిస్తాయో హెచ్చరించింది: **"Till you have earned/ knowledge of good and evil/ It is/ lusts body/ site of rage/ ambush of greed/ house of passion/ fence of pride/ mask of envy"!** ఈ అప్రమత్తతను రజని, సునీతలు తమ కవితలలో పెంచి పోషించారు; ప్రేమ పెరగడానికి చోటివ్వమన్నారు, దౌర్జన్యంతో మానవతను పెంచలేమన్నారు. స్నేహం ప్రధానం, శరీరం రెండో పక్షం అన్నారు. రజని- ''స్నేహ ధర్మంకాక శరీర ధర్మాలే గుర్తుకొచ్చే నీ వెనుక/ శతాబ్దం దూరం శాశ్వతంగా మిగిలిపోతుందన్న''ప్పుడు సందేశం సుస్పష్టం అలాగే సునీత వోట్ల రాజకీయాల్ని గురించి ముచ్చటిస్తూ వాగ్దానాల విందులు కురిపించే రాజకీయుల జిత్తులను బహిర్గతం చేసినప్పుడు 20వ శతాబ్దం తొలి దశాబ్దంలో మహిళా ఉద్యమ నాయకురాలుగా దూసుకువచ్చిన ఎమ్మా గోల్డ్‌మాన్ (1911) మహిళా విమోచనలో వోటు హక్కుకున్న పరిమితులు స్పష్టం చేస్తూ చేసిన ప్రకటన గుర్తుకొస్తుంది. ఎమ్మా ఇలా అంది: ''వోటు హక్కూ, అందరికీ సమాన పౌరహక్కులూ మంచి డిమాండ్లే కావొచ్చు. కాని మహిళలకు నిజమైన విమోచన ఎన్నికల ద్వారాగానీ, కోర్టుల ద్వారాగానీ ప్రారంభంకాదు. మహిళ ఆత్మలో, ఆమె మనోమందిరంలో అది ప్రారంభంకావాలి''! ఈ సత్యాన్ని రజని ఎంత బలంగా ఆవిష్కరించిందో చూడండి· ''కోకిలా, నాయకుడూ ఒక్కలానే లేరూ?/ కాకులలోనే పెరిగి కూత నేర్పుతో కోకిలా/ ప్రజలలోనే తిరిగి వోటు నేర్పుతో లీడరూ/ కావలసినంతవరకూ మౌనంగా మెలిగి/ కాలం తీరాక గొంతుమార్చేస్తారు!'' అలాగే సునీత కూడా జీవించే హక్కును కాలరాస్తున్న అనివార్య క్షణాల మధ్య తప్ప ఎప్పటికీ, మరెప్పటికీ నేను యుద్ధవ్యతిరేకినేనని చాటటం స్త్రీ- పురుషుల మధ్య ఉండవలసిన, పోషించుకోవలసిన సదవగాహనకు, వాత్సల్యానికి ప్రతీకగా భావించాలి. కాపలాగా వేసుకున్న కంచె కాస్తా చేనును మేస్తే పంటకు దిక్కెవరు? అలాగే చిరుమనస్సులను మలచవలసిన

**మనసులు ఇరుకైనవేళ మీ తోడు - నీడ రజని, సునీత!**

బడిపంతులే చిన్నారి వయస్సును కాటేసినప్పుడు రజని స్పందన విషప్పుచ్చెలకు విరుగుడు: ''అయ్యవారూ! ఆడపిల్లల కోసం మీ సిలబస్ కొంచెం మార్చండి/ తరతరాల యోధుల కథల్తోపాటు/ తమనుతాము కాపాడుకోవటం కూడా నేర్పండి! / రాణీ మల్లమ్మ కథవద్దు- రమీజాబీ పాఠం చెప్పండి/ మాంచాల పద్యాల బదులు- మాయాత్యాగి గాథ చెప్పండి/ కప్పను కబళించే పాముల్ని గురించేకాక- కను'పాప'ల్నే కాటేసే రెప్పల విపరీతాన్నికూడా/ ఒప్పులకుప్ప వయస్సప్పట్నుంచే హెచ్చరించండి''! స్త్రీ-పురుషుల సమాహారం ఈ సమాజం. ఒకే బొంగుకు ఇరువురూ రెండు రూపాలన్నాడు తత్వవేత్త. అవగాహన ఉంటే 'అర్థం చేసుకుంటే జీవితం ఆనందడోలిక, ద్వేషం, విద్వేషం వల్ల జీవితం, లోకవృత్తం దుర్లభం' ఈ సత్యాన్ని ఇరుపక్షాలూ గుర్తించాలి. ఆ గుర్తింపు ఒక పక్షాన లేదు కనుకనే కవయిత్రి చాటవలసి వస్తోంది: '' ఇప్పుడు నేనొంటరికాదు/ ధరిత్రి ఈనినట్టు/ దుఃఖం, ఉద్వేగం, ఉద్రేకం/ సమూహమై, చైతన్యమై, జ్ఞానమై అంతటా నేనై''అంటూ భరోసా చెప్పుకోవలసి వస్తోంది! జన్మపరంగా అందరికీ వచ్చిన జరామరణాలతోపాటు జండర్ (స్త్రీ,పురుష) పరంగా వచ్చిన జాడ్యాల శిలువల్ని కూడా మోస్తున్న అమ్మలకు ఇప్పటికైనా రిలీఫ్ ఇవ్వడం అమానుషం కాదా అని రజని, సునీతల ప్రశ్న. జవాబుకోసం ఎంతకాలం వారి నిరీక్షణ?

*(ఆదివారం 9, మార్చి 1997)*

# సకలభాషా సంస్కృతుల సంగమ స్థలం!

ప్రియురాలు మరణింప
ప్రియుడు కట్టించె
కన్నీటి కలపోతగా
తాజమహలు!
జవరాలి ప్రేమకై
యువరాజు నిర్మించె
పన్నీటి కానుకగ
భాగ్యనగరమ్ము!

అది పాతికేళ్ళనాటి మాట. సకల భాషా సంస్కృతీ వాహినులకు వారధిగా, ఉత్తర దక్షిణ సంస్కృతీ సంగమంగా, మతసామరస్యానికి ముఖద్వారంగా పేరెన్నికగన్న కుతుబ్ షాహీల నాటి ''భాగ్యనగరం'' (హైదరాబాద్) గురించి, ఒక సామాన్య తెలుగు నర్తకి ప్రణయగాథ గురించి ఒక మహానగరాన్ని ప్రపంచానికి అంకితం చేయడం గురించి నార్ల చిరంజీవి రచించిన రసవత్తర శృంగార నాటకంలోని పాదాలివి. భాగ్యనగరానికి నాలుగువందల ఏళ్ళ చరిత్ర ఉందని చెప్పి, ఇటీవల ఉత్సవాలు తలపెట్టారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకుని పురాచరిత్రలోని వెలుగునీడలను తడుముతూ ఎన్నో పుస్తకాలొచ్చాయి. వాటిపై వ్యాఖ్యలూ విమర్శలు కూడా ఎన్నో వచ్చాయి. కాని ఇటీవల కాలంలో పాలనా సామర్థ్యంలో, పౌరసేవలో, సంఘ సంస్కరణలో, పాండిత్యంలో, రచనా వైభవంలో, అన్నింటికీ మించి తాడిత పీడిత ప్రజాబంధుగా, హైదరాబాద్ జిల్లా మొదటి కలెక్టర్‌గా రాణకెక్కిన కె.చంద్రయ్య రాసిన హైదరాబాద్ చరిత్ర **("Hyderabad: 400 Glorious Years")** ఆయన స్వప్న కలశం. విశిష్ట పరిశోధన ఫలితం. ఇప్పుడు చంద్రయ్య మన మధ్య లేకపోవచ్చు. కాని భాగ్యనగరం చరిత్ర రచన కోసం, సుందరమైన ఉర్దూ చేవ్రాతల చరిత్ర కోసం ఆయన చేసిన పరిశోధన, సేకరించిన సామాగ్రి, పడిన

కష్టం అసామాన్యం అని చెప్పాలి. సాంఘిక సమస్యలు, ప్రజల కడగండ్లు, జాతీయ సమైక్యత, మతసామరస్యం- అడుగడుగునా చంద్రయ్య మనస్సును ఊగించి శాసించిన అంశాలు. సాలార్‌జంగ్ మ్యూజియం (ఫండ్స్) సర్కిల్ విశిష్ట సభ్యునిగా, మౌలానా అబుల్ కలామ్ గ్రంథాలయ పరిశోధన సంస్థ సభ్యునిగా సేవలందించిన చంద్రయ్య ఇస్లామిక్ కాలిగ్రఫీ గురించి, అందుకు భారతీయులు ఇచ్చిన చేయూత గురించీ ఆలిఘడ్ యూనివర్సిటీలో అనేకసార్లు ఉపన్యాసాలిచ్చిన మేధావి. శతపుష్ప సమర్పణంగా, సమర్చనంగా సాగిన చంద్రయ్య రచనలో ఏ ఒక్కదానినీ విస్మరించరాని వంద అధ్యాయాలు ఉన్నాయి. ఇది కేవలం తారీఖులు, దస్తావేజుల మతలబుకాదు, కేవల రాచరికాల చరిత్రకాదు, ప్రణయ గాథలతోపాటు, ప్రజల బాధలు, కన్నీటి గాథలూ జమిలిగా నడిపించిన నగర చరిత్ర : మధ్యయుగాల నుంచి ఈమధ్యకాలం దాకా భాగ్యనగర చరిత్ర ఎన్ని మలుపులు తిరిగిందీ ఇందులో లిఖితమై ఉంది. 16వ శతాబ్దం రాజకీయంగా, సాంఘికంగా, మతపరంగా దక్షిణభారతంలో, ముఖ్యంగా దక్కన్‌లో ఎన్నెన్నో పరిణామాలకు కారణమైంది, ఢిల్లీ నవాబులకు ప్రతికూలంగా స్వతంత్ర రాజ్యాలుగా ఏర్పడిన బహమనీ, విజయనగరం రాజ్యాల పతనానంతర పరిణామాల మధ్య ఆంధ్రజాతి పతాకం తిరిగి గోలుకొండలో ప్రతిష్ఠించడానికి దోహదం చేసిన సన్నివేశాల సమాహారం ఈ రచన. చెప్పుకోడానికే 400 సంవత్సరాల చరిత్రగాని, ఇందులో తొలి రెండువందల ఏళ్ళే భాగ్యనగర వైభవానికి నిజమైన నిలువుటద్దం అని చెబితే అబద్ధమూకాదు, అతిశయోక్తీకాదు. ఎందుకంటే, తొలి 200 సంవత్సరాలు (16-17 శతాబ్దాలు) కుతుబ్‌షాహీల పరిపాలనా కాలమే ఒక మేరకు స్వర్ణయుగం. ఆనాడు వెలసిందే భాగ్యనగరం-హైదరాబాద్. తెలుగులు సంతోషించిన కాలమూ ప్రజలు సహకరించిన కాలమూ అదే. కాని ఆ తరువాతి రెండువందల ఏళ్ళ చరిత్ర అసఫ్‌జాహీ వంశీయుల పాలనలో అలుముకుపోయిన అంధయుగానికి ప్రతీక. దక్కన్‌లో ఆంధ్ర సంస్కృతికి, తెలుగు భాషకు ఈ వంశీయులు ఇచ్చిన విలువ 'సున్న', కాకపోతే నామమాత్రం! ఇరువాగుల వారూ ముస్లిములే అయినా మొగలాయి చక్రవర్తి ఔరంగజేబును ప్రతిఘటించడానికి నడుం కట్టి గోల్కొండ వైభవ ప్రాభవాలను, ఈ ప్రాంతం సమైక్యతా శిబిరాన్నీ కాపాడడానికి ప్రయత్నించిన వాళ్ళు కుతుబ్‌షాహీలుకాగా, ఔరంగజేబు పంచన చేరి సుబేదార్లుగా మారి చరిత్ర హీనులయిన వాళ్ళు అసఫ్‌జాహీలు. ఇక ఏడవ నిజామ్‌గా మీర్ ఉస్మాన్ అలీఖాన్ హయాము అంతకన్నా తీసికట్టుగా మారింది కుతుబ్‌షాహీలు నిర్మించిన

సంఘీభావ సౌధాన్ని కూల్చడంలో వీరు ప్రధాన పాత్ర వహించారు. రజాకార్ల దోపిడీలు, హత్యలు, స్థానిక ప్రజలపై అత్యాచారాలు నిత్యకృత్యంగా ఏళ్ళతరబడి సాగాయి. ఇది తెలంగాణా ప్రజలను మూగనోము విడిచి త్యాగ సంస్కృతివైపు కంకణం కట్టడానికి ప్రోద్భలం చేసింది; గ్రంథాలయోద్యమం, ఆంధ్రోద్యమం ఇందుకు తోడ్పడ్డాయి; మాతృభాషలో వికాసం తెలుగుల జన్మహక్కుగా మారింది. కవి దాశరథి మాటల్లో 'తీగలను తెంపి అగ్నిలో దింపిన' నైజామును లొంగదీసి కోటి రత్నాలవీణ మీటిన తెలంగాణా తన మగటిమిని నిరూపించుకుంది; మోదుగుపూలు పుట్టుకొచ్చాయి, చిల్లర దేవుళ్ళను తరిమికొట్టాయి; జ్ఞానపథం జనపదాన్ని ఆశ్రయించింది. వైశాల్యంలో మైసూర్, గ్వాలియర్‌లకు మూడురెట్లు అధికంగా, నేపాల్, కాశ్మీర్‌లకు సమ ఉజ్జీగా ఎదుగుతూ వచ్చిన భాగ్యనగరం భిన్న భాషా సంస్కృతులకు నిలయంగా ఎలా రూపుదిద్దుకుంటూ వచ్చిందీ ఈ గ్రంథంలో రసవత్తర వ్యాఖ్యానం ద్వారా చంద్రయ్య చెప్పారు. ఈ సమష్టి సంస్కృతీ వారసత్వానికి చేదోడు వాదోడు అయినవారు ఒకరా, ఇద్దరా! పఠాన్లు, ఆఫ్ఘాన్లు, టర్కులు, పర్షియన్లు, క్షత్రీలు, కాయస్థులు, తెలుగులు, అరబ్బులు, సిక్కులు, మరాఠాలు, రాజపుత్రులు- ఇలా ఎందరో భిన్న సంస్కృతీ మహాస్రవంతిని సువర్ణ సాగరంలా దిద్దితీర్చారు! చరిత్రలో ఎన్నో నగరాలు వెలిశాయి, మరెన్నో పట్టణాలు పుట్టాయి. కాని కోహినూర్ వజ్రంలా జగజ్జేగీయమానంగా చెక్కుచెదరకుండా నేటికీ తన తనాన్ని నిలుపుకొంటూ వచ్చిన సుందర నగరం హైదరాబాద్. ఈ నాలుగు వందల సంవత్సరాల భాగ్యనగర్ చరిత్రను, ఆయా కాలాల్లో నగర ప్రజల జీవనాన్ని, కాలప్రవాహాన్నీ, పర్యాటనకు వచ్చిన ప్రసిద్ధ చరిత్రకారులైన ఏనుగుల వీరాస్వామి, నిజాముద్దీన్, ఫెరిస్తా, టవెర్నీర్ ఎలా వర్ణించిందీ సోదాహరణంగా చంద్రయ్య ఇందులో ప్రస్తావించారు. మధ్యయుగాల్లో నిరంకుశ ప్రభువులు, ఫ్యూడ్యల్ ప్రభువులు, పాలకవర్గాలుగా ప్రజాధనాన్ని ఎలా కొల్లగొట్టిందీ, ఈ దోపిడీలో హిందూ- ముస్లిం పాలకుల మధ్య భేదం లేదనీ చంద్రయ్య సమర్థనీయమైన సమన్వయం చెప్పారు. అయితే కొందరు చెపుతున్నట్టు అసఫ్ జాహీ నిజాములు ఏడుగురు కారనీ పదిమంది అనీ ఇందులో స్పష్టమవుతుంది. ఈ పదిమందికీ తొట్టతొలుత ఔరంగాబాద్ ఎలా రాజధానిగా ఉన్నదీ ఆసక్తికరమైన కథనం ఉంది;. తెలంగాణా, మరాట్వాడా, కర్నాటక ప్రాంతాలు బ్రిటిష్ వాళ్ళతో, ఫ్రెంచి వాళ్ళతో నిజాముల తగాదాల వల్ల ఎలా నలిగిపోయ -యో చెప్పారు. మొత్తం ఆనాటి చరిత్రలో కులీ కుతుబ్‌షాల (ఇబ్రహీం, సుల్తాన్ మహ్మద్) పాలనకే చంద్రయ్య పెద్దపీట

వేశారు. పర్షియన్‌తోపాటు తెలుగుభాషను గౌరవించి తెలుగువారికి ప్రియమైన ''ఇభరముడు''గా మల్కిభరాముడుగా కుతుబ్‌షాలు ఎలా ప్రశస్తిలోకి వచ్చిందీ చెప్పారు.

ఇరువురు కుతుబ్‌షాహీలు హిందూ స్త్రీలనే ( ఇబ్రహీం 'భగీరథి'ని, సుల్తాన్ మహమ్మద్ ఖులీ 'భాగమతి'నీ) ప్రేమించి పెళ్ళిచేసుకున్నారు; జిజియా పన్నును రద్దుచేశారు, ఆలయ భూములు, క్షేత్రాలపై పన్ను తొలగించారు; తానీషా చరిత్రమ, అక్కన్న మాదన్నలను పదవుల నుంచి తొలగించ నిరాకరించినప్పుడు కుతుబ్‌షాహీల మీద కారాలు నూరిన ఔరంగజేబు ధాష్టికం గుట్టును చంద్రయ్య కలం విప్పి చెప్పింది; కుతుబ్‌షాహీ వంశస్థుల హత్యతో గోల్కొండ చరిత్ర ఎలా మారిందీ చెప్పారు. మూసినా దాగని మూసీ చరిత్రను, చెప్పినా తరగని సామాన్య ప్రజల గుండె చప్పుళ్ళనూ ఇందులో వినవచ్చు; హైదరాబాద్ సెక్యులర్ సంస్కృతికి గొడుగుపట్టిన సూఫీ ప్రవక్తల చరిత్ర ఇందులో ఒక హైలైట్ ఇంగ్లండ్‌కు ఒకప్పుడు సెయింట్ జార్జి ఎలాగో, ఢిల్లీకి నిజాముద్దీన్ ఎలాగో- మధ్యయుగ భాగ్యనగరానికి సూఫీ ప్రవక్తలు అలాంటివాళ్లు, సామరస్య ప్రవక్తలు. ఈ ప్రభావంవల్లనే కుతుబ్‌షాహీలు అక్కన్న మాదన్నలనేకాదు, గోపన్న, వెంకన్న, దర్శి లింగన్నలాంటి తెలుగు అధికారులను తమలో ఇముడ్చుకోగలిగారు; ఈ ప్రభావం ఫలితంగానే మాదన్న సోదరులు కుతుబ్‌షాహీలకు అండగా ఔరంగజేబును ప్రతిఘటించడానికి దక్కన్ పాలకులను దండిగా సమీకరించేందుకు మరాఠా ఛత్రపతిశివాజీతో రాయబారాలు నడపగలిగారని మరవరాదు. అంతేగాదు, చంద్రయ్య రచన- ఆనాటి సమాజంలో స్త్రీల స్థితిగతులు ఎలా ఉండేవో చూపుతుంది; సాంఘిక జీవనంలోనేగాదు, మత విషయాలలో రాజకీయాలలో వారి పాత్రను ఇందులో వివరించారు. కదిరీపతి (కడప) ''సుక సప్తతి'' కావ్యం ద్వారా కుతుబ్‌షాహీల కాలంలో గ్రామీణ జీవితం ఎలా ఉందో తెలుసుకోవచ్చు; నాడు మెక్కాతివాసీలు, షిరాజ్ చాకులు, కాశ్మీర్ శాఫ్రాన్, మలయాళం చందినీ, ఇండోనీషియా పోకచెక్కలు ఎలా కొల్లలుగా తెలంగాణా అంగళ్ళను ముంచెత్తాయో మనకు తెలుస్తుంది. అరేబియా కోస్తా పట్టణాలతో తెలంగాణా వర్తక వ్యాపారాలు ఎలా నిర్వహించుకుందీ తెలుస్తుంది; అలాగే హైదరాబాద్ చరిత్రలో నిజాం ప్రభువులు, రాజా రఘునాథ్‌దాస్ పాత్ర, సాలార్‌జంగ్స్, పాయిగా ప్రభువుల పాత్ర, బ్రిటిష్ రెసిడెంట్లు, రెసిడెంట్ కిర్క్ పాట్రిక్ ప్రణయ గాథలు ఇందులో ఉన్నాయి; హైదరాబాద్ కరెన్సీపైన ''92'' అంకెకు ఉన్న ప్రాధాన్యం గురించీ, పేపర్ కరెన్సీ ప్రవేశం గురించి ఆసక్తికరమైన వివరాలున్నాయి; అంతేగాదు, ప్రజల

బాగోగులు పట్టించుకోకపోయినా విలాస జీవితాల మధ్య అసఫ్ జాహీలు ప్రవేశపెట్టిన మొగల్, ఇండో-సార్సెనిక్, సార్సెనిక్-రాజస్థానీ వాస్తుశిల్ప కళారీతుల గురించిన వివరాలూ ఉన్నాయి; వివేకానంద, గాంధీ, అంబేద్కర్‌ల నగర సందర్శన, హైదరాబాద్ దర్గాలపై కుష్వంత్‌సింగ్ పడ్కర్‌ల పరిశీలన, ఆర్యసమాజ కార్యకలాపాలు, హైదరాబాద్‌లో కులనాయకుల పాత్ర ప్రస్తావనలు ఇందులో ఇమిడాయి; సంస్థాన చరిత్రలో- ఈ నగర చరిత్రలో ప్రతీ దశలోనూ మతసామరస్యానిదే పైచేయి అనడానికి వీలులేదు. ముఖ్యంగా మూడవ నిజాం అయిన ''సోకందర్‌జా'' హయాము నుంచీ అడపాదడపాగానైనా మతతగాదాలు, కొట్లాటలు జరుగుతూనే వచ్చాయనీ, అయితే నాటి ప్రధాన తగాదాలన్నీ హిందూ-ముస్లింల మధ్యకంటే ముస్లింలలోని సున్నీ-షియా తెగల మధ్యనే తరచుగా జరిగేవనీ చంద్రయ్య రచన నమోదు చేసింది. ఆయా కాలాలకు చెందిన ఘట్టాల ఛాయాచిత్రాలు ఎన్నో ఇందులో ఉన్నాయి; నిజాం మీర్ మహబూబ్ ఆలీఖాన్‌కు సుప్రసిద్ధ అధికార ఛాయాగ్రాహకుడైన రాజా దీనదయాళ్ కెమెరాలో బంధించిన నగర వైభవ దృశ్యాలు ఈ చరిత్రకు ప్రత్యేకాలంకారాలు! భారత తొలి రోదసీ యాత్రికుడైన రాకేష్‌శర్మ, ''అగ్ని'' మిసైల్ అగ్నిహోత్రుడైన డాక్టర్ అబుల్‌కలామ్, కేంద్ర ప్రణాళికా సంఘం సభ్యుడైన అబీద్ హుస్సేన్‌ల పుట్టినిల్లు భాగ్యనగరం కావడం ఎవరికి గర్వకారణం కాదు? గవర్నర్ గిరీలు చెలాయించిన సరోజినీనాయుడు, పద్మజానాయుడు, చెన్నారెడ్డి- హైదరాబాద్ వనవాటికలో ఎదిగివచ్చిన ఉద్దండులంటే గర్వించని వారెవరు? విజయనగరం రాజధానిగా హంపి, బహ్మనీల రాజధానులుగా గుల్బర్గా, బీదర్‌లు కేవలం చారిత్రిక స్థలాలుగానో, జిల్లా కేంద్ర కార్యాలయాలుగానో మిగిలిపోవలసివచ్చింది; లేదా పర్యాటక కేంద్రాలుగానే సరిపెట్టుకోవలసి వచ్చింది; కాని హైదరాబాద్ నగరం- 17వ శతాబ్దంలో మొగలాయీసేనల దండయాత్రను తట్టుకొని, తేరుకొని పునరుజ్జీవనం పొంది చరిత్రలో తిరిగి నేటిదాకా తన వైభవాన్ని నిలబెట్టుకొంది; రాష్ట్రపతి దక్షిణాది విడిదిగా రాజసం చెలాయిస్తోంది. అసలు నగర నిర్మాతలు కుతుబ్‌షాహీలు కారు, ఆలోచనే వారిది, ఆకారం కల్పించిన వాస్తుశిల్పి కోర్బ్యూజర్ **(Courbousier)** అని మరవరాదు! సౌధభారం పునాదికి తెలుస్తుంది; నగర నిర్మాణ, పునర్నిర్మాణ భారం రాళ్ళెత్తే కూలీలకు తెలుస్తుంది!

*(ఆదివారం 23, మార్చి 1997)*

# ''భువనాలు కవనాలు పొంగిపొర్లిన వేళ''
# సాహితీ భారతి!

అవి ఒళ్ళు జలదరించిన ఘడియలు, జలదరించి కళవళించిన దినాలు, అతడు శంఖం నినదిస్తే చాలు, ఆ కళ్ళు ఆదేశిస్తేచాలు, ఆ చూపుడు వేలు ఆజ్ఞాపిస్తే చాలు, ఆ గొంత గర్జిస్తే చాలు, ఆ తనువు కదిలివస్తే చాలు, ఆ అడుగు ముందడుగై సాగితే చాలు- ప్రతి భారతీయుడూ ఒక వీరభద్రుడయ్యాడు, ఒక ప్రళయ భీకర స్వరూపుడయ్యాడు, రణోన్మత్తుడయ్యాడు, తానే ఒక విలయమయ్యాడు; బలిపీఠం ఎక్కడానికి మారుమాటాడకుండా స్వచ్ఛందంగానే ముందుకు ఉరికిన రోజులవి. యావద్భారతానికి ఆ స్ఫూర్తినిచ్చినవాడు గాంధీజీ. దేశభక్తులంతా ఎవరికితోచిన రీతిలో వారు ''భరతమాత''కు హారతులు పట్టారు. పరదేశ పరిపాలనా దాస్యశృంఖలాలను మాత్రమేకాదు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కోరుతున్న కవులూ, రచయితలూ కూడ సామ్రాజ్యవాదులు రూపొందించిన చట్టాలు విధించిన సాహితీ శృంఖలాలను తెగతెంచుకుని ముందుకు దూకిన సుముహూర్తాలవి. నేడు పిదపబుద్ధులు పుట్టి కొమ్మలూ, రెమ్మలూ తొడుగుతున్నాయిగాని, ఆనాడు సకల వర్ణాలవారు, అఖిల వర్గాలవారూ, సర్వమతాలవారూ ఏకతాటిమీద నడిచి భారతజాతి విమోచనే ఏకైక లక్ష్యంగా స్వాతంత్ర్య రథాన్ని లాగినవారే. అందుకే ఓ కవి కుమారుడన్నాడు: ''జీర్ణపర్ణ కుటీర సంకీర్ణ దేశ/ చిర నివాసిని దారిద్ర్య శిథిలవాణి/ గగనవాణిగ మార్మోగె కడల కడల/ అతని సందర్శనోత్సుక మావహించి''! అప్పటికే స్వరాజ్య రథానికి తొలి పూజలు సిద్ధంచేసిన మహనీయులు ''స్వరాజ్యం నా జన్మహక్కని'' చాటి ''వందేమాతరం'' మనకందించిన బాలగంగాధర తిలక్, బంకించంద్ర చటర్జీ! పరతంత్రత నుంచి ఇలా స్వాతంత్ర్యం పొందాలని తహతహలాడి సమర నినాదాలతో ప్రాణత్యాగాలతో పునీతమైన దేశాలు ఎన్నెన్నో, కవులూ, కళాకారులు మరెందరెందరో! పరాయి సంస్కృతీ ప్రభావం నుంచి దేశీయ సంస్కృతిని కాపాడడంలో రాజకీయోద్యమాలతోపాటు సాహితీ సమరాంగణంలో ప్రజావాక్కులై

సంస్కృతీ ఉద్యమాలు నిర్వహించిన వారిలో ముఖ్యులు రవీంద్రనాథ్ టాగోర్, డాక్టర్ డుబోయ్; అంతేగాదు, జాతుల ఔన్నత్యాన్ని చాటడంలో ప్రపంచ సాహిత్యంలో వారితో సమ ఉజ్జీలుగా చెప్పదగిన మరికొందరు సి.ఎల్.ఆర్.జేమ్స్, పాబ్లో నెరూడా, ఫ్రాంజ్ ఫానన్, కాబ్రాల్. జాతీయోద్యమంలో ఆశావాదానికి యేట్స్ మహాకవి ప్రాధాన్యమిస్తూ "You set fire to life/you made what is yours" అన్నాడు. ఆ త్రాణను, ఆధీరతను ప్రతివాడూ పొందాలన్నాడు. తాను పాడే పాటతో శృతి కలిపి అందుకున్న వాళ్ళూ పునర్జన్మ ఎత్తుతూనే ఉంటారనీ, ఈ ప్రపంచం ఆ ధీరమతులతో పొర్లిపొంగుతూ ఉంటుందనీ అన్నాడు. ప్రజా బాహుళ్యంతో ఈ మమేకత ఎలా సాధ్యమయింది? ప్రజలకూ కవికీ మధ్య ఎప్పుడూ అప్రకటితమైన ఓ సంధి పత్రం నడుస్తూ ఉంటుందని ఎడ్వర్డ్ సయిద్ అంటాడు (The poetic calling develops out of a pact between people and poet - "Culture and Imperialism")। అది విదేశీ ప్రభుత్వంగానీ, స్వదేశీ ప్రభుత్వంగానీ - విజ్ఞానశాస్త్ర, కళా సంస్కృతీ వైభవంపైనే రాజ్య పునాదులు భద్రంగా ఉండగలవన్నాడు విలియమ్ బ్లేక్. ఈ సందర్భంగా స్పానిష్ ప్రజలకు అంతర్యుద్ధ సమయంలో ఓ సుహృల్లేఖ రాస్తూ సుప్రసిద్ధ కవి లూయీ అరగాన్ ఈ యుద్ధానికి ప్రజలు కారకులు కారు, ఇది మనం కోరుకున్నదీకాదు, ఈ సంగతి ఇంగ్లాండ్ కార్మిక వర్గానికి చాటిచెప్పండి. కాని ఒకవేళ ఫాసిస్టులు మరోసారి బార్సిలోనాపై బారలు చాచి పెత్తనం చేయబోయినా వాళ్ళు మనుషుల్ని కాదు శిధిలాలను మాత్రమే ఏలవలసి వస్తుంది, పనిచేయడానికి కార్మికశక్తి కలికానికూ్కడా ఉండదన్నాడు! డిలన్ థామస్, హెర్బర్ట్ రీడ్, క్రిస్టోఫర్ కాడ్వెల్, డబ్ల్యు.హెచ్. ఆడెన్, లూకాసీ అంతర్యుద్ధంలో చిక్కుకున్న స్పానిష్ ప్రజలకు అండదండలుగా తమ గుండె గొంతులు కలిపారు. ఆ సమయంలోనే నెరూడా ప్రజల సమర స్ఫూర్తిని కీర్తిస్తూ their mouths are shaping the dry powder ready for action ... from so many bodies an invincible life rises" అని చాటాడు! అలా వీరంతా దేశాల చరిత్రలను మలచడంలో, త్యాగాలకు దీటైన మలుపు ఇవ్వడానికి చేదోడు వాదోడయ్యారు (We must swing history to its final course' అన్నాడు కార్న్ ఫోర్డ్)! అణగారిన ప్రజల గురించి నిత్యం ఆలోచించి ప్రబోధ రచనలు అందించిన ప్రసిద్ధ నీగ్రో కవి, చరిత్రకారుడైన డాక్టర్ డూబోయ్ పోరాటాల మధ్య ఎన్నడూ కుంగిపోనివాడు, ఓటమితత్వాన్ని దరిచేరనివ్వనివాడు ("O Lord, keep me from sinking. down")

''భువనాలు కవనాలు పొంగిపొర్లిన వేళ'' సాహితీ భారతి!

అలాగే భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ఉద్యమ స్ఫూర్తితో వెలసిన సాహిత్యానికి ప్రత్యేక చరిత్ర ఉంది. పాటలు, పద్యాలు, నాటికా నాటకాలు, ప్రచార సాధనాలుగా వెలువడిన జాతీయ గీతాలకు ఆనాటి కవులకు, రచయితలకూ వస్తువు-జాతీయోద్యమమూ, ఆ ఉద్యమం నుంచి పుట్టుకొచ్చిన వేయిన్నొక్క శాఖలూ. జాతీయజెండా, తిలక్ స్వరాజ్యనిధి, తిలక్ నిర్యాణం, రాజకీయాలలో గాంధీ ప్రవేశం, సహాయ నిరాకరణోద్యమం (అసహాయోద్యమం), రాట్నం, ఖద్దరు వస్త్రధారణ, మద్యపాన నిషేధం, హరిజనోద్యమం, ఉప్పు సత్యాగ్రహం, రౌలత్ చట్టం, స్వాతంత్ర్య సమరం, గాంధీ దివ్యస్మృతి- ఇత్యాదులన్నీ రచయితలకు వస్తువులయ్యాయి. ఇతర మేధావులందరిలానే పెక్కువంది కవులూ, రచయితలూ, కళాకారులూ జాతీయోద్యమంతో ప్రత్యక్ష, పరోక్ష సంబంధాలలో ఉన్నవారేనని మరవరాదు. వీరి పాత్ర జ్ఞప్తికి వచ్చినపుడు తమతమ దేశాలలోని వివెూచనోద్యమాలలో, సంస్కరణోద్యమాలలో వోల్టేర్, కార్లైల్, గోర్కి, మయకొవస్కీల పాత్ర గుర్తుకువస్తుంది. బ్రిటిష్ పాలనకు, దోపిడీకి వ్యతిరేకంగా నీలిమందు రైతులు సాగించిన వీరోచిత పోరాటాన్ని దీనబంధుమిత్ర ''నీల్ దర్పణ్'' నాటకం ద్వారా చిత్రించాడు. ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు విద్యా సంస్కరణల్లో భాగంగా వలస పాలనలో విద్యకు పట్టిన దుర్గతిని గుర్తెరిగి బాలబాలికలకు బెంగాల్‌లో ''వర్ణపరిచయ'', 'బోధోదయ', 'కథామాల'ను అందించాడు. ఆ ఊపుతో తదనంతర దశలో దేశవ్యాపితంగానే మాతృభాషల వికాసానికి స్ఫూర్తి కలిగింది. అలాగే బుందేల్‌ఖండ్ ప్రాంతంలో (యు.పి.) హిందూ- ముస్లిమ్ పేద రైతులంతా బ్రిటిష్ పాలనా దోపిళ్ళపైన నానాసాహెబ్, షేక్‌దల్లాల నాయకత్వాన తిరుగుబాటు చేశారు. ఆనాడు బహుళ ప్రచారం పొందిన పాటల్లో ఒకటి: ''కాళ్ళ కింద నేల, నింగిపైన అల్లా/ మా ఆశ అంతా షేక్‌దల్లా'' **(Below is the earth, above Allah/ our hope is in Shak Dalla)**!! అసలీ జాతీయ గీతాలకు ఇండియాలో తొలి సంకలనకర్త ద్వారకానాథ్‌గంగోపాధ్యాయ అని చెప్పవచ్చు. 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంతో ఈ సంకలన ప్రయత్నం జరిగిందని కొందరి అంచనా. రాజపుత్ర వీరుల గురించి రంగలాల్ బందోపాధ్యాయ పాపులర్ గీతాలను సంకలనం చేశాడు. స్వేచ్ఛ లేకుండా బతుకులేదని చాటాడు (**''In the lack of freedom/ who wishes to stay alive; O, Who wishes to stay alive"**)! మీర్జాగాలిబ్ దేశభక్తిగీతాలు అందిస్తే, బంకించంద్రుడు ''వందేమాతరం'', టాగోర్ ''జనగణమన''

అందించారు. అయితే ఇక్కడొక సత్యాన్ని చెప్పితీరాలి. మన గురజాడ అప్పారావు రాసిన''దేశభక్తి'' గేయం జాతీయంగానే గాదు, అంతర్జాతీయంగానూ సర్వకాలాలకు సమాన ధర్మంతో నిలవగలిగిన శక్తికలదని మరవరాదు. ఆసేతు సీతాచలం కదలబారిన జాతీయోద్యమంలో తెలుగు కవులు సహా పలు ప్రాంతాల రచయితలు ఉద్యమగీతాలు అల్లారు. వంగ విభజనతో నిప్పు రగిలింది. జలియన్‌వాలాబాగ్ దురంతాలతో కనువిప్పు కలిగింది. తెలుగునాట బలిజేపల్లి, దువ్వూరి, జాషువా, తుమ్మల, త్రిపురనేని, చెళ్ళపిళ్ళ, గడియారం, మధునాపంతుల, మాధవపెద్ది, వెంకట్రామానాయుడు, విశ్వనాథ, బసవరాజు, మంగిపూడి, కొడాలి ఆంజనేయులు, అబ్బూరి, దాశరథి, వానమామలై, కాళోజీ, వేలూరు శివరామశాస్త్రి, కాటూరి, శ్రీశ్రీ, చిలకమర్తి- ఇలా ఎందరో కవులు జాతీయతా స్ఫూర్తిని పాఠకులలో కలిగించారు.

గరిమెళ్ళ ''మా కొద్దీ తెల్లదొరతనం'' అన్న పాటతో తెలుగు నేలను ఒక కొలిక్కి తెచ్చాడు. 1921 నాటికే అసహాయోద్యమానికి అండదండలుగా గళమెత్తిన వైతాళికులు చిలకమర్తి, రాయప్రోలు, చెన్నాప్రగడ, మంగిపూడి. ''భరత ఖండంబు చక్కని పాడియావు'' రచనతో చిలకమర్తి మేలుకొలుపులు చెప్పాడు, చెరసాలలను వరచంద్రశాలలుగానూ, అరదండాలను (సంకెళ్ళను) విరిదండలుగానూ మలిచాడు! ''కారాగారాలను కైలాసం''గా మార్చుకోమన్నాడు! రాయప్రోలు రాష్ట్రగానంతో జాతి నిండు గౌరవాన్ని కాపాడాడు. దేవులపల్లి భారతమాతను దివ్యధాత్రిగానూ, ''జయజయ శత సహస్ర నారీ హృదయనేత్రి''గానూ దిద్దితీర్చాడు. దువ్వూరి ఒకవైపు నుంచి ''శారద శుభ్ర వియత్తల పథమున/ సంచరించు భారతమాత'' రథాన్ని ఆవాహనం చేస్తే, జాషువా ఇంకొకవైపు నుంచి చీలికలొద్దు ''ఐకమత్యంబు గల్గి నిన్ననుభవించు కొరత పూరించు మాకు'' అని వేడుకొన్నాడు. జాతీయ సమైక్యతా శక్తిగా జండాను జాతీయస్థాయిలో శ్యాంలాల్‌గుప్త పార్వద్ ''ఝండా ఊంచా రహే హమారా'' అని నినదిస్తున్న సమయంలో ఇటు తెలుగునాట ''జండా ఎత్తర, జాతికి ముక్తిర'' అంటూ కవులు చెలరేగారు. సాహస త్యాగాలకు, శాంతి సత్యాలకు, ఆత్మవిశ్వాసాలకు, ఔదార్య భావాలకు ప్రతీకగా ఉన్న జాతీయ పతాకను కవులు ''ఆడసీరా యెగిరి- ఆడసీరా విప్పి హాయిగా'' అని కీర్తించారు. ఒకవైపున దాశరథి ''నవోష్ణ రక్తధా/రా జలసిన్, పాద కమల ద్వయ శోభి మనోజ్ఞ దేహ రేఖా'' అంటూ భారతిని కీర్తించగా ఇంకొకవైపు నుంచి బాపిరాజు గాంధీని హిమాలయ శిఖరంతో పోల్చుతూ ''హిమాలయోత్తుంగ

శృంగం నీ బ్రదుకు/ఉమాపతీ నృత్యరంగం'' అంటూ నినదించాడు. విదేశీ వస్త్ర బహిష్కరణోద్యమంలో, స్వదేశీ ఉద్యమ ఉధృతిలో బసవరాజు''సిగ్గులేదా నీకు శరము లేదా/అన్నమైనా లేక బీదలల్లాడుతుంటేను/సీతాకోక చిలుకలాగ సీమ గుడ్డ/కట్టి తిరుగ సిగ్గు లేదా'' అంటూ ఎగతాళి పట్టించాడు. కరుణశ్రీ ''పరాధీన భారతదేశంలో/ నిరాధార నిర్భాగ్య ప్రజలకు/తరతరాల నరనరాల కెక్కించే'' శక్తినివ్వమని కోరగా, త్రిపురనేని ''వీరగంధము తెచ్చినారము, వీరుడెవడో తెల్పుడీ'' అని ఉడికించాడు. ఒకమూల నుంచి మధునాపంతుల ''సత్యసంధునకున్ హరిచందనంబు/న్యాయ మార్గైక పరునకు వందనంబు'' పలికితే, ఉమర్ ఆలీషా కవి ఇంకో తట్టునుంచి ''హిందూ ముసల్మాను లేక మైనారన్న/గాంధీ మహాత్ముని కతన గాదె'' అని చాటాడు. ఒక కవి ''నిమ్నజాతుల నెత్తుమోయి వారు/నీరసించిన యెడల నికనీకు గోయి'' అని ఎలుగెత్తి చాటగా, వెన్నెలకంటి '' ఏకులు కావలెనా? దాస్యపు మోకులు కావలెనా!/కదురులు కావలెనా? కొరడా బెదురులు కావలెనా?'' తేల్చుకోమని చెప్పాడు. గాంధీ హత్య వార్త విని జ్ఞానానంద కవి ఇంక ''వినుపించునే విశ్వమును దన్ను నవ్య భారత వర్ష నిర్మాత రమ్యవాక్కు'' అని విలపించాడు! ఈ మాటలు విన్నప్పుడు ఒక ఆంగ్లకవి "Your breathing is the blast, the bullet, and the final sky" అన్న మాటలు జ్ఞప్తికొస్తాయి. బహుశా అందుకే మాటలకు బాటలు మలిచే శక్తీ, బీటలు కొట్టే శక్తీ ఉందంటారు పెద్దలు. ఉద్యమ స్ఫూర్తి అనేది ఉరవడిలో ఉన్న నదిలాంటిది. అది కరకట్టలనేకాదు, నదీ ముఖద్వారాల రక్షణలేర్పాటు చేసుకున్న అసలు కట్టలను కూడా తెంచుకుపోతాయి. జాతీయోద్యమాలు, స్వాతంత్ర్య సమరాలు అంతశక్తి కలవీ, వాటికి ఉద్దీపనగా ఉండే గీతాలూ, సంగీతాలూ అంతే శక్తికలవీ. కనుకనే కవి డబ్ల్యు.హెచ్.ఆడెన్ అంటాడు: "Reshuffle the alphabet and order the guns/ To discharge their shells into the doubtful ear"! అలా 'వర్ణమాల'ను మార్చడం, భావ విప్లవానికి ప్రోది చేయడం ఉద్యమాలకు మాత్రమే, ప్రజా ఉద్యమాలకు మాత్రమే తెలిసిన విద్య అని మరిచిపోరాదు!

*(ఆదివారం 17, ఆగస్టు 1997)*

# స్త్రీవాద సాహిత్యానికి శోభాడే సరికొత్త కాన్క!

**స**త్యం కర్ణకఠోరంగా ఉంటుంది. భారత స్త్రీవాద సాహిత్యంలో ఒక కమలాదాస్, ఒక శోభాడే వాదనలు కూడా కొందరికి దుర్భరంగానే ఉంటాయి. కాని జీవితాన్ని ఎలా కాదనలేమో, దానిని అంటిపెట్టుకుని వ్యక్తులు గడించే జీవితానుభవాలను కళ్ళు మూసుకుని తోసిపుచ్చలేము. అక్కడక్కడా స్త్రీవాదం అతివేలంగా, అతివాదంగా అనిపించవచ్చుగాని పితృస్వామిక వ్యవస్థలో, శ్రమ దోపిడీపై ఆధారపడిన పెట్టుబడి వ్యవస్థలో, విద్య, వైద్యం, ప్రేమలు, పెళ్ళిళ్ళూ, మాటామంతీ - అన్నీ వ్యాపార నాగరికతలో భాగమైపోతున్నాయి కనుకనే సమాజంలోని ప్రతీవర్గమూ తమ హక్కుల గురించి చైతన్యం పొందవలసిన అవసరం వచ్చింది. పురుషాధిక్య సమాజంలో స్త్రీకి ఈ ప్రత్యేకత మరింత అవసరమవుతోంది. స్టార్‌డస్ట్, సొసైటీ, సెలిబ్రిటీ మాగజైన్లతో భారతీయ పత్రికా లోకంలోకి వేగాతివేగంగావిరుచుకుపడిన శోభాడే పురుషుల్ని కవ్వించి వారి మనస్సుల్లో కల్లోల తరంగాలను, గుండెల్లో సూపర్‌ఫాస్ట్ రైళ్ళను పరుగెత్తించడంలో విజయవంతమైన రచయిత్రి! స్త్రీవాదులకూ, స్త్రీవాద సాహిత్యాభిలాషులకూ- ఒక్కముక్కలో మహిళా లోకానికి వకాల్తా పట్టగల ఒక గుడిపాటి వెంకటాచలమో లేదా సుప్రసిద్ధ ఫ్రెంచి ఫెమినిస్ట్ సిమన్ ది బోవిర్‌లాంటివాళ్ళో ఇప్పుడు లేరన్న బెంగ అవసరంలేదు. ఎందుకంటే స్త్రీ-పురుష సంబంధాలపై తాజాగా శోభాడే రాసిన ''సర్వైవింగ్ మెన్'' అన్న గ్రంథం సరికొత్త ఉప్పెన, సిమన్ దిబోవిర్ (''సెకండ్ సెక్స్'') కన్నా కనీసం పాతికేళ్ళముందే జీవన సమరంలో స్త్రీవిలువ ఏమిటో చలం దండోరా వేశాడు. ఆమె వ్యక్తిత్వానికి హారతులర్పిస్తూ పురుషుల్ని అన్యాపదేశంగా ఇలా ఆదేశించాడు మనిషిని లేదా మానుషిని అన్ని శాఖలలోనూ పరిపూర్ణ స్థాయికి ఎదగనివ్వకుండా ఎప్పుడైతే అడ్డుకట్టలు కడతారో అప్పుడు కల్లోలం వస్తుంది. అది సంఘ జీవితాన్ని కలుషితం చేస్తుంది మనస్సుల్ని చీల్చుతుంది పురుషాధిక్య సమాజంలో ఆ పని జరగబట్టే హేతు దృష్టి పరివ్యాప్తం కాకుండా స్తబ్దత సమాజాన్ని ఏలుతోంది. సమతుల్యత దెబ్బతింది. దృష్టి వక్రించి సృష్టి సమత్వాన్ని చెదరగొట్టింది. తిరిగి

స్త్రీవాద సాహిత్యానికి శోభాడే సరికొత్త కాన్క!

స్త్రీ-పురుషుల మధ్య సమత్వాన్ని పునరుద్ధరించడం ఎలా? ఆర్థిక స్వాతంత్ర్యంతోనే స్త్రీ స్వేచ్ఛ పొందుతుందా? లేక ఈ స్వేచ్ఛకూ, లైంగిక స్వేచ్ఛకూ మధ్య వేరేదైనా అనుబంధం ఉందా? పురుష ద్వేషంవల్ల స్త్రీ మనస్సు స్వస్థత పొందుతుందా? లేక సదవగాహన మాత్రమే వీరి మధ్య పరస్పర సుఖశాంతులకు 'సంజీవిని' కాగలుగుతుందా? ఇలాంటి ప్రశ్నలు, శోభాడే పురుషాహంకారాన్ని తట్టుకుని బతికేందుకు అవసరమైన చిట్కాలు ఆమె సరికొత్త రచనలో ఉన్నాయి. ఇందులో ఆమె పురుషుల్ని చాలా చిలిపిగా ఏడ్పించింది. సమానత్వం కోసం స్త్రీ-పురుష వర్గాల మధ్య సాగుతున్న సంకుల సమరంలో యుద్ధ వ్యూహాలు రచించింది! పురుషుడిని వ్యూహం రీత్యా ''శత్రువు''గా పరిగణించి, ఎత్తుగడరీత్యా 'శత్రు శిబిరం' శక్తి సామర్థ్యాలను గణిస్తూ గందరగోళం ("Confuse the enemy")సృష్టించడానికి కలాన్నిబలంగా కదిలించింది! అయితే జీవనయానంలో సహయాత్రిగా ఉండే పురుషుడిని,అతని అహంకారాన్ని, దర్పాన్ని, కర్కశత్వాన్ని, నిరాదరణ తత్వాన్నీ ఎంతగా ఆమె ఆడిపోసుకున్నా స్త్రీలలో ఉండే మొండితనాన్ని, పురుషుడు పొగిడితే ఉబ్బితబ్బిబ్బయిపోయే మనస్తత్వాన్నీ కూడా చీల్చి చెండాడింది. కనుకనే శోభాడే తనను తాను ఈ రచనలో ''సంశయ శ్రేయోభిలాషి''("Skeptical well-wisher")అనికూడా ప్రకటించుకుంది. పురుషాధిక్య సమాజానికి పాశాలు కట్టి, తొడపాశాలు పెట్టిన శోభాడే 270 పేజీల్లో పరుచుకున్న నాలుగు అధ్యాయాల్లో ఈ దండయాత్ర సాగించింది! మరొక మాటలో చెప్పాలంటే స్త్రీ సర్వతోముఖాభివృద్ధికి (విద్య, వైద్య, ఆరోగ్య, ఉపాధి రంగాలలో) ఈ రోజుకీ ఉన్న సవాలక్ష ఆటంకాలు ఏమిటో ఆమె ఏకరవు పెట్టింది. పురుషుల వంచనా శిల్పానికి స్త్రీలు ఎలా బలి అవుతున్నారోచెప్పి, ఎలా అవకూడదో, అందుకు ఏ చైతన్యం స్త్రీ పొందాలో పేర్కొంది.అదేసమయంలో శోభాడే ఈ రచనలో చేసిన తప్పు ఒకటుంది: ఏ పురుషుడి ''వంచన'' నుంచి స్త్రీ తప్పుకోవాలని శోభాడే కోరుతోందో అదే వంచనా శిల్పాన్ని స్త్రీ కూడా తన విమోచన కోసం ఆశ్రయించాలని ప్రబోధించడం! ఇందువల్ల స్త్రీ-పురుష అసమానత తొలగదు సరిగదా, సమానత్వ లక్ష్యసాధన వెనుకడుగువేసి ఇరువైపులా 'వంచన' మాత్రమే ఆదర్శం అయికూర్చునే ప్రమాదం ఉంది. అయితే అవినీతిమయమై పోయిన బడావ్యాపార సంస్కృతిని బహిర్గతం చేయడంలో, తప్పుడు మార్గాలు తొక్కుతున్న నేటి సమాజంలో విలువలు కోల్పోతున్న సమాజంలో పురుషులతో పాటు కొందరు స్త్రీలు కూడా ఎలాభ్రష్టుపడుతున్నారో

శోభాడే ఇంతకుముందు తన నవలల్లో (''సోషలైట్ ఈవెనింగ్స్'', ''సిస్టర్స్'') స్థూలంగానైనా వెల్లడించగలిగింది. ఎదుటపడిన పురుషుడంటే అతి దాహార్తితో వ్యవహరించే ''అంజలి'' వలలోపడి జీవితాన్ని బుగ్గిపాలు చేసుకున్న ఒక ''కరుణ'' ''కృషి'' వివాహేతర సంబంధాల్లో భర్తకు తోడునీడైన అతని భార్య, అమలినమైన ఒక 'శకుంతల' కోసం పడిగాపులు పడి హతాశుడైన ఒక గిరీష్, డబ్బుకోసం వెండితెర లోకం లోకి తల్లి బలవంతంగా నెట్టిన ఆషారాణి- ఒకే నాణానికి రెండు ముఖాలు కావు, బహుముఖాలు! ఈ కథ వింటున్నప్పుడు ముంబయ్ వెండితెర వెనకగాథలు తెలుసుకున్నప్పుడు భరద్వాజ ''పాకుడురాళ్ళు'' నవల గుర్తుకు రావలసిందే! అలాగే అక్కచెల్లెళ్ళుగా ఎదిగి రావలసిన మిక్కీ హీరాలాల్, అలీషా (తండ్రికి సవతి కూతురు)లు వ్యాపార నాగరికతలో అనుబంధాలు మరిచి అనుమానాల మధ్య బతుకుతూ ఆశపోతులుగా మారి పరస్పరం ద్వేషించుకునే స్థితికి ఎలా దిగజారారో శోభాడే ''సిస్టర్స్''లో కథ నడిపింది. అందువల్ల ఆమె భర్తల్ని ఎలా లోబరచుకోవాలో, సంసార జీవితంలో సయోధ్య కోసం స్త్రీలకు ఏ చిట్కాలు ప్రయోగించాలో చెప్పినా, ఆదర్శ ప్రేమనూ, మంచి కుటుంబ జీవితాన్నీ కాదనదు. తాజా రచనలో శోభాడే ప్రధానమైన వాదన అంతా- వస్తు వ్యామోహంలోపడే స్త్రీలు తమ స్వతంత్ర వ్యక్తిత్వాన్ని, ఆర్థికస్వేచ్ఛనూ కాపాడుకోలేరని! స్త్రీ వ్యక్తిత్వ సాధనకు, పురుషుడితో సమాన హక్కుల రక్షణకూ తోడ్పడేవి అబర్‌జిన్ సిల్కులూ, బర్గండీ కలర్ చీరలూ కావని ఆమె వాదన. సర్వసాధారణంగా స్త్రీ చదువుల తల్లిగా ఎదిగిరావడానికి, విదుషీమణిగా రాణించడానికి పురుషులు స్వతస్సిద్ధంగా ఇష్టం ఉండదు. తమ జీవిత భాగస్వాములు (భార్యలు) నోరులేని మూగజీవులుగానో, మొద్దు స్వరూపాలుగానో, లేదా వంటింటి కుందేళ్ళుగానో ఉండిపోవాలని కోరుకునే భర్తల సంఖ్య ఎక్కువంటుంది శోభాడే. ఎవరు అంగీకరించినా, అంగీకరించకపోయినా మహిళ ముందున్న మార్గాలు రెండే రెండని చెప్పింది: మూగజీవిగా పడి ఉండడమా? లేక తన తనాన్ని నిరూపించుకొని, వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవడమా? వస్తు వ్యామోహాన్ని వదిలించుకుంటే స్త్రీ వ్యక్తిత్వం నిలుస్తుందంటోంది. స్త్రీ తన జీవితంలో ప్రవేశించిన ఒక శాడిస్టును ఇంటినుంచి నెట్టివేయాలనుకున్నప్పుడు అతడి దగ్గర ఉన్న వస్తువుల్ని తాను ఆశించకూడదు; అతనితో కాపురం ఉన్నచోట నీ సొంత వస్తువులపై కూడా ఆపేక్ష కనపరచకూడదు; వస్తువులపై వ్యామోహం వల్ల తాను వదిలించుకోదలచిన వ్యక్తిపై కూడా వ్యామోహం పెరిగే ప్రమాదం ఉంటుందని శోభాడే సూత్రీకరణ!

షర్టులు, జీన్స్, శారీస్, సెంట్లు, టూత్‌పేస్టులు, ఇళ్ళస్థలాలు, మైక్రోవేవ్ వాషింగ్‌మెషిన్లు, షేర్లు,బాండ్లు- ఈ ఉచ్చులు వివాహ సంబంధాల్ని మెరుగుపరిచేదిపోయి ఉక్కిరిబిక్కిరి చేస్తాయని చెప్పింది! వస్తు వినియోగానికి ఆమె వ్యతిరేకంగాదు. అవి స్త్రీ-పురుష సంబంధాల్లో 'కట్టుగొయ్య'లుగా మారకూడదని మాత్రమే ఆమె ప్రబోధం.

అలాగే పెళ్ళి అన్నది లైంగిక వ్యవహారంగా కొనసాగడానికి తోడ్పడే ఓ దీర్ఘకాలిక పెట్టుబడిగా (long-term investment in sex) శోభాడే పరిగణిస్తోంది.కాని అదే సమయంలో సెక్స్‌కూ, ప్రేమకూ సంబంధంలేదని తేగేసి చెబుతూ ప్రేమను సెక్స్‌తో ముడిపెట్టకూడదంటుంది. మనో పరిపక్వతకు చిహ్నం ప్రేమ అనీ, సెక్స్ కేవలం తాత్కాలిక భావప్రాప్తికోసం ఉపయోగపడే సాధనం అనీ అంటుంది.నిజానికీ స్థితిని అర్థం చేసుకోలేకనే అసలు సిసలు ప్రేమతత్వాన్ని అవగాహన చేసుకోలేకనే బూతుపదాలన్నీ స్త్రీపరంగానే పురుషులు వాడుకలోకితెచ్చి ఉంటారు. కార్యాచరణ లేకుండా తమ దుస్థితికి కన్నీళ్ళు పెట్టుకునే స్త్రీలపట్ల శోభకు కనికరంలేదు. అయితే స్త్రీల కన్నీటి గాథలకు కారణం ఆమెకు తెలుసు. కుటుంబ జంజాటనవల్ల వారికి పరిస్థితులను మెరుగుపరచుకునే శక్తియుక్తులు-కొరవడుతున్నాయని శోభాడే గుర్తిస్తుంది. అయితే ఇక్కడ సమస్య పిల్లలు కాదనీ, ఆర్థిక దాస్యంవల్ల స్త్రీల జీవితాలు అడుగడుగునా డబ్బుతో ముడివడి ఉన్నాయంటుంది. అందుకనే ఒకచోట శోభాడే మగవాడు సెక్స్‌కూ స్త్రీ డబ్బుకూ ఆశపడతారనీ, వారి మధ్య ''ప్రేమ'' అన్నది మందు మాత్రంగానే చోటు చేసుకుంటుందన్న వాదనను అందరూ అంగీకరించకపోవచ్చు. ఈ స్థితికి స్త్రీని దిగజార్చింది పురుషుడని ఆరోపిస్తున్న శోభాడే మానవ జాతిలో తమ గౌరవ స్థానం ఎక్కడ అని స్త్రీలోకం ప్రశ్నిస్తోందని చెబుతోంది; చాకిరీకి తాకట్టుగా, ఒక మసిగుడ్డగా స్త్రీ మిగిలిపోరాదని ఆవేదన పడుతున్న శోభాడే '' ఇల్లు అంటే స్త్రీ దృష్టిలో సర్వస్వం కావచ్చుగాని, పురుషుడి దృష్టిలో పట్టించుకోదగింది కాదు'' అని విమర్శిస్తుంది అందుకే స్త్రీ మోయలేని భారంమోస్తూ ఉంది అంటుంది. కనుకనే మనుషులు మరింతగా నాగరికం కావాలనీ, పురుషులు నాగరికం అయినకొద్దీ అనేక పెళ్ళిళ్ళు పందిళ్ళలోనే కాదు పదిమందిలో కూడా సుఖాంతం అవుతాయన్నది ఆమె ఆశాభావం ఎందుకంటే, సిమన్ డిబోవిర్ చెప్పినట్టు ''మానవ చరిత్రలో స్త్రీ-పురుష విభజన జీవశాస్త్ర సంబంధమైనదేగాని అదో సన్నివేశంగానీ, ఓ ఘటనగానీకాదు'' (the division of the sexes is a biological fact, not an event in human

history). కనుకనే చరిత్రలో తొలి ఫెమినిస్టు మహిళగా పేరొందిన మేరీ ఊల్‌స్టోన్ క్రాఫ్ట్ కూడా శోభాడేలా స్త్రీ వివక్షను ఖండించినప్పటికీ, స్త్రీ పురుషుల మధ్య సమన్వయం సాధించడానికి శతధా కృషి చేసింది: ''స్త్రీ పురుషులకు కోర్కెలు, రాగద్వేషాలు స్వభావ సిద్ధం. అయితే హేతుదృష్టి కొరవడితే ఇద్దరూ అదుపు తప్పిపోతారు. అయితే వీళ్ళను అదుపాజ్ఞల్లో ఉంచే బాధ్యత మానవాళిదేగాని, లైంగిక సబంధమైన విధి (Sexual duty) కానేకాదు'' అన్నది ఊల్‌స్టోన్ క్రాఫ్ట్. ఈ సమన్వయాన్ని ఎలా సాధించవచ్చో కూడా ఆమె మరి కొంత వివరిస్తూ చెప్పింది: ''మా విమోచనలో పురుషులు కూడా పాలుపంచుకోవాలి, మా నుంచి బానిస విధేయతకు బదులు హేతుబద్ధమైన మైత్రీసంబంధాలతో పురుషులు తృప్తిపడాలి. అలా అయ్యే పక్షంలో పురుషులు మమ్మల్ని బుద్ధిమంతులయిన కూతుళ్ళుగా, మరింత అనురాగంతో మసలుకొనే తోబుట్టువులుగా, విశ్వాసపాత్రమైన భార్యలుగా, మరింత న్యాయబద్ధమైన తల్లులుగా- ఒక్కముక్కలో మంచి పౌరులుగా చూడగలుగుతారు''! ఈ విశిష్ట సమన్వయాన్ని శోభాడే ఉద్రేకంతో కసిగా, అసిగా కాకుండా జీవిత భాగస్వామినిపై ఆర్ద్రతతో అభిమానంతో సాధించాలి. ఈ సమన్వయం సంఘర్షణ ద్వారా సాధ్యపడదు. బుద్ధులు మార్చుకుని మసలుకోవడం వల్ల, సంస్కరణ వల్ల సాధ్యం. అవమానించి, రెచ్చగొట్టే బుద్ధిని మానుకోవాలి. వేధింపులు, సాధింపులతో, దౌర్జన్యాలతో దాష్టికంతో స్త్రీని కార్నర్‌చేసి ఆమె మరో గత్యంతరం లేక ''పాలింకి పోవడానికున్నట్లు/ మనసింకిపోవడానికీ/ మాత్రలుంటే ఎంతబావుండు''('రజని' లా) అన్న నిర్ణయానికి వచ్చేట్లు ప్రవర్తించరాదు! మనస్సు ఇంకిపోయినచోట స్త్రీకిగానీ, పురుషుడికిగానీ మనుగడలేదు, ఉండదు! ఒక వ్యక్తిగా, తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోడానికి వివాహ వ్యవస్థ ప్రతిబంధకంగా మారిందన్న ఆలోచన స్త్రీకి రాకుండా ఉండాలంటే పురుష'మాలోకం' కళ్ళుతెరిచి మనస్సులోని కుళ్ళును కడిగేసుకోవాలి.

*(ఆదివారం 6, ఏప్రిల్ 1997)*

# ఆగ్రహ భార్గవుల 'యుగవాణి' గిన్స్‌బర్గ్!

ఒక్కో తరం ఒక్కో నవ్యతను ఆవిష్కరిస్తుంది. ఆ పని ఆయా చోట్ల రాజకీయ, ఆర్థిక, సాంస్కృతికదశలలో పేరుకుపోయిన జడత్వాన్ని విదిలించుకొని కొత్త మార్గాలను అన్వేషించడం ద్వారా జరుగుతుంది. కాలమాన పరిస్థితులపట్ల అసంతృప్తి, నిరాశాజనకమైన పరిసరాల నుంచి ఉబికివచ్చే అసహనమే యువతలో ఆగ్రహ జ్వాలలకు కారణమవుతుంది. అలాంటి తరాలు 1920లలో,1950లలో పాశ్చాత్య కవితా, సంగీత, కళా ప్రపంచంలో నవ్యసాహితీ శక్తులుగా ముందుకు తోసుకువచ్చాయి.దేశ దేశాల యువతను ప్రభావితం చేసి, మానసిక కల్లోలానికి గురిచేశాయి. ఇతరులను ఆలోచింపచేశాయి. ఈ తరాన్ని బ్రిటన్‌లో ''యాంగ్రీ యంగ్‌మెన్'' (ఆగ్రహ భార్గవులు) అంటే, అమెరికాలో బీటిల్స్, బీట్నిక్ తరంగా కవితా కళారంగాలలో కొత్త పేర్లతో ప్రసిద్ధిలోకి వచ్చారు. అప్పటికి తలెత్తిన ఈ కొత్త తరాన్ని మొత్తంగా ''బీట్ జనరేషన్'' అన్నారు. అలాంటి తరానికి వాగర్థాలు సమకూర్చిపెట్టినవాడు గిన్స్‌బర్గ్. సీమాంతరాలలో కవితా, కళారంగాలలో ముద్రవేసుకొన్న గిన్స్‌బర్గ్ ప్రభావం భారతీయ కవితారంగాన్ని కూడా ఒక దశాబ్దంపైగా శాసించింది. 1962లో బెంగాల్‌లో దేవీరాయ్, మలయరాయ్ చౌదరి, వాసుదేవ్‌ల సారథ్యంలో ''ఆకలి తరం''పుట్టుకొచ్చింది. ఉత్తరాదిన హిందీ కవితాలోకంలో 'అకవితా' ఉద్యమం తలెత్తింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్యాకాశంలో''దిగంబర''తరం గిన్స్‌బర్గ్ బీట్స్ కవితా ఉద్యమ స్ఫూర్తితోనే దూసుకువచ్చింది. ఇంతమందిని ప్రభావితం చేసిన ఒక ఉద్యమ నాయకుడైన గిన్స్‌బర్గ్ ఇటీవలనే అస్తమించాడు. వ్యక్తిగా ఆయన మరణించినా ప్రపంచ వ్యాపితంగా అనేకమందిని కదిలించిన ఆయని మూర్తిత్వాన్ని మరచిపోరాదు కాని, ప్రభావితులయిన కవి కుమారులు కూడా పెద్దగా ఆయనను తలచుకొన్నట్లే లేదు। ''బీట్ జనరేషన్'' ఒక లక్ష్యం లేని ఉద్యమం అని కొందరు ఆరోపించవచ్చు. కానీ, ప్రజాసమస్యలను వారు అలక్ష్యం చేయలేదన్న సత్యాన్ని అనిష్టంగానయినా అంగీకరించాలి వారి ఆగ్రహం అన్యాయాలపట్ల, అక్రమాల పట్ల, అచేతనత్వం పట్లనేగాని, సవ్యమైన పరిష్కార మార్గాలకు వ్యతిరేకంగా జనించింది కాదనిగుర్తించాలి

అయితే నవ్యతకు అర్థం సంప్రదాయ బంధాలను ఛేదించడమేనని పాతతరాలు కూడా అంగీకరించబట్టే- క్షీణయుగానికి ప్రతినిధిగా ప్రబంధ కవితకు చెల్లుచీటీ ఇచ్చి నవ్యకవితా ఉద్యమం, ఆ తరువాత అభ్యుదయ కవితా ఉద్యమం, ఆ పిమ్మట దిగంబర కవితా ఉద్యమం, ఆ దరిమిలా విప్లవ కవితా యుగం, వీటన్నింటినీ పక్కకు నెట్టుకొంటూ స్త్రీవాద కవిత, దళిత కవితాశకం ఆంధ్రదేశంలో అవతరించాయి. శ్రీశ్రీలా విన్నవి కన్నవి విన్నవించడంలో బీట్ జనరేషన్ జాక్ కెరాక్, గిన్స్‌బర్గ్, జాన్ బ్రైనీ, కాలిన్ విల్సన్, నార్మన్ మైలర్, జాన్‌వైన్, జాన్ ఆస్బోర్న్లు కూడా ఛందోబంధాలను తెగ్గొట్టుకున్నారు. రచనలో స్వేచ్ఛాప్రియత్వాన్ని ప్రదర్శించారు. కాలం చెల్లిన ప్రతీకలను (సింబల్స్) కాలదన్నారు. ఆగ్రహంలో కవితా శక్తిని కసిగా అసిగా మలచుకున్నారు. భావప్రకటనా స్వేచ్ఛలో పరుష భాషా ప్రయోగాలు చేయడానికి జంకలేదు. తామస్ వాట్‌లాగా గిన్స్‌బర్గ్ కూడా యూరోపియన్ కవితా బంధాలను ఇక్కడ మన పఠాభి చెప్పినట్టు సరికొత్త భావ చిత్రాలతో కవన కుఠారాలతో 'ఫటాఫట్' తెంచేశాడు. యువతరానికి కొత్తటానిక్ అందించాడు. గిన్స్‌బర్గ్ ''హౌల్'' (1995) కవితా సంపుటి అమెరికన్ కవిత్వంలో ''బీట్స్'' ఉద్యమం తొలిపూజా ఫలం. అది నిరసన కవితేగాని, నిరాశా నిస్పృహజనితమైన కవితకాదు. ''హౌల్'' అంటే ప్రచండ ధ్వానం లేదా ''ప్రచండ నాదం''. అందులో సమాజ నిరసన ఉంది, నిర్భీకత ఉంది. సంప్రదాయ ప్రాతికూల్యత ఉంది; ప్రజల పట్ల హెచ్చరికతో కూడిన ప్రేమాభిమానాలున్నాయి. ఈ అన్ని దశలనూ గిన్స్‌బర్గ్ ఉద్యమ ప్రభావంతో పుట్టుకొచ్చిన మన దిగంబర కవులు కూడా ప్రతిబింబించారు. వారు నలుదిక్కులా చాటిన ''దిక్''లు కూడా అలాంటివే. వారి నిరసన కవితా ప్రతీకలైన 'ఆత్మయోని','తొడ విరిగిన తరం','వందేమాతరమ్' ఎముకల కేకలూ మనకు సుపరిచితాలు! ఈ ఆగ్రహ భార్గవులందరి లక్ష్యం- నిరాశకాదు, సామాజికులలో కనిపిస్తున్న పలాయనవాదాన్ని ఛేదించడం, కర్కశంగా నిరసించడం, తద్వారా దోపిడీ వ్యవస్థపై తిరుగుబాటు బావుటా ఎగురవేయమని సందేశ మాత్రంగా ఆదేశించడం! ఈ లక్ష్య సాధన కోసం గిన్స్‌బర్గ్, ఇతర కవులూ ఇతరులకు అనిపించే ''అశ్లీల'' భాషనూ, దూషణనూ తమ తిరస్కార సంస్కారంగా భావించారు. వాస్తవాన్ని నిర్భీకంగా ప్రకటించడం వారి ఆదర్శం, మానవుడి ఉనికిని అతనిలో చైతన్య దీపాలు వెలిగించడం ద్వారానే కాపాడడం సాధ్యమని విశ్వసించారు అందుకుగాను వారు సమకాలీన సంఘం సంప్రదాయం పేరిట చెలామణీ చేసుకొంటున్న ఆచార వ్యవహారాలను నిరసించారు. ఇందుకు గిన్స్‌బర్గ్ తరాన్ని ప్రభావితం చేసిన 1930ల నాటి ప్రపంచ ఆర్థిక సంక్షోభం,

ఆ తరువాత సామ్రాజ్యవాదులు రాజ్యాకాంక్షతో మానవాళిపై రుద్దిన రెండవ ప్రపంచ యుద్ధం,దానివల్ల కలిగిన నైరాశ్యం, అవిశ్వాసం, నైతికధర్మాల పతనం, ప్రచ్ఛన్న యుద్ధపునీడలూ- ఈ కవితా శకావిష్కరణకు దారితీశాయి ఈ నైరాశ్యంలో వారికి కొన్ని మంచి పరిణామాలు కూడా (శాంతి ఉద్యమం లాంటివి) చెడుగానే తోచాయి. అయితే సర్వనిరసనలో కూడా సార్వకాలీన సత్యాలను వారు కాలదన్నలేదు. ఆదర్శవంతమైన సమాజంకోసం వారు పడిన తపనను మనం అర్థంచేసుకోవాలి. ఎందుకంటే- అక్రమ యుద్ధ ప్రభావంవల్లా, దోపిడీవల్లా, వర్ణవివక్షవల్లా సంఘానికి ఉపయోగపడవలసిన ఎన్నో తన తరపు మేధావులు నాశనమైపోయారన్న ఆవేదన గిన్స్‌బర్గ్‌ను పీడించింది. ఆ అభిప్రాయాన్ని ఆయన చాలా శక్తిమంతంగా''హౌల్'' కవితలో ప్రకటించగలిగాడు:''**I saw the best minds of my generation/ destroyed by madness, starving hysterical nacked/ dragging themselves through negro streets at dawn/ looking for an angry fix**"!! అంతేగాదు, ధనదాహం భ్రమలను ఎలా పెంచుతుందో, మనస్సులను ఎలా తుంచుతుందో చెప్పాడు గిన్స్‌బర్గ్. డబ్బు ఆత్మహత్యాసదృశమే కాదు, నిత్యహత్యాసత్యం అన్నాడు. ఐహికాముష్మిక సుఖాలు రెంటినుంచీ మానవుణ్ణి ధనం దూరం చేస్తుందన్నాడు. ఒక్కముక్కలో డబ్బును ఆయన ''భ్రమాపత్రం'' (**"paper of illusion"**) అన్నాడు! ''హౌల్'' కవితాఖండికలలో గిన్స్‌బర్గ్ సమాజ చిత్రాన్ని, మానవుల ప్రవర్తనను, వారి నైరాశ్యాన్ని, సంప్రదాయం పేరిట చెల్లుబడి అయిపోతున్న అష్టావక్రగతులనూ, మతులనూ పచ్చిపచ్చిగా కచ్చికచ్చిగా చీల్చి చెండాడాడు. శ్రామికవర్గ సంస్కృతినుంచి జాలువారిన ''బీట్'' యువతరం తమ రచనలలో ప్రధానంగా తలపోసిందీ, తపన పడిందీ సామాజిక పరిణామాల గురించేనని అర్థం చేసుకోవాలని సుప్రసిద్ధ మానుష శాస్త్రవేత్త జాఫ్రీ గోరెర్ అంటాడు! అన్నిరకాల కపట నాటకాలను నిరసించిన బీట్ తరాన్ని అందుకే ''యుగవాణి'' (**Spokensmen for our Age**) అన్నారు.

అయినా గిన్స్‌బర్గ్ ''హౌల్'' కవితా సంపుటిని ''అశ్లీల'' రచన అని ముద్రవేసిన కొందరు నిషేధించడానికి యత్నించారు. విశ్వవిద్యాలయాల ద్వారాలను మూసివేశారు. చదవడాన్ని నిషేధించారు. ఆకాశవాణికి''హౌల్'' అస్పృశ్యం అయింది. గిన్స్‌బర్గ్‌ను కోర్టుకు ఈడ్చారు. అమెరికన్ కస్టమ్స్ శాఖ కవితా సంపుటి కాపీలను దిగ్బంధించారు అయితే శాన్ ఫ్రాన్సిస్కో మునిసిపల్ కోర్టులో న్యాయమూర్తి తన తీర్పులో గిన్స్‌బర్గ్ రచన

'అశ్లీలం'కాదు, సమాజ స్పృహతో కూడిన ఆవేదనా కలశం అని అభివర్ణించాడు! నిజానికి గిన్స్‌బర్గ్ ఆదర్శించిన మానవుడు చరిత్రలో ఓ క్షుద్రజీవిగా మిగిలిపోకుండా తన ముందు తరాలకు అందివచ్చే అనుభవాల రాశీ మూర్తిగా నిలవాలని ఆశించినవాడు. అలాంటి గిన్స్‌బర్గ్‌ను కోర్టులకు ఈడ్చినట్టే ఇక్కడ ఆంధ్ర దేశంలో కూడా దిగంబర కవుల మీద న్యాయస్థానాల్లో అభియోగపత్రాలు నడిచాయి. అయినా జస్టిస్ చిన్నపరెడ్డి కవుల, రచయితల భావప్రకటనా స్వేచ్ఛను పరిరక్షిస్తూ తీర్పు చెప్పినట్టే- గిన్స్‌బర్గ్ రచన ''హౌల్''ను పలువురు సాహితీ ఉద్దండులు ''మానవుడి అనుభవానికి అందివచ్చిన విశిష్టమైన వ్యాఖ్య'' (significant comment on human experience")గా కొనియాడారు. ఇక ఆ రచనపైన జడ్జి క్లేటన్ హార్న్ తీర్పు చెబుతూ ఇలా అన్నాడు : ''మానవ జీవితం పనిగట్టుకుని ఒక మూసలో ఇమిడి బందీ అయిపోదు. ఏ ఇద్దరు వ్యక్తులూ ఒకలానే ఆలోచించరు. మానవులకు చావు పుట్టుకలు ఒకటే కావచ్చు. కాని మానవులు విభిన్న మూసలలో తయారైన వాళ్ళు (not from the same mould, but in different patterns). రుచీపచీలేని, చవీ సౌరూలేని నీరస పదజాలానికి వ్యక్తి తన భావజాలాన్ని కుదించుకోవలసి వస్తే (Vapid innocuous euphemism)- అప్పుడు పత్రికా స్వేచ్ఛగానీ, భావ ప్రకటనా స్వేచ్ఛగానీ ఉంటుందా? బతుకుతుందా? తీసుకున్న అంశాన్ని మలచడంలో రచయిత వాస్తవాన్ని ఆశ్రయించాలి. తన ఆలోచనలనూ, భావాలనూ తన సొంత మాటలలోనే వ్యక్తంచేసే స్వేచ్ఛ అతనికి ఉండితీరాలి'' ("PROTEST" నుంచి)!! అలాంటి స్వేచ్ఛను కోరుకున్నవాడు గిన్స్‌బర్గ్ అందుకే అతను కవితా చందోబంధాల్ని తెంచుకున్నా తన మనస్సు నుంచి కట్టలు తెంచుకొచ్చే భావచిత్రాలు స్వరమూర్ఛనలుగా ధర్మాగ్రహాన్ని సునిశితం చేస్తూ జాలువారిన వాగర్థాలుగా (Flowing cadences and charged diction) సాహితీ విమర్శకులు అంగీకరించవలసి వచ్చింది. గిన్స్‌బర్గ్ రచన పాలకవర్గాలకు కంటగింపు అయింది ఒక దశలో. ఎందుకంటే, అన్ని ప్రభుత్వాలూ పతనమవుతాయనీ, మంచి ప్రభువులు మాత్రమే మనగలుగుతారనీ, అయితే ఆ మంచి ప్రభుత్వాలు ఇప్పుడు లేవనీ, కాని అలాంటివి బట్టకట్టేందుకు ఉద్యమించాలనీ, అయితే అలాంటి ఆదర్శ ప్రభుత్వాలే ''నా కవితలలో నిలుస్తాయనీ'' అంటాడు గిన్స్‌బర్గ్ ఇప్పుడున్న ప్రభుత్వాలన్నీ రష్యన్, అమెరికన్ జీవచ్ఛవాలకు ప్రతిబింబాలు మాత్రమేనంటాడు!! రాజకీయంగా మధ్యేమార్గాన్ని ప్రబోధించినవాడు. ''రాకెట్'' అన్న కవితలో తన ఎళ్ళు నవ్యమానవుని పాదముద్రలతో నవచంద్రోదయాన్ని ఆవిష్కరిస్తాయంటాడు! మరణించిన తన తల్లిపై రాసిన ఒక

శోకగీతంలో ("Kaddish") గిన్స్‌బర్గ్ ''ప్రత్యూషంలో పండి రాలిపోయిన పుష్పదళం'' అని వర్ణించాడు తన మాతృమూర్తిని! వాల్ట్ విట్మన్‌లాగా వచన కవితా ఖండికలను కావ్యకథా చిత్రాలుగా మలచినవాడు గిన్స్‌బర్గ్. ''హౌల్'' కవితా సంపుటిని విట్మన్ ''లీవ్స్ ఆఫ్ గ్రాస్'' (గడ్డిపోచ) వచన కవితతో పోల్చుకోవచ్చు. గిన్స్‌బర్గ్ వారందరికన్నా అఖండ స్వేచ్ఛాప్రియతను తన రచనల్లో కనబరిచాడు. అతను దడులు మడులు కట్టుకోలేదు కనుకనే యువ పాఠకులలో జడతను వదిలించి నడతను జలపాతంలా అబ్బించాడు. ఇక్కడ ఇస్మాయిల్, అజంతాలు''చెట్టు''ను ఆదర్శంగా భావించి కవితలల్లినట్టే గిన్స్‌బర్గ్ ''చెట్లు'' ఆది భౌతిక శాస్త్రాన్నిగురించి మర్యాదగా ముచ్చటిస్తాయి. చివరికి అతని కవితల్ని రాయించేది కూడా ''చెట్లే'' కావడం విశేషం! అమెరికా విదేశాంగ విధానాన్ని, వియత్నాం యుద్ధాన్నీ నిరసించినవాడు గిన్స్‌బర్గ్. ఇరాన్, లాటిన్ అమెరికా, ఆసియాలలో అమెరికన్ గూఢచారి శాఖ జోక్యాన్ని తూర్పారబట్టాడు. కార్పొరేట్ అమెరికా దోపిడిని ఖండించాడు. ఈ ఖండన పరంపరలకే అతణ్ణి అమెరికా గూఢచారి విభాగం ''విద్రోహి, ఉన్మాది'' అని చిత్రించి సంతృప్తిపడింది! గిన్స్‌బర్గ్ కేవల వస్తు వ్యామోహ వ్యవస్థను కూడా నిరసించాడు. భౌతికానందాలతో గడిపే సంస్కృతిని ఎండగట్టాడు. చివరికి యతి విటుడుగాను, విటుడు యతిగా పరిణామం చెందినట్టుగానే- గిన్స్‌బర్గ్ కూడా తన మనస్సును విశ్వామిగా మార్చుకున్నాడు. ఇండియాలో కొన్నేళ్ళు గడిపాడు. అతని యాత్రా విశేషాలు, వ్యాఖ్యాన సహితంగా ''ఇండియన్ జర్నల్స్'' (1968) పేరిట వెలువడ్డాయి. ఈ గ్రంథాన్ని ఆయన మారిస్ ఫ్రాడ్ మాన్‌కు అంకితమిచ్చాడు. ''గురువుల కోసం చూడొద్దు'' అన్న ఫ్రాడ్ మాన్ సలహా గిన్స్‌బర్గ్‌కు నచ్చింది; ''నీ ఆత్మే నీ గురువు, వేరే గురువులేడ''న్న స్వామి శివానంద ఆయనకి నచ్చాడు. మాదక ద్రవ్యాలకు అలవాటుపడిన గిన్స్‌కు మానసిక స్వస్థత అవసరం. ఆ పరిస్థితుల్లో ఒక కాలింపాంగ్ లామా గిన్స్‌బర్గ్‌కు ఇచ్చిన సలహా- ''పీడకలొస్తే చెదరకు, అతిలోక సౌందర్యం కనిపిస్తే చలించకు''! వెళ్ళివెళ్ళి చివరికి గిన్స్ 'హరేకృష్ణ' ముఠా పాటలలో కూడా సౌందర్యం చూశాడు. బెనారస్‌లో శంఖుభర్తి బాబాతో కలిసి గంజాయి దమ్మూ కొట్టాడు! భోగి కానివాడు యోగికాడన్న మాటకు సజీవ రూపం గిన్స్‌బర్గ్!

*(ఆదివారం 20, ఏప్రిల్ 1997)*

# తెలుగునాటక పరిణామం కడు'రమణీ'యం!

కావ్యాలలో నాటకం రమ్యమయిందన్నారు. ఎందుకు? జీవన సమగ్ర చిత్రణకు నాటకం అద్దంపడుతుంది గనుక, పట్టాలి గనుకా! పౌరాణికాలను, చారిత్రకాలనూ మినహాయిస్తే ఆ అభివ్యక్తి ఒక్క సాంఘిక నాటకానికే అరుదైన ఆభరణం. ఉత్తమ నాటక రచయితగా, తెలుగు నాటక రంగంలో ఇటీవల దూసుకువచ్చిన వినూత్న ప్రయోక్తగా, విమర్శకునిగా పేరొందిన డ్కాక్టర్ పి.వి.రమణ తెలుగులో సాంఘిక నాటకం పరిణామ వికాస పతనాల గురించి వెలువరించిన పరిశోధన గ్రంథాలు పతన దశలో ఉన్న తెలుగు నాటక రంగ పునరుద్ధరణకు వైతాళిక గీతాలు. ఇప్పటికి వెలువడిన మూడు గ్రంథాలు అసంపూర్ణమే అయినా నిష్కల్మషంగా సాగించిన అనుకూల ప్రతికూల సమీక్షా విమర్శ ఆచార్య రమణలోని తపనకు ప్రత్యక్షర సాక్ష్యాలు. కొంతకాలంగా నాటకరంగ పతనావస్థ గురించి తెలుగునాట పండిత పామరులలో సాగుతున్న విచికిత్సను దృష్టిలో పెట్టుకునే బహుశా రమణ అయిదు ప్రశ్నలను వేస్తున్నాడు: (1) ఇతర రాష్ట్రాల సాంఘిక నాటక రంగాలతో పోల్చి చూసుకొన్నపుడు తెలుగు నాటక రంగం ఎందుకు వెనకబడి ఉంది? (2) పల్లెపడుచు, రక్తకన్నీరు నాటకాల తర్వాత సాంఘిక నాటకాలు టిక్కెట్లు కొని చూసే ప్రదర్శ స్థాయికి జనాన్ని ఎందుకు సమీకరించలేకపోతున్నాయి? (3) నాటక అకాడమీ, విశ్వవిద్యాలయాల్లో నాటక శిక్షణా సంస్థలు ఉండి కూడా నాటక రంగం పట్ల విశేష ఆసక్తిని అటు విద్యార్థుల్లో, ఇటు ప్రేక్షకుల్లో కల్పించలేకపోవడానికి హేతువేమిటి? (4) మన నాటక రచయితలను సినిమా దృష్టి నుంచి మళ్లించి,మంచి నాటకాలు సిద్ధింపచేసుకోలేమా? (5) నూరు సంవత్సరాల తర్వాత కూడా తెలుగులో గొప్ప నాటకం ఏదీ అని ప్రశ్నిస్తే గురజాడ వారి ''కన్యాశుల్కం'' మినహాయించి మరో నాటక ప్రస్తావన రాదెందువల్ల? ఈ ప్రశ్నలకు సమాధానాన్ని కూడా రమణ పొందుపరిచిన తీరు అభినందనీయం. ఎందుకంటే, మన నాటకరంగం పతనం కావడానికి కారణం ''పొరుగింటి పుల్లకూర రుచి'' అన్నట్టు మనలో విజయ టెండూల్కర్లు, గిరీష్‌కర్నాడ్‌లు, ఉత్పల్‌దత్‌లతో సమ ఉజ్జీలు లేకకాదు,

చేయి తిరిగిన ప్రయోక్తలు కొరవడడమూ కాదు. ఆ కొరతకు అసలు కారణం ఈ పరిశోధనలో రమణ వివరించాడు: వస్తువు ప్రాధాన్యాన్ని మింగివేసే ప్రయోగాల హోరుతో తెలుగు సాంఘిక నాటకం వస్తువురీత్యా, ప్రదర్శనరీత్యా, సందేశ రీత్యా ఘోరంగా విఫలమయింది. రచయిత అన్వేషణ, కళాభివ్యక్తి వక్రమైపోయి,రచనా పరిధి కుంచించుకుపోయింది. కేవలం బజారు గారడీ వినోద ప్రక్రియగా నాటకం దిగజారిపోయింది. దీనంతటికి కారణం విదేశీ ప్రయోక్తలు ప్రవేశపెట్టిన,చేతులు కాల్చుకొన్న వివిధ సిద్ధాంతాలూ, టెక్నిక్‌లూ, ప్రయోగాల పట్ల మన రచయితల, దర్శకుల వ్యామోహం పెచ్చుమీరిపోవడమే. ఫలితంగా తెలుగు జన జీవన ప్రతిబింబంగా మచ్చుకైనా లేని నాటకాన్ని ఇక్కడి ప్రజలు తిరస్కరిస్తూ వస్తున్నారు. అందువల్ల తెలుగు నాటక రచయితలు, ప్రయోక్తలు, నటులు ఈ ప్రయోగ వ్యామోహాన్ని విడనాడనంతవరకు మన నాటకానికీ దుర్గతి తప్పదని చెబుతూనే రమణ-పాశ్చాత్య ప్రయోగ వ్యామోహమే తెలుగు నాటకరంగ వికాసానికీ, దాని ఆశయానికీ శాపంగా పరిణమించిందని ఆత్మవిమర్శ చేసుకుంటాడు. అందువల్ల మన ఇవరుగుపొరుగైన తమిళనాడు, మహారాష్ట్రలలో నాటకానికి ఉన్న గౌరవాదరాలు తెలుగునాట ఎందుకు ఉండడంలేదన్నదే అసలు ఆవేదన. తెలుగు సాంఘిక నాటకాలపై పాశ్చాత్య ప్రభావాన్ని ఎంత ఈసడించుకోడానికి ప్రయత్నించినా నాటక రంగాన్ని ఆధునీకరించడంలో పాశ్చాత్య రంగ స్థల నవ్య కళారీతుల తోడ్పాటును రమణ కూడా కాదనలేడు. నాటక రచనలో అనుకరణలు, అనుసరణలూ, అనువాదాలూ అభ్యంతరం కావొచ్చునేమోగాని (తెలుగు జీవితానికి సంబంధించి) టెక్నిక్స్‌ను కాదనలేం. రచయితలు కథాపరంగా నేల విడిచి చేసిన సాముగారిడీల వల్ల ఈ పతనం వచ్చిందిగాని ఆధునిక సాంకేతిక పద్ధతుల వల్లకాదని గుర్తించాలి.సినీరంగానికి చెందిన ఓ నటుడు అశ్లీల చిత్రాలను ఎందుకు ప్రోత్సహిస్తున్నారన్న ప్రశ్నకు సమాధానమిస్తూ ''ప్రేక్షకులు చూస్తున్నారు కాబట్టి, ఆదరిస్తున్నారు కాబట్టీ'' అన్నాడు! ఇదే ప్రమాణాన్ని నాటక రచయితలకు వర్తింపజేసి చూస్తే- నాటకానికి సరిపడా ''ఇతివృత్తాలు దొరకడంలేద''న్నది వారి రొడ్డకొట్టుడు సమాధానం! ఇది బాధ్యతారహితమైన దృక్పథం. ఎందుకంటే బెర్నార్డ్ మలాము చెప్పినట్టు ''కళకు జీవితం ఆయువుపట్టు, కాని దాని విస్తృతి అనంతం'' **(Art is in life, but the realm is endless)**! అంతేగాదు జనజీవిత సమగ్ర చిత్రణే, సుఖదుఃఖాల సమ్మేళనా చిత్రణే కళ అనికూడా అన్నాడు! జీవనరీతుల పట్ల,మానవ జీవితం పట్ల, అన్నింటికన్నా మిన్నగా మానవ వికాసం పట్ల నిబద్ధత

లేకపోతే ఇతివృత్తం దొరకదు! అందుకే నోబెల్ బహుమాన గ్రహీత నాదినీ గోర్డినెర్ అంటుంది: ''నిబద్ధత అన్నది కేవలం రాజకీయ పరమైనదేకాదు. జీవితం పట్ల అవసరమైన తాత్త్విక దృక్పథంలోనే అదొక భాగం''(Commitment is part of the whole ontological problem in life)! ఒక జీవితాన్ని ప్రభావితం చేసే ఆయా కాలాల సాంఘిక, రాజకీయ, ఆర్థిక, ఆధ్యాత్మిక పరిణామాలన్నీ నాటకం సహా అన్ని సాహిత్య ప్రక్రియలనూ ఊగించి శాసించక తప్పదు. తొలి తెలుగు సాంఘిక నాటకం ''నందక రాజ్యం'' 1880లో (వావిలాల వాసుదేవశాస్త్రి) వెలుగుచూసిన తరువాత పన్నెండేళ్లకు సంఘ సంస్కరణ పతాకగా దూసుకువచ్చిన సాంఘికం గురజాడ ''కన్యాశుల్కం'' కాని ఆ తరువాత పదిహేనేళ్ళ దాకా, 1926 వరకూ, మంగతాయి పీఠికాకర్త కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి చెప్పినట్టు ''మనలో సాంఘిక స్థితిగతులను చిత్రించే రూపకాలే లేనపుడు'' అందుకు మూడు దశాబ్దాల ముందే వచ్చిన ''కన్యాశుల్కం'' ఎంత గొప్పదో తెలుగు ప్రజలకు అప్పటికే అర్థమయింది. ఆ విస్మయం నుంచి అనుకున్నంతగా తెలుగువారు తెప్పరిల్లి నవ్య నాటక వీధుల్లో తేకువతో విహరించేటట్లు మన రచయితలూ, కళాకారులూ ఇప్పటిదాకా చేయలేకపోవడమే విశేషం! కళా ధర్మానికి లోకరీతికీ మధ్య సమన్వయం కూర్చి, మానవుణ్ణి ఎప్పటికప్పుడు ఒకడుగు ముందుకే- ప్రగతిగామిగా విశ్వగామిగా మలిచేందుకు రచయితలూ నాటక రచయితలు తోడ్పడాలి. 'కన్యాశుల్కం' నాటక కాలంనాటికన్నా ఎన్నో రెట్లు సామాజికులను పీడిస్తున్న రుగ్మతలు నేడున్నాయి. అవినీతి, చొల్లు కబుర్లు, హత్యలు, ఆత్మహత్యలు. హింసావాదం పెచ్చరిల్లిన ఆధునిక సమాజం రంగస్థలికి సర్వదా అనువైన ఇతివృత్తం. ప్రభుత్వాలూ అలాగే తయారయ్యాయి. ప్రోత్సాహంలేదు. భావ దారిద్ర్యం - మనచుట్టు చూపులేని విద్యలో ఉంది, మూఢనమ్మకాలను పెంచుకోవడంలో ఉంది. వాస్తవాలను, వ్యష్టి, సమష్టి జీవనంలోని ఆటుపోట్లనూ పరిణామాలనూ చూడనొల్లని దివాంధతలో ఉంది, పక్కవాడి బాగోగులను పట్టించుకోని మనస్తత్వంలో ఉంది! ఏ జిల్లాకూ చెప్పదగిన రంగస్థలంలేదు. బెంగాల్, మద్రాసు, మహారాష్ట్రలలో ఎన్ని నాటక రంగస్థలాలో! నాటక వికాసం కోసం, అభ్యుదయ పథంలో సమాజ పురోగతి కోసం ''నా బొందో'' అంటూ పనిచేయగల సత్తా ఉన్న నటులూ, రచయితలు, దర్శకులూ కొందరైనా లేకపోలేదు కాని వీరంతా ఉండికూడా కాలుకదపని 'నటన' మనది!

రమణ ప్రపంచ నాటక రంగరీతుల్ని,వివిధ దేశాలలో ప్రయోగాలను, ప్రక్రియా

భేదాలను, సిద్ధాంతాలను ఆకళింపుచేసుకున్న ఆచార్యుడు. నాటకానికిజీవం-దీపాలంకరణలు, రంగాలంకరణలు, ప్రయోగ విన్యాసాలూ కావు (అవితోడు మాత్రమే), మానవ జీవితం మాత్రమే అని తెలుసుకున్నవాడు. ఇబ్సన్‌నుంచి ఇలియట్‌దాకా, ప్రాచీన నాటకరంగ చరిత్ర నుంచి ఆధునిక రంగ చరిత్రవరకూ, విలియమ్ ఆలివర్ నూరిపోసిన కళామర్మాల నుంచి అలార్డీ నికోల్ చెప్పిన కళాధర్మాల దాకా రమణ ఆపోశనం పట్టాడు. వందేళ్ల తెలుగు సాంఘిక నాటక దర్పణంగా చరిత్రను మన కళ్లముందుంచిన రమణ దిద్దితీర్చిన స్వీయ నాటకాలు ''చలిచీమలు'', '' ఆకురాలిన వసంతం'', ''వెంటాడే నీడలు'' సమగ్ర మానవుడి చిత్రణ కోసం సాంఘిక విప్లవాన్ని త్వరితం చేయడం కోసం ఉద్యమించిన కళాఖండాలు. ప్లెఖనోవ్ సాంఘిక పునరుజ్జీవనోద్యమం, కన్నింగ్ హోమ్ సాంస్కృతిక వికాసనోద్యమం రమణ పరిశోధనకు ఉసురుపోశాయి. అతనిలోని సంఘ చైతన్యానికి ఒరుపిడి పెట్టాయి. ఆధునిక సాంఘిక నాటక పితామహుడుగా పేరొందిన ఇబ్సన్ నైతిక విలువలను నాటక రచయితగా రమణ ఆకళింపు చేసుకున్నాడు. ఆచార్య ఆత్రేయ నాటకాలలో కవితా స్పర్శతో కూడిన భావ చిత్రాలకు ఇబ్సన్ నాటకాలు ఉత్తేజమిచ్చాయి. అలాగే తెలుగు నాట కందుకూరి, చిలకమర్తి ప్రహసనాల ప్రాశస్త్యాన్ని, వారు జనాన్ని ప్రేమించిన తీరునూ నాటక రంగ చరిత్రలో రమణ రసవంతంగా చెప్పాడు. ఆధునిక నాటక రంగానికి, నవ్యభావ రచనా ప్రక్రియకు, ప్రేక్షక చైతన్య స్ఫూర్తికీ కారకాలైన ఇబ్సన్ నాటకాలు బళ్లారి రామువ, రాజమన్నార్, డాక్టర కొర్రపాటి, గొల్లపూడిని ఎలా ప్రగాఢంగా ప్రభావితం చేశాయో వివరించాడు. 1906లోబళ్లారి రాఘవ ప్రవేశంతో అభినయ చరిత్రలో అభినవ నాటకరంగ చరిత్ర ఎలా మలుపు తిరిగిందీ విప్పి చెప్పాడు. 1929లో ఆంధ్ర నాటక కళా పరిషత్ అవతరణతో,1946లో ఆంధ్ర విశ్వవిద్యాలయ అవతరణతో నాటకరంగంలో పుట్టుకొచ్చిన కొత్త సంచలనాన్ని వివరించాడు. క్యూబన్ విప్లవంతోనే లాటిన్ అమెరికా రంగ స్థల దిశాగతి కొత్తపుంతలు తొక్కిందంటారు. అలా 1933లో కమ్యూనిస్టు ఉద్యమ ఉధృతిలో,స్వాతంత్ర్య సమరదీక్షలో పూర్తి సమాజ స్పృహతో పెల్లుబికి వచ్చిన రంగస్థలం తెలుగువాడి సొంతం. 1943లో అఖిల భారత ప్రజానాట్యమండలి స్థాపనతో,వివిధ కళారూపాలను తొలిసారిగా పునరుద్ధరించిన ఆంధ్ర ప్రజా నాట్యమండలి రంగస్థల చరిత్రకు సర్వతంత్ర స్వతంత్రమైన బీజాలు నాటింది. మరొక్కమాటలో చెప్పాలంటే 1940-1955 మధ్యకాలం తెలుగు నాట సాంఘిక నాటకాలకు, విభిన్న కళారూపాల ప్రదర్శనకూ ఆనాటికి ఉన్నంతలో స్వర్ణయుగమనే చెప్పాలి! ఈ దశలో వెలువడిన నాటకాలు, నాటికలు, ఒకటా అరా,

ఎన్నో. ఈ చరిత్రలో కందుకూరి ''బ్రహ్మవివాహం'' నుంచి, కామేశ్వరరావు ''ప్రతీకారం''దాకా, కోలాచలం నుంచి కోరాట వెంకట సుబ్బారావు వరకూ, పానుగంటి నుంచి పర్వతాల నవనీతయ్య దాకా నాటక కర్తలను, వారి నాటకాలనూ స్థాలీపులకంగా చర్చించడమేగాక వివిధ నాటక పరిషత్తుల, సమాజాల తరపున వెలువడిన పలువురి రచనలను ప్రస్తావించడమూ జరిగింది. ''కన్యాశుల్కం'' పరిపూర్ణ ప్రదర్శనను దిగ్విజయం చేసిన ఖ్యాతి అబ్బూరిది కాగా, ''నటాలి'' ఆధ్వర్యంలో వరద రాజేశ్వరరావు చేసిన ప్రయోగాలు అబ్బురమైనవేనని గ్రహించాలి. అబ్బూరి గోపాలకృష్ణ మరికొన్ని ప్రయోగాలు చేశారు. అభ్యుదయ నాటక రంగ సారధులైన డాక్టర్ రాజారావు, సుంకర, వాసిరెడ్డి, కోడూరు అచ్చయ్య, అనిసెట్టి, పినిసెట్టి, బెల్లంకొండల పరామర్శ ఉంది. తెలుగునాట అపూర్వ సంచలనానికి కారణమైన ''ముందడుగు'', ''మాభూమి'', ''అపనింద'', ''రక్తకన్నీరు''ల సమీక్షలున్నాయి. రాచకొండ ''నిజం'', ''తిరస్కృతి'' మరో మలుపు. తన జీవితాన్ని మలుపుతిప్పిన ''బ్రాండ్'' నాటకంలో ఇబ్సన్ వాడిన పదసంపద నార్వేజియన్ భాషను సుసంపన్నం చేసినట్టే ''మాభూమి''లోసుంకర- వాసిరెడ్డి వాడిన తెలుగు సామెతలు, నుడికారాలు, నానుడులూ, సంభాషణలూ విశ్వనాధ ప్రశంసలు పొందాయి. కాగా 1965 తర్వాత కథావస్తువుకన్నా టెక్నిక్స్ ప్రధానంగా అలంకారాలవైపు మోజు పెంచుకున్న రచయితలు, ప్రయోక్తలూ నేటి సాంఘిక నాటక పతనానికి ఎలా కారకులయ్యారో రమణ చెప్పాడు. అయితే ఈ దశలో టెక్నిక్ ప్రధానంగా ఎన్.ఆర్.నంది మలిచిన ''మరో మొహంజదారో'' రంగస్థల పతన దశకు ముందు ఆధునిక నాటకానికి కొసమెరుపుగా ఎలా నిలబడిందీ చెప్పాడు. అయితే ఇంత పతన దశలో కూడా కొన్నాళ్ల క్రితం ఆంధ్రయూనివర్సిటీ కేంద్రంగా సుప్రసిద్ధ ప్రయోక్తలయిన వెంకటేశ్వరరావు, అత్తిలి కృష్ణారావు రహదారినే రంగస్థలంగాచేసుకొని నూతన ప్రయోగాలు ( ఉ: గణేష్‌పాత్రో ''పిల్లొచ్చిందీ'') విజయవంతంగా చేశారని మరవరాదు. అలాగే ఒక ఏడాది క్రితం హైదరాబాద్‌లోని ''గోల్డెన్ త్రెషోల్డ్'' ఆవరణలో కాశీపట్నంవారి ఆరుబయలు 'చావు' వినూత్న ప్రయోగానికి మరో మచ్చుతునక! ఇలా ఒకకోణం కాదు- గ్రీకు నాటకరంగ వైభవ పతనాలు, షేక్స్‌పియర్ సాంఘిక దృష్టి, నీషే ప్రవచనాలు, వాస్తవికవాదం, కాల్పనిక వాదం, అనేక సంస్కరణ వాదాలు, తెలుగు నాటక రంగంపై ఇబ్సన్, బెర్నార్డ్‌షా, గోగోల్, దాస్తవిస్కీ,గోర్కీ, చెహోవ్ ప్రభావం, స్వభావ వాదం, ప్రతీక వాదం, వ్యక్తీకరణ వాదం అనిబద్ధతా వాదం, అధి వాస్తవికతా వాదం, అస్తిత్వవాదం, ఆధునిక ఆంగ్లనాటక రంగ

ప్రభావం, ఇలా ఎన్నో కోణాల నుంచి రంగస్థల వైభవ పతనాలను రమణ సమీక్షించాడు. అంతేగాదు, సుప్రసిద్ధ నాటక ప్రయోక్త, రిపర్టరీ అధినేత అయిన ఎ.ఆర్.కృష్ణ ఓపెన్ ఎయిర్‌లో ఉన్నవ వారి ''మాలపల్లి'' నవలను నాటకంగా ప్రదర్శించిన తీరు అద్భుతం, సాహసోపేతం. కాని కుహనా నాటక ప్రయోక్తల ''థియేటర్ డిప్లొమాలు'' రమణ దృష్టిలో''సిగ్గుబిళ్ళలు''! అయితే ప్రయోగ వ్యామోహాన్ని విడనాడకుండానే వస్తు ప్రాధాన్యతను వదులుకోనివాడే ఆదర్శ ప్రయోక్త కాగలుగుతాడని రమణ కూడా అంగీకరించాలి. ప్రపంచ థియేటర్ ఉద్యమానికి మూడువందల ఏళ్ల చరిత్ర ఉంది. ఇన్‌డోర్ థియేటర్లు16వ శతాబ్దం సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమంతో అవతరించసాగాయి. థియేటర్ వెయ్యేళ్లపాటు కేవలం వినోద సాధనంగానే ఉండిపోయింది. విజ్ఞాన వేదికగా అది అవతరించడం ఆ తరువాతనే. తొలి నాటకశాల ' ఒలింపికో థియేటర్ (ఇటలీ), స్పానిష్ థియేటర్ 'స్వర్ణయుగం' చూసాయి. ఇంగ్లాండ్‌లో రెస్టొరేషన్ ప్లే హౌస్, ఆలివర్ థియేటర్, అమెరికాలో గ్రధీ థియేటర్ ప్రపంచ ప్రసిద్ధాలు. మనకున్నది ఒక్క-రవీంద్రభారతి! జిల్లాకొక్క- రంగ స్థలమైనా ఉండాలి. ఇప్పటికైనా మించిపోయింది లేదు. తెలుగు నాటకం పునరుజ్జీవనం నిరాశవల్ల కలగదు. సమష్టి ఆలోచనల వల్ల, లక్ష్యనిర్దేశం వల్ల మాత్రమే కలుగుతుంది. యువ కవి మనోమందిరంలో రగిలే అశాంతి నుంచీ ఎగసిపడే అలలనుంచీ, సమష్టి కార్యాచరణ నుంచీ ఈ చీకట్లు తొలగాలి: ''ఈ అశాంతికి ఒక లిపిఉంది/ ఈ కన్నీటికి ఒక భాష ఉంది/ నేను సముద్రాన్నై ఎగిసినప్పుడు/ ఈ అల వెనుక ఒక ఘోష వుంది/ అడుగు అడుగుకీ ఘనీభవించే ఆలోచనలో ఒక బాధ ఉంది''. ఆ వ్యష్టిబాధ సమష్టిరూపం దాల్చితే, సమాజం సమస్యలూ కళ్లముందు వాల్తాయి. సామాన్య ప్రజల బాధలు తెలుస్తాయి. నాటకానికి వస్తువును ఎక్కడి నుంచి చేదుకోవాలో తెలుసొస్తుంది! ఆ మహోదయం కోసం ఎదురుచూద్దాం.

*(ఆదివారం 20, జులై 1997)*

# విశ్వనాటక సాహిత్యానికి 'మంజుల' కొత్తవెలుగు!

కావ్యాలలో నాటకం రమ్యమైందని ఎందుకంటారు? సామాజిక జీవన విధానాన్ని, మానవునిలోని మంచి చెడులను తిరిగి సామాజికులకు కళ్ళకు కట్టినట్టు చూపించి, మనస్సులలో చైతన్య దీపాలు వెలిగించగల, నీతిబోధకులకు ఆస్కారం కల్పించగల ప్రబోధ సాధనం కాబట్టి నాటకానికి అంత విలువ. నాటకం అద్దం అనుకుంటే అందులో కనిపించే బొమ్మలన్నీ ఆ అద్దం ముందు నిలిచిన సామాజికుల సజీవ పాత్రలే. ముంజేతి కంకణానికి అద్దం ఎందుకు? కంకణం అచేతన వస్తువు. కాని మనిషి చేతనుడు. కనుక స్వార్థ చింతనతో కర్తవ్యాన్ని, ధర్మాన్ని విస్మరించి సంచరించే మనుషులను సన్మార్గంలోకి తిప్పడానికి నాటకమనే అద్దం తప్పనిసరి అవుతూ ఉంటుంది. పౌరాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలతోపాటు పెక్కు ప్రయోగాత్మక నాటకాలు కూడావెలుస్తున్నాయి. అయితే ప్రయోగం కేవలం ప్రయోగం కోసం కాకుండా సామాజిక ప్రయోజనాన్ని ఆశించి రచించే ప్రయోగాత్మక నాటకాలకు ఎప్పటికైనా విలువ ఉండకపోదు. ముఖ్యంగా వర్తమాన సాంఘిక జీవనంపైప్రభావం నెరపే రచనల విషయంలో ఇది మరీ వాస్తవం. ఇటీవలకాలంలో,సర్కారీ హింసకూ,సాంఘిక ఆర్థిక దోపిడీకి బలి అవుతూ వచ్చిన పీడిత ప్రజల జీవన సరళిని, బతుకు బరువుల్ని, పోలీసుల హింసా దౌర్జన్యాలను, మతమౌఢ్యాన్ని తన నాటకాలలో చీల్చి చెండాడుతూ వచ్చిన ఇటాలియన్ హాస్య నాటక కర్త డారియోఫో. ''అరాచకవాది ఆకస్మిక మరణం'' **(Accidental Death of an Anarchist)** అన్న నాటకం రాసిన ఈయనకు ఇటీవలనే నోబెల్ పురస్కారం లభించింది. అలాగే కొలది సంవత్సరాల క్రితం కార్టూనిస్టుగా, కథారచయితగా, వ్యాఖ్యాతగా ప్రసిద్ధిలోకి వచ్చిన మంజులా పద్మనాభన్ గ్లోబలైజేషన్ పేరిట ప్రపంచ బ్యాంకు-ఐ.ఎం.ఎఫ్. కాబూలీవాలా సంస్థలు దేశంపై బలవంతంగా రుద్దుతున్న 'సరళీకృత ఆర్థిక సంస్కరణలు' - సాంఘికంగా,సాంస్కృతికంగా ప్రజలపై ఎలాంటి ప్రభావం కలగజేస్తున్నాయో చెప్పడానికి ఒక నాటకం రాసింది. ఆ నాటకం పేరు ''హార్వెస్ట్'' శ్రవ్య కావ్యంగానూ దృశ్య కావ్యంగానూ నప్పగల ఈ నాటకానికి గ్రీస్‌లోని ఒనాసిస్ ఫౌండేషన్ నిర్వహించిన

అంతర్జాతీయ నాటక పోటీలలో ప్రథమ బహుమతి వచ్చింది (2,50,000 డాలర్లు)! ''నూతన ఆర్థిక సంస్కరణల''తో విశ్వీకరణ పొందిన పెట్టుబడి తాండవ నృత్యంలో డబ్బు కొలమానంగా సామాన్య మధ్యతరగతి కుటుంబీకులు ఎలా బలి అవుతున్నారో రేఖా మాత్రంగా మంజుల ఈనాటకంలో నిరూపిస్తుంది. మంజులా పద్మనాభన్ మద్రాసువీధుల్లో, కుటుంబాలలో కళ్ళారా చూసిన కొన్ని దృశ్యాలను ఆధారం చేసుకొని,బొంబాయి కేంద్రంగా ఓ నిరుపేద కుటుంబం బతుకుతెరువు కోసం, కొడిగడుతున్న కుటుంబ సభ్యుల ప్రాణాల్ని కాపాడుకోడం కోసం- శరీర భాగాల్ని కలవారి సౌఖ్యం కోసం ఎలా అమ్మ చూపిందో ఈ నాటకం విశదీకరిస్తుంది. మరో మాటలో చెప్పాలంటే ఇప్పటికే దేశంలో ప్రారంభమై వ్యాపార సరళిలో కొనసాగుతున్న మూత్రపిండాల (కిడ్నీ) క్రయ విక్రయాల తంతు 2010 సంవత్సరం నాటికి ఏ స్థాయికి చేరుతుందో చూపుతుంది. శాస్త్ర,సాంకేతిక పరిజ్ఞానం, అవి శరవేగాన సాగిస్తున్న విజయపరంపర పేద దేశాలైన వర్ధమాన దేశాలలోని సామాన్య మధ్యతరగతి ప్రజలను సంపన్న దేశాలలోని మోతుబరుల సుఖసౌఖ్యాల కోసం ఎలా బలి చేయబోతుందో మంజుల ఈ వ్యంగ్య నాటక రచనలో తెలుపుతుంది.అందులో ఆమె ఈ ప్రపంచాన్ని 'ఋణదాతలు'గాను. 'ఋణగ్రహీతలు'గానూ చూపిస్తుంది. అయితే ఈ 'ఋణం' ఆర్థిక సహాయం కాదు,నిధుల తరలింపుగాదు, మానవ శరీరభాగాలతో, జీవితాలతో చెలగాటం ఆడే వ్యాపారం. అందువల్ల సంప్రదాయంగా మనం ఆలోచించే 'ఋణదాతల', 'ఋణగ్రహీతల' పరిభాషలో ఈ నాటక రచనను అర్థం చేసుకోరాదు. 2010 నాటికి కిడ్నీ దాతలు భారతీయులుగానూ,కిడ్నీ గ్రహీతలు అమెరికన్లుగానూ ఉంటారు! పేద దేశాల ప్రజల ఆర్థిక బాధలు 'గ్రహించిన' సంపన్న దేశాలలోని ధనవంతులు ఇందుకు పరిహారంగా కిడ్నీ దాతలను ఉత్తిచేతులతో పంపరు: పేదవాడు అందరికీ లోకువ అన్నట్టుగా పేదరికాన్ని లోకువగా భావించి పేదలు ఎన్నడూ కళ్ళుజూడని వస్తు ప్రపంచంతో వారిని ఆకట్టుకోవాలని చూస్తారు. అక్కడ పేదవాడి జీవితానికి విలువ లేదు, గౌరవంలేదు. కాని సంపన్నుడి సౌఖ్యం కోసం, అతని చిరాయువు కోసం బక్కవాడి (వాడే పేదవాడు) ఉసురు తీయడానికైనా సిద్ధం. వాడి జీవితాన్ని పణం పెట్టడానికైనా వెనుదీయకపోవడం, ఇందుకోసం శస్త్ర చికిత్సా పద్ధతులకు సరిపోయిన ఆధునిక వాతావరణాన్ని, పరికరాలనూ టెక్నాలజీ ద్వారా సమకూర్చి పెట్టడం. ఒక్క ముక్కలో మంజుల చెప్పదలచింది - సంపన్న దేశాల నుంచి వర్ధమాన దేశాల పేదప్రజలపై జరుగనున్న దాడి కిడ్నీల వ్యాపారం!

నిజానికి మంజుల 2010వ సంవత్సరాన్ని భవిష్య కథనంగా చెప్పిందిగాని, ఇప్పటికే ఈ వ్యాపారం ఇండియాలో (బెంగుళూరు, హైదరాబాద్‌లు కేంద్రంగా) సజావుగా సాగిపోతోంది. ఇది పిల్లికి (ధనంతుడికి) చెలగాటం, ఎలుకకు (పేదరికంలో ఉన్నవాడికి) ప్రాణ సంకటం. ఈవ్యాపారం వల్ల వ్యక్తి గౌరవ ప్రతిష్ఠలకూ, ఆత్మగౌరవానికీ జరుగుతున్న నష్టాన్ని గుర్తింపచేయడమే మంజుల ఉద్దేశంగా కనిపిస్తుంది. ఎందుకంటే, ఏ ప్రక్రియ అయినా ప్రజల ప్రయోజనం కోసం జరగాలిగాని, వ్యాపార ప్రయోజనాల కోసం మానవ శరీరభాగాలను క్రయవిక్రయాలకు గురిచేయరాదన్నదే ఇక్కడ ప్రధాన లక్ష్యం. మంజుల ఈ నాటకం ద్వారా చేసిన నూతన సృష్టికి రంగస్థల భాగ్యం ఇంకా కలగవలసే ఉంది. గ్రీస్‌లోని భారత రాయబార కార్యాలయంలో 'హార్వెస్ట్' నాటకాన్ని కొందరు నటులు పఠించినపుడు ఆసమావేశానికి హాజరైన సభికులు శ్రవ్య కావ్యంగా ఆనందించవచ్చు. కాని దృశ్య కావ్యంగా మంజుల నాటకం రూపక సాహిత్యంలో చెలామణి కావలసి ఉంది. అయితే రాయబార కార్యాలయంలో జరిగిన నాటక పఠనంలో ఒక పాత్రదారిగా వ్యవహరించి శ్రోతల మన్ననలు పొందిన కుసుమ్ హైదర్ దృష్టిలో 'హార్వెస్ట్' దృశ్య కావ్యంగా కూడా నిలబడుతుంది! సర్వ రూపకాలకు ప్రయోగ యోగ్యత కల్పించేది కాబట్టి నాటకాన్ని చాక్షుష (దృశ్య) క్రతువుగా పెద్దలు వర్ణించారు. కాబట్టి - మంజుల 'హార్వెస్ట్' శ్రవ్య కావ్యంగానూ దృశ్య కావ్యంగానూ వర్ధిల్లగలదని చదివిన వారికి అనిపిస్తుంది. అందుకే సారస్వతీయులు ఒక విషయాన్ని ప్రస్తావిస్తుంటారు: సరస్వతిని ఉపాసించేవారు ఎందరో ఉండొచ్చు. కాని సారస్వత నవనీతాన్ని అభ్యాస విద్యలో సాధక బాధకాలు తెలిసిన మురారి తప్ప మరెవరూ ఎరుగరు అంటారు. అలాగే మురారి కవి నాటకం ''అనర్ఘ రాఘవమ్'' దేశంలో తొలి శ్రవ్య నాటకంగా భావిస్తారు. గంభీరమైన సముద్రంలోకి ఎన్నో కోతులు దూకి ఉండవచ్చుకాని, సముద్రం లోతు మాత్రం ఒక్క మందర పర్వతానికే తెలుసునని అంటారు. అలాగే మంజుల నాటకం లోతుపాతులు కూడా దానికి ప్రదర్శన భాగ్యం కలిగినపుడే సాధ్యం. అందువల్ల రచన అనేది వివిధ ప్రమాణాలతో సాగుతుంది. అది రచయిత విశృంఖులతలోని సమతుల్యతకూ, భావుకతకూ నిదర్శనం. అందుకే శామ్యూల్ జాన్సన్ అంటాడు: There can be no certain limit to the modes of composition open to the dramatist. ఇబ్సన్, జి.బి.షా, హెన్రిక్, బెర్తోల్ బ్రేష్టులు సాంఘిక, రాజకీయ భావ పరిణామానికి నాటక సాహిత్యం ద్వారా విభిన్న మార్గాలలో తోడుసీడై నిలిచినవారే. యూరప్‌లో రీడర్స్ థియేటర్ ఉండేది.

గ్రీస్‌లో మంజుల 'హార్వెస్ట్'ను శ్రవ్య కావ్యంగా ఎలా కొంత మంది కలిసి పఠించారో అలాగే రీడర్స్ థియేటర్‌లో నటులు కూడా నాటకాల్ని ప్రదర్శనకు ముందు ఒక బృందంగా పఠిస్తుండేవారు. నాటక రచనకు సంబంధించిన అన్ని సిద్ధాంతాలనూ కాలదన్ని బాద్లేర్,బెర్గ్‌సన్‌లా తమ తనాన్ని నిరూపించుకునే కొత్తతరం నాటక కర్తలు, రచయితలూ ఉండొచ్చు. మంజుల ఆ కోవకు చెందుతుంది. 'హార్వెస్ట్' రచనను కొంత కమర్షియలైజ్ చేసినా 'కాలి ఫర్ ఉమెన్' ప్రచురణ సంస్థ ఆశయాలకు తగినట్టుగానే నేటి ఒక సాంఘిక సమస్యను మంజుల బలంగా ప్రతిబింబించిందనే చెప్పాలి.

మూడు అధ్యాయాలలో, తొమ్మిది అంకాలలో పూర్తిఅయ్యే మంజుల నాటకంలో ప్రధాన పాత్రధారులు: ఓమ్‌ప్రకాష్ ‌‌_జయ, ఓమ్ తల్లి మా,జీతు, బిద్యుత్‌భాయి. వీరంతా సామాన్య కుటుంబాన్ని సాకుతున్న ఓమ్‌కుటుంబీకులూ, ఇరుగు పొరుగూ, ఓమ్ ఎంత మంచివాడో అంత అసమర్థుడు కూడా. ఒకచోట కుదురుకున్న కొలువు కాస్తా ఊడిపోవడంతో పూటగడవని స్థితిలో అవయవాలు అమ్ముకుంటే డబ్బులొస్తాయని విని, అందుకు మొత్తం కుటుంబాన్ని తాకట్టు పెట్టడానికి సిద్ధమవుతాడు ఓమ్. ఈ కుటుంబం, విదేశీ కిడ్నీ వ్యాపారులకు ఆటపట్టు అవుతుంది. ఈ వ్యాపారులెవరు? అమెరికాలో మూత్రపిండాలు అవసరమైన ధనికుల తరఫున ఇక్కడ పేదవాళ్ళ చిరునామాలు తెలుసుకొని 'గార్డ్స్' పేరిట 'ఏజెంట్స్'పేరిట వ్యవహరించే 'ఇంటర్ ప్లాంటా సర్వీసెస్' సంస్థా దాని తాలూకూ యజమానులూ. వీళ్ళు చెప్పిన 'ప్యాకేజీ' ప్రకారమే కిడ్నీదాతలు వ్యవహరించాలి. మరొక వ్యాపారితో కుటుంబ సభ్యులు మాట్లాడకూడదు. వ్యాపారం చేయకూడదు. ఆ అవకాశం ఆ విదేశీ కిడ్నీ కాంట్రాక్టరుకే ఉండాలిగాని మరొకరికి ఉండడానికి వీల్లేదు! ఇందుకోసం వారు ముందుగా 'ఓమ్'ను మచ్చిక చేసి, క్రమంగా మిగతా కుటుంబ సభ్యుల్ని కూడామభ్యపరచడానికి ప్రయత్నిస్తారు. ఈ వ్యాపారంలో ప్రధానమైన షరతు - పిల్లలు లేని దంపతులైతే మరీ మంచిదని చెప్పడం! కిడ్నీ వ్యాపారులు చెప్పినదానికి తలూపితే - దారిద్ర్యంలో ఉన్న కుటుంబానికి కాసులు రాల్తాయి (సబ్సిడీలు తగ్గించి, ఎరువుల ధరలు పెంచి, బ్యాంక్ పరపతిని కుంచించి, ప్రైవేటు వడ్డీ వ్యాపారుల కబంధ హస్తాలలోకి పత్తిరైతుల్ని నెట్టిన ప్రపంచ బ్యాంకు షరతుల మూలంగా పత్తిరైతుల ఆత్మహత్యలు జరిగినట్టే కిడ్నీ వ్యాపారానికి కూడా దారిద్ర్యం ప్రధాన కారణమవుతోంది). మంజుల ఒకసందర్భంగా తమిళనాడులోని నిరుపేద గ్రామాలకు కిడ్నీ వ్యాపారులు ఎలా ఎగబడుతున్నారో చెబుతూ 'ఆకస్మికంగా

బయటనుంచి ఊడిపడిన సంపద కిడ్నీ దాతల జీవితాలను చిందరవందర చేసింది' ని పేర్కొనవలసి వచ్చింది! ఈవ్యాపారం గృహఛిద్రాలకు కారణమై సామాజిక అశాంతికి ఎలా దారితీస్తుందో చతురమైన సంభాషణల ద్వారా, పటువైన సన్నివేశాల ద్వారా, దిటవైన సంఘటనల ద్వారా మంజుల హెచ్చరించింది. అంతేగాదు, దారిద్ర్యభారంవల్ల కిడ్నీ దాతలుగా మారే వారిని గురించి చెబుతూ భార్య కిడ్నీని డబ్బుకు అమ్మే భర్త, ('జయ' భర్త ఓమ్) అవసరమైతే మరో పెళ్ళి చేసుకొని రెండో భార్య కిడ్నీ కూడా అమ్మడానికి జంకడని శరిస్తుంది మంజుల. ఎక్కడో ఎవడో ధనవంతుడి సౌఖ్యం కోసం, అతడి ఆయుష్షును పెంచడం కోసం తన సంతానాన్ని తానే బలిచ్చే స్థితికి సమాజ పరిస్థితులు దిగజారడాన్ని మంజుల సహించలేదు. కిడ్నీ వ్యాపారంలో నేడు సాగుతున్న అంతర్జాతీయ పోటీని ఎండగడుతూ **(classic theme of age cannibalising youth in quest of longevity)** విశ్వీకరణ పేరిట నడుస్తున్న పెట్టుబడిదారీ దోపిడీ సంస్కృతి విస్తరణవల్ల మానవాళికి కలుగనున్న ఒక అనర్థాన్ని చెబుతుంది. ఈ కిడ్నీలు అందుకునే విదేశీ సంపన్నులకు మంజుల నాటకంలో ప్రతినిధులు: జిమ్మి, వర్జిల్. ఒకప్పుడు గొప్ప నాటకంగా ప్రసిద్ధి పొందిన ఎన్.ఆర్.నంది ''మరో మొహంజదారో'' లో అవకాశవాద, అసహాయ మనస్తత్వాలకు ప్రతినిధులుగా, ధనాభిలాషకు, డాంబికాలకు చిహ్నాలుగా పరంధామయ్య, కోటీశ్వరయ్యలు ఎలా ఉన్నారో 'హార్వెస్ట్'లో వీరూ అంతే! మందు మాత్రంగా మంజుల కొన్ని పరిమితులలో తన నాటకంలో కొంత మెలోడ్రామా నడిపినప్పటికీ ఆ పని ఎందుకు చేయవలసి వచ్చిందో కూడా ఇలా చెప్పింది. కథలు చెప్పుకుని ఎలా బతకలేరో కేవలం నాటకాలు రాసి బతుకును పోషించుకోలేరు. నాటక రచయిత కనే ప్రతీ స్వప్నాన్ని తళుకు బెళుకుల సినీ పరిశ్రమ కాపుకాసి నీడలా వెంటాడుతూనే ఉంటుందనీ **(film industry glints seductively on the horizon of every dream)** ఆ ప్రమాదం నుంచి తన స్వాప్నిక జగత్తును సంరక్షించుకోవడానికి డ్రామా కొంత కమర్షియలైజ్ కావలసి వచ్చిందనీ మంజుల భావన. కనుక అకుంఠితమైన అనురాగంతో అంకితభావంతో ఉన్న ఔత్సాహిక నటుల భుజస్కంధాలపై రంగస్థలం రూపురేఖలు దిద్దుకొంటూ ముందడుగు వేయాలని ఆమె కోరుకొంటోంది. నేటి సంఘ పరిస్థితిని మంజుల 'జయ' పాత్రద్వారా రకరకాలుగా చెప్పించింది. 'నేను నివసిస్తున్న గదిలో ఉండే ఏ ఇరువురి దృష్టిలోనూ అందులోనే ఉంటున్న మిగతా ఇద్దరూ ఉండీలేనట్టే' అంటుంది జయ. కిడ్నీ ఇవ్వడానికి ఓమ్ పడిన బాధల్ని వర్ణించింది. మీరు కిడ్నీ అమ్మితే సుందర భవిష్యత్తును, ధన కనక వస్తు

వాహనాలు ఇస్తామన్న వ్యాపారుల మాటలు వినిపిస్తుంది. మింగమెతుకు లేదు, మీసాలకు సంపెంగనూనె పులిమినట్లుగా ఒక గదికే అవకాశంలేని చోట ఆధునిక పరికరాలు ఏర్పాటుచేస్తాం,సెంట్లు అమరుస్తాం, పూవులు పేరుస్తాం అంటూ కిడ్నీ వ్యాపారులు 'చెవుల్లో పూవులు' పెట్టడం చూస్తాం! అంతేగాదు అక్కడ కూడా మంజుల కూర్చిన సంభాషణ చమత్కార మంజరిగా సాగింది : నీకు నవ్వురాక పోయినా నవ్వుతున్నట్లు, కృత్రిమంగా ముఖం పెట్టాలి. మనిషి నవ్వకపోతే సంతోషంగా లేనట్లు లెక్క; మనిషి నవ్వితే శరీరం సంతోషంగా ఉన్నట్లు, శరీరం నవ్వితే అతని అవయువాలన్నీ దర హాస పిచికలు వెదజల్లినట్టే నట- ఇదీ కిడ్నీ వ్యాపారుల భాషాపదకోశం! దరహాస నియంత్రణ! మంజుల 2010 సంవత్సరానికి కిడ్నీ వ్యాపారుల గురించి ఇచ్చిన అంచనా వ్యంగ్యరచన 'హార్వెస్ట్'.అలాగే నలభై అయిదేళ్ళ నాడు శ్రీశ్రీ ముగియనున్న 20వ శతాబ్దానికి వీడ్కోలు చెబుతూ 21వ శతాబ్దానికి స్వాగతం పలుకుతూ 'చతురస్రం' అనే గొప్ప రాజకీయ నాటకం రాశాడు. 1999 డిసెంబర్ 31 నాటికి అమృతాన్ని అందరికీ పంచగలిగితే ఈ స్వాతంత్ర్యం సాధ్యమవుతుందనీ, నిజమవుతుందనీ అంటాడు! మానవజాతికింకా మానసిక స్వాతంత్ర్యం ఏర్పడలేదు కాబట్టి అరణ్యాల్లో ఉన్న మన మనస్సుల్లో వెలుగులు రానంతకాలం ఈచీకటి తొలగదంటాడు. మానసిక స్వాతంత్ర్యానికీ ఆర్థిక స్వాతంత్ర్యానికీ మధ్య ఎంత అంతరం ఉందో నిరూపించే పాత్రలు ఓమ్,జయ - వాటిని ప్రయోజనకరంగా రూపుదిద్దిన రచయిత మంజులా పద్మనాభన్. అమెరికాలోని కిడ్నీ గ్రహీతలలో ఒకరైన వర్జిల్ అంటాడు : ప్రపంచంలోని పేదవాళ్ళకు బతుకు లాగడానికి ఇన్ని డబ్బులు పడేస్తాం. ఆ మేరకు మా శరీరాల్ని యువ మూత్రపిండాలతో నవంనవం చేసుకొంటాం... పేదవాడి ఆగ్రహం పెదవికిచేటు, ఆగ్రహం అహంకారం, గర్వం అతడికొక ఫ్యాన్సీ డ్రెస్‌లాంటిది' తప్ప మరేంకాదు అన్నాడు **(Pride is a poor man's fancy dress!)** అయితే జయ మాత్రం విదేశీ కుట్రకు బలికాదలచలేదు, తిరగబడింది,తలపడింది. పరువు ప్రతిష్ఠల్ని కాపాడుకోవడానికి సిద్ధమైంది. నా అంటూ నాకు మిగలేది చావే కనుక, నా చావే నాకు గర్వకారణం అంటుంది. చావు ద్వారానే విజయం సాధిస్తానంటుంది **(winning by losing)** జేమ్స్ లాంగెన్ బాక్ అనే కవి **"pain will lessen,father, if you eat us"** అంటాడు! జేమ్స్ బాధే మంజుల పాత్ర 'జయ' బాధకూడా!

- ఆదివారం *29,* మార్చి *1998*

# జీవన సమరానికి చిత్రలిపి అజంతా 'స్వప్నలిపి'!

తెలుగు అజంత భాష! ఆద్యంతమూ ఆ భాషకు న్యాయం చేకూర్చదలచి అజంత భాషనే తన నామధేయంగా మార్చుకున్నవాడు అక్షరశిల్పి, సుప్రసిద్ధ కవి అజంతా! అంతేగాని కొందరు భావించినట్లు అజంతా గుహలకూ, ఎల్లోరా గుహలకూ, వాటిలోని శిల్ప సంపదకూ మోజుపడి తన పేరును 'అజంతా'గా మార్చుకున్నవాడు కాదు! అక్షరంతో జీవన బీభత్సానికి అద్దం పట్టిన వాడు; తన ఆశయాలకు, ఆకాంక్షలకూ అంతరాంతరాలలో దశాబ్దాలుగా గూడుకట్టుకుని సంచరిస్తున్న తన ఆలోచనలకూ, దోపిడీ, దారిద్ర్య బాధల నుంచి సామాన్యుడి విముక్తి కోసం తపనతో కంటున్న కలలకూ అక్షర బద్ధమైన చిత్రలిపే ఇటీవల కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం పొందిన అజంతా 'స్వప్నలిపి'! స్వాప్నికుడు కాని మానవుడుండడు. కానీ కలలు కనే వాళ్ళంతా స్వప్నకలశాలను జీవితాంతం చెక్కుచెదరకుండా భద్రపరచనూ లేరు. అజంతాకు ఇతరులకూ ఉన్న తేడా అక్కడే ఉంది! ఎందుకని? గాయపడిన స్వప్నాలు కాంతిని వెదజల్లలేవు గనుక 'స్వప్నా'న్ని కంటికి పాపలా కాపాడుకోగల శక్తి అజంతాకు ఉంది! అధివాస్తవిక రచనగా కనిపించే 'స్వప్నలిపి'కి అసలు కథానాయకుడు మానవుడు, సగటుమనిషి, అతి సామాన్యుడూ! ఈ రహస్యాన్ని అజంతాయే విప్పి చెప్పాడు. అన్నిటికీ కారకుడు మనిషి కనుక ప్రతి మనిషిలో తనను చూసుకోవడం అజంతాకు ఇష్టం. తన స్వప్నంతోనే సంతృప్తి పడి ఉండడు. ప్రతిమనిషి స్వప్నంలోనూ తానై సంచరించే కవి కనుక, అజంతా ప్రతిమనిషి బాధలు, దుఃఖాలు, మండుతున్న గాయాలలో ప్రత్యక్షమవుతాడు. ప్రత్యక్షసాక్షిగానే దైనందిన జీవన బీభత్స దృశ్యాలకు ప్రత్యక్షర సాక్షిగా మెలుగుతాడు! ఈ రహస్యాన్ని అర్థం చేసుకోలేని కొందరు మరో అక్షరశిల్పి, నిరంతర భావనా తపస్వి అయిన బైరాగిని ఆడిపోసుకున్నట్టే, అజంతాను నిరాశావాదిగా తలపోశారు కానీ మానవశక్తి పైన, మానవుడిపైన అజంతాకు ఉన్న ఆత్మవిశ్వాసాన్ని ఎవరూ అంచనా కట్టలేరు. అధఃపతితుడైన మనిషి బాధల పల్లవిని అర్థంచేసుకొని అతనితో మమేకమై దోపిడీ వ్యవస్థపై ధర్మాగ్రహం ప్రకటించాడే గానీ, మానవుడి ప్రాశస్త్యాన్ని

అజంతా ఏ కోశానా కించపరిచినవాడు కాడు. కనుకనే అతను చీకటి హాలాహలాన్ని ఆస్వాదిస్తున్న వీధి మహర్షిని తన కావ్య నాయకుడని ప్రకటించుకోగలిగాడు; శిరస్సు బద్దలై ప్రవహిస్తున్న స్వప్నజలాలలో స్వచ్ఛమైన మనిషికోసం పరితపించిన పరిశోధకుడు అజంతా. ఇందుకు కారణం లేకపోలేదు. అతని జీవితమే ఒక కథాకావ్యం. 1947 నుంచీ 1990 దాకా జీవనసమరంలో,బతుకు దిద్దుబాటులో ఆర్థికంగానూ ఉద్యోగరీత్యానూ అనేక బాధలు పడినవాడు అజంతా. 'చెట్లు కూలుతున్న దృశ్యం' 'పరిత్యాగి పరివేదన' 'వేళ్ళు ఇక్కడే' కవితలు అతని ఆత్మకథా చిత్రాలుగా భావించవచ్చు. జనన - మరణాలకు అభేదం పాటించిన అద్వైతి. అతను శిల్పి, 'వాస్తుశిల్పి' కూడా. ఎందుకంటే ప్రతిమనిషినీ అక్షరంగా భావించిన అజంతా అక్షరాలకు కూడా అవయవ నిర్మాణం పటిష్టం చేసినవాడు కాబట్టి! ఆయనే చెప్పుకున్నట్టు మనిషి ముఖకవళికల వలెనే, మనిషి అవయవ నిర్మాణం వలెనే అక్షరాలకు కూడా ఒక ఆకారం, ఒక భంగిమ, భావానుగుణ్యమైన ఒక కదలిక, ఒక లయ, ఒక విన్యాసం, రంగు, రుచి ఉంటాయని చెప్పి స్వప్నలిపి రహస్యం ఇదేనన్నాడు. దైనందిన జీవన బీభత్సంలో తాను చేస్తున్న విచిత్ర విన్యాసాలే అతని కొత్త ఛందస్సు! శ్రీశ్రీ తరువాతి తరం గొప్ప కవులలో ఒకరు అజంతా. అతని ముద్రలు అనేక మంది తెలుగు యువకవుల రచనలపైన బహుముఖాలుగా ఉన్నాయి. కానీ వారంతా వచన పద్య రోచిస్సులను వెదజల్లడంలో, ప్రతి పదవిన్యాసంలో,భావచిత్రాల పొందికలో అజంతాకు అంత దగ్గరగా రాలేకపోయారు. రాగలిగిన వారిలో ఎన్నదగిన కవి నగ్నముని కావ్యానుగుణమైన భాషను కాదు, కాలానుగుణమైన భాష అజంతాకు ఇష్టం. కనుకనే కావ్య నిర్మితిలో అతని నడకే వేరైంది.

అయితే పద్యవచనకు (అతను మంచి వచనాన్ని పద్యంగా భావిస్తాడు గనుక) అజంతా కొన్ని విలక్షణమైన నియమాలు పెట్టుకున్నాడు. వాటిలో ప్రధానమైనది - బళ్ళకెత్తగలనన్ని రచనలు కవి సృష్టించకూడదన్నది! ఆరుద్ర ''నేను ఎక్కదలుచుకున్న రైలు ఒక జీవితకాలం లేటు'' అన్నట్టుగానే అజంతా కావ్యరచనకు ఏళ్ళూ, పూళ్ళూ తీసుకుంటాడు. గంటలు,రోజులు కాదు, ఒక్కో రచనను (కవితను) పూర్తి చేయడానికి రెండు మూడేసి ఏళ్ళు తీసుకున్నాడు. కానీ ఈసరిహద్దుల్ని కూడా అధిగమించి మరో నగ్నసత్యాన్ని అజంతా తాజాగా రాసిన 'మృత్యువు హాస్యప్రియత్వం' కవితలో చాటుతున్నాడు 'ఒకపద్యం రాయడానికి ఒక జీవితం ' కావాలంటున్నాడు!! మన కవుల్లో ఈ అనంతమైన చెక్కుడుకు అలవాటు పడిన మరోప్రసిద్ధుడు దేవులపల్లి

కృష్ణశాస్త్రి. ఆంగ్ల సాహిత్యంలో ఫిలిప్ లార్కిన్ కవి ఒక్కో కవితను నెలల తరబడి అలా చెక్కుకుంటూనే కూర్చునే వాడు. జాన్ ఉప్‌డైక్ కూడా అజంతా లాంటి పర్‌ఫెక్షనిస్టే. కనుకనే కొందరు 'పరిపూర్ణవాదులకు' తమ రచనలను పుస్తకరూపంలో తేవడంగానీ, సకాలంలో తేవడంగానీ సాధ్యపడి ఉండదు. అజంతా దృష్టిలో ప్రతి అచ్చయిన పుస్తకం కూడా ఓ 'చిత్తుప్రతి' కిందనే లెక్క! ఈ భావన తీవరించబట్టే కడచిన వలభై ఏళ్ళుగా అతని రచనలు పుస్తకరూపంలో రాలేదు! త్రిపురనేని శ్రీనివాస్ పుణ్యమా అని 'స్వప్నలిపి' రూపంలో అజంతా వెలుగుచూడటం వల్లనే సాహిత్య అకాడమీ మదింపునకు, పురస్కారానికి వీలైంది. ఒక రచనకు సంబంధించి అంతూ పొంతూ లేని చిత్తుప్రతులు పేర్చుకుంటూ పోవడంలో అమెరికన్ కవి, నవలకారుడు రేమాండ్ కార్వర్ కూడా ప్రసిద్ధుడే. కథకైతే 20-30 చిత్తుప్రతులు, కవిత అయితే కనీసం 40 చిత్తుప్రతులైనా పట్టవలసిందేనట! మిలన్ కుండేరా అన్నట్టు బహుశా ఈ తాత్సారం వల్లనే all grreat works are partially incomplete గా ఉండి ఉంటాయి. అందుకనే అజంతా కవితకు కూడా ఆద్యంతాలు లేవు. ముగింపూ, ఫలశ్రుతి అతనికి ఏవగింపు! ఎందుకని? జీవితానికి ముగింపు ఉండవచ్చునేమోగానీ జీవన సమరానికి ముగింపు లేదు కాబట్టి ! ఆ మాటకొస్తే టాల్‌స్టాయ్ కూడా 'వార్ అండ్ పీస్' నవలను ఎనిమిదిసార్లయినా తిరగరాశాడు! ఇక బ్రిటీష్ కవి డోనాల్డ్ హాల్ అయితే తన కవితల్ని కనీసం వందసార్లయినా తిరగరాశాడు! నవలాకారుడు ఫిలిప్ రాత్ రోజుకు ఎనిమిదిగంటల చొప్పున చెక్కిచెక్కి ఆరుమాసాలకుగానీ ఒక్క పేజీని ముగించేవాడు కాడట! తృప్తిలేకనే మన అజంతా కూడా ఒక కవితను పూర్తిచేయడానికి సుదీర్ఘకాలం వెచ్చిస్తాడు. అది పరిపూర్ణవాదుల అనుల్లంఘనీయమైన నియమం. మనం కాదనడానికి వీలులేని పరసీమ అది! బహుశా అందుకే పై లక్షణాన్ని వివరిస్తూ కార్వర్ కవి "With water comes together with Other Waters" అన్న కవిత గురించి చెపుతూ "it is something I love to do, putting words in and taking words out" అని ఉంటాడు! భాషను, పదాన్ని సునిశితం చేసుకొని వాడుక చేయడంలో, భావాన్ని శిల్పీకరించడంలో కవి నిశిత దృష్టి ఎలా ఉంటుందో కవి విలియమ్ మాక్స్‌వెల్ అంటాడు. "It was an education in how to refine language to the point where it almost becomes something else. It is a pure pr:uiced effectiveness and verve of an Olympic athlet"

**జీవన సమరానికి చిత్రలిపి అజంతా 'స్వప్నలిపి'!**

అజంతా, బాధను ముఖచిత్రం చేసుకున్నవాడే గానీ ఆ దుర్భరచిత్రాన్ని ఇతరులకు తొడగడానికి ప్రయత్నించలేదు. బాధాగ్నిలో పునీతుడైన మనిషి పాదధూళిలో మరణానంతరం నేను పాడే స్వేచ్ఛాగీతాన్ని రచిస్తానని దండోరా వేసిన కవికన్నా ఈ లోకంలో జీవితాన్ని ప్రేమించగలవాడెవడు? ఆకలి విషకౌగిలిలో రహస్య సముద్రాల హోరు వినగలిగిన, కనగలిగిన వాడు అజంతా. ప్రశ్న ప్రగతికి మార్గమని గ్రహించిన వాడు జీవన రహస్య శోధనను ఆపనూలేడు, ప్రశ్న వేయకుండా ఆగనూలేడు! తన పెక్కు భావ చిత్రాలలో అతను సమాజంలో కుబుసం విడిచే ఎన్నో కాలసర్పాల గురించి హెచ్చరించాడు. కాలావధులకు అతీతంగా ఊపిరిపోసుకునే అదృశ్యలోకాలను చూపించగలడు; అతడు రేపిన సుడిగాలిలో ఎండుటాకులు సహితం సంభాషించేటట్లు చేయగలడు. మండుతున్న మధ్యాహ్నాల మధ్య, రుద్ర మందారాల మధ్య నుంచి నడిచిపోనూగలడు; ఆ అనుభవంతోనే అజంతా ఆకలిజ్వాలలను కళ్ళతో ఆర్పగలననుకునేవాడిని పరమ విద్రోహిగా జమకడతాడు; అలాగే అదే మోతాదులో 'సోఫాలో కూర్చుని రివాల్వర్ గురిపెడుతున్న విప్లవ ప్రవక్తను మహావంచకుడి' గాను శపిస్తాడు. అయితే పోరును మాత్రం ఆశ్రయించక తప్పదనీ అంటాడు! తను ప్రాతినిధ్యం వహించే మనిషి దైనందిన జీవితంలో ఇప్పటికీ పడుతున్న తీరని బాధలను ఏకరువు పెడుతూ సగటు మనిషి పుట్టుకతోనే ఎలా శాపగ్రస్తుడైపోయాడో కుమిలిపోతాడు. ఎందుకని? సామాన్యుడి ప్రగతి మార్గంలో ముళ్ల కంచెలు పెట్టి,జిల్లేళ్ళు మొలిపించిన దుష్టశక్తులు ''సామాన్యుడి కన్నుల వెనుక సూర్యోదయాలను / ఎప్పుడో, ఏనాడో అపహరించారు'' కనుక! సంఘంలో అంతరాల దొంతర్లను ఏవగించుకునే అజంతా ఆశకూ దురాశకూ మధ్యన అంతరాన్ని కూడా చూడమని అత్యాశలను విడనాడాలని సలహా ఇచ్చాడు. 'ఇంద్రధనస్సుల సౌందర్యాన్ని ఆరాధిస్తూనే / అసత్యాల అరణ్యంలో చిక్కుకుపోయాను.గగనకుసుమ సౌరభం క్రింద స్పృహ తప్పిపోయాను' అంత మాత్రాన క్రోధాగ్ని నేత్రాలను సమీకరించే ప్రయత్నాన్ని మాత్రం మానుకోడు అజంతా! ఆకలి రుద్రభూమిలో జీవన సౌందర్యాన్ని చూడబోవడం ఎంత చిలిపితనమో చెప్పాడు; అంతేగాదు, అత్యాధునికంగా ఒక ప్రకటన చేస్తున్నాడు కూడా అజంతా : 'నిస్సహాయుడు, నిరాయుధుడైన ఒక గిరిజనుడు లేదా ఒకదళితుడు మాట్లాడేదంతా కవిత్వమే'' నని. తెలంగాణాలో ఒక గ్రామం చాలు / లేదా మన్య ప్రాంతంలో ఒక గ్రామం చాలు తను జీవితం అక్కడే ముగించుకోవాలన్న ఆకాంక్షను చాటాడు!! ఎన్ని గడ్డురోజులైనా ఎదురు

కానివ్వండి. మనిషి మీద విశ్వాసం, ఆత్మ విశ్వాసం సడలకూడదన్నది అజంతా ఆదేశం; అందాకా 'జీవన ప్రవాహంలో మనిషి కదలిక, చూడకుండా ఉండలేను నేను; ఒక శరీరాన్ని చుట్టుకుని ఎన్నో శరీరాలు, ఒక హృదయాన్ని చుట్టుకుని ఎన్నో హృదయాలు, అంతా సామాన్యులే, బ్రతుకు బరువు మోయలేక మోస్తున్న సామాన్య కుటుంబీకులే; ప్రవాహ జలాలను గుండెలకు హత్తుకొని, మనిషి గుండెచప్పుడు వింటేనేగానీ బ్రతకలేను నేను''అన్నాడు! అజంతా కవిత అగ్ని, జలపాతాల మేలుకలయిక. 'అజంత' భాష వాల్మీకితో ప్రారంభమై అజంతాదులతో కొత్తపుంతలు తొక్కుతోంది.

*(ఆదివారం 4 జనవరి 1998)*

# పీడనపై పడగెత్తిన 'శ్వేత'నాగు!

''స్వాతంత్ర్యం వచ్చాక బానిసత్వం, దాసత్వం రద్దయినాయన్న సంగతి, ఆ బానిసలకు ఎవరూ చెప్పినవారు లేరు. వాళ్ళ వంశస్థులు తరతరాలుగా భూస్వాముల సదుపాయం కోసం బానిసత్వమే అనుభవిస్తున్నారు. భూములన్నా, వ్యవసాయమన్నా ఖర్చుతో కూడుకున్న పని. అవి వీళ్ళకి అందుబాటులో ఉండవు. పొట్టకి అవసరమైన గింజలు ఒక్కొక్కప్పుడు మిగులుతాయి, ఒక్కొక్కప్పుడు మిగలవు, పంట పుష్కలంగా పండినా సరే! అనావృష్టి,అతివృష్టి, వరదలు ఏమొచ్చినా సరే, అప్పులు తీసుకోవడం, వేలి ముద్రలు వేసేయ్యడం బాకీ తీర్చడం కోసం జీతం లేని వెట్టిచాకిరీ చేయడం, బానిసత్వం, జన్మదాస్యం. పంటలో దాదాపు మొత్తం అంతా ఎలాగూ కామందుకి పోతుంది. తన వాటాకి వచ్చే స్వల్పమూ కూడా బాకీ తీర్చడానికే పోతుంది. ఇంక జీతమూ, కూలీలేని వెట్టిచాకిరీయే మిగులు. సర్వంస్వాహా శక్తి కలది పద్దు పుస్తకం. ఆ పద్దు పుస్తకంలోని 'టిక్కు'ల్లో చిక్కుకుపోయిన బందీలే వీళ్ళు. అప్పులపాలై వెట్టిచాకిరీ చేసే బానిసలు, దాసానుదాసులు.''

ఈ కథకు అంతులేదు. ఏ రోజో కాదు, ఈ రోజుకీ యావద్భారతంలోని గ్రామీణ వ్యవసాయ సంబంధాలలో నడుస్తున్న చరిత్ర కూడా అదే, కొంచం అటూ ఇటూగా! అణగారిన ఆర్తుల గాథలకూ, దళిత, అదివాసుల దయనీయ స్థితిగతులకూ పీడనా దోపిళ్ళకూ - ఒక్క మాటలో భూస్వామ్య వ్యవస్థ నగ్న స్వరూపానికి అద్దం పట్టిన మహా కథకురాలు బెంగాలీ రచయిత మహాశ్వేతాదేవి మాటలివి! సామాజిక న్యాయానికి నిర్వచనం చెప్పి, సంప్రదాయంలోని మంచిని గుర్తించి, వర్తమానంలోని చెడు లక్షణాలపై కత్తి కట్టిన 'శ్వేత'నాగు ఈ మహాశ్వేత! 'జ్ఞానపీఠ్' పురస్కారం ఈమెకు దక్కడంవల్ల పురస్కార గ్రహీతల విలువ పెరిగింది. ఎందుకంటే, అగ్రవర్ణాల, అంత్యవర్ణాల మధ్య అగాథాన్ని శాశ్వతంగా పూడ్చడం కోసం ఏ 'అంత్యోదయం' కోసం అంబేద్కర్, గాంధీలు శ్రమించారో, ఏ వామపక్ష ఉద్యమాలు గణనీయమైన పోరాటాలు సాగించాయో-

వాటన్నింటికీ అక్షరబద్ధంగా విలువ సమకూర్చిన ఘనత మహాశ్వేతాదేవికి దక్కుతుంది. పైన పేర్కొన్న ఆమె మాటలు దళిత జాతుల బాధల పల్లవి 'రాకాసికోర' నవలలోనివి. దేశంలోని భూస్వామ్య వ్యవస్థ గ్రామీణ ఉత్పత్తి శక్తులను ఎలా అణగార్చిందీ, అందువల్ల తాడితుల, పీడితుల సంఖ్య ఎలా పెరిగిందీ, వ్యవసాయ సంబంధాల్ని నిర్దేశించి నియంత్రిస్తున్న శక్తులు ఎలా బలం పుంజుకొన్నదీ - 'శ్వేత' రచనలు మన కళ్ళకు కట్టినట్టు చూపిస్తాయి. ఆదివాస ప్రాంతాలలోనే ఆమె 'ఆవాసం' అన్నట్టుగా ముక్తిమోర్చాలు నడిపిన ఉద్యమ మహిళగా కూడా మహాశ్వేత ఎదిగి వచ్చింది. బీహార్-బెంగాల్ సరిహద్దు ప్రాంతాల్లోని ఆదివాస ప్రాంతాలు ఆమెకు కార్యరంగాలు కావడమేగాక, ఆమె 'కథా'కేళికి ఆదివాసుల జీవితాలు ప్రధాన ముడిసరుకులయ్యాయి. సంతాల్, ముండారీ జాతుల తిరుగుబాట్లు రచనలకు పూర్వరంగాన్ని సమకూర్చాయి. వ్యవసాయ కూలీలపైన, పేద రైతులపైన జోతేదార్లు (భూస్వాములు) సాగించిన అత్యాచారాలు ఆమె రచనా దీక్షను మరింత సునిశితం చేశాయి. వాల్డో ఎమర్సన్ అన్నట్టు 'రచయిత విమోచన ప్రదాత' **(Liberating God)**. అలా తన గుండెనే సన్నికల్లుగా మార్చుకొని సామాజిక న్యాయసాధన కోసం జీవన రసాయనాలను తయారుచేసి పీడితులకు పంచుతున్న రచయిత 'శ్వేత'. ఈదృష్ట్యా ఆమె రచనా జీవితం ఆచరణకు మాతృకగా మారిపోయింది. ప్రసిద్ధ కథకుడు, నవలా కారుడూ పి.జి.ఉడ్‌హౌస్ అనలేదూ: **"A writer's life is the ideal life"** అని! శ్వేతాదేవి మహామొండిది కాబట్టే ఎంతకాలమని ఆకలి దప్పుల్ని గురించి ఒకే కథా వస్తువుగా రాస్తూంటావని ఎవరో ప్రశ్నించినపుడు ఆమె ఇచ్చిన సమాధానం: ''ఎంతకాలం ఆకలి, దారిద్ర్యం, ధనవంతులు, భూస్వాముల బహిరంగ దోపిడీ, ప్రభుత్వ యంత్రాంగాల పీడనా సాగుతాయో, అంతకాలమూ నేను అవే విషయాలు రాస్తూంటాను'' అని! ఆమె సంఘసేవికగా ఉబుసుపోని కథలూ, నవలలూ రాయలేదు. అవగాహనతో, అనుభవాలతో నిండిన వాస్తవ జీవిత చిత్రణ ఆమె కవన రంగం. కట్టు బానిసల విమోచనోద్యమకారిణిగా శ్వేతాదేవి తండ్రి మణీష్ ఘటక్ సాహిత్య వేదికగా తీర్చిదిద్దిన 'వార్తిక' పత్రికను వ్యవసాయ కార్మికుల, పేద రైతుల, రిక్షావాలాల మాటల్లోనే వాళ్ళ జీవిత దర్పణంగా మలిచింది! జేమ్స్ జాయిస్ 'యులిసిస్'లాగా ఒకరోజు కథాకాలాన్ని జీవన చిత్రణ పరిధిగా మలిచిన మరో రచన 'ఒక తల్లి'. వర్తమాన ప్రపంచానికి కూడా చెహోవ్ బంధువెందుకయ్యాడు? నిజ జీవితాలను చిత్రించాడు కాబట్టి. మహాశ్వేతాదేవి ఇటీవల కాలంలో నోబెల్ సాహిత్య

పురస్కారం పొందిన ఆఫ్రికన్ - అమెరికన్ రచయిత్రి నాది నీ గోర్డిమీర్ లాంటిది! అమెరికన్ సాంస్కృతిక జీవనానికి చేదోడు వాదోడై నాలుగువందల ఏండ్లకుపైగా సంపదైశ్వర్యాల సృష్టికీ, మెరుగులు దిద్దడానికీ కారకులైన దళిత వర్గాలతో గొంతు కలిపిన వ్యక్తి గోర్డిమీర్. మనిషీ, అతని పరిసరాలు - వెరసి రాజకీయాలు. ఆ రాజకీయ చైతన్యాన్ని గోర్డిమీర్,అప్టన్ సింక్లయిర్ గొప్ప నవల 'జంగిల్' (అడవి) ద్వారా పొందింది. అలాగే మానవునిలోని మంచి-చెడులను అధ్యయనం చేసిన మహాశ్వేతాదేవికి టాగోర్ శాంతినికేతన్ విద్యా సంస్కృతులు తోడ్పడ్డాయి. మానవీయ దృష్టికి ఆమె తగిన వారసురాలైంది. ఆ క్రమశిక్షణే ఆమె భావిజీవితానికి ఏడుగడ అయింది.

శ్వేతాదేవి 'రాకాసి కోర' భూస్వామ్య వ్యవస్థలోని చెడుగుల్ని ఎత్తి చూపిన గొప్ప నవల. వర్గ వ్యవస్థ, వర్ణ వ్యవస్థ, మతవ్యవస్థ - పేదసాదలపై ముప్పేటగా జరిపిన దాడిని బట్టబయలుచేస్తుంది. కొండజాతులు, దళితులు తమ భూములను ఎలా కోల్పోయి, తమ నివాసంలోనే తాము ఎలా నిర్వాసితులు కావలసి వచ్చిందీ కళ్ళకు కట్టినట్లు చూపుతుంది. ఇందుకు సంప్రదాయాల ఉచ్చులూ, ఆచారాల అచ్చులూ అరదండాలుగా ఎలా తోడ్పడ్డాయో వివరిస్తుంది. గిరిజన ప్రాంతాల్లో మైదాన ప్రాంతాల వారు సాగించే వ్యాపార దోపిడీ ఎన్ని పద్ధతుల్లో సాగుతూంటుందో తెలుపుతుంది. 'బాఢా' గ్రామం ఆధారంగా రాజపుత్ర అగ్రవర్ణులు అక్షరాస్యులుకాని తక్కువ కులస్థుల్ని, ఆదివాసుల్ని ఎలా దోచుకుతింటారో చూపుతుంది. ఉత్పత్తి సాధనాలూ, ఉపాధి ఆధారాలూ కలవారి సొత్తు అయినంత కాలం సాంఘిక న్యాయానికి అర్థాలు మారతాయని బోధిస్తుందీనవల. అంతేగాదు, సామాజిక ఆర్థిక పరిస్థితులను పొలిటికల్ ఎకానమీ ద్వారా పరిశీలించిన గొప్ప నవల ఇది. యజమానులు భూముల్ని కౌలుకి ఎందుకిస్తారో సమాధానం చెబుతుందీ నవల! గ్రామం ఒకటి, భూకామందులు తొమ్మిది కుటుంబాలు, మిగతా అందరూ అప్పులపాలై అమ్ముడుపోయిన ప్రజ. కొందరు యజమానుల దగ్గిర భూములు కౌలుకు తీసుకొని వ్యవసాయం చేసుకుంటారు. ఈ పద్ధతి యజమానులకు అభ్యంతరం ఉండదు ఎందుకంటే వ్యవసాయానికి కావలసిన పెట్టుబడి డబ్బు వీళ్ళ దగ్గరుండదని తెలుసు! అప్పులకోసం తిరిగి యజమానుల దగ్గరికే చేరతారనీ తెలుసు! అప్పు తీసుకున్నారా, వాళ్ళని ఉచ్చులో కట్టిపడేశారన్నమాటే. అప్పుమీద వడ్డీ తీర్చడానికే కౌలు వాటా కాస్తా పోతుంది. ఆపైన ప్రాణాలు నిలబెట్టుకోడానికి పట్టెడు అన్నం సంపాదించుకోడానికి

పాలేరు పనిచేయడం మేలు! ఈ ఊడిగం ఇలా ఉండగా భూస్వామ్య సంస్కృతి' పాలేర్ల సంసారాలను కూడా ఎలా చెడగొడుతుందో, స్త్రీలపై అత్యాచారాలకు ఎలా దిగజారుతుందో శ్వేతాదేవి ఈనవలలో అడుగడుగునా ఎండగట్టింది! ఈ నవలలోని ఒక మేదినీ సింగ్, ఒక గణేశ్, ఒక బరకందాజ్, ఒక రామ్‌రూప్ (పాత్రలు) భూస్వామ్య సంస్కృతికి ప్రతినిధులైతే, ఆ వ్యవస్థ రథచక్రాల కింద నలిగిపోయిన తాడితులకు, పీడితులకు ప్రతినిధులు ఒక గులాల్, ఒక గంగ, ఒక లచ్చిమా, ఒక మెహర్, ఒక హరువా, ఒక మోరీ, రుక్మని, పుల్హా, లఖ్పతియా! ఊరు ఆడపడుచుల బతుకులు, ఆలుబిడ్డల ప్రాణాలు ఎన్ని చట్టాలున్నా భూకామందులకు అప్పడాలూ, నైవేద్యాలూ! ఆస్తికీ వాళ్ళ భోగభాగ్యాలకు లంకె. సంస్కృతికి నిదర్శనం కట్టూ, బొట్టూ, కంటి కడియం జుమికీ కావనీ, మానవుల అంతరంగం ప్రధానమనీ చాటుతుంది శ్వేతాదేవి. కామందులు పేదసాదల భూములులాగేసుకున్నారు, గుడిసెలు కాజేశారు, స్థలాలు ఆక్రమించుకున్నారు, తమ మాట వినకపోతే గుడిసెలు కాల్చారు, గూడేలకు గూడేలనే కూల్చారు. ఆ ఆదివాసులు ఎక్కడ బతుకుతున్నారుమరి? అటవీశాఖవారి భూముల్లో. ఆదివాసుల భూములకు అగ్రవర్ణస్థులు ఎగబాకడంవల్లనే సాంఘికంగా, ఆర్థికంగా దుర్బలులైన 'అంత్యవర్ణస్థులు' అడవుల పాలుకావలసి వచ్చిందని - ఈనవల పిండితార్థం.ఈపరిస్థితుల్లో ఈ పీడితులు ఎందుకు ఉద్యమిస్తారో, మరెందుకు విప్లవిస్తారో, ఎందుకు తిరగబడతారో శ్వేతాదేవి నీళ్లు నమలకుండా, కాళ్ళు తడబడకుండా చెప్పింది. పాతిక సేర్ల గోధుమలిచ్చి, నలభై ఏళ్ళ గొడ్డుచాకిరీ చేయించుకోడం - ఇదే భూస్వామ్య సంస్కృతికి వెన్నతో పెట్టిన విద్య. మరి ఈ గుట్టు ఎప్పుడు రట్టవుతుంది? ప్రచారం ద్వారా ఇన్ని బాధల మధ్యనే 'అలగాజనానికి' ఒక జన్మహక్కు సంక్రమించిందంటుంది శ్వేతాదేవి : కులప్రాబల్యం రాజ్యాధికారం చేస్తున్న ఈ దేశంలో మనుషులుగా బతకడానికి కూడా ఆస్కారం లేకుండా, స్వేచ్ఛా స్వాంత్ర్యాలు పోగొట్టుకుని వంచితులైన పీడిత ప్రజల ప్రచార పాటవాలకు కథావస్తువులన్నీ దోపిడీ సమాజమే అందజేస్తుందంటుంది శ్వేతాదేవి. ఈ హక్కును మిగిల్చిపోయినదెవరో తెలియదంటుంది! బతుకు బరువైన వేళా, కన్నీరు చెరువైన వేళా బాధితులలో చైతన్యం వెల్లివిరిస్తుంది. దళిత జాతుల్లోని ఈ ఇంటింటి గాథను, భూములు, కొళ్ళు అన్నీ బాకీలకి దఖలు పడి ఫకీరులై పోతున్న గాథను ఈ రోజుకీ మనం చూడొచ్చు: ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్ - కేరళల్లో ఆదివాసుల జీవనానికి అడ్డుతగులుతూ వచ్చిన స్థానిక భూస్వామ్య శక్తుల ధార్ష్టికం గిరిజనోద్యమాలవల్ల

కొంత కట్టుబడినా, గిరిజన భూములను చట్టవిరుద్ధంగా ఆక్రమించుకొన్న మైదాన ప్రాంతాల (సెటిలర్స్) భూస్వాముల పెత్తనం కొత్తగా తలెత్తింది. ఇటీవల తీసిన లెక్కల ప్రకారం 2,000 మంది గిరిజన స్త్రీలు గిరిజనేతర భూస్వాముల ఆగడాలకు, రకరకాల మోసాలకు గురయ్యారు! గిరిజన ప్రాంత భూముల క్రయవిక్రయాలను నియంత్రించే బదలాయింపు రెగ్యులేషన్ ఉన్నా, 'వన్ ఆఫ్ సెవెంటీ' రెగ్యులేషన్ ఉన్నా, హేమెండార్ఫ్ నివేదికలున్నా ఈ దోపిడీ యథేచ్ఛగా సాగిపోతూనే ఉంది. గిరిజన భూములకు చెందిన అరవైవేల కేసుల్లో గిరిజనులకు అనుకూలంగా పరిష్కారమైన కేసులు ఇరవై వేలు కూడా లేవు! ఇది ఇలా ఉండగా, యువతరం డబ్బూ, హోదా భోగభాగ్యాలు ఇచ్చే విలువల్ని కాస్తా నిరాకరించి ఆగ్రహావేశులై ఎందుకు అడ్డదారులు తొక్కుతున్నారో, ఎందుకిలా మారవలసి వచ్చిందో తెలియక సతమతమవుతున్న తల్లుల చరిత్ర శ్వేతాదేవి 'ఒకతల్లి' కథ! పారుపోని పదాలతో, అద్భుతమైన సంభాషణా చతురిమతో కథాచిత్రణ చేయగలిగిన దిట్ట శ్వేతాదేవి. వాక్యవిన్యాసంలో, కథా సంవిధానంలో ప్రసిద్ధ రచయిత జోన్ డిడియన్ లాంటిది శ్వేతాదేవి. హెమింగ్వే రాసిన 'ఫేర్ వెల్ టు ఆర్మ్స్' నవల తన వాక్య నిర్మాణాన్ని సునిశితం చేసిన రచన అంటుంది డిడియన్. సూటిదనమేగాని, మార్మిక రచన తన లక్ష్యం కాదంటుంది. అలాగే శ్వేతాదేవి రచన కూడా (**"They are perfect sentences, very direct sentences, smooth rivers, clear water over granite, no sinkholes"**). జీవితం ఊట కాదు, అదొక జల, మహత్తర శక్తి. ఆ శక్తినుంచి పుట్టుకొచ్చేదే సృజన శక్తి. ఈ శక్తి రచనకూ, కళాఖండానికీ ప్రాణం, మహాప్రాణం. రచయితలో నిద్రాణమై ఉండే ఈ శక్తికి జనశక్తితో చేతులు కలిపినప్పుడే సార్థక్యం!

*(ఆదివారం 5, జనవరి 1997)*

# భావరసకోటి బాలల ఛాయాచిత్ర పేటి!

పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది, మనస్సు తట్టగానే, చిత్రిక పట్టగానే వింత సోయగాలు పోతుంది; రంగుల హరివిల్లుగా, మనోవల్లరిగా కళ్ళముందు పరచుకుంటుంది! ఇటీవల ముంబై కార్యరంగంగా అంతర్జాతీయ స్థాయిలో ముక్కుపచ్చలారని బాల బాలికలు ఛాయాగ్రాహకులుగా పలువురి కళ్ళలో పడ్డారు. కమనీయ కాంతులు వెదజల్లిన దృశ్యాలను వాళ్ళ కెమెరా కళ్ళు బట్వాడా చేశాయి! మాలిన్యంలేని మనస్సులు మన్వంతరాలను జయిస్తాయి; చిలిపి కళ్ళు చిద్విలాసాలు చూపిస్తాయి. 16వ శతాబ్దం నాటి సెయింట్ ఫ్రాన్సిస్ జేవియర్ అన్నాడు: ''పిల్లల్ని ఏడేళ్ళు వచ్చేదాకా నా దగ్గర ఉంచండి, ఆ తరవాత తీసుకెళ్ళి చూడండి వాళ్ళ ఉచ్ఛస్థితి''! అలాగే జాన్ వాట్సన్ అనే విద్యావేత్త కూడా చిన్నారి పొన్నారుల మనస్సులను ఎలా మార్దవంగా మలచవచ్చునో చెప్పాడు: ''ఆరోగ్యవంతులైన అరడజనుమంది చిన్నారుల పోషణ బాధ్యతను నాకప్పగించండి. వాళ్ళలో ప్రతి ఒక్కడినీ మీకు నచ్చే, మీరు మెచ్చే బిడ్డగా తీర్చిదిద్ది అప్పగిస్తానని గ్యారంటీ ఇస్తా'' అన్నాడు! అలాంటి ప్రయోగాన్ని ఇటీవల కాలంలో ''గెట్టీ కన్సర్వేషన్ ఇన్స్టిట్యూట్'' అనే సంస్థ 12-18 సంవత్సరాల మధ్య వయస్సులో ఉన్న బాలబాలికలకు ఫోటోగ్రఫీలో పోటీలు నిర్వహించి ఒక ఎగ్జిబిషన్ (జనవరి 1997) ఏర్పాటుచేసింది. పిల్లలలో ఈ విద్యపట్ల ఆసక్తిని, అనురక్తిని కలిగించడం కోసం, వారిలో నిద్రాణమై ఉన్న కళను పోషించి ప్రోత్సహించడం కోసం, దృశ్యకళలనూ, మానవ సంస్కృతినీ వ్యాప్తి చేయడం కోసం లాస్ ఏంజెల్స్ (అమెరికా) కేంద్రంగా లాభాలతో నిమిత్తంలేని సేవాసంస్థ ''జె.పాల్‌జెట్టీ ట్రస్ట్'' పేరిట ఒక సంస్థ వెలసింది. దీని ఆధ్వర్యంలోనే ముంబై కేంద్రంగా ఉన్న జెట్టీ ఇన్స్టిట్యూట్ బాల గంధర్వుల్లా బాల ఛాయాగ్రహకుల తరాన్ని ప్రోత్సహిస్తోంది. జనజీవిత దృశ్యాల్ని, వారి సుఖదుఃఖాలను, వారి జీవన శైలిని కెమెరా కళ్ళలో బంధించి ఈ తరానికీ, భావి తరాలకూ ప్రపంచ సంస్కృతీ వారసత్వంలో భాగంగా ఒక నవ్యతరానికి చిహ్నంగా, కొండగుర్తుగా ''ముంబై దృశ్యాదృశ్యాల''తో ఓ సావనీర్‌ను ప్రకటించారు దాని పేరే ''పిక్చర్ ముంబై- లాండ్‌మార్క్స్ ఆఫ్ ఎ జెనరేషన్''

భావరసకోటి బాలల ఛాయాచిత్ర పేటి!

ఇది వివిధ వృత్తులకూ, వ్యాపకాలకూ చెందిన కుటుంబాలలోని తొమ్మిదిమంది ఔత్సాహిక బాలబాలికల ఛాయా చిత్రదర్శిని. ఇప్పుడిప్పుడే ఎదిగివస్తున్న ఈ నవతరంలో కొన్ని వందలమందికి ఇంటర్వ్యూలు నిర్వహించి నవనీతంలా తొమ్మండుగురిని ఛాయా గ్రాహకులుగా పోటీలలో ఎంపిక చేశారు. లోకాల యువ్వనపు కాంతులన్నీ కలిసి వసంతం అయిందన్నాడు బాపిరాజు. ఆ కాంతులే ఛాయా గ్రహణంలో కూడా ప్రతిబింబాలు చూసుకున్నాయి! ఈ చిన్నారులకు చెప్పిన వస్తువు 'ముంబై'లోని నాలుగు దిక్కులలోని ప్రజాజీవనం, పరిసరాలూ. విభిన్న కోణాల నుంచి వారు జీవితాన్ని కెమెరాలో బంధించారు. ఈ చిన్నారులకు, ఈ కొత్త తరానికి ఛాయాగ్రహణ విద్యలో ఎంపిక చేసుకున్న కొండ గుర్తులేవి? అసలు ఆ గుర్తులకు మూలమేది? ఏదైనా కావచ్చు- ఓ విగ్రహం కావచ్చు, ఓ శిల్పం కావచ్చు; కొందరికి గుర్తు కొండ అయితే, వేరొకరికి కాకతీయ ''తోరణం'' కావచ్చు, ఇంకొకరికి గేట్ వే ఆఫ్ ఇండియా కావచ్చు, మరొకరికి చార్మినార్, ఇతరులకు బెజవాడ ప్రకాశం బరాజ్, విశాఖ డాల్ఫిన్స్ నోస్ కావచ్చు, లేదా లేపాక్షి బసవయ్యో, కోస్తాలో వరికోతలో కావచ్చు! భావ చిత్రాలు ఛాయాగ్రాహకుడి ఇష్టానిష్టాలను బట్టి ఏర్పడుతూ ఉంటాయి. ఊహాపోహలు, పరిశీలన, కెమెరా నిర్వహణలో పొందిక, వస్తు నిర్దేశం, అన్నింటికీ మించి రసదృష్టి- కళాకారుల్ని తీర్చిదిద్దుతాయి. నగర జీవితంలో మీకు తోచిన ఆసక్తికరమైన దృశ్యాన్నిగానీ, ప్రజల జీవితాన్నిగానీ, వారి వ్యాపకాలనుగానీ- వస్తువుగా స్వీకరించి ఫోటోలు తీయమని ఈ చిన్నారులను ఆదేశించి జన సముద్రంలోకి వదిలిపెట్టారు. ఆత్మవిశ్వాసం, కళాత్మక ప్రతిభ, రసదృష్టి ఉన్న పిల్లలను విభిన్న సాంఘిక ఆర్థిక, భౌగోళిక పూర్వరంగాలనుంచి నిర్వాహకులు ఎంపిక చేశారు. వాళ్ళకి కెమెరాలు, ఫిల్ములు ఇచ్చారు. కెమెరాను ఎలా లోడ్ చేయాలో, ఎలా హోల్డ్ చేయాలో ఎలా వాడాలో శిక్షణ ఇచ్చారు. ముగ్గురు పెద్దల ఆధ్వర్యంలో నగరం నాలుగు దిక్కులకూ ఈ చిన్నారులు తమ కెమెరాలతో దూసుకుపోయారు! వాళ్ళు కెమెరాలలో బంధించి తెచ్చిన దృశ్యాలే ఈ సావనీర్. ఇందులో ఈ బాల ఛాయాగ్రాహకులు ఎంతగానో స్వతంత్ర పోకడలు పోయారు చేయి తిరిగిన ఫొటోగ్రాఫర్లకు ఏమాత్రం తీసిపోని చిత్రాలను తీసి సావనీర్‌ను రసమయం చేశారు ఇక్కడ వయస్సు ప్రధానం కాదు, మనస్సు, శిక్షణ. చరిత్రలో చాంపోలియన్ (16వ శతాబ్దం) పదహారవ ఏటనే బహు భాషావేత్త అయ్యాడు. ఆ తరువాత ఈజిప్షియన్ చిత్రలిపిని విడమర్చి శబ్దార్థాలు లాగాడు. పాస్కల్, లెబ్నిజ్, గాస్‌లు బాల్యదశల్లోనే

గణితానికి చిక్కుముడులు విప్పారు. మొజార్ట్ మూడేళ్ళకే బాల గంధర్వుడయ్యాడు. ఇక్కడ మన బాలమురళీకృష్ణ తొమ్మిదేళ్ళకే ఆ స్థానం చేరుకున్నాడు. రష్యన్ చిత్రకారులైన కారల్ బ్రులోవ్,అలెగ్జాండర్ ఇవ్వనోవ్ తొమ్మిది- పదకొండేళ్ళకే రష్యన్ కళాపరిషత్ సభ్యులయ్యారు. ఎడిసన్ అతికౌమార దశలోనే తొలి డిస్కవరీలకు వైతాళికుడయ్యాడు! ఈ సంప్రదాయంలోనే ముంబై చిన్నారులు నగర వీధులకు ఎగబాకి అర్థవంతమైన, అందమైన ఫోటోలను భావ చిత్రాలుగా మలిచారు. సుఖదుఃఖాలలో మానవుని అనుభవాలకు నిలువుటద్దం పట్టేది ఫోటోగ్రఫీ కళ అని వీళ్ళు గ్రహించారు. రచయిత కలంతో రాస్తాడు, చిత్రకారుడు బొమ్మను కుంచెతో వేస్తాడు, ఛాయాగ్రాహకుడు కాంతినే కలంపోటుగా **(Writing with light)** మార్చుకుంటాడు! వస్తువుగానీ దృశ్యంగానీ రచయిత కన్ను కప్పినా, కెమెరా కన్ను కప్పలేవు! అందుకే ఛాయా చిత్రకళను ''నిజానికి నిలువుటద్దం ఫిల్మ్''**(Truth on film)** అన్నారు. లెన్స్‌లో సూర్యోదయ భావ కవితను బంధించగల కవి ఛాయాగ్రాహకుడని **(Lyric of a sunrise in his lens)** వర్ణించారు.

ఇలా 'లెన్స్'లో భావకవితా చిత్రాలు పొదిగిన చిన్నారులు దర్శించిన స్థలాలు, ప్రాంతాలు ఎన్నో; నారిమన్ పాయింట్, భులాభాయ్ దేశాయ్‌రోడ్డు, గ్లోరియా చర్చి, స్టాక్‌మార్కెట్, లాల్‌బాగ్ ఫ్లైవోవర్, ముంబై సమాచార్ మార్గ్ వగైరా ఎన్నో! అయితే ఈ సందర్భంగా చిన్నారుల ఈ ఛాయాగ్రాహక విజ్ఞాన యాత్రలో తమ కెమెరా కన్ను నగర జీవితానికే పరిమితమైనా, తమ అనుభవాలకు విశ్వజనీనతను సాధించుకోగలిగారు. ఎందుకంటే జీవన సమరంలోని ఎత్తుపల్లాలను వారు ఈ యాత్రలో చూడగలిగారు. తొమ్మండుగురు బాల ఛాయాగ్రాహకులు తమ దృశ్య 'కావ్యాల'కు సమకూర్చిన అక్షర వర్ణన కూడా మనలో ఆలోచనా తరంగాలు రెక్కవిడుతుంది.జీవితంలో జ్ఞాపకం ఉంచుకోదగిన కొండగుర్తులంటే ఏవిటో ఒక్కొక్కరూ చెప్పిన వివరణ మరపురానిదీ, మరవరానిదీ! అతీతమైన సంక్షోభం నుంచి పుట్టుకొచ్చే ఒక ఆకస్మిక పరిణామమే ఓ 'కొండగుర్తు' అని బాల ఛాయాగ్రహకురాలు నివేదితా మాగర్ అంటే, నాలుగు గోడల మధ్యనున్నది జీవితం కాదు,వాటి వెలుపలదే అసలు జీవితం అంటుంది అనితా బాలచంద్రన్; మా స్కూల్లో ఆటస్థలమే నాకు 'మైలురాయి' అనీ, పొట్టగడవడానికి నగరానికి వచ్చే పల్లెవాసుల వలస కూడా మరపురాని దృశ్యమేనని అసిర్ ముల్లా భావిస్తే, నగరం రణగొణ ధ్వనుల తంత్రీనాదమైనా, ప్రశాంతికి నోచుకొనే చిరుమూలలు కూడా నగరానికి శోభనిస్తాయంటాడు వినీత్ చౌహాన్! వలస పక్షులు పుట్టినచోటనే బందీలై

వలస వెళ్ళకపోతే వాటి జీవనం దుర్భరం. అలాగే మానవ సంస్కృతి బతికి బట్టకట్టాలంటే ఇతర సంస్కృతులను కూడా తనలో ఇముడ్చుకోవడం సహజమంటుంది యామినీ హూలీ. అసలు కొండ గుర్తుల కోసం ఈ వెతుకులాట దేనికి, ఈ తపన దేనికి - నగర జీవితాన్ని తీర్చిదిద్దేవాళ్ళు ప్రజలేఅయినపుడు? కాబట్టి ప్రజలే తన కొండ గుర్తు అంటాడు నికోల్ డిసోజా! ఫోటోగ్రఫీ కళను విశ్వజనీనం చేసినవాళ్ళు ఒకరా, ఇద్దరా? రసాయనవాదులూ, రసవాదులూ, కళాకారులూ, భౌతికవిజ్ఞాన శాస్త్రవేత్తలూ- అందరూ ఈ కళావిర్భావానికి తలో చేయి వేసినవాళ్ళే. హెన్రిక్ షుల్జ్, డాగరీ, హారీ ఫాక్స్, టాల్బోట్‌లాంటి వాళ్ళు ఓనమాలు నేర్చుకున్న ఈకళ నేటి చిన్నారులకు సహితం విద్యను, విజ్ఞానాన్ని సుకరం చేస్తున్న ఒజ్జబంతిగా ఉపయోగపడుతోంది. ఈ చిన్నారులలో ఎంతమంది రోజర్ ఫెంటస్‌లాంటి యుద్ధరంగ ఫోటోగ్రాఫర్లు ఉన్నారో, బ్రాడీ టిమోతీ సులివాన్, అలెగ్జాండర్‌లాంటి అంతర్యుద్ధ ఛాయాగ్రాహకులున్నారో ఎవరికెరుక? జీవితపు వెలుగునీడలను, అనితర సాధ్యమైన కోణాల మధ్య కెమెరాలో బంధించి చూసే రఘురాయ్‌లాంటి ఫోటోగ్రాఫర్లు వీరిలో ఎందరున్నారో! రోజుకో తీరున ఆధునిక సాంకేతిక పరిజ్ఞాన పరిధులు విస్తరిస్తున్న కొద్దీ కెమెరాలే కాదు, వాటిని వినియోగించే టెక్నిక్కూ మారుతున్నాయి. ఎలక్ట్రిక్ ఫ్లాష్, ఆల్ట్రా ఫాస్ట్ లెన్స్‌లేగాదు, కొత్తరకం ఎడాప్టర్లు, అత్యాధునికమైన కలర్ ప్రొసెసర్‌లు, డిజిటల్, లాప్‌టాప్ కంప్యూటర్-కమ్- ఫోటోగ్రాఫ్ సౌకర్యం అమరిన పనిముట్లూ విస్తారంగా అందుబాటులోకి వస్తున్నాయి. చరిత్రను లిఖించేదీ, భద్రపరిచేదీ ఒక్క రచనేకాదు, దానికి తోడునీడగా వార్తకు విలువ తెచ్చే ఛాయాచిత్రం కూడా!

*(ఆదివారం 16, ఫిబ్రవరి 1997)*

# కళింగాంధ్రలో 'కారా' కథానిలయం!

మనిషికో వ్యాపకం. కళా, సాహిత్యాలలోని శాఖోపశాఖలన్నింటి పరమార్థం- మానవుడి ఉద్ధరణ. ప్రపంచంలోని సమస్త జీవరాశి నిరంతరం చలనంలోనే ఉందని చాటేది శివతాండవం! ఈ చలన దశకు రూపు, రంగు, రుచి కల్పించేవాడు మానవుడు. అతడి చేష్టితాలకు అక్షర రూపమిచ్చేవాడూ మానవుడే. ప్రపంచ రంగస్థలంపై మన జీవితాన్ని మనకే చూపే దృశ్య కావ్యం నాటకం. అయితే ప్రశాంతంగా భావ విప్లవానికి దోహదం చేసేదీ సామాజిక స్పృహను కల్పించగలదీ శ్రవ్య కావ్యం కథ! తెలుగు కథా సాహితికి ఎన్నో భూషలు సమకూర్చిపెట్టిన కొడవటిగంటి కుటుంబరావు ఎందుకనో ఓ సందర్భంలో ''ఒక రచయిత రాసిన కొన్ని కథలు అతనికి కీర్తి తేవచ్చునేమోకాని సంఘాన్ని చెప్పుకోదగ్గట్లు మార్చలేవు'' అన్నారు. నిజానికి కొ.కు.మాట అర్ధసత్యమే అయినా, సాంఘికంగా పెనుమార్పులకు దోహదపడే భావ విప్లవానికి తోడునీడై, చంద్రునికో నూలుపోగులా సహకరించే సాహిత్య ప్రక్రియలలో ఒకటి కథ/ కథానిక అని చెప్పితీరాలి. అదే నిజం కాకపోతే సంఘ సంస్కరణోద్యమం తెలుగునాట మహోధృతంగా సాగుతున్న 19వ శతాబ్దం ఆఖరిపాదంలో 20వ శతాబ్దం తొలిదశకంలో తెలుగు కథకు ''దిద్దుబాటు'' ద్వారా అంకురార్పణ చేసిన మహాకవి గురజాడకు ఈరోజున అంత ప్రాధాన్యం ఇవ్వవలసిన అవసరం వచ్చేదికాదు. తెలుగు సాహిత్యంలో ఆధునిక తెలుగు కథకు అంకురార్పణ జరిగిన ప్రాంతం కళింగాంధ్రం. ఆ ఉత్తరాంధ్రలోనే మరో సంతోషకరమైన పరిణామానికి శనివారంనాడు (22వ) నాందీ వాచకం పలికిన ఘటన- తెలుగు 'కథా'గమనాన్ని దిద్దితీర్చిన గురజాడకు అడుగుజాడగా శ్రీకాకుళ సాహితి ఆధ్వర్యంలో శ్రీకాకుళంలో వెలసిన తెలుగుల ''కథానిలయం''. తెలుగునాట ఒక సాహిత్య ప్రక్రియను ఇబ్బడిముబ్బడిగా సమర్థించడం కోసం దానికి ఒక 'గూడు' ఏర్పరచాలన్న ఆలోచన, తపన గొప్పది. దీనికి యజ్ఞకర్త, ''యజ్ఞం'' రచయిత సుప్రసిద్ధ కథా రచయిత కాళీపట్నం రామారావు (కారా). వివిధస్థాయిల్లో అవార్డుల రూపంలో తనకు వచ్చిన పారితోషికాలతో ఈ పరిశోధన గ్రంథాలయ నిర్మాణం తలపెట్టాడు

'కారా'. అందుకు యావదాంధ్ర సాహితీపరుల నుంచి, సంస్కృతీపరుల నుంచి సాహిత్య పిపాసుల నుంచి విరాళాలు ఆశిస్తూ మిగిలిన లోటును పూడ్చమని దాతలకు, కథావిధాతలకూ చేసిన విన్నపాన్ని గౌరవించడం మనందరి విధి. ఎందుకంటే ఒక ప్రక్రియకు వేరు సదనం ఏర్పడడం అన్నది తెలుగుదేశంలోనే కాదు, భారతదేశంలోగాని, విశ్వసాహిత్య వీధుల్లోగాని ఉన్నట్టు కచ్చితమైన దాఖలాలు లేవు! కలకత్తాలో ఎక్కడో 'కథానికుంజ్' పేరిట ఒక ఇల్లు ఉందని చెబుతారు గాని, బహుశా అది వ్యక్తులు మమకారంతో కట్టుకున్న సొంత ఇంటికి పెట్టుకున్న రచయిత ముద్దు పేరై ఉండాలి! రాచకొండ విశ్వనాథ శాస్త్రి 'ఇల్లు''కు ఇచ్చిన రెండు నిర్వచనాలలో ఒకటి కొందరి దృష్టిలో ఇల్లు ఉండడానికే అయితే, మరికొందరి దృష్టిలో ఇల్లు కేవలం ఆస్తిగా మలచుకోడానికి! కాని 'కారా' ఛాయిస్ మొదటిదానికేగాని రెండో దానికి కాదు! కథా చక్రవర్తితోపాటు పెరుగుతూండే జ్ఞానాలయం కారా ''కథానిలయం'' కావడం ఇక్కడి విశేషం. అది యావదాంధ్ర కథకుల విశేష పరిశోధనాలయంగా, లక్షకు పైబడిన కథల కాణాచిగా వర్ధిల్లబోతోంది. కథా చరితల శోధకులకు, పరిశోధకులకూ అది జ్ఞానతృష్ణ తీర్చిపెట్టే గంగోత్రి కాబోతోంది. అంటే, తనకు అందిన పారితోషికాలతో ఇంతవరకూ అందివచ్చిన తెలుగు కథాసరిత్సాగరం సరిహద్దులను పరిశోధనా జిజ్ఞాసను ''కథానిలయం'' ద్వారా పరివ్యాప్తం చేయబోతున్నారు. 'కారా'ది కేవల జ్ఞానపీఠం కాదు, తన ఎదుగుదలకు సహకరించిన సమాజానికి రుణం తీర్చుకోవాలనుకుని సామాన్య ప్రజల గుండెలోతుల్ని శోధించుతూవున్న జనపీఠం. ఒక్కముక్కలో 'కథానిలయా'న్ని ప్రజల పరం చేయడమే ప్రారంభ సంరంభం లక్ష్యం. ఆధునిక తెలుగు కథకు నేటికి ఎనభై ఏడేళ్ళ వయస్సు. ఇక పదమూడేళ్లలోనే (2010 నాటికి) శతాబ్ది ఉత్సవాలు నిర్వహించుకొంటుంది! తెలుగు కథ ఆరు పూవులూ పన్నెండు కాయలుగా వర్ధిల్లుతూ వచ్చిన తీరు రసవత్తరం; సువ్యాప్తమైన సాహితీ ప్రక్రియగా, సుసంపన్నమైన కథగా అది ఎంతమంది వర్ధిష్ణు రచయితల చేతులలోనో, మరెంతమంది ప్రసిద్ధుల శిల్ప చాతుర్యంవల్లనో వింత సోయగాలు పోయింది. తెలుగుల సాంస్కృతిక పునరుజ్జీవనంలో నవోదయ కర్తగా భాసిల్లిన గురజాడ ప్రారంభించిన భావ విప్లవ రథానికి రెండు చక్రాలు- సంఘ సంస్కరణ, భాషా సంస్కరణ అదే ఆనాటికి నిర్దేశమైన సాహితీ నిబద్ధత; స్త్రీల కన్నీటి గాథలకు హేతువు కనిపెట్టి వారికి వకాల్తా వహించిన గురజాడ మతమౌఢ్యాన్ని కూడా చీల్చి చెండాడిన ఉద్యమశీలి. గురజాడతో తెలుగు కథ ఎత్తుబడే మారిపోయింది. పైశాచీ భాషలో గుణాఢ్యుడు

రాసిన 'బృహత్కథ' ఆ తరువాతి రచయితలైన దండ్యాచార్య, క్షేమేంద్ర ప్రభృతులను ఎలా ప్రభావితం చేసిందో అలాగే గురజాడ కథలు ఆయని తరువాతి తెలుగు కథకులను శాసించుతూ వచ్చాయి. సుమారు తొమ్మిది దశాబ్దాల నాటి గురజాడ భావాలతో పోల్చుకున్నప్పుడు నేటితరంలో చాలామంది యువకులు ఇంకా 'తాతగారి నాన్నగారి భావాలకు దాసులు'గా మనోవికాసంలో ముసలివాళ్ళుగానే గడుపుతున్నారని చెప్పాలి! గురజాడ తరువాత ముప్పయ్యేళ్ళకు స్త్రీవిమోచన సాధకుడుగా, సాంఘిక తిరుగుబాటు బావుటా ఎత్తిన వాడు చలం. కొ.కు. మాటల్లో చెప్పాలంటే ''తెలుగు కథారచన చరిత్రలో ఒక బ్రహ్మాండమైన ఉప్పెన చలం. ఆయన కథా రచన చరిత్రలో తెచ్చిన మార్పు అపారం. అంతవరకూ అమాయకంగా ఉన్న తెలుగు కథ చలం చేతిలో పడి గడుసు తేలింది. సహజంగానే చలం యుగం ఏర్పడింది''. చలం కలం నుంచి జాలువారిన ''ఓ పువ్వు పూసింది'' కథ స్త్రీవాద సాహిత్యం పెరుగుదలకు బీజాలు నాటింది. ఇది ఇలా వుండగా తెలంగాణాలో ఆంధ్రోద్యమ నాయకుడు మాడపాటి హనుమంతరావు కేవలం హిందీ కథల అనువాదాలతోనే తృప్తిపడక స్వయంగా ప్రసిద్ధమైన ''మల్లికాగుచ్ఛము'' కథా సంపుటం ప్రకటించారు. సురవరం వారి ''సంఘం పంతులు'' గొప్ప కథ. ఆనాటి పోలీసు వ్యవస్థపైన వ్యంగ్య వైభవంతో ఆయన చురకలంటించారు! అలాగే రాయలసీమ కథా జగత్తును ఏలిన వై.సి.వి.రెడ్డి, మధురాంతకం రాజారాం, పులికంటి కృష్ణారెడ్డి, నామిని సుబ్రహ్మణ్యంనాయుడు, పి.రామకృష్ణారెడ్డి, కేతు విశ్వనాథరెడ్డిలాంటి ప్రసిద్ధులున్నారు.

ఆధునిక కథకు ఆద్యుడైన గురజాడ ప్రాచ్య, పాశ్చాత్య సాహితీ రీతిలో తెలుగు కథకు స్వేచ్ఛా వాయువులనుకూడా దించాడు; కొత్త రుచులు నేర్పాడు. ఆ ఊపులో తమ కథలకు రూపుదిద్దుకున్నవారు ఒకరా ఇద్దరా, ఎందరెందరో, చిలుకూరి, చింతాదీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి,మల్లాది రామకృష్ణశాస్త్రి, విశ్వనాథ, అడవి బాపిరాజు, కొడవటిగంటి, సుదర్శనం,గోపీచంద్, బుచ్చిబాబు, పాలగుమ్మి, చాసో, మాగోఖలే తెలుగు కథను శిఖరాయమానం చేశారు. మళ్ళీ వీరిలో ఒక్కొక్కరూ, కథా సంవిధానంలో, శైలిలో, శిల్పంలో, వైచిత్రిలో, పాత్రపోషణలో ఎవరికి వారే అనితర సాధ్యమైన పోకడలు పోయారు. మధ్యతరగతి మందహాసం వెనక చెప్పుకోలేని బాధలు, గాథలూ, బలహీనతలను, నీతికథలను, వైజ్ఞానిక కల్పనా కథలనూ, డిటెక్టివ్‌వ్యంగ్య రచనలనూ పుంఖానుపుంఖాలుగా అందించినవాడు కొడవటిగంటి కథను సామాజిక

సంస్కర్తగా దిద్దితీర్చిన కొలదిమందిలో ఆయనొకరు. రా.వి.శాస్త్రి విశ్వసాహితికి వన్నెలు చిన్నెలు కూర్చిన కథకుడు. అతని చేతిలో కథానిక కావ్యంగా, వచన కావ్యంగా, ప్రతిపద వ్యంగ్యంగా, రసనిష్యందంగా, సందేశంగా నిర్దేశం చేసింది. ఆధునిక కథ గురజాడ తర్వాత నాలుగు దశాబ్దాలకే నాలుగు చెరగులా మరింత నవ్యత సంతరించుకొని ప్రపంచ కథానికల పోటీలో (''గాలివాన, ''నీలి'') బహుమతులకు అర్హురాలయింది. రకరకాల ఆచారాలు డుల్లిపోతున్న యుగ సంధ్యలో కథానిక లక్ష్యాన్ని కొత్త పుంతలలో పదునుపెట్టిన వాడు గోపీచంద్ కాగా, బుచ్చిబాబు మనసత్త్వ విశ్లేషణా ప్రాధాన్యతతో దూసుకువచ్చినవాడు (''నన్ను గురించి కథ వ్రాయవూ?'')! పాలగుమ్మి నుంచి పాపినేనిదాకా, వేలూరి శివరామశాస్త్రి నుంచి విశ్వనాథ దాకా తెలుగు కథ క్రమంగా నాలుగంచులూ తీరి నిలిచింది. 'చాసో' కర్మ సిద్ధాంతాన్ని చీల్చి చెండాడిన వాడు; కాళీపట్నం రామారావు వ్యవస్థలోనే దాగివున్న తిరుగుబాటును ప్రశాంతంగా చూపించి, జ్ఞానబోధచేశాడు, మనిషిలోనే కాదు, రచనలో కూడా నిరాడంబరత వ్యక్తంచేసినా, అంతరంగంలోని కల్లోల తరంగాలను, బడబానలాన్నీ సామాన్యుడిపరంగా కళ్ళకు కట్టినవాడు (''యజ్ఞం'', ''చావు''). కరుణకుమార, 'మాగోఖలే'లు గ్రామీణ సమస్యలను, కూలినాలి జనం కష్టాలను, పల్లె జీవనంలోని నైర్మల్యాన్నీ చూపినవారు. మునిమాణిక్యం జీవితంలోని ఆనందమయ ఘట్టాలను దాంపత్య జీవితాన్ని 'కాంతా' సమ్మితంగా రసమయంచేశాడు. పురిపండా ''విశ్వకథావీధి''ని తెలుగువారి సందుగొందుల్లోకి దించాడు! 1960కి ముందు కాలం- మధ్యతరగతి సుఖదుఃఖాలపై తెలుగు కథ కేంద్రీకరించగా 1964 నుంచీ ''యజ్ఞం''. ఆవిష్కరణతో శ్రమజీవులకూ శ్రమ జీవన సౌందర్యానికీ కథ కొమ్ముకాసింది. టెక్నిక్ దృష్ట్యా పద్మరాజు ''గాలివాన'' గొప్పదైనా, కథా సంవిధానంలో, భావ వైచిత్రిలో ''యజ్ఞం'' ఎన్నో మెట్లపైన ఉంటుంది; 1985 నుంచీ తెలంగాణ కొత్తతరహా కథలకు కాణాచిగా మారింది. త్రిపుర వింతైన పదచిత్రాలతో, విచిత్రమైన ఉపమానాలతో నవ్యతవైపుగా కథను మలచుకొన్నాడు. స్వతంత్ర పోకడలు పోయిన కథకులలో ''శారద'', హితశ్రీ, విశ్వనాథరెడ్డి, వాకాటి పాండురంగారావు, శీలా వీర్రాజు, తిలక్ ,శ్రీపతి, మునిపల్లె రాజు వస్తారు. శ్రీశ్రీ కోనేటిరావు కథలు, చింతా ''వటీరావు'' కథలు మనస్సును పదును పెడతాయి. మల్లాది మరోవైపు నుంచి తనవి నీతికథలు కావు, 'జాతికథల'ని చాటుకున్నాడు! విద్వాంసులు కథకులు కాలేదన్న లోటును శివరామశాస్త్రి తీర్చాడు! 1985 తర్వాత ఉధృతస్థాయిలో దూసుకువచ్చిన రెండు ప్రత్యేక పాయలు స్త్రీవాద

సాహిత్యం, దళిత సాహిత్యం. స్త్రీవాద సాహిత్యంలో అందుకు ముందుతరానికి కనపర్తి వరలక్ష్మమ్మ, ఇల్లిందుల సరస్వతీదేవి, ఆచంట శారదాదేవిలాంటి వారు ప్రాతినిధ్యం వహించగా, కడచిన ముప్ఫయ్యేళ్ళుగా కొత్తతరాలకు రంగనాయకమ్మ, వాసిరెడ్డి సీతాదేవి, సులోచనారాణి, భానుమతి, అబ్బూరి ఛాయాదేవి, పి.సత్యవతి, కుప్పిలి పద్మ ప్రతినిధులుగా ఉన్నారు. బడుగువర్గాల కథాసాహితికి కొలకలూరి ఇనాక్, బి. ఎస్.రాములు, బోయ జంగయ్య, కాలువ మల్లయ్య, కె.వరలక్ష్మి ప్రతినిధులు. ఇలా అప్రతిహతంగా ప్రవహిస్తున్న కథాయాత్రకు సంకుచిత హద్దులు ఉండకూడదు. 'కారా' కథానిలయం సరిహద్దులు ఉత్తరాంధ్రకు పరిమితంకారాదు; రాజకీయులు ప్రవేశపెట్టిన ప్రాంతీయ విభేదాలను సాహితీ జగత్తు సహించరాదు, చెరిపివేయాలి. నదులనంటి ప్రభవిల్లిన మానవ నాగరికతకు ప్రాంతీయ దోషాలు పనికిరావు. ఆంధ్ర, తెలంగాణా, రాయలసీమల జానపదులకూ, వారి పద సాహితికీ, వారి యాసలకు, బాసలకూ ''కథానిలయం'' యథాస్థానం కావాలి!

*(ఆదివారం 23, ఫిబ్రవరి 1997)*

# ఆధునిక భారతానికి గీతామెహతా రేఖాచిత్రం!

''నాటికాలం మేటిదైతే
నేటి బాధలు తీరునా
ఆరిపోయిన దూరదీపం
కారుచీకటి మాపునా''

ఓ కవి కుమారుడు చెప్పిన ఈ మాటలకు అర్థం తెలుసుకున్నపుడు ఆధునిక భారతానికి సుప్రసిద్ధ రచయిత్రి గీతామెహతా వైకుంఠపాళీ ("Snakes and Ladders")తో రూపొందించిన రేఖాచిత్రం అర్థంకాకపోదు! ఇండియా, ఇంగ్లాండ్, అమెరికా- ఈ మూడు దేశాల మధ్య ఆశులో గొట్టంలా ఖండాంతరాలను చుట్టబెడుతూ తరచుగా తిరుగుతూండే గీతామెహతా ఆంగ్ల భాషలో సమున్నత స్థితికి ఎదిగి వస్తున్న మహిళా రచయితలలో ఒకరు. అమెరికన్, బ్రిటిష్, యూరోపియన్ టెలివిజన్ కంపెనీలకు అనేక డాక్యుమెంటరీ చిత్రాలకు రచయితగా, నిర్మాతగా, దర్శకురాలుగా వ్యవహరించింది. ఇండియాలోనూ, కేంబ్రిడ్జి యూనివర్శిటీలోనూ విద్యాధికురాలిగా గణుతికెక్కిన ఈ భారతీయ ఆడపడుచు సీమాంతరాలలో కూడా ప్రసిద్ధికెక్కిన రచయిత్రి. ఈమె కలం నుంచి జాలువారిన తాజా కథనం భారతదేశంలో వస్తున్న మార్పుల గురించి, భారతీయత గురించి పాశ్చాత్యులకు ఉద్దేశించి రాసింది. ఇంతకుముందు ఈమె భారత సాంఘిక, రాజకీయ రంగాలలో సాగుతున్న సంఘర్షణ గురించి, స్వరాజ్య సంపాదన కోసం భారతీయులు చెల్లించవలసి వచ్చిన మూల్యం గురించీ ''రాజ్'' పేరుతో ఓ గ్రంథం రాసింది. చారిత్రక సన్నివేశాలతో పడుగు పేకలా అల్లుకుపోగలిగిన కథన కౌశలంతో నడిపించిన ఈ నవలను విమర్శకులు అమెరికన్ స్వాతంత్ర్య సమరానికి దర్పణంగా పేరొందిన ''గాన్ విత్‌ది విండ్'' రచనతో పోల్చారు. కాగా గీతామెహతా మరి రెండు రచనలు ప్రాచ్య, పాశ్చాత్య సంస్కృతుల మధ్య వ్యత్యాసాలను, ఘర్షణలను చిత్రించిన ''కర్మాకోలా'', మానవునిలోని బలహీనతలను

విప్పిచెబుతూ, భారతీయ జీవనంలోని మంచిచెడులను సంప్రదాయ కథనా చాతుర్యంతో మలచిన నవల ''ఎ రివర్ సూత్రా''.కాగా గీత తాజా రచన 'వైకుంఠపాళీ' సంప్రదాయ భారతీయ జీవన రీతులనూ, విధానాన్నీ పరామర్శిస్తూ అందులోని మంచికి హారతి పడుతూనే నవభారతం ఆధునికం కావలసిన అవసరాన్నీ, అవకాశాలనూ వివరిస్తోంది. గీతామెహతాకు ఈ దర్శనం ఎలా సాధ్యమయిందని అనుమానించేవారికి- స్వాతంత్ర్య సమరంతో పెనవేసుకున్న ఆమె కుటుంబీకుల చరిత్రే సమాధానం. దేశ స్వాతంత్ర్య సమర దినాలలో జన్మించిన గీతకు ''జోన్ ఆఫ్ ఆర్క్'' అని ముత్తవ నామకరణం చేస్తే, ఆ పేరులో భారతీయత లోపించిందని చెప్పి మిగతా కుటుంబ సభ్యులు ''గీత'' (పాట) అని పేరుపెట్టారు! కనుకనే ఆవిడకు స్వాతంత్ర్య సమరంతో ప్రత్యక్ష సంబంధాలుండే అవకాశం లేకపోయినప్పటికీ ఆమె జీవితం ఉత్తరోత్తరా '' ఇంగువ కట్టిన గుడ్డ''గా భాసించక తప్పలేదు. అందువల్లనే ఆనాడు కాకపోయినా, ఈనాటికైనా 'స్వేచ్ఛాగానం' (Song of Freedom) వినిపింపజేస్తోంది గనుక ''గీత''గానే మనమధ్య మసలుతోందని చెప్పాలి! అంతేగాదు, గీత తల్లి నర్తకి, తండ్రి స్వాతంత్ర్య సమరయోధుడు. తన తండ్రికి జ్ఞాతుడైన వ్యక్తి చిటగాంగ్‌లోని బ్రిటిష్ ఆయుధాగారంపై దాడిచేసిన భారతీయ దళంలో ఒకడూ, స్వయానా కవీ. గాంధీజీ అహింసా పద్ధతి దేశానికి బ్రిటిష్ సామ్రాజ్యవాదుల నుంచి విమోచన సాధించలేకపోతోందని కుపితులైన ఆనాటి సమరశీల యువ జాతీయవాదులు కొందరు ఇండియన్ ఆర్మీలోని సానుభూతిపరులైన దేశభక్తి ప్రేరితులైన ఆఫీసర్ల నుంచి ఆయుధాలు సంపాదించారు. వారిలో ఒకరు గీత తండ్రి. అండమాన్ దీవుల్లో నేరస్తులకు శిక్షా కేంద్రమైన 'కాలాపానీ' పీనల్ కాలనీ (నల్లనీటి దీవి - Island of Black Water)కి భారతీయ దేశభక్తులెందరినో ఆనాడు తరలించారు బ్రిటిషువాళ్ళు. గీతామెహతా కుటుంబ చరిత్ర అంతటితో ఆగలేదు- నాటి జాతీయోద్యమం సెంటిమెంట్స్‌ను పట్టించుకోలేదు. దాపరికం లేకుండా లక్ష్యాన్ని ప్రకటించడం స్వాతంత్ర్య సమరం తొలి పాఠాలలో ఒకటి. భారతీయ సమాజంలోని అతి మౌఢ్య ధోరణులను పోనాడి, క్రమంగా సామాజిక స్పృహను పౌరులకు కల్పించి సంస్కరణాభిలాషను వారిలో పెంచి పోషించిన సమరం అది. మనసులో మాలిన్యం లేకుండా స్త్రీ పురుషులు కలివిడిగా తిరగడానికి తగిన వాతావరణాన్ని సృష్టించిన ఉద్యమం అది. ఆ బాటలో నడిచిన సరోజినీదేవి కులాల కట్టుబాట్లు తెంచడమేగాక, రాష్ట్ర సరిహద్దులను కూడా దాటి తెలుగు వాడిస పాణిగ్రహణ మాడిన ఘడియలవి

అదే బాటలో ముందుకు సాగిన గీత ముత్తవ తూర్పు భారతంలోని హైందవ కుటుంబంలో జన్మించినా ఉత్తర భారతంలోని ముస్లిమ్ జాతీయవాదిని వివాహమాడింది. ఇంతటి చారిత్రక, ఉత్తమ సామాజిక పూర్వరంగం ఉన్న కుటుంబం నుంచి వచ్చి నేడు అంతర్జాతీయ ఖ్యాతినందుకున్న గీతామెహతా వైకుంఠపాళీ రచన ఆధునిక భారతానికి సంప్రదాయ విలువల నుంచి తాత్వికార్థం కల్పిస్తున్న రచన. స్వాతంత్ర్యోద్యమం నాటి గౌరవాలు, విలువలు ఈరోజు మరుగునపడిపోతున్నందుకు ఆమె రోదిస్తోంది. దేశానికి స్వాతంత్ర్యం వచ్చి ఏభై ఏళ్ళు అయినా, సకల త్యాగాలూ చేసి స్వాతంత్ర్య పోరాటంలో అసువులు బాసిన అమరవీరుల పేర్లను చరిత్ర పుటల్లో కనపడకుండా చేస్తున్నందుకు గీత విలపిస్తోంది. ఇందిరాగాంధీని గుర్తుచేస్తూ ''మీకు స్వాతంత్ర్యం తెచ్చింది నా తండ్రే'' అన్నందుకూ, ఇండియా అంటే ఇందిర, ఇందిర అంటే ఇండియా అని కొందరు వందిమాగధులు నినాదాలిచ్చినందుకూ గీత ఈ రచనలో శరించింది. ఒకనాటి ధైర్యసాహసాలు తదనంతర దశలో కొడిగట్టిపోయినందుకు, వీరులు భీరువులైనందుకు, సాంఘిక రాజకీయాధికారాన్ని చేజిక్కించుకున్నవారికి జో హుకుం అంటున్నందుకూ ఆమె నిశితంగా విమర్శించవలసి వచ్చింది. ప్రజాస్వామ్యం పేరుతో కుటుంబ (వంశ) పాలనా వ్యవస్థ తలెత్తి అనర్థాలు కలిగించినందుకు రాజకీయుల్ని విమర్శించింది. పాలకులనుబట్టి పాలితులు కూడా ఎలా తయారవుతారో సోదాహరణంగా చెబుతూ గీత రానురాను ప్రచార సాధనాలపైన ప్రభుత్వ అజమాయిషీ కొంత తగ్గినా మారుతున్న విలువల్లో జనాలకు కూడా సిసలైన కళాకారులకు బదులు గ్లామర్ స్టార్స్ కావలసి వచ్చిందనీ, ప్రేక్షకులు కూడా ఇంత ఆలోచనకు చోటిచ్చేకన్నా సెన్సేషన్‌ను ప్రేమిస్తున్నారనీ నిరసన తెలిపింది. సజీవ దృశ్యానికి బదులు కృత్రిమ దృశ్యాలకు విలువ ఇస్తున్నారని, కృత్రిమ వరివంగడాలు మాదిరే కంట్రీ సంగీతం పోయి 'కంత్రీ' సంగీతానికి విలువ పెరుగుతున్నదనీ గీత బాధపడుతుంది (Young Indians are dancing to hybrid music)! జానపద శైలికి మారు భంగ్రా రాక్ మ్యూజిక్‌చోటు చేసుకుంది కళా రహస్యాలను గురించి ముచ్చటిస్తూ గీతామెహతా కళ (ఆర్ట్) అన్నది స్పందించలేని ప్రేక్షక లోకం ముందు చేయి తిరిగిన కళాకారుడు చేసే ప్రదర్శనగా భావించరాదనీ, కళాకారుడు ప్రేక్షకలోకం, ఇతివృత్తం, శిక్షణాయుతమైన స్వరసమ్మేళనం వగైరా సర్వ సంభారాలు సమకూర్చుకుని సమ్మోహింపజేసే రసరాజ్యడోలగా ఓ సమష్టి కళాసృష్టిగా (a moment of mutual creation)ఉండాలని అంటుంది ఇంతటి సమున్నత

స్థాయిలో ఈ సమష్టి కళాదర్శనం ఎలా సాధ్యం? ప్రత్యూష పవనాంకురాలకు స్వాగతం పలికే 'భైరవ రాగాన్ని' ఆమె తలచుకుంటుంది. తమసోమా జ్యోతిర్గమయ (చీకటి నుంచి వెలుగులోకి) అన్న ఉపనిషత్ వాక్యాన్ని ఆలాపిస్తుంది. పాశ్చాత్య లోకంలో ఇండియా పట్ల, దాని సమస్యల పట్ల ఉన్న అనాదరణను, వెకిలి ప్రచారాన్ని గీతామెహతా ఈ రచనలో తుత్తునియలు చేయడానికి ప్రయత్నించింది.

అయితే ఈ ఊపులో ఆమె అప్పుడపుడూ ఆర్థికాభివృద్ధి సూత్రాలకు, విధానాలకు సంబంధించి తిరిగి వరల్డ్ బ్యాంకు చిట్కాల పరిధిలోనే ఆలోచనలు చేస్తోంది! గ్లోబలైజేషన్ కళ్ళద్దాల నుంచి భారతీయ సమస్యలను ఆమె దర్శిస్తోంది. నవభారత నిర్మాతలలో ఒకరైన జవహర్‌లాల్ నెహ్రూ ప్రణాళికా విధానమే, ఆయన రూపొందించిన పారిశ్రామిక విధానమే భారతదేశ అనర్థాలకు ప్రధాన కారణమన్నట్టు చిత్రించడానికి గీత ప్రయత్నించింది. ఇందుకామె గాంధీని ఉదహరిస్తూ ''ఎప్పటికపుడు భారతదేశ సమస్యలను కనుగొనే ఏ పరిష్కారమైనా పదేళ్ళకు మించి మనగలగలేదు''న్న మాటను పట్టుకుని వేలాడుతోంది. అలా అని గీత మల్టీ నేషనల్స్ వల్ల వస్తున్న ప్రమాదాన్నీ తక్కువ అంచనా వేయదు. కాని పరిష్కార మార్గాల వద్దకు వచ్చేసరికి ఆమె ఆలోచనలు తేలిపోతున్నాయి. దేశ సమస్యలేమిటో ఆమెకు తెలుసు. ప్రపంచంలోని పది పారిశ్రామిక దేశాలలో ఇండియా ఒకటనీ తెలుసు. ఏడాదికి లక్షలాది సంఖ్యలో యూనివర్సిటీ పట్టభద్రులు ఉత్పత్తి అవుతున్నారనీ తెలుసు. ఇండియా రోదసి శకంలో ప్రవేశించి పురోగమిస్తోందనీ తెలుసు. ఆహార రంగంలో కొంత స్వయం సమృద్ధిసాధించామనీ తెలుసు. కానీ ఈ స్వయం సమృద్ధికీ, పెరుగుతున్న దారిద్ర్యానికీ మధ్య పొంతన లేదనీ, పెరుగుతున్న గ్రాడ్యుయేట్స్ సంఖ్యకు తులతూగగల ఉపాధి అవకాశాలులేవని కూడా ఆమెకు తెలుసు. అంతేగాదు, రోదసిలోకి ఉపగ్రహాలు ప్రయోగించినా నేలమీద రైతులకు ఎదురవుతున్న ఇరిగేషన్ వనరులు, విద్యుత్‌వనరుల కొరత గురించీ తెలుసు. అయితే భారతదేశానికి సమస్యలు ఎన్ని ఉన్నా- స్వాతంత్ర్య సముపార్జన వల్ల అందివచ్చిన స్వేచ్ఛ ప్రసాదించిన కొన్ని హక్కులు (రహస్య బ్యాలెట్, పత్రికా స్వాతంత్ర్యం, స్వతంత్ర న్యాయ వ్యవస్థ) మాత్రం చెక్కుచెదరనందుకు గీత సంతసిస్తుంది. మధ్యమధ్యలో దారిద్ర్యంపై చేస్తున్న ఆమె వ్యాఖ్యలు వ్యంగ్య వైభవంతో తులతూగుతున్నాయి ఒక కాగితం పరిశ్రమ యజమాని 'గార్బేజి'ని తొలగించేందుకు నియమించిన భిక్షగాళ్ళను గురించి ఆమె ప్రశ్నించినప్పుడు వీళ్ళు గుడ్డ పీలికలు

ఏరుకునేవాళ్ళులెమ్మంటాడు. అందుకు గీత నిరసన తెలిపినపుడు ఆ యజమాని పోనీ మీకాపేరు నచ్చకపోతే 'స్వయం ఉపాధిలో ఉన్నవాళ్ళు' అనుకోండి అంటాడు! ఒకాయన్ని ఆమె ''మీరు కాపిటలిస్టా, మార్క్సిస్టా'' అని అడిగితే అతను ''నేను టైపిస్టు''నని అన్నాడట! గీత దేశం నలుమూలలా చేసిన పర్యటనలో కలుసుకుని ప్రత్యాక్షానుభవంతో తెలుసుకున్న విషయాలు భవంతులలో నివసించేవారి గురించి కాదు. భారతదేశ దారిద్ర్య భారంలో సగానికి పైగా మోస్తున్న సామాన్యజీవులను, కష్టజీవులను, పసితనంలోనే పొట్టకూడన్నం కోసం బాల్యాన్ని కోల్పోతున్న చిన్నారులనూ కలుసుకుంది. వారి గోడు విన్నది. నిజమైన గ్రామీణ భారతం ఏమిటో తెలియజెప్పడానికి ప్రయత్నించింది. గ్రామాల నుంచి పట్టణాలకు పల్లెవాసులు వలస పోవడానికి కారణాలు కళ్ళారా చూసింది. సంపన్నుల భారతానికీ, ఆపన్నుల (పేదల) భారతానికీ మధ్య ఉన్న అంతరం తెలుసుకుంది. స్త్రీల కన్నీటి గాథలను విన్నది. భూమియాలు (తోవచూపేవాళ్ళు), రాజ్‌పుతానా స్త్రీలూ ఎందుకు భూములు విడిచిపోవలసి వచ్చిందో చెప్పింది. తోటీల (పారిశుద్ధ్య కార్మికుల) కడగండ్లు, బొస్తలు, కొండ తెగల ఇబ్బందులూ అర్థం చేసుకోడానికి ప్రయత్నించింది. కారుచౌక కూలీ ఇచ్చి సామాన్య కష్టజీవుల్ని పల్లెల్లోనూ, పట్టణాల్లోనూ వర్తకులు, కాంట్రాక్టర్లు ఎలా దోచుకుంటున్నదీ గీత రచనలో ఉంది. కొన్ని కాంట్రాక్టు పనులు ముగియగానే కూలీలను ప్రాంతంగాని ప్రాంతాలకు ఎలా వెట్టిచాకిరికి పంపించడం జరుగుతుందో చెప్పింది. ఈ సందర్భంగా గీత ''గరీబీ హటావో'' నినాదాన్ని గురించి ప్రస్తావిస్తూ ఒక కార్మికుడి అనుభవాన్ని ఉదాహరించింది. ఆ కార్మికుడి మాటల్లోనే: ''దారిద్ర్యం రూపుమాపేస్తామని, ఉద్యోగాలిస్తామని రాజకీయ వేత్తలు చెప్పారు. అది నమ్మి వారికి ఓటు వేశాం. కాని తీరాచూస్తే వాళ్ళు మమ్మల్ని కలుసుకోవడానికే ఇష్టపడ్డంలేదు. ఇళ్ళ నిర్మాణ పనుల్లో ఉంటూ అలాఅలా బతుకు సాగిస్తున్నాం. ఇటుకలు మోసుకుంటాం. కాంక్రీట్ కలుపుతుంటాం. పనికిరాక ఇతర్లు పారేసిన సామాగ్రితో గుడిసెలు వేసుకుని బతుకుతున్నాం. ఢిల్లీనగరం సుందరంగా ఉండాలని దేశ నాయకుల బోధ. ''దారిద్ర్యాన్ని రూపుమాపండి'' అన్న నినాదాన్ని కాస్తా మన పాలకులు ''పేదోళ్ళని నిర్మూలించండి'' అన్న నినాదంగా మార్చేశారు. నిజానికి పేదోళ్ళు అందంగా కనిపించరు. మేము నిర్మాణ పనుల్లో ఉన్నపుడు బుల్‌డోజర్లు పంపి మా గుడిసెలను నేలమట్టం చేశారు. అందులోని మా సామానంతా ధ్వంసం అయిపోయింది. మమ్మల్ని బస్సుల్లో ఎక్కించి, నగరానికి 30 మైళ్ళ అవతలకు తీసుకెళ్ళి విడిచారు. అక్కడ పనుల్లేవు,

నీళ్ళులేవు, తిండిలేదు. ఆ ఈదురు గాలుల్నుంచి మా పిల్లల్ని రక్షించుకునే దారి కూడా లేదు. ''ఎమర్జన్సీ కాలంలో జగ్‌మోహన్ రాజకీయుల అండతో చేసిన పనులు ఇవే.... ఇలా గీతామెహతా ఎన్నో అనుభవాలను ఇందులో పేర్కొంది. బురాక్రసీ గురించి, అవినీతి గురించీ ఎండగట్టింది. గీత ఇందులో మరో ముఖ్యమైన అంశాన్ని వెల్లడించింది- అక్షరాస్యత పెరగనిదే రాజకీయ చైతన్యం పెరగదు. ఈ రెండూ పెరగనిదే జనాభా నియంత్రణ సాధ్యపడదు. అంతేగాదు, ఇండియా ఒక జాతికాదనీ, బహుళ జాతుల వేదిక అనీ స్పష్టం చేసింది. అలాగే ఇండియాది ఏక నాగరికత కాదనీ, బహుళ జాతులతో దీపిస్తున్న భిన్న సంస్కృతుల సమ్మేళనం అనీ చెప్పింది. వివిధ జాతుల సంస్కృతులు విభిన్న ప్రగతి దశలలో ఉన్నాయనీ, వైరుధ్యాల మధ్యనే సహజీవనం నెరపుకుంటున్నాయనీ నమ్ముతుంది. ప్రపంచ దేశాలకే నాగరికత రుచులు చూపించిన ఒకనాటి సుందర భారతాన్ని మరింత ఆధునికం చేయవలసిన అవసరాన్ని నొక్కి చెప్పింది. మస్లిన్ మనది, కాలికో మనది, కలంకారీ అద్దకం మనది, సంపద మనది. వాటి సద్వినియోగం మన చేతిలో పని. ఇంతకూ అసలు కొసమెరుపు- దేశంలో నూతన ఆర్థిక సంస్కరణలకు అసలు ప్రేరణ పి.వి.నరసింహారావు కాదు, 1986లో ఇలాంటి చొరవకు ''తీర్థంకరులు''గా, పురోహితులుగా పనిచేసినవారు డాక్టర్ కిసింజర్, మదర్ థెరిసా, దలైలామా. ఈ విషయాన్ని గీతామెహతా ఇందులో నమోదు చేసింది! దూతలు ఎన్ని పనులైనా చేస్తారుగదా!

*(ఆదివారం 15, జూన్ 1997)*

# బౌద్ధిక సరిహద్దుల్ని విస్తరించిన మార్క్సిస్టు బలరాముడు!

**త**త్త్వవేత్తలు ఇంతవరకూ ప్రపంచానికీ, అది మానవులకు విసురుతున్న సవాళ్ళకూ భాష్యం చెబుతూ వచ్చారు. కాని ఇకనుంచి వారి కర్తవ్యం ప్రపంచాన్ని మార్చడం అన్నాడు కారల్ మార్క్స్. ఈ మార్పు ఏ పునాదిపైన రావాలి? సమకాలీన సాంఘిక ఆర్థిక పరిస్థితులు, వాటి పుట్టుపూర్వాల అన్వేషణ ఆధారంగా, చరిత్రగతిని, అది వదిలివెళ్ళిన అడుగుజాడలను పరిశీలించడం ద్వారా, కార్య కారణ సంబంధాలను తర్కించుకొని భావి జీవితానికి మంచి బాటలు తీయగల సునిశితమైన ఆలోచన ద్వారా, అధ్యయనం ద్వారా, పురోగమన శక్తులకూ, తిరోగమన శక్తులకూ పరస్పరం సాగుతున్న సంఘర్షణ కారణాలను విచారించి వివేచనతో పరిష్కార మార్గాలు వెతుక్కోవడానికి ప్రయత్నించడం ద్వారా - ఈ మార్పు సాధ్యం అని మార్క్సీయులు నమ్ముతారు. తెలుగునాట అలాంటి విశ్వాసంతో ఎదిగిన మేధావులలో, తాత్త్వికులలో, చరిత్ర పరిశోధకులలో ఒకరు- బుధవారంనాడు కన్నుమూసిన ఏటుకూరి బలరామమూర్తి. ఒకతరం తెలుగు యువకులలో సామాజిక స్పృహతో కూడిన చారిత్రిక, తాత్త్విక సంబంధమైన భావధారను సరళమైన రచనల ద్వారా ఎక్కించడానికి మేధస్సును కరిగించుకున్న వ్యక్తి ఏటుకూరి. ఈయన సాహిత్య, చారిత్రిక, తాత్త్విక సమస్యలపై పెక్కు వ్యాసాలు రాయడమేకాదు, యువతరానికీ, మార్క్సిస్టు కార్యకర్తలకూ అందుబాటులో ఉండేవిధంగా ఆంధ్రుల సంక్షిప్త చరిత్రను, భారతీయ తత్త్వశాస్త్ర విశేషాలనూ, అంత సులభంగా భారతదేశ చరిత్రనూ అందించిన మేధావి బౌద్ధ ధర్మంలోని గతితర్క విశేషాలను మార్క్సీయ దృక్కోణం నుంచి వివరించి చెప్పాడు. చరిత్రను, తత్త్వశాస్త్రాన్నీ సాంఘిక పరిస్థితులనుంచీ, ఆయా కాలాలలోని ఆర్థిక స్థితిగతులనుంచీ పరిశీలించకుండా కేవలం సాధారణ సంఘటనలుగా, యాదృచ్ఛిక సన్నివేశాలుగా పరిణామాలను ''రికార్డు''చేసిన గ్రంథకర్తలు మనకు చాలామంది

దొరుకుతారు. కాని అలాంటి ధోరణి చరిత్రాధ్యయనానికి సరిపోదు, తాత్త్విక పరమైన ఆలోచనాశక్తినీ పెంచదు. ప్రాచ్య, పాశ్చాత్య తాత్త్విక సంపదను తనదిగా భావించుకుని, 'తవ్వోడ'గా గ్రంథ సంచయంలోకి తలదూర్చి సత్యాసత్యాలను అన్వేషించి కొత్త వ్యాఖ్యానాలతో వెలికి తెచ్చిన అభినవాచార్యుడు బలరామమూర్తి. సామాజిక స్పృహతో తొలినాళ్ళలో తెలుగువారి చేతికి అందివచ్చిన ఏకైక చరిత్ర- సురవరం ప్రతాపరెడ్డి ''ఆంధ్రుల సాంఘిక చరిత్ర'', ఆ తరువాత చెప్పదగినది కంభంపాటి సీనియర్ సత్యనారాయణ ఆంగ్లరచన. ఆ తరువాత గణించదగిన కొలది గ్రంథాలలో ఒకటి ఏటుకూరి ''ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర''. విమర్శకు ఎంతగా జంకడో, చరిత్ర పరిశోధకుడికి అవశ్యమైన భోళాతనానికి కూడా ఈయన పెట్టిందిపేరు. అందుకే కపటంలేకుండా ఆంధ్రుల చరిత్రకు ఆముఖమ్ రాసుకుంటూ ''చారిత్రక సరిహద్దులను రాజవంశాలు నిర్ణయించే ప్రాచీన కాలం అది. కనుక ఆ పరిధిని ఈ గ్రంథం అధిగమించలేకపోయింద''ని సత్యప్రకటన చేయగలిగారు. ''తెగల స్థాయి నుంచి జాతిస్థాయికి, మతావేశ దశ నుండి భాషాసమైక్యతా దశకు పయనించి, ఫ్యూడల్ సామాజిక స్థితినుండి ఆధునిక యుగంలోకి అడుగుపెడుతున్న ఆంధ్రజాతి స్థూల చిత్రణ''కు అద్దం ఏటుకూరి ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర. ఇందులో ఆయన ఆంధ్రుల ప్రాచీనత నుంచి ఆధునిక యుగావిష్కారణ దాకా, శాతవాహన యుగం నుంచి సామ్రాజ్యవాద శకందాకా, విష్ణుకుండిన యుగం నుంచి విశాలాంధ్ర అవతరణవరకూ తేనెలొలుకు తెలుగులో తెనుగువారి కథ నడిపారు. క్రైస్తవ మత సిద్ధాంతాలలో, క్రీస్తు బోధలలో క్యూబా అధినేత ఫిడెల్ కాస్ట్రో మహా మహోపాధ్యాయుడని చాలామందికి తెలియకపోవచ్చు. కాని చారిత్రక విభాత సంధ్యలలో మానవకథవికాసాన్ని తెలియనివ్వకుండా ఎన్ని శక్తులు, ఎందరు ప్రభుకుమారులు, చారిత్రికులు అబద్ధాలాడారో చెబుతూ ఇలా అన్నాడు కాస్ట్రో: ''మనం అసత్యాలతో వియ్యం అందుకున్నాం, వాటిని భుజాన వేసుకుని తిరగవలసిన దుస్థితి మనకబ్బింది. బహుశా ఈ కారణంవల్లనే కావొచ్చు సత్యం చెవిన పడగానే యావత్ ప్రపంచమూ కలగుండు పడిపోతుంది, దిగ్భ్రాంతి వ్యక్తంచేస్తుంది''. అది కన్ఫ్యూసియనిజం కానివ్వండి టావోయిజం, షింటోయిజం, హిందూయిజం, క్రిస్టియానిటీ, బౌద్ధం, జైనం, జుడాయిజం, ఇస్లామ్- ఏదైనా కానివ్వండి, సర్వమతాల సారం మానవసేవే అయినప్పుడు, ఇన్ని వ్యత్యాసాలు ఎందుకు తలెత్తవలసి వచ్చిందన్న జిజ్ఞాస మనకు అవసరం. అలాంటి సత్యాన్వేషణను పాఠకులలో పురిగొల్పగల చేవ, చైతన్యం ఉన్న మేధావి ఏటుకూరి

బౌద్ధిక సరిహద్దుల్ని విస్తరించిన మార్క్సిస్టు బలరాముడు!

అలాగే బలరామమూర్తి ''మన చరిత్ర''లో ఆదిమ మానవుల నుంచి అర్ధభూనిస వ్యవస్థ వరకూ, సాంఘిక కల్లోలాల దశల నుంచి తాత్త్విక చింతన దాకా, సంస్కృతీ విస్తరణ నుంచి స్వాతంత్ర్య పోరాట దశల వరకూ వేగాతివేగంగానే సమీక్షించి క్రమబద్ధంగా చర్చించారు. అన్ని యుగాలను సమీక్షించుకుంటూ వచ్చి ఆధునిక యుగీన సత్యంగా సమతా ధర్మాన్ని ప్రబోధించారు. అయితే బౌద్ధమతం క్షీణదశకు కారణాలను అన్వేషించడంలో కొంత తొట్రుబాటు ప్రదర్శించారు ఏటుకూరి. బౌద్ధమతం సామ్రాజ్య విస్తరణలో ఉన్న అశోకుడి చేతి ఎత్తుబిడ్డ కావడంతో- బౌద్ధాన్ని సామ్రాజ్యతత్త్వ చిహ్నంగా నాటి ప్రజాబాహుళ్యం భావించడం సహజం. కాని, ఈ పరిణామమూ, శిథిల ధోరణులూ, స్వతంత్ర రాజ్య స్థాపనకు బౌద్ధం ఆటంకం కావటమూ, చేతబడులూ వగైరా పరిణామాలు బౌద్ధమత క్షీణదశకు కొన్ని కారణాలు కావచ్చు. కాని, ఇది అర్ధసత్యం. యజ్ఞయాగాదులపై, ప్రజాపీడనపైన బతకనేర్చిన పురోహిత వర్గంపైన, పరాన్నభుక్కులపైన, విగ్రహారాధనపైన ధ్వజమెత్తి, పునర్జన్మ సిద్ధాంతాన్ని వ్యతిరేకించి, పుట్టిన ప్రతిదీ చావక తప్పదని భౌతిక సత్యాన్ని ప్రతిపాదించిన బౌద్ధమతాన్ని నాశనం చేయడానికి ఆనాడు కొందరు గజ్జెకట్టారు. అదీ బౌద్ధం క్షీణదశకు ప్రధాన కారణం. నాడు యజ్ఞయాగాదులు ఆగిపోతే వాటిపై సంపాదనకు ఆధారపడినవారు ఉపాధి కోల్పోతారు. కనుకనే ఆ దుర్దశలో ఉన్నవారు బౌద్ధంపై ఎదురుదాడికి దిగారు. దాని ఫలితమే- శంకర శిష్యగణాలు నాగార్జునకొండ సహా పెక్కుచోట్ల ఉన్న బౌద్ధారామాలను, చైత్యాలను కూలగొట్టడం, దోచుకోవడం అని ఫెర్గ్యూసన్ నిరూపించి నమోదు చేశాడు! అందుకనే కాలక్రమంలో తరానికొక్క సుద్దోదనుడూ, వరానికొక్క సిద్ధార్థుడూ పుట్టుకురావాలన్న నానుడి జనశ్రుతమై పోయింది!

ఎందుకంటే,బౌద్ధం ఆనాడు ఒక్క జ్ఞాన బోధలతోనే సరిపెట్టుకోలేదు. ఆత్మరక్షణ ఆయుధాన్ని కూడా సమకూర్చిపెట్టింది. ఈనాటి ''కరాటే''లాంటి మార్షల్ ఆర్ట్సుకు పునాది ఆనాటి ఆది బౌద్ధం బౌద్ధ సన్యాసి బోధి ధర్మ ''కలారిపయత్తు'' అనే దేశీయ (కేరళ) మార్షల్ ఆర్ట్సను చైనాకు నేర్పి వచ్చినవాడు. ఇలా- బౌద్ధాన్ని దేశ సరిహద్దులు దాటించి భారతదేశం హేతువాద దృష్టిని కోల్పోయి ఆత్మహత్య చేసుకున్నదని గురజాడ అప్పారావు ఆవేదన చెందాడంటే ఆశ్చర్యపోవలసిన పనిలేదు. ''మతా:''నికి ''ధర్మం''లేదా 'ధర్మచింతన' అని పేరు పెట్టుకుంటే సగం ఇబ్బందులు తొలగవచ్చు! ఎందుకంటే ''రెలిజియన్'' అంటే ''బంధం'' (to bind) అని అయినప్పుడు ఏ ఇద్దరి పౌరుల

మధ్య సంబంధమైనా బంధమేకదా. 'మతం'పేరిట మనుషుల మధ్య మమతానుబంధాల్ని తెగ్గొట్టజూడడం అవివేకం.

ఈ మానవీయ దృక్పథంతోనే ఏటుకూరి చివరిదాకా తన రచనలు కొనసాగిస్తూ వచ్చారు. చివరికి, ఇటీవల కొలదికాలం వరకూ ''మిసిమి''కి రాసిన తాత్త్విక వ్యాసాలలో కూడా ఈ నిశిత దృష్టిని ఏటుకూరి కోల్పోలేదు. ఆరు భారతీయ దర్శనాలలో మొదటిదర్శనం ''సాంఖ్య''మనీ, అది నిరీశ్వరవాద ప్రతిపాదనమనీ, ఆ మాటకొస్తే బౌద్ధానికి పూర్వమే సాంఖ్య భావన ఉందనీ, అలాంటి దానికి క్రమంగా వైదిక వాసనలు తొడిగారనీ ఆయన రాశాడు! మతభావన తగ్గిపోయి, జాతిభావానికి పెద్దపీట వేసిన యుగాలు కూడా మనకున్నాయనీ, వాటిలో ఆంధ్రుల చరిత్రలో ప్రధానమైనది చాళుక్య యుగమనీ మరిచిపోయిన మంద బద్ధులకు జ్ఞాపకం చేసినవాడు బలరామమూర్తి. చారిత్రకంగా పదికాలాలపాటు ప్రజాబాహుళ్యం గుర్తుంచుకోదగిన మహద్ఘటనలకు, ప్రజానుకూలమైన సన్నివేశాలకూ ధర్మచింతన దోహదం కావాలిగాని మానవాళి యుగయుగాలుగా కష్టించి సృష్టించుకున్న సువర్ణ సేతువును- ఆ సమష్టి సంస్కృతీ వారసత్వాన్ని చేజేతులా కూలదోసుకోరాదని ఏటుకూరి కూడా భావిస్తారు. మనకి వారసత్వ రాజకీయాలొద్దుగాని, సంస్కృతీ వారసత్వాన్ని విధిగా పెంచి పోషించుకొందాం!

*(శుక్రవారం 5, ఏప్రిల్ 1996)*

# ''మహోదయం'' నుంచి ''గేయకవుల'' దాకా...!

''నిజం! నమ్మండి, నమ్మకపొండి. అది మీ ఇష్టం. కవిననో, రచయితననో, బుద్ధి జీవిననో, మేధావిననో, నేనై నేనెన్నడూ డప్పు కొట్టుకోలేదు. విమర్శకుణ్ణనీ, విజ్ఞానిననీ, తాత్త్వికుణ్ణనీ, 'క్రాంతదర్శి'ననీ, రుషిననీ, నాకై నేనెవరి నుంచీ హెచ్చు మెచ్చు కోరుకోలేదు. యాచించలేదు యోగ్యతాపత్రాలు, అర్థించలేదు పంచరత్నాలు, పొగడమనలేదు, పొగడదండ వెయ్యమనలేదు. పదవి, బిరుదు, సన్మానం, సత్కారం, సభా గౌరవం, ప్రభు పోషణం- ఇవేవీ నానుంచి వెలువడ్డ ఆశలు కావు. నా ఆకాశం ఈ నేల మీదనే. ఈ నా జనమే నా ప్రాణ పంచకం. వీరి ఉన్నతి ఒక్కటే నా ధ్యేయం. అందుకోసమే నా శక్తి, నా తీరిక, నా కాలం, నా సమస్తం''. ఈ మాటలు పుట్టుకొచ్చింది మరెవరి నోటనుంచో కాదు, అర్ధశతాబ్దంగా ఆంధ్ర సాహితీ విమర్శనా లోకంలో నిష్కామకర్మగా సాహిత్య సేవలు అందజేస్తూ వచ్చి మొన్ననే కీర్తిశేషుడైన అభ్యుదయ వాదీ, ఆంధ్రప్రదేశ్ విప్లవ రచయితల సంఘం కార్యదర్శి స్థాయినుంచి అధ్యక్ష స్థాయికి ఎదిగి, అఖిలభారత విప్లవ సాంస్కృతిక సంస్థ వ్యవస్థాపక కార్యదర్శిగా రెక్కలు విస్తరించుకుని సాహితీ నేతృత్వం అందజేసిన కె.వి.రమణారెడ్డి నిగర్వంగా చెప్పిన పచ్చి నిజాలు! రాష్ట్ర, జాతీయ, అంతర్జాతీయ పరిణామాలకు ఇన్నాళ్ళూ అడుగడుగునా కె.వి.ఆర్. కవిగా, సాహితీ విమర్శకుడుగా, సాహిత్య చరిత్రకారుడుగా, ఉద్యమ రాజకీయ కర్మసాక్షిగా, కవితా సిద్ధాంతాల సమన్వయకర్తగా ఎంతగానో స్పందించిన మూర్తి. అతనికి సమన్వయం తెలుసు,మానవ సంబంధాలకు ఉండవలసిన అనుల్లంఘనీయమైన నియమాలు తెలుసు, వ్యక్తిత్వ కొలమానాలు తెలుసు, మానవీయ విలువలు తెలుసు. కనుకనే సాహిత్య విమర్శలో మార్క్సీయ దృక్పథానికి పెద్దపీట వేసుకున్నా కొందరిలా పిడివాదిగా చెలామణి కావడానికి ఉద్యమించిన వాడు కాడు.

జాతీయ పునరుజ్జీవనంలో మహాకవి గురజాడ అప్పారావు స్థానాన్ని బేరీజు వేస్తూ, ఆధునికాంధ్ర సాహిత్య విమర్శను కొత్త పుంతలు తొక్కించి, విమర్శనా సాహిత్యానికి మార్గనిర్దేశం చేసిన రచయిత రమణారెడ్డి. తెలుగు సాహిత్యం విమర్శనా దృష్టిని కోల్పోయి ఎదుగూబొదుగూ లేకుండా పోతోందన్న గురజాడ ఆవేదనకు అపవాదుగా రమణారెడ్డి సృష్టించిన అనర్ఘరత్నం - ''మహోదయం''. మానవ జీవితంతో చెలగాటమాడకూడదనీ, ఎలాంటి తృణీకార భావమూ లేకుండా మానవ జీవితాన్ని గంభీరమైన దానిగా భావించి దానినే రచయితలు తమ కలాలకు ఇతివృత్తం చేసుకోవాలన్న గురజాడ బోధ రమణారెడ్డి సాహిత్య జీవితానికి వెలుగు దివ్వెగా మారింది. ఈ విలువలు ఆధారంగానే అతను ప్రజారచయితగా కవిత్వానికి ఖరీదు కట్టాడు, విలువలతో తూచాడు, తన బేరీజుకు అందని రచయితలతో తలపడ్డాడు. ఈ దృష్ట్యానే కె.వి.ఆర్. గురజాడ నుంచి దువ్వూరి రామిరెడ్డి దాకా, శ్రీశ్రీ నుంచి చెరబండరాజు వరకూ రచనలను అంచనా కడుతూ వచ్చాడు. భోళాతనం నిష్కర్ష అతని ఆయుధాలు. విప్లవోద్యమాల గురించిన చర్చల్లోనూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చిన చీలుబాటల గురించిన శషభిషలలోనూ తల పండిన ఒక రాజకీయ సిద్ధాంతవేత్తకు ఉండే శక్తి సామర్థ్యాలతో తలదూర్చినవాడు. ఒకవైపునుంచి ''అక్షర తూణీరం'' ద్వారా సాహిత్య విమర్శనాస్త్రాలు సంధించినా, మరోవైపు నుంచి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో హేమాహేమీల మధ్య నడిచిన సిగపట్లను వర్ణిస్తూ 'రివిజనిజం' పాఠాలు బోధించినా కె.వి.ఆర్ దృష్టి సునిశితం. 'మహోదయం' ఉదయించడానికి ముందే 'అడవి', 'అంగార వల్లరి' కవితా సంపుటాల ద్వారా తానెంత ప్రజాపక్షపాతో రమణారెడ్డి నిరూపించుకున్నాడు. అతని వచనంలోగాని, కవితలోగాని అన్వయ కాఠిన్యం వ్యక్తమవుతూ వచ్చినా కె.వి.ఆర్.ను సాహితీ జగత్తుకు, ప్రజలకు సన్నిహితం చేసింది - రచయితల బతుకు తెరువుకు మూల్యమైన ప్రజా పంథాయేనని మరవరాదు! సాహితీ రంగంలో కడచిన మూడు దశాబ్దాలుగా వచ్చిన నవ్య కవుల రచనలను మనసారా ఆహ్వానించి ఆశీర్వదించిన వారిలో శ్రీశ్రీ,

రమణారెడ్డి అగ్రజులుగా నిలబడతారు. శ్రీశ్రీ సాహిత్య సంపుటాలకు సంకలన కర్తగా అతను చేసిన సేవ ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో మరపురానిది. 'భువనఘోష', 'జైలుకోకిల', 'కాహళి' సంపుటాలు వర్తమాన సామాజిక రాజకీయ పరిణామాలకు అద్దం పట్టిన రచనలు. విరసం కవితా సంకలనంగా వెలువడిన 'ఝంఝు'తో పాటు స్వీయ కవితగా వెలుగుచూసిన 'సూరీడు మావోడు' అటు ఉద్యమకారుల్లోనూ, ఇటు కవితాప్రియుల్లోనూ సంచలనం సృష్టించింది. ఎమర్జెన్సీలో జైలు జీవితం ఆయనను కుంగదీయలేదు. తాను సంకలీకరించిన 'ఝంఝు'పై ప్రభుత్వం రాజద్రోహ నేరం మోపినా అతను చలించలేదు. విరసం కార్యకలాపాల సందర్భంగా, సికిందరాబాద్ కుట్ర కేసు అతని నడుం విరగ్గొట్టనూ లేదు. అలానే, నిలబడి తలపడి తన తనాన్ని ముద్ర వేసుకున్నాడు. సొంత వ్యవహారాలకు తావివ్వకుండా నిర్బంధంలో ఉన్న విరసం సభ్యుల బాగోగులు పట్టించుకుంటూ వివిధ జైళ్ళ మధ్య సంధానకర్తగా వ్యవహరించిన వాడు రమణారెడ్డి. ఒక్కమాటలో చెప్పాలంటే - కడచిన ముప్ఫయ్యేళ్ళుగా ఆయన శ్రీకాకుళం నుంచి కరీంనగర్ దాకా సాగిన ఉద్యమ కవితా చరిత్రకు సాక్షిగానే కాదు, సాధికార వ్యాఖ్యాతగా కూడా నిలిచాడు. ఇంద్రవెల్లి వెళ్ళాడు. గోండుల గోడు విన్నాడు, మారని పరిస్థితులను గమనించాడు. గోండులపై ప్రభుత్వం జరిపించిన కాల్పులలో రక్తపు ముద్దగా మారిన ఓ బక్కజీవి వస్త్రాన్నీ, అతని కర్రనూ నిర్బంధపు నీడల మధ్యనే ఎర్రజెండాగా నిలిపి వచ్చినవాడు కె.వి.ఆర్! వాచాలత కాదు, వాక్శుద్ధి, నమ్రత, విన్నాణం అతని కూసు విద్య. కనుకనే చివరిదాకా మచ్చలేని మనీషిగా మసలుకున్నాడు. శ్రీకాకుళ సాహితీ విప్లవోద్యమ కర్తగా ఉన్న సుబ్బారావు పాణిగ్రాహిని ధనస్వామ్య ప్రభుత్వం పొట్టనపెట్టుకున్నప్పుడు తను రాసిన స్మృతిగీతాన్ని అచ్చువేయకుండా తొక్కిపట్టింది ''పెట్టుబడికి పుట్టిన ఏ విషపుత్రికో'' కాదు, స్వయానా విప్లవ రాజకీయాలకు తామే అసలు సిసలు వారసులమని విర్రవీగిన ఒక కమ్యూనిస్టు పత్రికే కావడం కె.వి.ఆర్.కు విస్మయ కారణమైంది!

ధనమూల మిదమ్ జగత్ అన్న లోకరీతికి దూరమై సర్వం సామాజికమ్ జగత్ అని ఎంతో ఎత్తుకు ఎదిగినవాడు కె.వి.ఆర్. రచనలో చారిత్రక ప్రమేయమే తన ఏకైక ధ్యాస అన్నాడు. 'కర్త' అయిన సామాజిక శక్తికి 'క్రియ' ద్వారా సత్ఫలితం చేకూర్చడంకంటే సంస్కృతికి వేరే పరమార్థం ఏముందని ప్రశ్నించుకున్నాడు. సంస్కృతికి పెట్టని నిధి సామాన్య ప్రజలే. ఆ ప్రజకు చెందవలసిన రాజ్యాధికారమే సంస్కృతికి మానవీయతనీ, మనిషికి సంస్కారాన్నీ సమకూర్చి వేల ఏళ్ళు పర్యంతం విస్తరించి పోయిన అఖాతాన్ని పూడ్చి యథార్థ సాఫల్యానికీ, వాస్తవ స్వేచ్ఛా స్వాతంత్ర్య, సౌభ్రాత్రమయమైన మహత్తర సామాజిక వ్యవస్థకూ ప్రారంభం కాగలదని విశ్వసించిన సద్విమర్శకుడు కె.వి.ఆర్. వైవిధ్యాన్ని 'సుందరంగా, ప్రాణబంధురం'గా ఎంచి, జీవన సంగ్రామంలో సమష్టి ప్రయత్నమే పరమార్థంగా భావించిన వాడాయన. మనిషిని సర్వత్రా ప్రేమించాడు, మానవతను తలచాడు, మమతను, సమతను రెండు కళ్ళుగా మలచుకొని మనిషిని మరీమరీ పలకరించాడు. చీకట్లను చీల్చుకుని వెలుగును ప్రసాదించే సూర్యుడిలా అంతిమంగా 'మానవుడే విజేత' అని చాటాడు: 'అనతిక్రమణీయం నాగరికత చెలియలికట్ట/ క్రిమి కాదు మనిషి/ మహాసముద్రం శేముషి / సంకల్పబలం మనిషి / మనిషంటేనే మనస్సు/ మనిషంటేనే మహస్సు' అన్నాడు రమణారెడ్డి. భావచిత్రాలు బొమ్మకట్టి చూపడంలో కూడా కె.వి.ఆర్.దిట్టగానే కనిపిస్తాడు. ఓరిమితో తప్ప విప్లవం జయప్రదం కాదని చెప్పడానికి ఒక వంక చంద్రవంకను మాధ్యమం చేసుకొని ప్రకృతి పరిణామక్రమాన్ని చెబుతాడు. పడమటి మబ్బు మసకల్లో మూర్చిల్లి పడి ఉన్న పంచమినాటి చంద్రవంకను చూపిస్తూ, ప్రకృతిపరంగా ఉద్యమాన్ని విప్లవీకరిస్తాడు: ''కొమ్మల్ని కలుపుతూంది/ పూర్ణత్వం సూచించే అస్పష్ట రేఖ/ ఇంకా పది రాత్రుల తర్వాతే పౌర్ణమి/ అందాకా అవసరం కంటికి ఓరిమి/ ఎదురుచూస్తూ కూచోడంకాదు/ ఎదురు నడుస్తూ పోవడమే కర్తవ్యం/ --- రేఖ బింబమయేలా క్రమంగా/ రాకా చంద్రుడు ఉదయించే దాకా ఎదుర్కోలు!'' ఈ స్వీయానుభూతి అతని సామాజిక చైతన్యం నుంచే పుట్టుకొచ్చిందని మరవరాదు.

''మహోదయం'' నుంచి ''గేయకవుల'' దాకా...!

విద్యార్థి సంఘాల నుంచి విజ్ఞాన చీలికలు పంచే సాహిత్య సంఘాల దాకా బాధ్యతలు నిర్వహించిన కె.వి.ఆర్. ప్రజాస్వామ్య సంస్కృతీ వికాసానికి ఎంతగానో చేదోడు వాదోడైన రచయిత. ఈ విస్తరణ 'మహోదయం' నుంచి గద్దర్ పోరాట 'ప్రజల గుండె డప్పుల' దాకా కొనసాగుతూ వచ్చింది. కవితలే కాదు, 'మాభూమి' తరహాలో 'అన్నపూర్ణ', 'రాజీవం'లాంటి సందేశాత్మక రాజకీయ నాటకాలు కూడా రాసిన కె.వి.ఆర్. ది నిజంగానే అరుదైన విలక్షణమైన సాహిత్య వ్యక్తిత్వం. సామాజిక, రాజకీయ అంశాలను మార్క్సిస్టు దృక్పథం నుంచి ఎలా అనుశీలన చేశాడో తెలుసుకోగోరే వారికి రమణారెడ్డి 'సాహిత్య లేఖలు' ఉపకరిస్తాయి. కొందరు పత్రికా సంపాదకులకూ, శ్రీశ్రీ, ఆరుద్ర, నగ్నముని, చేకూరి, రాచమల్లు, పురాణం, వరదరాజేశ్వరరావు, రామలక్ష్మి, దాశరథి, సుప్రసన్న, తుమ్మల వెంకట్రామయ్య, మహీధర, కొడవటిగంటి, అనిసెట్టి, రా.వి.శాస్త్రి లాంటి ఉద్దండులకు రాసిన విమర్శనా లేఖలు ఇందులో ఉన్నాయి. ''వ్యక్తి స్వాతంత్ర్యం'' గురించి బూరపట్టి గొంతు చించుకున్న ఒక దినపత్రిక 1955 ఎన్నికల్లో శ్రీశ్రీపై రేపిన దుమారానికి సమాధానంగా తాను రాసిన లేఖను ప్రచురించకుండా ఎలా తొక్కిపట్టిందీ కె.వి.ఆర్. వివరించాడు. ఆంధ్రదేశ అభ్యుదయ రచనోద్యమానికి నన్నయ నుంచి నగ్నముని దాకా ఉన్న పూర్వరంగాన్ని సందర్భోచితంగా అందులో ప్రస్తావించి కుహనా విమర్శకుల నోళ్ళు కట్టేశాడు. కనుకనే ఆ లేఖ ఆనాడు వెలుగుచూడలేదు! దేశ దేశాల్లో పరిఢవిల్లుతూ వచ్చిన ప్రజాతంత్ర రచనా సంప్రదాయాల్ని పేరుపేరునా అందులో ఏకరువు పెట్టాడు. విమర్శించవలసి వస్తే ఎంతటి వారినీ కె.వి.ఆర్. విడవలేదు. అవసరమైన చోట ప్రజాస్వామిక ప్రతిపాదనలు చేయకుండానూ వదలలేదు. విప్లవ రచయితగా ఉన్నా, సాహిత్య అకాడమీ తెలుగుభాషాభివృద్ధికి చేయవలసిన తక్షణ కర్తవ్యాలను గుర్తుచేశాడు. పిడివాదాన్ని అతను విసర్జించగలిగాడు కనుకనే కొందరిలాగా ఎవరికీ రమణారెడ్డి స్నేహం రీత్యా దూరంకాలేదు! అతివాదానికి దూరంగా ఉన్నందుననే అతను ఇలా ప్రకటించగలిగాడు: ''మన దేశంలో దూషణ, భూషణలు ఎక్కువ.

మనం చాలా నిక్కచ్చిగా ఉండి పరిస్థితుల్ని సవ్యంగా అంచనా వేయాలి. కారల్ మార్క్స్‌ను మార్క్సిస్టులు 'క్రీస్తు' లాగా చేశారని, యుటోపియన్ సోషలిస్టుల్ని జాన్‌ది బాప్టిస్ట్ లాగా చేశారనీ ఒకసారి అశోక్ మెహతా అన్నారు. దేవుళ్ళనయినా, దయ్యాలనైనా మనం సరిగ్గా అంచనా వెయ్యాలి'' అన్నాడు! ఇలాంటి అంచనా విరసం సాహిత్య పాఠశాలకు రాసిన 'ప్రాచీన భారతీయ సాహిత్యంలో సామాజిక ప్రతిబింబం' అన్న ప్రసంగ పాఠంలో రమణారెడ్డి అందించగలిగాడు. విప్లవాలు ప్రారంభమయ్యేది పాఠశాల గదుల్లోంచి అన్న ఇరాస్మస్ (Erasmus) మాటలు ఈ సందర్భంగా గుర్తుకు రాక మానవు! ఇటీవల రమణారెడ్డి రచన 'గేయకవులు' నెల్లూరి వెంకట్రామనాయుడు, సుంకర, కాళోజీ, పొట్లపల్లి రామారావు, నాజర్, తిరునగరి రామాంజనేయులు, పాణిగ్రాహి, గద్దర్‌ల సాహిత్య కళాసేవలకు అర్పించిన నివాళి. రమణారెడ్డి సాహిత్య విమర్శలో - విలియమ్ విమ్‌సాట్, క్లెనెత్ బ్రూక్స్, ప్లెఖనోవ్, క్రిస్టోఫర్ కాడ్‌వెల్, ఎడ్వర్డ్ విల్సన్ (సోషల్ రెస్పాన్సిబిలిటీ) లూయిపారింగ్టన్ (Main currents in American Thought) కోవకు చెందిన వాడు. గురజాడ నాది ప్రజల ఉద్యమం, ఎవరి సంతోషం కోసమో దానిని వదలబోను అని తెగేసి చెప్పినట్టే, కె.వి.ఆర్. 'ప్రజలే నా ప్రాణపంచకం' అని ఆచరణలో నిరూపించుకున్న ధన్యజీవి. ప్రజల ఉన్నతిని ఆకాంక్షించిన వాడు కాబట్టే గుండె గొంతుకలో ఇలా చాటుకో గలిగాడు: ''జనం తన తనాన్ని వదులుకోక/ జుత్తు మరో చేతికి దొరకనీక/ తన కథలో తానే నాయకస్థానాన నిలిస్తే/ తన కష్టసుఖాలకు తానే బాధ్యత వహిస్తే/ వీరులెందుకూ పీరులెందుకూ తనకు? కార్యం తనది, తాను చక్కదిద్దుకోవాలి చివరకు''!

*(ఆదివారం 18, జనవరి 1998)*

# కష్ట సుఖాల కలనేత మానవ 'కథాసాగర్'!

''కథానికలు రాయడానికి పదేళ్ళ లైసెన్సులు జారీ చేయాలి. ముసిలాళ్ళు కథానికలు రాయకూడదు. కథానిక యువకుల సొత్తు... అంచేత ప్రతి కథకుడూ తన పదేళ్ళ లైసెన్సుకు కాలదోషం పట్టగానే నవలలో ఏవో రాసుకోవాలి'', ''కాదు, కథానికలు ఎవరైనా రాయొచ్చు... ఏ యుగంలోనూ ఏ కథానికా ప్రపంచాన్ని తలకిందులు చేసినట్టు దాఖలా లేదు'' పరస్పరం రెండు విరుద్ధ భావాలుగా సాగిన ఈ సంభాషణ కొడవటిగంటి కుటుంబరావు 'ఫోర్త్ డైమెన్షన్' కథలో ఇరువురి మధ్య నడిచిన ఘట్టం. నిజానికి వీరిద్దరి మధ్య ఘర్షణ - కథలు అవసరమా లేదా అన్న మీమాంస పైన కాదు సుమా! కథానిక, లేదా నవల లక్ష్యం- మానవునిలోని బుద్ధి మాంద్యాన్ని తొలగించి, నిరాశను వైదొలగించి మానవుణ్ణి చైతన్యమూర్తిగా మలచడం తప్ప మరొకటి కాదు. ఈ విషయం సంభాషించుకునే వారికి తెలుసు. కాని అసలు విషయం 'కాలం అనేది లేని కథ చెప్పు' అని వీరిలో ఒకరు అన్నప్పుడు 'నేను చెప్పేది కాలం అనేది కూడా కథలో పాత్ర కావాలని' మరొకరు సమాధానమివ్వడం! ఏతావాతా తేలేదేమంటే కాలాన్నీ, సమకాలీనాన్నీ రచన అనేది ప్రతిబింబించాలనీ, కాలాన్ని కాలదన్నడమూ, సామాజిక పరిణామక్రమాన్ని అందులోని ఎగుడు దిగుళ్లను, అంతరాల దొంతర్లను, ప్రజల కష్ట సుఖాలనూ గుర్తించ నిరాకరించడమూ, కాలాన్ని కాదు - అసలు కలాన్నే రచయిత విరిచేసుకోవడమని! పాతికేళ్ళ చరిత్రతో దీపిస్తున్న 'కళాసాగర్' వ్యవస్థాపకులు, నిర్వాహకుల చేతుల మీదుగా తెలుగు కథా సాహితీ మహార్ణవంలో మరో ఉత్తమ కథా నదీమ తల్లి మరో పాయగా వచ్చి చేరింది. దానిపేరే 'కథాసాగర్'. తెలుగు కథ పుట్టి ఎనభై ఏడు సంవత్సరాలైతే, తాము ఉత్తమ కథలుగా భావించిన ఎనభై ఏడింటిని కాలంతో నడిపించి అందమైన సంకలనంగా తీసుకువచ్చిన వ్యవస్థాపక కార్యదర్శి ఎం.ఎ.సుభాన్ అభినందనీయులు ఇలాంటి సంకలనాలకు ఉపక్రమించే సాహితీ ఔత్సాహికులు, లేదా నిర్వాహకులు, ప్రచురణకర్తలూ ఒక జాగ్రత్త తీసుకోవలసి ఉంటుంది ఒక సంకలనంలో ఇంతకు ముందే వచ్చినవి మరో సంకలనంలోకి రాకుండా జాగ్రత్తపడాలి. అపుడు అన్ని సంకలనాలు కలిసి నదులన్నీ

మహా సాగరాభిముఖంగా ప్రయాణించినట్లు అనుపమానమైన బృహత్ కథాసాగరం అవతరిస్తుంది. సాహిత్య అకాడమీలు లోగడ ప్రచురించిన తెలుగుకథా సంపుటాలు కొన్ని ఉన్నాయి. తొలినాటి తెలుగు కథలను సంకలనంగా తెచ్చి జీవం పోసి, ఆసక్తిగల పాఠకులలో అనురక్తిని కలిగించినవారు మధురాంతకం రాజారామ్; తెలుగులో సుమారుగా ఏటేటా 'కథ' పేరిట ఎన్నెన్నో కొత్త కథలను సంకలీకరించి ప్రచురిస్తున్న యువకుడు, కథకుడు నవీన్. ఇవిగాక సీమాంతరాలలోకి మెడలు చాచుకొని 'విశ్వకథావీథి'లో విహరించిన వారు పురిపండా అప్పలస్వామి. వీరందరి కృషిని మరింతగా ఇనుమడింప చేయగల విధంగా 'కళాసాగర్' తన రజతోత్సవ కానుకగా 'తెలుగు జనజీవన ప్రతిబింబాల కథానిధి'గా ఈ కథాసాగర్‌ను వెలువరించింది. తెలుగు కథల వాడీ, వేడీ రుచి చూపించగల సాగరంలో ఈదులాడగోరే కథా ప్రియులైన పాఠకులకు తారసిల్లేవి ఒక ముఖం కాదు, బహుముఖాలు, ఒక కోణం కాదు, ఒక దృక్కోణం కాదు, ఒక తత్వంకాదు, ఒక సిద్ధాంతం కాదు, ఒక తబిశీలు కాదు, ఒక తకరారు కాదు, విభిన్న కోణాలూ, పలు దృక్పథాలు, భిన్న భిన్న మనస్తత్వాలూ ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. ఆనందింపచేసేవి కొన్ని, ఆలోచింపచేసేవి ఇంకొన్ని, చర్చకు దోహదం చేసేవి, కర్తవ్యాన్ని ప్రబోధించేవీ మరికొన్ని. ఒక్క మాటలో- నవరుచుల సమ్మేళనం ఈ కథాసాగరం. కథల ఎంపికలో సంకలన కర్తలు వివిధ ప్రాంతాలకు ప్రాతినిధ్యం కల్పించారు. ప్రవాసాంధ్రులను ఆదరించారు. ఆయా ప్రాంతాల జన జీవితాన్ని ప్రతిబింబించే విధంగా అంశాలను ఎంపిక చేశారు. కథా సాహిత్యంలో నేడు ప్రతిఫలిస్తున్న వివిధ సిద్ధాంత వాదాల ఛాయలూ, పలు పాయలూ ఇందులో ఆవిష్కరించుకున్నాయి. ఇందులో మానవ జీవితంలో వ్యక్తుల స్థాయిలోనూ సమాజ స్థాయిలోనూ ఎదురయ్యే ఘర్షణ ఉంది. సమన్వయం ఉంది. అన్నింటికీ మించిన మానవతా దృష్టిని ఒకడుగు ముందుకు సారించే అకుంఠితమైన ప్రయత్నమూ ఉంది. అనుభవం నేర్పిన గుణపాఠాలున్నాయి. అహంకారం కూల్చివేసిన అంతస్తులున్నాయి. జీవితానికి ప్రత్యక్ష ప్రేక్షకులు ఉండరు అలాంటి జీవన సమరానికి ప్రతినిధులెందరెందరో, ఈ కథల్లో! ఉదాహరణకు వ్యక్తిత్వాన్ని కోల్పోకుండా 'తన మార్గం'లో ప్రయాణించే వర్ధనమ్మ, 'వరుడు'లో చిన్నయ్య, 'అరుదైన ఆత్మహత్య'లో వెంకటేశ్వరరావు 'గోపురం'లో వసుంధర, 'సముద్రం'లో రాజా, జయ, ''4711 టాస్కా''లో పద్మరాజు, సుందరం, 'కాలానికి దూరంగా'లో తిరుమలరావు, విశ్వనాథ్, 'రాజనీతి'లో పోలుపిల్లి, సింహాచలం, 'సీతాపతి' కథలో సీతాపతి, 'తిరుగుడు గుమ్మి'లో

కష్ట సుఖాల కలనేత మానవ-'కథాసాగర్'!

అప్పలనాయుడు, గుంపస్వామి, 'కావేరి సీతారామన్'లో కమలనాథన్, సీతారామన్,మల్లిక, 'పొద్దుచాలని మనిషి'లో విశ్వపతి, రాజశేఖరం, 'కూలిన బురుజు'లో జయరాం, వాసు, 'అదెక్కడ'లో పరంధామయ్య, పద్మావతి, 'అమ్మమీది సొమ్ములు'లో సరోజ, 'తాతదిగిపోయిన బండి'లో లక్ష్మణస్వామి, వెంకటాచలం, 'ముఖేష్‌పాట'లో కృష్ణ 'వీరుడు - మహావీరుడు'లో గండిపేట రౌడీ, అల్లాపురం వస్తాదు, కొత్తపేట శాండో, 'బస్సు ప్రయాణం'లో బాలిరెడ్డి, 'మనిషి విధ్వంసం'లో రామేశం, రాజారాం ఒకరా - ఇలా ఎన్ని చెప్పేది, అందరూ ఈ జీవన సమరంలో వెలుగునీడలకు ప్రతిబింబాలే! కథల ఎంపికలో 'కథాసాగర్' సంపాదకులు ఉద్దేశించిన లక్ష్యాన్ని సాధించగలిగారనిపిస్తుంది. వారే చెప్పుకొన్నట్టు 'వస్తువులో క్లిష్టతకు, శిల్పంలో నేలవిడిచిన సాముకు దూరంగా, సహజత్వానికి దగ్గరగా ఉన్న కథలనే' ఎన్నిక చేయగలిగారని చెబితే అతిశయోక్తి కాబోదు. 19వ శతాబ్దానికి ముందు సాహితీ జగత్తుకు తెలిసిన ప్రక్రియ మౌఖిక సంప్రదాయంగా అందివచ్చిన 'టేల్', 'గల్పికగా' అవతరించిన 'స్కెచ్' ప్రధాన భూమిక వహించాయి. ఆ క్రమంలో తెలుగులో వందల ఏళ్ళుగా 'అనగనగా...' అన్నది పులుగడిగిన ముత్యంలా, తర్వాత అవతరించిన 'కథ'కు తొలిరూపమే. పేదరాశి పెద్దమ్మ కథలు, కేవల నీతిబోధలు, వక్రోక్తులు,కల్పిత గాథలూ చోటుచేసుకున్నాయి. ఈ రంగంలో పాశ్చాత్య ప్రపంచంలో ఏ ఎడ్గార్ అలెన్ పో లాంటి రచయితలో వచ్చి "Stories must have a compact and unified effect" అని చెప్పేదాకా అక్కడి సాహితీ జగత్తును వాషింగ్టన్ ఇర్వింగ్‌లాంటి వాళ్ల 'స్కెచ్‌బుక్' విలియమ్ డీన్ హోవెల్స్ లాంటి వాళ్ళ 'సబర్బన్ స్కెచెస్' ఏలుతూ వచ్చాయి. 'కథాసాగర్' లాగానే అలెన్ పో ఒకప్పుడు Tales of the Grotesque and Arabesque" అచ్చువేశాడు. హెర్మన్ మెల్‌విల్ కూడా 'పిజ్జాటేల్స్' (PIZZA TALES) అచ్చువేశాడు. ఇలాగే ఆధునిక కథకూ సీమాంతరాలలో బీజాలు పడ్డాయి. ఆమాటకొస్తే చరిత్ర రచనకు మూల పురుషులలో ఒకరుగా భావించే హిరొడోటస్ కథా జగతికి కూడా ఆద్యుడని (Logoi = Tales) కొందరంటారు. తవ్వినకొద్దీ మన వెనకటి తరాలు కళ్ళముందుకొచ్చి చెప్పే కథలకు జాతక కథలు, పంచతంత్ర గాథలూ, రాజతరంగిణి, కథా సరిత్సాగరం జ్ఞాతంగాను, అజ్ఞాతంగానూ దోహదం చేసినవే అయితే 1910 తర్వాత తెలుగు కథ ఎదుగుదలపై - కథా చిత్రణలో, సంవిధాన దర్శకత్వంలో, శిల్పంలో, పాత్ర పోషణలో, మలుపులు తిప్పడంలో క్రమంగా దశాబ్దాల మీదట టాల్‌స్టాయ్, జాయిస్, లారెన్స్, కాఫ్కా, హెమింగ్వే, మపాసా లాంటి పాశ్చాత్యుల

ప్రభావం కూడా పడింది. ఈ ప్రభావం తెలుగు కథకు చెరుపు కంటే మెరుపునే ప్రసాదించింది శిల్పంలో మన రచయితలు తెలుగు కథను ఏ పాశ్చాత్య రచయితకూ తీసిపోని విధంగా పరసీమలకు చేర్చారు. ప్రపంచ ఖ్యాతిని తెచ్చారు. ఇంతకూ సాహిత్యానికి లక్ష్యం ఏమిటని ప్రశ్నించుకున్నప్పుడు నోబెల్ బహుమాన గ్రహీత అయిన కామిలో జోసి సెలా చెప్పిన నిర్వచనంతో మనం ఏకీభవించవచ్చు. రోగ లక్షణాన్ని స్పృశించని వైద్యం దండగ అంటాడు. అలాగే సామాజిక రుగ్మతలను తలపోయని రచన నిరర్థకం అంటాడు. **"The goal is to touch the ulcer with your finger, and write the poultice of rhetoric"** అంటాడు! తెలుగువారిలో సుమారు 4500 మంది కథా రచయితలున్నారన్న అంచనాను నమ్మవలసివస్తే, 'కథాసాగర్' లాంటి సంకలనాలు అవసరం మరెంతో ఉందనిపిస్తోంది. వాటన్నింటినీ ఒకేచోట సంపుటాలుగా చేర్చాలన్న సుభాన్ కోరిక మెచ్చతగిందే. కానీ ఈ లక్ష్యం ఆయనకు అతిశయంగా కూడా కాదు 'భీషణాతిశయం'గా కనిపిస్తోంది. 50 సంపుటాలలో ఒక్కొక్కరిదీ ఒక్కొక్క కథగా ఎంపికచేసి ఒక ఊహాతీత సంకలనం తేగలిగితే 'కథకులందరికీ న్యాయం చేకూర్చవచ్చు'నన్న మహదాశయం మెచ్చుకోతగింది. సంకల్పబలానికి సానుకూలమైన అర్థబలం తోడుకావాలి. ప్రభుత్వాల ప్రోత్సాహం లేని చోట, సంస్కృతీ విరోధులూ,కళావిధ్వంసకులూ ఇంకా ఊళ్ళేలుతున్న చోట ఈ ప్రయత్నం అసిధారావ్రతం. ఉత్తమ లక్ష్యాలతో ప్రేరేపితులయ్యే కళాసాగర్‌లాంటి స్థితప్రజ్ఞతగల సాంస్కృతిక సంస్థలు తలచుకొంటే సుభాన్ ఆశ దురాశకాదు! మానవ విలువలను పెంచి పోషించడానికి తోడ్పడే రచనలే - సంఘజీవుల్లో జడత్వాన్ని విదిలించి, చైతన్య దీపాలు వెలిగించగలవని ఇందులోని అనేక కథలు నిరూపిస్తున్నాయి. శిల్పకళా ఖండాలకన్నా ఎత్తుకు ఎదిగే ఉన్నతమైన వ్యక్తిత్వంగల గోపుర సమానమైన స్త్రీలు ఉంటారని, మానవీయ దృక్పథం నుంచి, సాలోచనా పూర్వకమైన స్త్రీవాద దృష్టి నుంచీ రుజువుచేసే కథలున్నాయి. జీవితపు హద్దులు విశాలమైనవనీ, సాధారణ నీతిసూత్రాలతో వాటిని బంధించి చూడటం సాధ్యపడదనీ ఎక్కడో ఒకచోట రాజీపడక తప్పదనీ ఆలోచన రేకెత్తించే భావజాలమూ ఇందులో ఉంది. నీటిలో చేపల కదలికలను కనిపెట్టడం కన్నా, గాలిని గుప్పిట్లో బంధించడంకన్నా, చీకటిని కత్తితో చీల్చడం కన్నా, మనిషి మనసులోని అరలను పొరలను కనిపెట్టడం ఎంత కష్టమో చూపించే కోణాలున్నాయి అమాయకులైన సామాన్య ప్రజలను కొందరు స్వార్థపరులు మోసాలతో 'సామర్థ్యం'పేరుతో ఎలాదోపిడీ చేస్తారో కళ్లకు కట్టి చూపించిన కథా

చిత్రాలున్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే ఎవరికి వారు తన ముఖాన్ని తానే చూసుకునే అద్దంలాంటి 'కథాకేళి' ఈ కథాసాగరం! కళాసాగర్ కల్చరల్ ట్రస్ట్ చైర్మన్ ఎం.ఎస్.రెడ్డి సంస్థ కార్యకలాపాలను రాగరంజితంగా అక్షర నీరాజనంగా సమీక్షిస్తూ చెప్పిన మాటలు కూడా మరచిపోరానివే. సంస్థ చరిత్రలో పాతికేళ్ళుగా నిర్వహించిన కార్యక్రమాలు ఎలాంటివి? 'రాగజ్యోత్స్నలు విరియించిన సంగీత విభావరులు (Musical nights), భావోద్విగ్న భరితమైన నాటక విభావరులు, జానపదుల వినోద విన్యాసాలను ప్రతిఫలించే ప్రాచీన కళా విభావరులు'! ఎంతటి బంగారపు పళ్ళెరానికైనా గోడ చేర్పు కావాలి. ఉపజ్ఞకు, ఉత్తమ రచనకూ ఎవరో ఒకరు ఎత్తుపీట వేయాలి. ఆ కళాపీఠాన్ని సుసంపన్నం చేస్తున్న సంస్థ కళాసాగర్. సుప్రసిద్ధ రచయిత అయోనెస్కో కటువుగా ఒక మాటన్నాడు - చదవని వాళ్ళు మూర్ఖులని అంత కర్కశంగా మనం అనలేము కానీ ఈ కథాసాగరాన్ని బెడ్‌సైడ్ బుక్‌గానైనా పాఠకులు స్పృశించగలిగితే జీవితంలో ఒక లోటు తీర్చుకున్న వాళ్లవుతారు. అయితే ఇది అందరికీ అందుబాటులోకి రాగల సంకలనం కాదు. అమూల్యమైన కథలకు అలవిగాని (రూ.400) రేటు విధించినందుకు అయిన ఖర్చుల రీత్యా పెట్టుబడిని ఎప్పటికైనా రాబట్టుకోగల తృప్తి కళాసాగర్‌కు మిగలవచ్చుగానీ, ఔత్సాహిక పాఠకులకు కలిగే అసౌకర్యం తీర్చే మార్గాంతరం కనపడదు - ఏ కాళీపట్నం రామారావు కథానిలయానికో లేదా మరో గ్రంథాలయానికో వెళ్ళి చదువుకొంటే తప్ప!

*(ఆదివారం 1, ఫిబ్రవరి 1998)*

# 'భక్తి' సంగీత సర్వస్వం 'సుబ్బు'!

**ఒకనాటిమాట** : తానొక శిల్పికాదలచిన ఒక రాకుమారుడు వెనకటికి ఓ రుషి పుంగవుణ్ణి కలుసుకుని, తనకు శిల్ప విద్య నేర్పమన్నాడట. అప్పుడు రుషి 'చిత్రకళ నేర్వకుండా శిల్ప విద్య నీకెలా అబ్బుతుందయ్యా' అన్నాడట. అయితే మరి 'ఆ చిత్రకళ నాకూ నేర్పండి గురూ' అన్నాడు రాకుమారుడు, కాని 'నృత్య విద్య నేర్వకుండా చిత్రకళ ఎలా నేరుస్తావ్' అన్నాడు రుషి 'అయితే నృత్య ఫణితులన్నీ నాకూ నేర్పండి' అన్నాడు రాకుమారుడు. కాని 'వాద్య సంగీతం (జంత్రవిద్య) రాకుండా నృత్యం ఎలా చేద్దామనుకున్నావ్' అన్నాడు రుషి. దానిపైన రాకుమారుడు 'వాద్య విద్యాసూత్రాలను కూడా నన్ను నేర్వనివ్వండి' అనడిగాడు! 'ఓరబ్బీ, గానకళలో నిష్ణాతుడవైతేగాని వాద్య సంగీతం అబ్బదునాయనా' అన్నాడు రుషి. అప్పుడు రాకుమారుడి ఆఖరి సమాధానం: 'సర్వ కళలకు గానమే మకుటాయమానమైతే, గాత్ర సంగీత విద్యా రహస్యాల్ని నాకు విప్పి చెప్పమని వేడుకొంటున్నాను గురూ' అన్నాడు! అలాంటి విద్యకు వన్నెచిన్నెలు కూర్చిపెట్టిన సంగీత కళానిధి, భక్తి సంగీత సర్వస్వం అయిన ఎమ్.ఎస్.సుబ్బలక్ష్మికి 'భారతరత్న' పురస్కారం ప్రకటించడం ఘనకార్యం కాదు. అయితే ఆలస్యంగానైనా ఆమె అందుకోబోతున్న ఈ సత్కారం భారత జాతికి గర్వకారణంగా భావించాలి. సంగీతంలో పాత బాణీలలోనే గాక, సొంతగొంతులు విప్పి సరికొత్త రాగాలతో, ఆలాపనలతో భారతీయ సంస్కృతికి నూతన సొబగులు దిద్దుతున్న వారెందరో! త్యాగరాజు భాషలో 'ఎందరో మహానుభావులు, వారందరికీ వందనాలు!' ఏ కళ అయినా ఉద్వేగంతో, తాదాత్మ్యంతో కూడి రసానందాన్ని కలిగిస్తుంది. తద్వారా సంస్కారాన్ని అద్దుతుంది. దేశంలో ఈ నూతన సంస్కృతికి ప్రోదిచేస్తూ వచ్చిన గాయనీ గాయకులు జయదేవ్, పురందర్‌దాస్, స్వాతితిరునాళ్, ఆండాళ్, స్వామి హరిదాసు, సదరంగ్, అదరంగ్, బాలమురళి, గిరిజాదేవి, రవిశంకర్, బిస్మిల్లాఖాన్, చౌరాసియా మున్నగు మహనీయులు. భిన్నస్వరాలు, విభిన్న బాణీలు. దేనికదే స్వతంత్ర ఫణితిలో రాగాలాపన ద్వారా నాద మాధురిని కాపాడుకుంటూ వస్తోంది. నాదజగత్తును, కాల ప్రధానమైన ఈ శ్రవ్యకళను

పాలించి పోషిస్తున్న రెండు సంగీత పాయలు ఉత్తరాదివారి హిందుస్తానీ, దక్షిణాది వారి కర్ణాటక సంగీతం ఒకరికి గీతగోవిందం భక్తిరస ప్రధానమైతే, ఇంకొకరికి త్యాగరాజ కృతులు, మరొకరికి 'దేవరనామాలు' వేరొకరికి ధ్రుపదలు, మరొకరికి 'ఖయాలు' ఆస్వాదనీయాలు.

తన గాన మాధుర్యంలో శ్రోతలను ఓలలాడించే సుబ్బులక్ష్మి దృష్టి విశ్వజనీనం. ఆ వాణికి భాషా భేదాలు లేవు. ఆ బాణీకి కులమతాలు లేవు, హద్దులూ, సరిహద్దులూ లేవు. కర్ణాటక సంగీత మూర్తిత్రయానికి (శ్యామశాస్త్రి, త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితార్) గర్వించదగిన వారసురాలైన ఈ విదుషీమణి, ఈ వాగ్గేయకారిణి - దేశ విదేశ సంగీత ప్రియులలో మధురధ్వని తరంగాలు సృష్టించింది. భక్తి పారవశ్యంలో వేదనతోపాటు సంవేదననూ సృజించింది; ఆరోహణ అవరోహణల్లో విభిన్న స్వర ప్రస్తారాల ద్వారా రకరకాల గతులను వినిపించింది; శ్రోతల హృదయాల్ని ఉర్రూతలూగించి విశుద్ధానందాన్ని ప్రసాదించింది. ఒక్క మాటలో - సంగీతాన్ని విశ్వజనీనం చేసి పెట్టింది! భక్తి ఉద్యమాలు నడిచిన కాలంలో పుట్టకపోయినా వర్తమాన భారతీయ సమాజంలో జటిలమైన సమస్యలతో మానసిక ప్రశాంతికరువైన పౌరులకు, సంగీత ప్రియులకూ భక్తి సంగీతం ద్వారా రక్తినీ, అనురక్తినీ కలిగించింది. అందం ఆమె చేతిలో ఆనందమయింది, రాగం అనురాగంగా మారింది. మహాదేవుడు డమరవు ద్వారా 'లయ' కాపాడాడు, సుబ్బులక్ష్మి తన గాత్రం ద్వారా సప్తస్వర రీతిని కాపాడింది. కనుకనే జవహర్‌లాల్ నెహ్రూ ఒకసభలో ఈమెను ఉద్దేశించి మాట్లాడుతూ 'నేనెవర్ని? కేవలం ఓ ప్రధానమంత్రిని,ఈ సంగీత కళానిధి ముందు నేనెంత?' అని వినమ్రుడు కావలసి వచ్చింది. సుబ్బులక్ష్మి అభినవ 'మీరా' యేగాదు, బ్రిటన్‌లో సంగీతరాణిగా పేరుమోసిన ప్రిమా డొన్నాకు సరిజోడు. భారత సంగీత చరిత్రలో రాణి మృగనాయనికి సమ ఉజ్జీ! ఆమె నటించిన 'మీరా' చలన చిత్రానికి దర్శకుడుగా ఉన్న డంకన్ ఒక సందర్భంలో చెప్పినట్లుగా సుబ్బులక్ష్మి మీరాకు ప్రతిబింబంకాదు మీరాయే వచ్చి సుబ్బులక్ష్మిగా నటించి వెళ్ళింది! 'సావిత్రి' పాత్రలో కూడా ఆమె సావిత్రిగానే కనిపిస్తుంది! కీర్తనల ప్రచారంలో, అన్నమయ సంకీర్తనల ప్రాచుర్యంలో కర్ణాటక గాత్ర సంగీతంలో తనకు నచ్చిన దేవేరుల స్తుతిలో, ప్రస్తుతిలో సుబ్బులక్ష్మి పరసీమలు చూపింది. సంస్కృతి పునరుజ్జీవన శకానికి దోహదం చేసిన బహుకొలది మంది కళాకారులలో ఈమె ఒకరు రేడియో కార్యక్రమాలలోగానీ, అన్నమాచార్య కీర్తనలలోగానీ, వెంకటేశ్వర సుప్రభాత గీతాలలో గానీ, ఆమె గొంతు

వినిపించని రోజు ఉండదు. కేదార గౌళలో 'కొలువుదా భక్తి కొండల' కీర్తన చెప్పినా, షణ్ముఖరాగంలో 'పరమ పురుష' ఆలాపించినా, సావేరిలో 'దీనుడ నేను దేవుడనీవు' వినిపించినా, రాగమాలికలో 'మరలి మరలి జయమంగళం' పాడినా, రీతి గౌళలో 'ఇదియే సాధన' చూపినా, 'స్వరరాగ సుధ'లు చిందించినా, మధ్యమావతిలో 'నీనామమె' - పాడి వినిపించినా శ్రోతలు ఆ గంధర్వ లోకాలలో విహరించవలసిందే. వినిపించే స్వరం కైశికీ నిషాదమా, కాకలీ నిషాదమా శ్రోతలకు అనవసరం. కాని ఆమె వీనులవిందు చేయవలసిందే. వారు ఆనందించవలసిందే.

ఆమె శేముషి, ప్రతిభాపాటవాలు అలాంటివి. అన్నింటికంటే గొప్ప విషయం - విద్య నేర్చుకోవడంతో సరికాదు, స్ఫురద్రూపి అయిన 'ఎం.ఎస్' ఈ లక్షణాలు పుణికి పుచ్చుకున్న విదుషీమణి, నిగర్వి. 'నాకు భక్తి సర్వస్వం' అని ప్రకటించుకుందామె. ఆ తన్మయీ భావనలోనే కృష్ణుణ్ణి గురించి, 'భజన్' నడుపుతూ పొందిన అనుభూతి గురించి ఇలా తానే ఒకసారి పేర్కొంది: 'ఆ తాదాత్మ్యంలో నేను విలపిస్తుంటే శ్రోతలందరూ కూడా కళ్ళ నీళ్ళు పెట్టుకున్నారు'. సంగీతం నిశ్శబ్దంలో పుట్టి, నిశ్శబ్దంలోనే అంతమవుతుంది. కాని సంగీత ఝురిలో సుబ్బులక్ష్మిలాంటి వాళ్ళు నాదమాధుర్య చతురిమతో శ్రోతలను మధ్యే మధ్యే శబ్ద ప్రపంచంలోకి తీసుకుపోతుంటారు! దేశ,విదేశాల్లో ఎన్నో సంగీత కార్యక్రమాలు ఇచ్చిన సుబ్బులక్ష్మికి దేశంలోని కొన్ని యూనివర్సిటీల నుంచి, సంగీత అకాడమీల నుంచి పద్మభూషణ్, పద్మవిభూషణ్ పురస్కారాలు ఇంతకుముందే అందాయి. అయితే 'ఖయాల్స్'లో ప్రసిద్ధురాలైన ఒక సంగీత విద్వాంసురాలు ఆక్షేపించినట్టుగా 'ఇతర జీవన సౌకర్యాలేవీ కల్పించకుండా ఉత్తుత్తి పురస్కారాలు ప్రభుత్వం కల్పిస్తే వచ్చిన ప్రయోజనం ఏముంది? ప్రయాణ సదుపాయాలు గానీ, వైద్య సదుపాయాలుగానీ చాలామంది కళాకారులకులేవు!' ఈ లోటును ప్రభుత్వం పూడ్చవలసిన అవసరం ఉంది. లోగడ లతామంగేష్కర్‌కు జరిగిన అవమానం మన విద్వాంసులకు జరగకూడదు. కోట్లకు పడగలెత్తిన అవినీతిపరులను కాపాడే ప్రభుత్వాలు జాతీయ సమగ్రతకు, సంస్కృతికీ, సంఘీభావానికి దోహదం చేసే విశిష్ట కళాకారులకు సకల సదుపాయాలు కల్పించాలి స్వాతంత్ర్య సమరయోధుడు, విద్వాంసుడు అయిన భర్త సదాశివం సజీవుడై ఉండగానే 'భారతరత్న' పురస్కారం సుబ్బులక్ష్మికి వచ్చి ఉంటే - ఆ ఆనంద ఘడియలు వేరుగా ఉండేవి సుబ్బులక్ష్మి విన్నాణం, విధేయత మానవుని సంక్షేమం కోసం ఆ క్షిషిలో భాగంగానే

ఆమె వితరణ శీలిగా మారింది. ఆమె సంగీతం భద్రపరచిన క్యాసెట్ల అమ్మకాల నుంచివచ్చే డబ్బును ధర్మసంస్థలకు (ఛారిటీస్) దఖలు పరచడం నిస్వార్థ భక్తి భావానికి పరాకాష్ఠ! భరతుడు ఊరకనే అనలేదు - 'అలంకారం లేని సంగీతం చంద్రుడు లేని రాత్రి, నీరులేని నది, పుష్పాలు లేని లత, ఆభరణాలులేని వనిత' అని! అందుకే కంచిపట్టు చీరలో 'క్షీరాబ్దికన్య'గా కనిపించే సుబ్బులక్ష్మి సంగీతం సర్వాలంకార శోభితం, సర్వత్రా అనుభూతిమయం!

- *శుక్రవారం 16, జనవరి 1998*

# చంద్రుడిలో వెన్నెల గంధాలు, నీటి కుప్పలూ!

లాభం లేనిదే వ్యాపారి వరదన పోడని మనకో సామెత! అలాగే ప్రపంచ బడా వ్యాపారులకు రాజకీయ ప్రతినిధి అయిన అమెరికా మాజీ ప్రెసిడెంట్ జార్జి బుష్ కూడా ఈ భూమ్మీద జరిగే దోపిడీతో సంతృప్తిపడ దలచుకోలేదు. రోదసీ యాత్రల ద్వారా గ్రహాంతర యానాల ద్వారా శాస్త్ర సాంకేతిక ప్రయోగాలు జరుపుతున్న మానవుడి ద్వారా చంద్రలోకంలో వ్యాపారకాలనీలు ఏర్పాటుచేయాలని ఒకప్పుడు ఆయున సూచనప్రాయంగా ప్రతిపాదించాడు. అది 1989 జూలై 24. 'ఇక వచ్చే శతాబ్దం - నూతన శతాబ్దం. తిరిగి చంద్రమండలానికే ప్రయాణం. భవిష్యత్‌లోకే మన చూపు. అయితే ఈసారి అక్కడ స్థిర నివాసమేగాని తిరుగు టాపాకట్టే ఆలోచన ఉండదు'. ఈ మాటలతో బుష్ చంద్రమండలంలో కూడా వ్యాపార నాగరికతకు బ్లూప్రింట్ అందజేశాడు! సుమారు ముప్పయ్యేళ్ళ నాడు చంద్రలోకాధినేత కాగలిగిన మానవుడు ఆనాటినుంచి ఆ గ్రహరాశిని నివాసయోగ్యం చేసుకోడానికి చేస్తూ వచ్చిన ప్రయత్నంలో భాగమే గురువారంనాడు అమెరికా రోదసీ పరిశోధనకేంద్రం 'నాసా'కు చెందిన శాస్త్రవేత్తలు ప్రకటించిన సరికొత్త డిస్కవరీ! చంద్రుని అంతర్భాగంలో అపార జలనిధులు ఉన్నాయని 'ప్రాస్పెక్టర్' రోబో రోదసీ నౌక పరిశోధనలో తేటతెల్లమైనట్లు శాస్త్రవేత్తల అంచనా. చంద్రునికి చెందిన ఉత్తర - దక్షిణ ధ్రువాలవద్ద నీటి కుప్పలు రాశులుగా గడ్డకట్టుకుని ఉన్నట్లు వారు పేర్కొన్నారు. ఇదే నిజమైతే చంద్రమండలంపై తొలిమానవుడు పాదం మోపిన తరువాత ఇది మహద్ఘటనగా పేర్కొనాలి. చంద్రమండలాన్ని మానవ నివాస యోగ్యం చేయడానికి ప్రాథమిక అవసరమైన నీరు లభ్యం కావడం మానవేతిహాసంలో, శాస్త్ర విజ్ఞాన చరిత్రలో మరో మహోత్తర పరిశోధనగా, విజయంగా ఈ పరిణామాన్ని సంభావించుకోవచ్చు. సౌర కుటుంబ రహస్యాలను ఛేదించి, మానవాళికి వాటి మంచి ఫలితాలను పంచిపెట్టడానికి గత నాలుగు దశాబ్దాలుగా సాగుతున్న రోదసీ యాత్రలవల్ల, గ్రహాంతర యానాలవల్ల కొన్ని అంశాలు రుజువయ్యాయి. మరికొన్ని ఇంకా ఊహాగానాలుగానే మిగిలిపోతున్నాయి. మారినర్లు, మిర్‌లు, అపోలోలు, వైకింగ్‌లు,

చంద్రుడిలో వెన్నెల గంధాలు, నీటి కుప్పలూ!

వాయేజర్లు, యులిసెస్‌లు - ఇత్యాది రోదసీ నౌకలు జరిపిన పరిశోధనలు శుక్ర, కుజ, గురు గ్రహాలలో జీవరాశి ఉనికికి సంబంధించిన సమస్యలను ఇంకా పూర్తిగా నిగ్గుతేల్చలేదు. జీవరాశి మనుగడకు అవసరమైన రసాయన ప్రక్రియల సౌలభ్యత గురించి, మూలధాతువుల ఉనికి గురించి, వాటి సంయోగ క్రియల గురించీ పూర్తి తబిశీళ్ళు ఇంకా మనకు అందవలసే ఉంది. అయితే మహాకవి శ్రీశ్రీ అన్నట్టు అందాకా - 'ఎల్లుండి ఏ తమాషా జరుగుతుందో / ఎవ్వడూ చెప్పలేడంటే నమ్మండి... పదార్థ విజ్ఞాన శాస్త్రం అమోఘంగా వికసిస్తోంది/ ప్రాణం స్వభావం ఏమిటో పరిశోధనలు సాగుతున్నాయి/ ఉత్తర ధృవంలో వ్యవసాయం/ ఒకప్పుడు జరిగి తీరుతుంది?' సాగుభూమి కావాలంటే నీరుండాలి. ఆ వనరు లభ్యంకావాలంటే అపారమైన జల సంపద అవసరం. అయితే నిన్న మొన్నటి వరకూ చంద్రోపరితలానికి, దాని అంతర్భాగానికి సంబంధించిన సమాచారం ఏం చెప్పింది? చంద్రునిలో ఒకప్పుడు మంచు గడ్డకట్టి ఉంది. కాని అది కరిగిపోయి గుంటలు/ కందకాలు (క్రేటర్స్) ఏర్పడ్డాయి అని. కాని అక్కడ పగటివేడి 214 డిగ్రీలుందని శాస్త్రవేత్తలు చెప్పినప్పుడు, అంత వేడిలో మంచు ఎలా ఉంటుంది? ఈ వేడిలో జీవరాశి ఎలా మనగలుగుతుంది? ఈ అనుమానాలను ఇప్పుడు పక్కకు నెడుతుంది 'నాసా' శాస్త్రవేత్తలు 'ప్రాస్పెక్టర్' రోబో ద్వారా అందిస్తున్న పరిశోధన ఫలితం. చంద్రమండలంలో నీరు, ఖనిజాలు, సహజ వాయువులు ఏ మేరకు ఉన్నాయో తెలుసుకోవడం 'ప్రాస్పెక్టర్' లక్ష్యం. చంద్రుని ఉత్తర, దక్షిణ ధ్రువాలలోని గడ్డకట్టి ఉన్న మంచు కుప్పలను కదిలించి చూసిన రోబో యంత్రం అక్కడ జల నిధుల ఉనికిని పసికట్టింది. శుక్ర, కుజ (అంగారక), గురు గ్రహాలలో జరుగుతున్న పరిశోధనలు కూడా జీవరాశికి నివాసయోగ్యమైన ప్రాథమిక వనరుల గురించి నిగ్గుతేల్చడం కోసమే. ఈ రోదసీ పరిశోధనల వల్ల ఒక రహస్యంమాత్రం బయటపడింది - అప్పుడప్పుడు పతనమయ్యే గ్రహశకలాల మృత్తికా గర్భాలలో కొన్నివందల కోట్ల డాలర్ల విలువైన ఇనుము, బంగారం, ప్లాటినం ఖనిజ సంపద దాగి ఉందని, ఈ ఉద్దేశంతోనే, కుజ - గురు గ్రహాల మధ్య తారాట్లాడే గ్రహశకలాలలోని సంపదను మరింతగా పరిశీలించేందుకుగాను ఈ గ్రహాలపై రోదసీ నౌకల్ని శాస్త్రపరికరాలతో దించాలన్న ఆలోచన రావడం! అంతేగాదు, ఈ విజ్ఞాన యాత్రలు ముందు ముందు రోబో టెక్నాలజీని, చంద్రభూగర్భ శాస్త్రాన్ని **(Lunar geology)** మరింతగా సుసంపన్నం చేయబోతున్నాయి. చంద్రమండలంలో తొలిపాదం మోపిన ఘడియలలో వ్యోమగామి

నీల్ ఆమ్‌స్ట్రాంగ్ తాను వేసిన అడుగు ఓ చిన్న అంగ మాత్రమేనని, కాని అది మానవాళికి మాత్రం జాంబవంతుని అంగలాంటిదనీ వర్ణించాడు. నిజంగా 'ప్రాస్పెక్టర్' తాజాయాత్ర ఎంతటి బృహత్ సంఘటనో శాస్త్రవేత్త స్కాట్ హబ్బార్డ్ చెప్పాడు. చంద్రునిలోని విస్తారమైన ప్రాంతంలో నీటి బుగ్గలున్నాయని కనిపెట్టిన నేటి పరిశోధనకు పూర్వరంగాన్ని 1994 లోనే సైనిక ప్రయోజనాల కోసం జరిపిన తమ పరిశోధనలో భాగంగా అమెరికా పంపించిన 'క్లెమెంటైన్' రోదసీ నౌక సమకూర్చి పెట్టిందని చెప్పాలి! కొన్ని బిలియన్ల టన్నుల మేర నీటి కుప్పలున్నాయని చూచాయగా ఆ ప్రయోగం వల్ల వెల్లడయింది. శత్రువులు ప్రయోగించే మిస్సైల్స్ రాకపోకలను పసిగట్టే 'సెన్సార్స్'ను పరీక్షించడం కోసమే ఈ నౌకను ఆనాడు వదిలారు. చంద్రలోకంలో వేయవలసిన 'తిష్ఠ' గురించి జార్జిబుష్ వెలిబుచ్చిన ఆకాంక్ష వెనక అసలు రహస్యం - సైనిక ప్రయోజనాలని కూడా మనం మరవరాదు. కాని అదే సమయంలో కృత్రిమోపగ్రహాల ద్వారా రిమోట్ సెన్సింగ్ వ్యవస్థ అందుబాటులోకి వచ్చిన తరువాత - దేశాల పెట్రోల్ వనరులు, ఖనిజాలు ఇతర సహజ సంపద, జలరాశుల ఉనికిని గురించి సమాజ ప్రయోజనాలకు ఉపకరించే పరిశోధనలు మానవాళికి సత్ఫలితాలు ఇస్తున్నాయనీ మరవరాదు. రోదసి నుంచి అప్పుడప్పుడూ మేగాతివేగంతో దూసుకువచ్చే నక్షత్రాలుగాని, గ్రహశకలాలుగాని పాలపుంత కేంద్ర స్థానాన్ని 'ఢీ'కొని పెద్దపెద్ద కందకాలు (black holes) ఏర్పడడానికి కారణమవుతున్నాయి. ఈ శకలాలు సెకండుకు 600 మైళ్ళ వేగంతో దూసుకు వస్తుంటాయని శాస్త్రవేత్తల అంచనా. ఇప్పుడు చంద్రమండలంలో జలరాశిని, ఇతర ఖనిజ వనరులను కనుగొనడానికి ఉద్దేశించిన రోబో రోదసీ నౌక లాంటిదాన్నే మరొకటి అంటార్కిటికాలో ఘనీభవించిన సాంద్రజల రాశిని ఛేదించడానికి త్వరలో ప్రయోగించబోతున్నారు. గడ్డకట్టిన హిమరాశిని ఛేదించే ప్రక్రియను ఇవాళ 'రోబో' యంత్ర సహాయంతో మానవుడు ప్రయత్నించవచ్చుగాని, ప్రపంచ సృష్టి పరిణామక్రమంలో వందకోట్ల సంవత్సరాల కాలంలో కూడా ఈ పని జరిగిందని గుర్తించాలి. హిమరాశిని కరిగించడానికి ప్రకృతి సహజంగా జరిగిన ఈ ఘర్షణ తొలిరోజుల్లో భూమిని కూడా కుమ్మింది. అంతేగాదు, బుధ, చంద్ర గ్రహాలను కూడా ప్రకృతి కుమ్మి విడిచిందని శాస్త్రవేత్తలు గ్రహించారు. కాకపోతే అప్పటికీ ఇప్పటికీ తేడా అల్లా - సాంకేతిక పరిజ్ఞానం మరింత అందుబాటులోకి వచ్చినందున గ్రహాలను అనుగ్రహింపచేసుకొని మానవ నివాసయోగ్య కేంద్రాలుగా వాటిని మలచడంలో భాగంగా ప్రాణాధార ధాతువుల కోసం మానవుడు నేడు వెంపరలాడుతున్నాడు!

**చంద్రుడిలో వెన్నెల గంధాలు, నీటి కుప్పలూ!**

ఇటీవల కాలంలో బుధ, చంద్ర రాశులలో జరిపిన రోదసీనౌకా యాత్రలు గ్రహాంతర్భాగంలో నిక్షిప్తమై ఉన్న మంచు గుట్టలను బయట పెట్టాయి. 'గురు' గ్రహానికి చంద్రుడుగా అవతరించిన 'యురోపా' ఉపగ్రహంపై కూడా గడ్డకట్టిన మంచు కుప్పలున్నట్టు 'గెలీలియో' రోదసీ నౌక పరిశోధనల్లో వెల్లడైంది. ఫ్రెంచి శాస్త్రవేత్తల అంచనా ప్రకారం, ఉల్కల ద్వారా, శిలా సదృశమైనగ్రహ శకలాల ద్వారా భూమికి ఏడాదికి 300 టన్నుల చొప్పున దుమ్ము, ధూళి చేరుకుంటోంది. ఈ గ్రహాంతర యానాల పరిశోధన ప్రధాన ఉద్దేశం - గడ్డ కట్టుకుపోయిన హిమానీ గర్భాలలో జీవరాశి ఉండి ఉండాలన్న ఆశ. 'కుజ' గ్రహ ఉపరితలాన్ని ఒకప్పుడు జలరాశులు భారీ ఎత్తున ముంచెత్తాయని 'పాత్‌ఫైండర్' -రోదసీ నౌక జరిపిన ప్రయోగాలు వెల్లడించాయి. అలాగే చంద్రమండల యాత్ర జరిపిన వ్యోమగాములు భూమికి తెచ్చిన చంద్రశిలలను పరిశీలించినపుడు - చంద్రమండలంలో ఇనుము, గంధకం, కాల్షియం, అల్యూమినియం ఖనిజ వనరులు సమృద్ధిగా ఉన్నట్టు స్పష్టమైంది. అంతేగాదు, నైట్రేట్స్ కూడా అపారంగా ఉన్నట్టు తేలింది. చంద్రుని కొంత భాగంపైన ఎప్పుడూ సూర్యరశ్మి సోకుతూనే ఉంటుంది కాబట్టి, హైడ్రోజన్, హీలియం వాయువుల సహాయంతో జీవరాశి మనగలగడం సంభవమని కూడా భావిస్తున్నారు. ఎందుకంటే, ఆస్ట్రేలియాలో ఒకసారి గ్రహశకల పతనంవల్ల రాలిన 'ఐరన్ ఆక్సైడ్' (కొన్నాళ్ళు ఈ పదార్థాన్ని పేపర్‌వైట్‌గా కూడా కొందరు వాడారట) నుంచి ఆక్సిజన్‌ను జయప్రదంగా తీయగలిగారు. ఈ ఆక్సైడ్ శిలను చంద్రకర్మాగారం (లూనార్ ఫ్యాక్టరీ)సహాయంతో నుసిగా మార్చుకోవచ్చు. తద్వారా దీన్నుంచి ప్రాణవాయువును తోడుకోవచ్చునని తేల్చారు **("The next 500 years": Life in the coming Millennium!)** అంతేగాదు, చంద్రమండలంలో లభించే కొన్ని పదార్థాలు భూ కక్ష్యలో ప్రయాణంలో ఉన్నప్పుడే కాదు, భూమి మీదనే ప్రాణికోటికి ఉపకరిస్తాయి. ఇందుకు ఉదాహరణ: 'హీలియం-3' అనే వాయువు. ఇది ప్రపంచంలో అపారంగా దొరకగల వాయువుగా శాస్త్రవేత్తలు కనుగొన్నారు. చంద్రతలంలో దొరికిన 'హీలియం-3' వాయువు చాలా యాదృచ్ఛికంగా లభించిందని మరవరాదు. కాని ఇదే వాయువు భూ ఉపరితల గర్భంలో లభించదు. ఈ గ్యాస్ వ్యాప్తి ఎలా సాధ్యం అయింది? వందలకోట్ల సంవత్సరాలపాటు చంద్రోపరితల పొరలు **(crust)** సౌరవాయువుల తాకిడికి లోనవుతూండడం వల్లనేనని శాస్త్రవేత్తలు నిర్ధారించారు. కాని ఈ గ్యాస్ ఇంతవరకూ భూమికి చేరలేదు. సూర్యగర్భంలో ప్రతి సెకండుకు 40 లక్షల టన్నుల హైడ్రోజన్

వాయువు హీలియంగా మారిపోతుంటుందని అంచనా. కనుక 'హీలియం-3'వాయువులాగానే, భూమ్మీద అరుదుగా గాని లేదా అసలు దొరకనే దొరకని అనంతమైన పదార్థాలు కూడా చంద్రమండలంలో దొరుకుతాయని, తద్వారా జీవరాశిపై అద్భుతమైన ప్రభావం వాటివల్ల సాధ్యమనీ శాస్త్రవేత్త ఆర్థియన్ బెర్రీ వెల్లడించాడు. అంతేగాదు, హానికరంగాని పరిశుద్ధమైన, కారుచౌకైన ఈ గ్రహ ఇంధనాన్ని జీవరాశి మనుగడకు మనం వాడుకోవాలనుకుంటే - అది అపారంగా లభ్యమవుతుంది. ఈ ఇంధన వనరులు కొన్ని లక్షల సంవత్సరాలపాటు ఉంటాయి. అయితే ఆ ఇంధనం చంద్రమండలం నుంచి మాత్రమే మనకు లభ్యమవుతుందని బెర్రీ బల్లగుద్ది చెబుతున్నాడు! అలాగే క్రాఫ్ట్ ఎహ్రిక్ అనే శాస్త్రవేత్త కూడా రానున్న కాలంలో మానవుడు ఇప్పటిలా ఏ ఒక్క భూ ప్రపంచానికో అధినేతగా మిగిలిపోడని రేపు చంద్రలోకాన్ని ఆక్రమించుకోవడంతో బహు నాగరికతలకు ఆసామిగా మారతాడనీ జోస్యం చెబుతున్నాడు **("birth of poly global civilization")** ఈ చంద్ర స్థావరాలను - పలు ధాతువులను, వాటిరాశులను నిర్ణయించిన మెండెల్ 'లూనార్ బేసెస్' అన్నాడు. అంతేగాదు, శాస్త్రవేత్త ఎహ్రిక్ రేపటి చంద్రలోకపు మానవ స్థావరాల నిర్మాణాన్ని రెండవ నాగరికతగా పేర్కొంటూ **("selonopolis")** ఇలా సెలవిచ్చాడు: నాగరికత వర్ధిల్లడానికి సరిపోయిన హంగులన్నీ చంద్రమండలంలో ఉన్నాయి. మన భూలోకపు ఆర్థిక వ్యవస్థకన్నా ఉన్నతమైన, బలీయమైన పారిశ్రామిక వ్యవస్థ విజయపథంలో ఉన్న న్యూక్లియర్, సైబర్నెటిక్, మెటీరియల్ ప్రోసెసింగ్ టెక్నాలజీల సహకారంతో పటిష్టమైన పారిశ్రామిక ఆర్థిక వ్యవస్థ నిలదొక్కుకోవడానికి 'చంద్ర నాగరికత' అపారమైన అవకాశాలు కల్పిస్తుంది. దానివల్ల ఫలితం - ఒకనాడు మరుభూమిగా పడి ఉన్న చంద్రోపరితలం కాస్తా ఎడారి జీవితంలో ఒక మహా ఒయాసిస్సుగా మారనుంది. చంద్రలోకంలో పుట్టబోయే భావి తరాల వారికి చంద్రమండల మంత శక్తిమంతమైన సుందరమైన ప్రదేశం మరొకటి ఉండబోదు. అంతగా నివాసయోగ్యం కాగల ఈ చంద్ర నగరికి పోలికల్లా ఒక్కటే - అడవుల్లో ఆకూ అలమూ తినుకుంటూ చిమ్మచీకట్లతో కూడిన ఆ కాంతార బుయ్యారాలనుంచి బయటపడి కమ్మని సువిశాల పచ్చిక బయళ్ళలోకి మానవుడు తొలిసారిగా అవతరించిన శుభఘడియలు!! జలరాశి ఉంటేనే జనం ఉనికి. శ్రీనాథుడు చుక్కలను కూడా చిక్కని అమృత జలరాశులుగా ఉపమించాడు!' 'చుక్కలా ఇవి గావు సురలోక వాహినీ విమలాంబు కణకదంబములు కాని...' అని. అంతే మరి - మానవుడి మనస్సూ,

మహస్సూ అలాంటిది. అది 'కాలాన్నీ నిద్రపోనివ్వదు', నీ కలాన్నీ నిద్రపోనివ్వదు. కాగల కార్యాన్నీ నిద్రపోనివ్వదు. అలా అనంత లోకాలలోకి మెడలు రిక్కించి పరిశోధిస్తూనే ఉంటుంది. జీవకణాల్లో చైతన్యం మూర్తీభవిస్తున్నంత కాలం మానవుడి ఈ తపన ఆగదు, గ్రహాంతర జీవనానికి కూడా అది అర్రులు చాస్తుంది. కవి ఎన్.గోపి అనలేదూ: 'చంద్రుణ్ణి ఎన్నిసార్లు రుద్దినా /అరిగిపోడు / వెన్నెల గంధం వస్తూనే ఉంటుంది/ చుక్కలను ఎన్నిసార్లు తడిమినా విరిగిపోవు/ పువ్వులుగా విచ్చుకుంటాయి'! మనిషి పరిమళించడమే జీవితమైనప్పుడు ఆ పరిమళాన్ని గ్రహాంతరాలకు వ్యాప్తిచేయడం వాడి ఉత్కంఠకు నిదర్శనం కాదా?!

*(ఆదివారం 8, మార్చి 1998)*

# సదాస్మరణకు తెచ్చే తొలి గిరిజన కథ 'చెంచి'

'సామాజిక స్పృహ' అన్న పదాన్ని అవహేళన చేస్తూ ఈ మధ్య ఓ వెర్రిబాగుల టి.వి.ఛానల్ వాడు హాస్యం పేరిట ఓ చెత్త సీరియల్ నడుపుతూండడాన్ని ప్రేక్షకులు గమనించి ఉంటారు. తనను తాను మైమరచినవాడికీ, కడుపు నిండిన వాడికీ సమాజం గురించి, సామాజికుల గురించీ, సాంఘిక ఆర్థిక పరిణామాల గురించీ పట్టించుకోనవసరం లేకపోవచ్చు. కాని 'పూటబత్తెం పుల్లవెలుగు'గా జీవన సమరంలో కొట్టుమిట్టాడే సామాన్య మానవుల బాగోగులను పట్టించుకొని తన బాధ వారి బాధగా కాకుండా, వారి బాధను తన బాధగా భావించే రచయితలను మనసారా అభినందించక తప్పదు. అది 1930-40 మధ్యకాలం. జీవితం నడిపొద్దుకు చేరకుండానే అస్తమించిన వర్ధిష్ణువులైన రచయితలలో, మేధావులలో ఒకరు నెల్లూరు జిల్లా గూడూరు రాజేంద్రరావు. ఉన్నత జీవిత విలువలకు, ఉత్తమ సంస్కారానికి పెట్టింది పేరుగా ఎదిగివస్తున్న రాజేంద్ర బొబ్బిలి సంస్థానంలో ఇంగ్లీషు ట్యూటర్‌గా కొన్నాళ్ళు, నెల్లూరు జిల్లా బోర్డు సెక్రటరీగా ఇంకొన్నాళ్ళు, నెల్లూరు, కడప, కర్నూలు, పెద్దాపురం మున్సిపల్ కమిషనర్ హోదాలో మరికొన్నాళ్ళు, గూడూరులో రిక్రూటింగ్ ఆఫీసరుగా కొన్నాళ్ళూ పనిచేసినా - సాహిత్య వ్యాసంగాన్ని ఒక వ్యసనంగా కాకుండా సామాజిక బాధ్యతగా చేపట్టిన యువకుడు. అయితే పబ్లిసిటీ గొడవ లేని వాడు కాబట్టి రాశిలో గాకున్నా వాసిలో గణుతికెక్కిన కొన్ని రచనలు ఆయన చేశాడు. సీరియస్ రచయితగానే గాక హాస్య రచయితగా, కవిగా, కథకుడుగా, నాటక కర్తగా, వ్యాసకర్తగా, వార్తాకథకుడిగా తన పలుకు చూపిన వ్యక్తి రాజేంద్ర. అజ్ఞాతంగా, అశ్రద్ధతో ఉండిపోయిన యాభైయేళ్ళ నాటి ముద్రితాముద్రిత రచనలు ఎనిమిదింటిని వెలుగులోకి తెచ్చిన పాత్రికేయుడు గోపాలకృష్ణ. ఈ ఎనిమిది రచనలూ ఆధునిక తెలుగు సాహిత్యంలో రాజేంద్ర స్థానాన్ని నిర్ధారించగల ఆణిముత్యాలుగానే పరిగణించాలి. ఎందుకంటే విభిన్న కోణాల నుంచి జీవితాన్నీ, సమాజాన్ని దర్శించిన రాజేంద్ర రచనల్లో - మానవతా విలువలున్నాయి, హేతువాద దృక్పథం ఉంది, ప్రజా ప్రయోజనాలకు దూరంగాని తాత్వికత ఉంది, ప్రేమ ఉంది, ప్రేమతత్వం ఉంది, అందుకోలేని అంతస్తుల

వల్ల కుమిలిపోయే సామాన్య మానవుల బతుకు వెతలున్నాయి. ప్రేమానురాగాలకు మూలం ఆస్తులు అంతస్తులూ కావనీ ఆదరణ, ఆప్యాయతలేనని చాటిచెప్పే నీతిసూత్రం ఉంది. 1930లలో వచ్చిన ఆర్థిక మాంద్యం నాటి పరిస్థితుల ప్రభావం తాలూకూ స్పృహ ఉంది. సంకలనకర్త గోపాలకృష్ణ ఈ పుస్తకానికి 'చరమలేఖ' అని పేరు పెట్టారుగాని, తెలుగు కథా సాహిత్యాన్ని సుసంపన్నం చేయగల కథాసారమతి 'చెంచి' కథను ఈ సంపుటికి మకుటంగా పెట్టి ఉంటే బాగుండేది. ఎందుకంటే, చరిత్రకారులు తొలి హరిజన కథగా పేర్కొనే వేలూరి శివరామశాస్త్రి 'ఓబయ్య' తరువాత రాజేంద్ర రాసిన 'చెంచి' తొలి గిరిజన కథ. దళిత బతుకుల్లోని దైన్యస్థితిని, సాంఘిక, ఆర్థిక దోపిడీని, లైంగిక సంబంధమైన వేధింపులనూ, కాబూలీవాలాల 'జలగ పీడనా' సంస్కృతిని 'చెంచి'లో కళ్ళకు కట్టినట్టు రచయిత చూపాడు. 'చెంచి' భర్త చెంచుమామ శారీరక రుగ్మతవల్ల కంటి చూపుకోల్పోతే, సామాజిక అన్యాయంవల్ల చెంచి ప్రాణం కోల్పోతుంది. సాంఘిక ఆర్థిక సమస్యలను అర్థం చేసుకున్న మేర స్త్రీ వాచ్యంగా చెప్పిన తొలి కథ 'చెంచి'. ఇందుకు కర్మసాక్షి రచయిత కథా సంవిధానానికి పూర్వరంగంగా ఎంపిక చేసిన కలిగిరి చెరువు. నాడు కబూలీవాలా వద్ద అప్పుల బాధతో అణగారిన కుటుంబం 'చెంచి'ది కాగా, నేడు అవే అప్పుల బాధతో - నిమ్మకు నీరెత్తినట్టు కూర్చున్న ప్రభుత్వాల నిరాసక్త యోగం ఫలితంగా ఆత్మహత్యలు చేసుకోవడం రైతుల పరమయింది! వ్యాపార నాగరికతలో మానవ విలువలకు చోటు ఉండదు. కాని లేమిలో కూడా, ఎవడో పసరు పోస్తే చూపు కోల్పోతున్న చెంచు మామని ఆర్ద్రతతో ఆదుకోజూచిన 'చెంచి' అన్న మాటలు జానపదుల మధ్య ఉండే సహజమైన అతినిర్మలమైన అనురాగాన్ని నిరూపిస్తాయి, మన గుండెల్ని పిండుతాయి: 'నీ కళ్ళు బాగలేకపోతే నా కన్నొకటిస్తాలే మావా! నీకొకటి నాకొకటీ చాలు'! కాబూలివాడు వసూళ్ళకొచ్చి కామాంధుడైనప్పుడు 'చెంచికి కుక్కభయం కన్నా మనిషి భయం ఎక్కువైంద'న్నప్పుడు రచయిత సామాజిక స్పృహకు నీరాజనాలర్పించ బుద్ధేస్తుంది. స్క్రీన్‌ప్లేలా నడిచిన ఈ కథలో నెల్లూరు మాండలికాల సొగసులెన్నో. ఇందులో 'మోజాల కిర్రు' శబ్దాలు వినిపిస్తాయి, 'బొంత నిజారులు' కనిపిస్తాయి; 'గుడ్డలు జవురు' కోడం వినిపిస్తుంది. పేదోళ్ళు ఎక్కడోచోట 'కుదవుండి' (చాకిరీ) బాకీలు తీర్చడం చూస్తాం; ఇందులో 'తూర్పు రేకలు మైలవిడు'స్తాయి, 'పొద్దు కొండలో పడు'తుంది, ఆకాశం 'తేటపుల్లనీళ్ల కుండ'లా కనిపిస్తుంది, చినుకులు 'పుటపుట రాల్తుం'టాయి!! రాజేంద్ర 'చరమ లేఖ'

ప్రేమాస్పదమైన కవిత. మలయాళీ కవి వల్లథోల్ కవితకు అనువాదం. ఇది ఒక సామాన్య పల్లెటూరు కాపు పడుచు ప్రేమ తత్పరత అందం, ప్రతిభ, ముప్పిరిగొన్న ఒక మూర్తిని తాను అందుకోలేనప్పుడు ఆమెలో ఏకకాలంలో మొదలైన అంతర్వేదన, సంయమనం, సమన్వయం ఇందులో ద్యోతకమవుతాయి. 'యామిని (రాత్రి) చేయి చాపి సూర్యుణ్ణి అంటగలదా? అమోఘమైన వాక్సుధా ధారలను తన నిర్భాగ్యపు నాలుక స్మరింపగలదా' అనుకుంటుందా పల్లె పడుచు. అదొక రసమయ కవిత, అందని ప్రేమకు పరసీమగా నిలిచిన ఒక జీవితం! 'దివ్యసంభాషణం' రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో రక్తధారలు చిందించిన వీరుల సంస్మరణ. రచయిత ఇందులో 'నెత్తురు కాలువల్లాంటి కారు మబ్బులు' చూపి కల్లోల పరిస్థితుల్లో కుమిలిపోతున్న ప్రపంచానికి ఆశావహమైన ఊరట కల్పించడానికి ప్రయత్నిస్తాడు. 'మేఘాలు వర్షిస్తే రక్తధారలు కురుస్తాయేమో'నని భయపడుతున్న పాపను ఓదారుస్తూ ఒక ముదిమానిసి 'లేదు, మబ్బు లెగిరిపోతాయి, ఆ ప్రళయం రాదు, జగతి రుధిర్ణార్ణవం కాదు' అని బరోసా చెబుతాడు! ఈ సందర్భంగా రచయిత ఆ యుద్ధంలో నేలకొరిగిన భారతీయుల్ని తలచుకొంటాడు: 'నల్లవీపులు బీటలెగయగ/వేడి రక్తము చింది పారగ/ జాటి వ్రేట్ల సహింపజాలక/ మానముల విడనాడ నేరక' ప్రాణసుమాలు అర్పించిన వారికి జోహారులర్పిస్తాడు. ఆశావాది అయిన రాజేంద్ర నిఘంటువులో నిరాశకు చోటులేదు. కనుకనే కల్లోలం నుంచే ఎవరో ఒక కమలనాభుడు పుట్టుకు వస్తాడు, 'ధర్మ సంస్థాపనార్థం' ఒకరు అవతరిస్తారని చెబుతాడు! సంకలన కర్త ఈ నాటకానికీ చైనీస్ మహారచయిత లూసన్ రాసిన 'ది పాసర్స్ బై'కి చాలా దగ్గర పోలికలున్నాయని చెబుతూనే 'దివ్య సంభాషణం' దీనికి అనువాదం కాకపోవచ్చుననడానికి చెప్పిన కారణాలు సమర్థనీయంగా లేవు. ఎందుకంటే లూసన్ రచనలు నలభయ్యో దశకానికి గాని ఇంగ్లీషులోకి తర్జుమా కాలేదు కాబట్టి, అనువాదానికి గాని అనుసరణకు గానీ ఆస్కారం లేదంటారు సంకలనకర్త. కాని లూసన్ రచనలన్నీ 1934 నాటికే ఇంగ్లీషులోకి తర్జుమా అయ్యాయి. 'దివ్య సంభాషణం' రచనకు ప్రేరకమైన 'ది పాసర్స్ బై'ను లూసన్ 1925లో రాశాడు. ఇది 'వైల్డ్‌గ్రాస్' అన్న సంకలనంలో భాగంగా అచ్చయిందని గ్రహించాలి. 'దివ్య సంభాషణం' వచ్చింది 1937లో. 'రాజా' నాటకం విశిష్టమైనది. పుక్కిటి పురాణ పాత్రలకు 'ఆధునికత'ను అద్ది ప్రదర్శించి సొమ్ము చేసుకోడానికి కొందరు ప్రయత్నిస్తే సామాజిక ప్రయోజనాన్ని సాధించడం కోసం మరికొందరు ప్రయత్నిస్తారు. పురాణ గాథలకు నూతన భాష్యం చెప్పిన త్రిపురనేని

రామస్వామి 'సూతపురాణం' ద్వారా చేసిన పని అదే; ఏటుకూరి వెంకట నరసయ్య చేసిన పనీ అదే. తరువాత 'రాజు'లో రాజేంద్ర మానవతా విలువల్ని చొప్పించడానికి చేసిన ప్రయత్నమూ అదే. రాజధర్మానికీ, మానవుని మనస్సుకూ మధ్య ఘర్షణ చూపించాడు; పురాణ హిరణ్యకశిపుడికీ, 'రాజు'లోని హిరణ్యకశిపుడికీ తేడా ఉంది. 'రాజు' పాత్ర భౌతిక వాదిగాని పురాణ రాక్షసుడు కాడు. దేవుడున్నాడా లేడా అన్న ప్రశ్న అతణ్ణి సదా వేధిస్తూంటుంది. సంశయ వాదిగానే గాక (Agnostic) భౌతిక వాదిగా కూడా ఇందులో 'రాజు' అవతరిస్తాడు. లోకమహేశ్వరుడొకడుండి, ఈ జగన్నాటకాన్ని నడిపిస్తున్నాడని నమ్మడానికి అతని మనస్సొప్పదు. లోకరీతి ప్రకారం దండాలుపెట్టి ఏదో ఒక 'శక్తి'ని కొలవడానికి అతని బుద్ధి ఒప్పదు. అలాంటి శక్తి లేదని దండోరా వేయడానికి అతని అంతరాత్మ వెనక్కి పీకుతుంది. అయితే అతని ఉద్దేశంలో దైవభావన ఒక కల్పన కాబట్టి, మోసపూరితమైన యుక్తివాదాల్ని చెండాడాడు. పురాణ హిరణ్యకశిపుడు రాక్షస స్వరూపుడైతే 'రాజు'లోని పాత్ర జిజ్ఞాసువు, ప్రేమ పాత్రుడు. ఇందులోని ప్రహ్లాదుడు, నారదుడు కూడా సరికొత్త కోణం నుంచి దిద్దితీర్చిన పాత్రలు. 'ప్రజ్ఞకొలదీ కర్మనెదిర్చి పెనుగులాడి, జయించి, నశించి, జన్మించుచున్న జీవరాశికి (ఇది పరిణామవాదం) దేవుడు సాక్షి కాదు సోమరిపోతు. లోక మహేశ్వరుడనే వాడు సోమరిగా ఉండకూడదు, సోమరిగా ఉండేకన్నా లేకుండడమే మేలని' అంటాడు ఈ 'రాజు'లోని పాత్ర. చూడని దాన్ని నమ్మేదెట్లా అని ప్రశ్నించుకొని ఉన్నదానిని లేదనడంకన్నా లేనిదాన్ని ఉన్నదనడం క్షుద్రవాదంగా జమకడ్తాడు హిరణ్య కశపుడు. పోతనలాంటి పరమభక్తుడికే 'కలడు కలండనెడు వాడు కలడో, లేడో' అన్న అనుమానం వచ్చింది కదా! రచయిత రాజేంద్రకు బౌద్ధంలోని సుగుణాలు ఒంటపట్టబట్టే, రాజు ద్వారా భౌతిక సత్యాల్ని పలికిస్తాడు: 'సముద్రాన్ని చేరిన జలబిందువు మళ్ళీ వేరవుతుంది. రాలిపోయిన ఫల బీజం తిరిగి వృక్షమవుతుంది' అలాగే ప్రతి జీవికి జనన మరణాలు సహజం అంటాడు. ఈ చక్రభ్రమణం అని వార్యం, అది జీవరసాయన ప్రక్రియ!

అలాగే 'నాటకం' అనే రచన హాస్యభరితమైన ఓ మంచి ప్రహసనం. ఆనాటి పౌరాణిక నాటకాలు, నాటక కంపెనీలు పడిన కష్టనష్టాలకు ప్రదర్శనలో సాధక బాధకాలకు, రకరకాల నాటకాల రాయుళ్ళ ప్రవర్తనలకూ, సంభాషణలకూ వ్యంగ్యరూపకం ఇది. ఆనాటి ప్రసిద్ధ రంగస్థల నటుల పేర్లను స్ఫురణకు తెచ్చే విధంగా - పాత్రలను మడతపిల్లి బలరామశాస్త్రి అనీ, నల్లులతిర్రి దీక్షితులనీ, వదరువాయి లక్ష్మీపతీ అని, ఇలా

వ్యంగ్యీకరించాడు. కావ్యాలలో రమ్యమైనది నాటకం అని ఎంత చెప్పినా, తెలుగువాళ్ళు నాటకాన్ని చేజేతులా చంపుకొన్నారని చెప్పాలి. అయితే తెలుగునాట చచ్చిపోయిన నాటకరంగాన్ని ఇప్పటికైనా పునరుద్ధరించుకోడానికి 'నాటకం'లోని వర్ధనమ్మ చెప్పిన మాటైనా చెవికెక్కించుకోవడం అవసరం: 'మన సంసారం గొడవ ఎప్పటికీ ఉండేదేగాని, అదేమిటో తులశమ్మా నాకు మాత్రం నాటకమంటే పొయ్యే ప్రాణం లేచొస్తుంది. ఊళ్ళో నాటకం అంటే నాకు ఇంట్లో పండగలాగుంటుంది' అని! రూపకం లేదా నాటకాన్ని బతికించుకోమన్నది రాజేంద్రరావుఅభిలాష. ఈ నాటకం మరోవైపు దేశభక్తిని నూరిపోస్తుంది. కర్తవ్యం ఆలోచించకుండా దుఃఖంలో గడపడం మంచిది కాదని హితవు చెబుతుంది. ఇందులోని కవి ఆనాటి రాజకీయ ఆందోళనలను సవిమర్శకంగా చిత్రించిన రచన 'భరత రాజ్యం'. ధర్మంకన్నా వేరే తల్లి (జనని) ఉండదని బోధిస్తుందీ నాటకం. అంతేకాదు, కృష్ణపాత్రలో ఉన్న వదరువాయి 'భరతుడు కర్పూర హారతిచ్చి మంగళం పాడా'లంటే మరోపాత్ర (నల్లుల తిర్రి) అడ్డునిలిచి 'మంగళంకాదు, జాతీయ గీతం పాడితే మేల'ని గుర్తుచేయడం వాస్తవిక వాదానికి పట్టిన హారతి! చివరికి ఇందులోని 'అమర ప్రేమికుడు' రచన కూడా సామాన్య ప్రజాజీవితానికి విలువ ఇచ్చిన రచన. ఎనిమిదవ ఎడ్వర్డ్ రాజు (ఇంగ్లాండు) అతి బీదకుటుంబీకురాలైన వనితను ప్రేమించడాన్ని గాంధర్వంగా రాజేంద్ర 1930ల నాటికే ఆమోదం తెల్పడం అతని అభ్యుదయ భావజాలానికి నిదర్శనం. రాజేంద్ర ఈ రచనలన్నీ ఒక ఎత్తు, నాటకానికి 'విద్యాపాదకశక్తి' (1935 రచన) మరొక ఎత్తు! రచన ప్రయోజనాన్ని, నాటక ప్రయోజనాన్ని నిర్దిష్టంగా, నిర్దుష్టంగా నిర్వచించిన అమూల్య రచన ఇది. మానవ సమాజానికి, కావ్యకళకూ అవినాభావ సంబంధం ఉందనీ, వివేకం, రసావేశం -రెండూ మానవ జీవితాన్ని దిద్దితీర్చడంలో ఘనతరపాత్ర వహిస్తాయని నమ్మిన వాడు రాజేంద్రరావు. కనుకనే రూపకాన్ని రసభావభరితమైన దృశ్య కావ్యంగా భావించి దానికి ప్రేక్షకుల్ని విద్యావంతుల్ని చేయగల శక్తి (విద్యాపాదక శక్తి) ఉందని తేల్చాడు. ఆచార వ్యవహారాలకు బద్ధమై ఉండడమే విద్యకాదనీ, విశాలభావం కలదే విద్యనీ, విశ్వమే మహోన్నత పాఠశాల అనీ, ప్రకృతి ఆచార్యుడనీ, మానవ జీవితాన్ని ఉద్ధరించడమే అభ్యసించవలసిన పాఠమనీ చెప్తాడు. అవినీతికర కావ్యాలూ, నాటకాలూ, రచనలూ లోకకల్యాణాన్ని సాధించలేవనీ, సంఘ నాశనానికే దారితీస్తాయని అరవయ్యేళ్ళనాడే హెచ్చరించాడు. కళలు క్షణికాలు కావు, విశ్వశ్రేయాలని చెబుతూ 'లలిత కళలన్నింటి సారమే విశ్వజనీనత'- అన్నాడు.

అంతేగాదు,వేదాల్లా పాలనా దండంతో మానవుల్ని బెదిరిస్తే నీతి ఎదుగదన్నాడు. మానవునికి నాగరికత, స్వాతంత్ర్యాభిలాష పెరిగే కొద్దీ అధికార ముద్రలు తొడుక్కున్న శాసనాలేవీ పనిచేయవని తెగేసి చెప్పాడు. 'కథకాదు' అన్న రచనలో రైలు ప్రయాణంలో ఒక అనుభవగాధను, దాని పూర్వరంగాన్ని రాజేంద్ర వివరించాడు. అన్నా-చెల్లెళ్ల ప్రేమ పరసీమలకు చేరి చివరికి ఒకవిషాద ఘట్టంగా ఎలా పరిసమాప్తమైంది ఈ వాస్తవ గాథలో చూస్తాం. రాజేంద్ర రచనలు చదివితే - తేజోవంతంగా ఎదిగి వస్తున్న ప్రతిభావంతుడైన ఒక యువ మేధావి, జీవితం అనుమతించి ఉంటే మరెన్ని గొప్ప రచనలు మనకందించి ఉండేవాడో అనిపిస్తుంది. ఇవి చదువుతున్నంత సేపూ ఆ విషాద స్మృతి మనల్ని వెన్నంటుతూనే ఉంటుంది. అయితే మిలన్ కుండేరా అన్నట్లు, **Memory does not give us back the dead person's presence.** అయినా ప్రతిభావంతుడికి స్మృత్యంజలి ఘటించకుండా ఉండలేము!

*(ఆదివారం 8, ఫిబ్రవరి 1998)*

# అణగారిన ప్రజల ఆర్తనాదం 'అన్నలు'!

'**నువ్వు** నైజాం రాజు కాలం నాటి దొరల లెక్క వుండకూడదు. ఖద్దరు బట్టలేసుకున్న నాయకుల్లాగ వుండాలి... ప్రభుత్వానికి టోపీ పెట్టి పైసా పెట్టుబడి లేకుండా ఫ్యాక్టరీలు పెట్టొచ్చు. బ్యాంకులను దగా చేసి కోటీశ్వరులు కావొచ్చు. పైసలతో ఈ ప్రపంచంలో కొనలేనిదంటూ లేదు: అధికార పార్టీ టిక్కెట్టు కొనవచ్చు. ఎన్నికల్లో వోట్లు కొనొచ్చు. ఆ తర్వాత మంత్రి పదవి కొనవచ్చు. చివరికి ప్రభుత్వం ద్వారా ఈ దేశాన్నే అమ్మేయవచ్చు.'

తండ్రులకు ఇం'చక్కని' సలహాలిచ్చే కొడుకులుంటారా అని విస్తుపోకండి. పటేల్ బుచ్చిరెడ్డి కొడుకు ప్రవీణ్ అంత పనీ చేశాడు. వీర తెలంగాణా కళ్ళు విప్పకపోయి ఉంటే రైతాంగ ప్రజల్లో చైతన్యం అంతంత మాత్రంగానే ఉండేది. ఒకనాడు తెలంగాణాను తమ సొంత జాగీరుగా మార్చుకున్న జమిందారులు, జాగీర్దార్లు, దేశ్‌ముఖ్‌లు, మక్తేదార్లకు, వారి దొరతనాలకు రైతాంగ పోరాటం గండి కొట్టబట్టే ఇప్పటికీ ప్రజలలో చైతన్యం కొడిగట్టకుండా మరింతగా ప్రతీప్తమవుతోంది. బుచ్చిరెడ్డి, అతని కొడుకు ప్రవీణ్ ఈ దోపిడీదార్లకు, వారి ఆగడాలకు 'అన్నలు' నవలలో ప్రతినిధి పాత్రలు. బాల్యం అంటే ఏమిటో ఎరుగని చెహోవ్‌లాగా 'అన్నలు' నవలా రచయిత పులుగు శ్రీనివాస్ కార్మికుడుగా, పత్రికా రచయితగా పూటగడవని స్థితిలో గడిపిన సామాన్యుడుగా ఎదిగినవాడు. నవలా పాత్రలో ప్రవీణ్ చెప్పిన పై మాటలు 'దొరల పెనంలోంచి పోలీసుల పొయ్యిలోకి పడిన' జనాల జీవన పరిస్థితులను, ఆర్థిక పరిస్థితులనూ ప్రతిబింబిస్తున్నాయి. తెలంగాణాలో పోలీసు యాక్షన్ తర్వాత గ్రామ సీమల్లో కడచిన నలభై తొమ్మిదేళ్ళుగా సాగిన దోపిడీ క్రమ పరిణామానికి ఈ నవల అద్దం పడుతోంది. కాంగ్రెస్ ఉద్యమాలు, ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టు పార్టీల నేతృత్వంలో సాగిన ఉద్యమాలు ఒక మేరకు ఈ దోపిడీకి అడ్డుకొట్టినా, ఆ సుముహూర్తాన్ని ఆసరా చేసుకొని మరింత ముందుకు సాగి పాలకులు ప్రజాస్వామిక వ్యవస్థను పటిష్టం చేసుకోవడంలో విఫలమయ్యారు. ప్రజా చైతన్యాన్ని చూసి బెంబేలుపడి పట్టణాలకు

ఎగబాకిన దోపిడీ శక్తులు, చిల్లర దేవుళ్ళు పోలీసు యాక్షన్ తర్వాత తిరిగి గ్రామ సీమల్లో మరో రూపంలో పాగా వేయడమో లేదా పట్టణాలలో వ్యాపార దోపిడీకి పూనుకోవడమో జరిగింది. ఎక్కడున్నా గ్రామ సీమలపై ఏదో ఒక పద్ధతిలో తమ పట్టును వీడకుండా వీరు జాగ్రత్తపడుతూ వచ్చారు. ఈ పరిణామానికి తోడు కొత్తగా వచ్చిన 'నూతన ఆర్థిక సంస్కరణలు' గ్రామప్రజలను, రైతులను, వ్యవసాయాభివృద్ధిపై ఆధారపడిన చేతివృత్తుల వారిని ఎలా దెబ్బతీశాయో - ఈ వక్రగతి సామాజికంగా ఎంతటి అసంతృప్తికీ, అరాచకానికీ దారితీస్తోందో 'అన్నలు' నవల వివరిస్తోంది. దాశరథి రంగాచార్య ఒక సంభాషణలో అన్నట్టు 'ఇప్పటి తెలంగాణా పల్లెలను ఈ నవల బరిబద్దిలుగా చూపింది, లేంది చెప్పడంకన్నా ఉన్నది చెప్పడం కష్టం'! తన పరిసరాల్లో ఏం జరుగుతోందో కళ్ళారా చూడగలిగిన వాడూ, కష్టాలు స్వయంగా అనుభవించిన వాడూ, ఇతరుల కష్టాలకు స్పందించగలిగిన వాడూ మాత్రమే ఈ పని చేయగలుగుతాడని రచయిత శ్రీనివాస్ నిరూపించాడు. లేనిదీ చూడనిదీ ఊహా లోకాల్లో విహరించి పాడలేను, ఆ 'కల్పనా' శక్తి నుంచి కాపాడు దైవమా అని ప్రార్థించాడు పాబ్లో నెరూడా ("God, help me from inventing when I sing ") 'అన్నలు' నవలలో పాత్రల కల్పన తప్ప ఘటనలు, సంఘటనల కల్పనే లేదు. అన్ని పాత్రలూ జీవితం నుంచీ జీవన సమరం నుంచీ పుట్టు కొచ్చినవే.నేడు తెలంగాణా గ్రామ సీమల్లో జరుగుతున్న నరమేధానికి సంబంధించి శ్రీనివాస్ ఉన్నది ఉన్నట్టు చెప్పాడు, లేనిది చెప్పలేదు. ఒకనాటి బానిస బతుకుల నుంచి నేటి బతుకు విప్లవం దాకా సాగిన ప్రజల కథా చిత్రణకు భూమిక వరంగల్‌కూ - కరీంనగర్ జిల్లాకు మధ్యనున్న ఓ సరిహద్దు ప్రాంతం. అది తెలంగాణా రైతాంగ పోరాటానికి కొనసాగింపుగా పెల్లుబికిన జగిత్యాల, సిరిసిల్ల ఉద్యమాల కార్యరంగం. ఒకనాడు సాంఘిక బహిష్కరణకు గురైన 'దొరలు' తిరిగి పల్లెలకు ఎలా చేరుకొన్నారు? నాడు 'దొరల' హోదాలో భూముల్ని ఆక్రమించుకున్నట్టే పట్నంలో సేట్లుగా కంపెనీలు ఎలా ఆక్రమించుకోగలిగారు? ప్రజలు ఎందుకు 'అన్నలు'వైపు చూడవలసి వచ్చింది? ఈ పరిస్థితులకు కారకులెవరు? ఇక్కడ ప్రధాన సమస్య- నక్సలైట్లూ కాదు, పోలీసులూ కాదు, అన్ని రకాల దోపిడీకి కారణమైన దుర్మార్గపు సామాజిక వ్యవస్థను మార్చుకోవడం ఎలా అన్నది. భూస్వామ్య వ్యవస్థ అవశేషాలు పూర్తిగా తొలగకుండానే, పెట్టుబడిదారీ వ్యవస్థ పూర్తిగా వేళ్లూనకుండానే వచ్చిపడుతున్న అంతర్జాతీయ కాబూలీవాలాల (వరల్డ్ బ్యాంక్), బహుళజాతి గుత్త సంస్థలు భారత ఆర్థిక వ్యవస్థపై ప్రారంభించిన దాడిని

తిప్పికొట్టడం ఎలా? ఈ ప్రశ్నలకు పాల నారాయణ ఎలియాస్ క్రాంతి, కొమురయ్య, గోపాల్, రుక్కమ్మ, కుమారస్వామి, రాధ, భద్రయ్య, వీరయ్యల బతుకు చితుకులే సమాధానం. భూమిని 'పటేండ్లు దున్నితే అన్నలు తన్నుతారు. పేదోళ్ళు దున్నుకుంటే పోలీసోళ్లు జంపుతారు. గదేం పరేషాను - కాని ఈ స్థితి ఇంకెంత కాలం' అని ప్రజలు ప్రశ్నించుకోవడంలోనే సమాధానం కూడా ఉంది! చెట్లు పాదులు కూడా రాజకీయాలు నేర్చుకున్న సంప్రదాయం తెలంగాణా గ్రామ సీమలది. ఆ సంప్రదాయం నుంచే వినూత్న సృష్టికి, నవ్య మానవ సమాజావిష్కరణ కోసం ప్రజలు పడుతున్న కష్టాలకు, అనునిత్యం చేస్తున్న త్యాగాలకూ విలువ పెరిగింది. ప్రతి మార్పునూ, సంచలనాన్నీ విధ్వంసంగా చిత్రించుకోకూడదు. చీకట్లు చీల్చుకువచ్చే అరుణోదయానికి పురిటి నొప్పులు తప్పవు. ఈస్ట్ ఇండియా కంపెనీ (కుంఫిణీ) పాలనకు వ్యతిరేకంగా భారత జాతి జరిపిన పోరాటం కేవలం ముష్టి యుద్ధం కాదు. భారత స్వాతంత్ర్య సముపార్జన కోసం గాంధీ, నెహ్రూలు ప్రారంభించిన ఆగస్టు విప్లవం 'కాగితప్పులి' కాదు. భగత్‌సింగ్, సుఖ్‌దేవ్, అజాద్‌ల సమర శంఖారావం త్యాగాలకు పెట్టింది పేరయింది. ప్రపంచంలోని ప్రతి నిర్మాణమూ పాత పునాదులను తొలుచుకుంటూ వచ్చిందే. ప్రతి నూతన సృష్టి వెంటా బొబ్బలూ, పెడబొబ్బలూ తప్పవు. సూర్యచంద్రుల గతులను తప్పించలేము, సూర్యకాంతిని అరచేతితో అడ్డుకోలేము, అనివార్యమైన సమాజ పరిణామ క్రమానికీ కాలడ్డలేము. బతకలేని స్థితిలోనే ప్రజలు పోరాట పంథాకు మళ్లుతారు, ప్రాణం మీదకు వస్తేనే తిరుగుబాటుకు సిద్ధమవుతారు. అందుకు దోహదం చేసే సామాజిక పరిస్థితులను మూలముట్టుగా మార్చడం పాలకుల విధి. స్థూలంగా ఇదీ, 'అన్నలు'లో శ్రీనివాస్ అందిస్తున్న సందేశం.

బూటకపు ఎన్‌కౌంటర్లు నిర్వహించడానికి పోలీసు వ్యవస్థ ఎన్నిరూపాలు ధరిస్తుందో, ఎన్ని వేషాలు వేస్తుందో విమర్శించిన శ్రీనివాస్,'అన్నలు'లో వివిధ గ్రూపుల మధ్య నెలకొన్న శత్రువైఖరులనూ, అసహిష్ణుతనూ, అంతర్గత హత్యలనూ, అమాయకుల్ని బలిగొంటున్న హత్యలనూ కూడా ఖండించాడు. అయితే 'పోరాటం ఉధృతమైనప్పుడు ఇటువంటి లోపాలు మటుమాయమై పోతాయ'న్న శ్రీనివాస్ విశ్వాసానికివిలువ - ఆ నమ్మకాన్ని 'అన్నలు' వమ్ముచేయకుండా జాగ్రత్తలు తీసుకున్నప్పుడూ, ఆ విశ్వాసాన్ని కోల్పోయే తమ చర్యలను సవరించుకున్నప్పుడూ! అసహనం కార్యకర్తలకు అలంకారంగా మారకూడదు. ఈ అసహిష్ణుత వల్లనే ఒక

గ్రూపునకు చెందిన ఓ గాయకుణ్ణి చంపడం! సామాన్య రైతు భద్రయ్యను హతమార్చిన మిలిటెంట్ శంకర్ ఆ తరువాత 'పోరాట పంథానే మార్చుకున్నా'డు, కాని వెలి అయ్యాడు! ఇంతకూ 'అన్నల'వైపు ఆకర్షణకు కారణం ఏమిటి? 'నన్నో కూలివానిగా కూడా దొరలు, సేట్లు బతకనివ్వడం లేద'ని రైతు సాంబయ్య మొత్తుకున్నా, 'న్యాయాన్నే చట్టం తిరస్కరించినప్పుడు ఇక మిగిలేది 'అన్న'లే కదా. తప్పనిసరైనపుడు పిల్లి కూడా పులిలా మారుతుంద'ని కుమారస్వామి (పాత్రలు) ధైర్యం చెప్పినా సాంఘిక ఆర్థిక పరిస్థితులేనని మరవరాదు. ఈ పరిస్థితులకు నాయకత్వం వహిస్తున్నది నూటికి తొంభై మంది ప్రజల శ్రేయస్సుకు విరుద్ధంగా నడుస్తున్న మన రాజకీయార్థిక వ్యవస్థ. ఈ నవలలో మరో విశిష్టత -సమకాలీన పత్తి రైతుల సమస్యలకు,అంతులేని ఆత్మహత్యలకు కారణాలను పేర్కొనడం. మానవ తప్పిదాల వల్ల, మానవేతర వైపరీత్యాల వల్ల ఆత్మహత్యల పాలవుతున్న రైతులకు 'అన్నలు'లో ప్రత్యక్ష ప్రతినిధి పత్తి రైతు వీరయ్య. కొత్త ఆర్థిక సంస్కరణలలో భాగంగా పాలకులు విదేశీ మారక ద్రవ్యం కోసం పశు మాంసం ఎగుమతుల్ని ప్రోత్సహించే పేరిట, అవసరమైన పశుసంపదను కూడా నాశనం చేసే 'ఖతర్ కబీర్'ల (పశు వధ్యశాలలు)ను ఎలా జనంపై రుద్దుతున్నారు? ప్రభుత్వ సంస్థలకు ఎందుకు నష్టాలు వస్తున్నాయి, చేనేతవారి కడగండ్లకు కారణాలేమిటి, పర్యావరణానికి శత్రువులెవరు, రైతాంగానికి అందవలసిన విద్యుత్ సరఫరాను కోత పెట్టడానికి కారకులెవరు, ప్రభుత్వ పశువైద్యశాలలో రైతుల గొడ్లకు ఉచితంగా అందవలసిన మందులను సహితం ఇవ్వడానికి డాక్టర్లు ఎందుకు లంచాలు అడుగుతున్నారు, ఇత్యాది సమస్యల్ని ఈ నవల స్పృశించింది. ప్రభుత్వ పరీక్షాకేంద్రాల వద్ద పోలీసు బందోబస్తులూ, ప్రైవేటు స్కూళ్ల ద్వారా సర్టిఫికేట్ల అమ్మకాలు ఎలా సాగుతున్నాయో వెల్లడించింది. ఈ దోపిడీ వ్యవస్థలో గ్రామాల నుంచి పట్టణాలకు ఉపాధి కోసం నిరంతరం వలసలు ఎందుకు సాగుతాయో చెప్పింది. బట్టల మిల్లుల యజమానుల దోపిడీకి సాలి మంగయ్య ఎలా దెబ్బతిన్నాడో హృదయ విదారకంగా చెప్పింది. మిల్లులు నూలుధరలు పెంచేయడం వల్ల చీరలు గిట్టుబాటుగాక మగ్గాలు పస్తుంటాయి, చేనేత పనివారికి మేలురకం నూలు కావాలి కాని దాన్ని దొరకనివ్వరు, నాసిరకం నూలైతే దారం తెగిపోతుంది, బట్ట నాణ్యతా ఉండదు, పనిగంటలూ వృధా! మిల్లుగుడ్డతో చేనేత బట్ట పోటీపడలేదు. ఇలా - ఒకవైపు పత్తిరైతును దెబ్బతీస్తున్నారు ఇంకొక వైపునుంచి వ్యవసాయోత్పత్తులపై ఆధారపడిన వృత్తులలో ఒకటైన చేనేత వ్యవస్థనూ బతకనివ్వడం లేదు. ఇలా జన జీవన వాస్తవ పరిస్థితులపై ఆధారపడి

సాగిన శ్రీనివాస్ నవలలో పాల్లు తక్కువ. రచనలో శిల్పమూ, కొదవలేదు. ప్రకృతి ఆధారంగా భూస్వామిని కాళసర్పంగా చిత్రించాడు. ఆ సర్పంమింగే సేతువు పిట్టను గూటి పక్షుల్ని, వాటి పిల్లల్నీ ప్రజలుగా మలిచాడు. కాళసర్పం దౌర్జన్యాన్ని ఎదుర్కోవడానికి పక్షులన్నీ ఏకమై సర్పాన్ని పరిమార్చడానికి చేసిన ప్రయత్నం కష్టజీవుల ఐక్యతకు ప్రతీకగా చూపాడు. అందుకే కేవల శిల్పం రచనా వైశిష్ట్యాన్ని అంచనా కట్టడానికి తోడ్పడదు. భావనా బలం అవసరం. సందేశం లేని కళ, శిల్పం లేని సందేశం -రెండూ రచనా ప్రయోజనాన్ని దెబ్బతీస్తాయి. అందుకే ప్రసిద్ధ అమెరికన్ నవలాకారుల్లో ఒకరైన జాన్ కెరోయక్ (Kerouac) అంటాడు: "Feeling is what I like in art, not craftiness and the hiding of feelings". శ్రీనివాస్ నవలలో చివరికి 'అన్న' నారాయణ ఎలియాస్ క్రాంతిని దుండగులు హత్యచేసిన తరువాత కొడుకు గోపాల్ సహితం ఉద్యమంలో ఎందుకు చేరవలసి వచ్చిందో, కుమారస్వాములూ, గోపాల్‌లూ ఎందుకు పుట్టుకొస్తుంటారో చెప్పాడు. అమ్మ రుక్కమ్మకు చెప్పకుండా కనపడకుండా వెళ్ళి 'అన్న'ల్లో చేరబోతున్న తనను మేనత్త వద్దురా నాయనా అని అడ్డుకోబోయినపుడు గోపాల్ అన్న మాటలకు సమాధానం చెప్పడం కష్టం: 'అవునత్తా... నిజంగానే. నువ్వన్నట్టు పటేల్ బుచ్చిరెడ్డి జాగల ఆయన కొడుకు రానేవచ్చిండు. ఆయనతోపాటు నిషేధం... పోలీసులు... మిలిట్రీ కూడా తోడు తెచ్చుకున్నాడు, కానీ... వాళ్ళు ఇప్పుడు మా నాయన జాగల నన్ను చంపకుంట నువ్వు ఆపుతావా చెప్పు... నువ్వే కాదు, ఈ రాష్ట్ర ముఖ్యమంత్రి కూడా ఆపలేడు... చట్టబద్ధమైన హత్యలు రాజ్యహింసలో భాగం... నాకు తప్పకే అన్నల దిక్కు పోతున్నా'' అంటాడు! అందుకే ఒక వీరుడు మరణిస్తే / వేలకొలది ప్రభవింతురు/ ఒక నెత్తుటి బొట్టులోనే ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు' అన్నాడు కవి. పరిస్థితులు సానుకూలమయ్యేదాకా సమాజంలో ఈ చిరంతన సత్యానికి ఎప్పటికప్పుడు ప్రారంభమేగాని ముగింపు ఉండదేమో!

*(ఆదివారం 15, ఫిబ్రవరి 1998)*

# 'ఈ అశ్రుధార పెల్లుబికిన రక్తజీర'!

తెలుగునాట అభ్యుదయ కవితోద్యమంలో జాలువారిన రచనలన్నీ గొప్పవి కాకపోవచ్చు కాని మానవాభ్యుదయాన్ని కాంక్షించి దృష్టిని ఆ వైపుగా నిశితం చేయడంలో ఆ ఉద్యమం నిర్వహించిన పాత్రను ఎవరూ కాదనలేరు. అంతేగాదు, అభ్యుదయ కవితోద్యమం అలంకారప్రాయం కాకముందే ఆవిష్కరించిన వచన కవితా క్షేత్రంలో తీసిన పంటలెన్నో! ఆ వారసత్వంలో 1940ల నుంచి నేటిదాకా వస్తున్న కవితా ఖండికలు వింతవింత పోకడలు పోతున్నాయి. అయితే వస్తువును ఆశ్రయించడంలో, ఆశ్రయించిన వస్తువును కమ్మెచ్చులాగినట్లు దిద్దితీర్చడంలో, అలంకారాలు అద్దడంలో, అర్థస్ఫూర్తిలో, విషయ వైవిధ్యంలో, శిల్ప పోషణలో, దీర్ఘకవితా ప్రయోగంలో - వచన కవితను సర్వజనామోదం చేసి పరసీమలకు నడిపించినవారు మాత్రం కొలదిమందే ఉంటారు. అలాంటి కొలదిమంది రచనలలో సి.వి.కృష్ణారావు కవితలు కొన్ని, గద్యం తరువాతనే పద్యం పుట్టిందని ఒప్పుకొంటే, వచన కవిత బతికి బట్టగట్టి అనతికాలంలోనే విపుల ప్రాచుర్యంలోకి రావడానికి కుందుర్తి భల్లూకపు పట్టుదల, నిరంతర కృషితో వహించిన నేతృత్వం కారణమని మరవరాదు ఆ అభ్యుదయ కవితోద్యమంలో పుట్టిపెరిగిన ఈ వచన కవితోద్యమాన్ని సుసంపన్నం చేస్తూ వచ్చిన అగ్రగాములలో ఒకరు కృష్ణారావు. ఈయన రాసిన 'వైతరణి నుంచి రాస్తూ రాస్తూ' అన్న (వైతరణి, మాదీ మీ ఊరే, అవిశ్రాంతం, కిల్లారి) కవితా కదంబం ఈ సంప్రదాయంలో నుంచి పుట్టుకొచ్చిందే. స్వాతంత్ర్య పోరాటం, అభ్యుదయ కవిత్వం, మార్క్సిజం, రైతాంగ పోరాటం ఈయనను ప్రభావితం చేయగా, అనేక సాహిత్య గోష్ఠులు, అనేకమంది ఆధునిక విప్లవ రచయితలతో పరిచయాలు, నయాగరా కవులతో అనుబంధాలూ ఆయన కవితా వ్యాసంగాన్ని, లక్ష్యనిర్దేశాన్ని సునిశితంచేసి పెట్టాయి కవిత్వంలో కేవల రసానుభూతికి కాలం చెల్లిన తరువాత, 'కథానాయకులు కేవల ప్రేయసీ ప్రియులు గాక, సామాన్య ప్రజలు, వారి కతలు, వెతలే బతుకులే కవితావస్తువులుగా స్థిరపడిన తర్వాత రచన దిశాగతే మారవలసి వచ్చింది ఆధునిక వచన కవితను బతికిస్తున్నదీ, చదివిస్తున్నదీ పదాడంబరమూ,

అలంకారాలూ కావు - ప్రజాసమస్యలే కావ్య వస్తువులు అయినందున మాత్రమేనని మరవరాదు. కుందుర్తి అన్నట్లు నేడు కవితా తత్వాలు రెండే రెండు: ఒకటి - ముందుచూపు, రెండవది - వెనుకచూపు. ముందు చూపున్నది అభ్యుదయం, రెండవది అందుకు విరుద్ధం. కృష్ణారావు చేతిలో వచన కవిత వస్తువుతో పాటు ప్రౌఢిమను కూడా సంతరించుకోవడం గొప్ప విషయం. 'వైతరణి' సంకలనంలోని అయిదు విభాగాలలోనూ సామాన్యుడు, మానవతావాదం, పేద ప్రజల సముద్ధరణ- ముప్పేటగా కృష్ణారావు వస్తు సంచయంగా రూపుదిద్దుకున్నాయి. కర్తవ్య ప్రబోధం చేశాయి. వచన కవితను ప్రచండమైన ప్రక్రియగా మలిచిపెట్టాయి. ఇందులో ఆశావాదం, ఆర్ద్రత, అకుంఠితమైన దీక్ష, మనిషిని నిలబెట్టి నిగ్గుతేల్చగల సాహసం ఉన్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ కవితలో పనికిమాలినదని చెప్పడానికి ఎవరూ సాహసించలేని నిప్పులాంటి నిజాలున్నాయి. నిప్పుకు చెదలంటదు. కృష్ణారావు కవిత సార్వకాలికం. కుందుర్తి విడిచివెళ్లిన అసలు సిసలు వచన కవితకు కృష్ణారావే చిరునామా అన్నా అత్యుక్తి కాబోదు! కుందుర్తి 'ఒక మంచి ప్రయోగం' గురించి ముచ్చటిస్తూ ఒకే కేంద్ర కథావస్తువుకు సంబంధించిన భావ పరంపర - పరస్పరం పెనవేసుకున్న వివిధ ఖండికల రూపంలో ఉందన్నాడు. సుదీర్ఘ కవితగా రూపొందిన 'వైతరణి' ఏ నరకంలో ఉండే నిప్పుల యేరో కాదు. సాక్షాత్తూ భూలోకంలో దళితులు అనుభవిస్తున్న నరకానికి ప్రతిబింబం. పాశ్చాత్య ప్రపంచంలో ఎ.ఆర్. అమోన్స్ కూడా 'టేప్', 'గార్బేజి' అనే రెండు కవితలు ఇలాగే రాశాడు. అవీ ఒకే కేంద్ర కథావస్తువుకు సంబంధించిన భావ పరంపరే ("a single image that can sustain multiplicity -- an arbitrary end would also be an organic end' అంటాడు అమోన్స్!) కృష్ణారావు 'వైతరణి'లో తరతరాలుగా దగాపడిన అధో జగత్సహోదరుల దుర్భర జీవితాలకు కవితా రూపమిచ్చాడు. చీకు చింతలతో కూడిన మురికి పేటలలోని వేలకొలది జనుల విషాదగాథను వినిపించాడు. ఇది ఏకాంతంగా, తీరుబడిగా లోతులు చూడడానికి ఉద్దేశించిన కవితా వైతరణికాదు, 'విధి తిరస్కరించిన' వ్యథాభరిత జీవితాలవైపు పాఠకుల దృష్టిని మళ్ళించిన వైతరణి! కృష్ణారావు ఆశలు, ఆకాంక్షలూ వైయక్తికాలు కావు సామాజికాలు. కష్టజీవుల్ని కడతేర్చి దరిచేర్చగల అగామికి స్వాగతం చెప్పే కవి మనస్సు చిరంజీవం. వృత్తులను ప్రతీకలుగా చెప్పి ఈ అట్టడుగు జనాలు ఎవరో చూపి పాఠకుల మనస్సులను కదిలించాడీ కవి. ఒక ఊరికి దక్షిణాన మరో ఊరికి ఉత్తరాన నలిగిన జీవితాలను చూపుతూనే సర్వత్రా రేపు 'నవచైతన్యం ప్రసరించే నాల్కల'ను ఆవిష్కరిస్తాడు. దగాపడిన, పడుతున్న తరాలను జ్ఞాపకం చేస్తూ

'ఈ అశ్రుధార పెల్లుబికిన రక్తజీర'!

కృష్ణారావు చాతుర్వర్ణ్య వ్యవస్థపై వ్యంగ్యమైన చరుపులు చరిచాడు. జాషువా 'నాల్గు పడగల హైందవ నాగరాజు'ను చూపగా, వైతరణి కవి 'పంచముడి' ఉనికికి సరికొత్త అర్థాన్ని సంతరించిపెట్టాడు: నాలుగు వర్ణాలను ప్రస్తావిస్తూ 'నాలుగుకోళ్ళు తన్ని/ పడుకున్నారు నలుగురు/ కిందికే తోశారు కనిష్టుణ్ణి/ మంచానికే వాడు బరువని/ నేల పట్టుకోని కోడు పట్టుకోని/ అయిదోవాడు తెచ్చుకున్నాడు నిచ్చెన/ మెట్లు చూసి మూలుగుతున్నాయి కోళ్ళు, వణుకుతున్నాయి కాళ్ళు''! ఇక దగాపడడానికి దళితులు ఇష్టపడరని చాటుతూ వారిలో భయాన్ని పారదోలి, చైతన్య దీపాలు వెలిగించడానికి కవి ప్రయత్నించాడు. ఈ సందర్భంగా బ్రెజిలియన్ కవయిత్రి లోర్డెస్ తియోడోరో ఆ భయం ఎందుకొచ్చిందీ, దానికి విరుగుడుగా ఎందుకీ చైతన్యం అవసరామో ఇలా వర్ణిస్తుంది: "The generation of fear files past and wants to think/ ants to say, tell, recall/only history plants consciousness/ in the opaque moment desperate embrosiderer,/ the generation of fear/ hunts for scraps, dyes bits and pieces/ and tries to build / show its face out hands and the old outburst". అలాగే కృష్ణారావు కథానాయకులు కూడా 'చీకటిలో వెలుగు స్తంభాలు నాటించి/ సామాన్య మానవుడు అసామాన్యుడని చాటించి/ అందరికీ వెలుగును పంచి కొత్త తోవలు' తొక్కుతారు. ఈయన ఇప్పటి చీకట్లకు ఆవలిగట్టున వెల్తురు కోణాన్ని చూపడంతో పాటు ఇప్పటి అగచాట్లకు విముక్తి ఎక్కడుందో చెబుతాడు: అది 'మన సంఘటన శక్తిలో ఉంద'ని చాటుతాడు. వ్యక్తికి బహువచనం శక్తి అని శ్రీశ్రీ చాటగా, ఆ సమష్టి శక్తి ఎందులో లభిస్తుందో, ఎక్కడ దాగి ఉందో కృష్ణారావు చూపుతాడు తనతోటి సోదరుని కష్టం దొంగిలించని వ్యవస్థకోసం తపనపడతాడు: 'ఈ జగత్తు పరిధిలో/ ఈ చరిత్ర నడకలో/ అనాది మానవుడు మాత్రమే సోదరుని కష్టం దొంగిలించలేదు/ అప్పట్నించి నేటివరకు/ సంఘంలో సహచర్యంగా / బ్రతుకుట ఎవ్వరికీ తెలియలేద'ని చెప్పాడు. ఆ శక్తి ఏది? 'నలుగురి చేతులు/నలుబది వ్రేళ్లయి/ శిఖరాగ్రం కదిల్చి/ విషవృక్షం కూకటితో కూల్చి/ నల్గురి సంఘటనలో/ ఎనిమిది నేత్ర జ్యోతులు/ చీకట్లను చీలుస్తవి/ సాధించలేని సమస్య లేనేలేదని సంఘానికి చాటిస్తవి' అంటాడు! ఈ బాధల వైతరణిని లంఘించే మహాశక్తి ఎవరో కాదు - జనాలే. ఎవరో వస్తారని, ఏదో చేసి పెడతారని, తలకెత్తుతారనీ ఆశించకూడదు సామాజిక అసమానతల వల్ల కలిగే అశాంతి, అనర్థం బాయిలింగ్ పాయింట్‌కు చేరుకునే సరికి సామాజికులు తమ గమనాన్నీ, గమ్యాన్నీ నిర్దేశించుకుంటారు అప్పుడు గాని కృష్ణారావు ఊహించే వెతల విలాపాల ఆలాపాలకు ముగింపురాదు, అప్పుడుగాని కాలుడి రాజ్యాంగం

కళ్లెదుట ఆవిష్కరించబోదు, ఆనాడుగాని ఊహలపైన తేలియాడే చీకట్లను చీల్చి తమోసంద్రాన్ని దాటించలేడు, ఆరోజున కానీ పెల్లుబికిన రక్తజీరలుగా జాలువారిన అశ్రుధారలకు విశ్రాంతి దొరకదు!

ఆకలి రుచి ఎరుగదు, నిద్ర సుఖం ఎరుగదు. కవి దృష్టిలో అసమ వ్యవస్థలో మహిళలు సహా ప్రతి ప్రాణీ దళిత ప్రాణే, యజ్ఞ పశువే. అనుక్షణం అతి సున్నితమైన దారాలకు వేలాడే ప్రాణులు వీరు. ఇలాంటి బతుకులు మనందరి ఉనికిని ప్రశ్నించి, ఊగించి శాసిస్తున్నాయి. అరడుగు జాగా లేక అప్పుడప్పుడూ శ్వాసకూడా ఆడక 'ఆద్యంతాలలో (జనన - మరణాలు) దేనికి సన్నిధిలో వున్నా'వని బొడ్డులో చేయి వేసి అడుగుతున్నాయి! ఈ అన్ని కవితలలోనూ రాజకీయ వేత్తలపై చురకలున్నాయి; వాద ప్రతివాదాలే ఉద్యమంగా గడిపే కాలక్షేపరాయుళ్ల మీద కమ్చీ దెబ్బలున్నాయి.'దేశ సేవే జీవితాదర్శం' అని కోసే కోతల రాయుళ్లను కడిగిపెట్టేడు కవి. రాముని దర్శనార్థం వెళ్ళి పూజా స్థలాల్లో జరిగే వ్యాపారాన్ని తూర్పారబట్టాడు,కోటిపూజలు చేయాలని కోరుకున్నవాడి నెత్తిపైన దేనికదే రుద్దే సుంకాల బాధలు చెప్పాడు. ఇంతకూ ఈ దేశానికి ఆరాధ్యదైవం ఎవరు? రాముడా, రాగినాణెమా? అని ప్రశ్నించి సెక్యులర్ భావాలను పెంచడానికి కృష్ణారావు ప్రయత్నించాడు. కంటకాలేవైనా ముందు చూపుతో ముందుకు సాగిపోవడమే మనిషి కర్తవ్యమని చాటాడు. పరమోపదేశాలు చేసే ప్రవక్తలు దేవుడికి హారతులిచ్చి మానవుడికి మాత్రం మంగళం చెప్పడాన్ని ప్రశ్నించాడు 'నా' అన్న శబ్దాన్ని విస్మరించి నలుగురిలో నలుసుగా మెలగమన్నాడు. అతను దారిద్ర్యానికిచ్చిన నిర్వచనం వెనక ఆర్థికశాస్త్రం ఉంది. ముప్పయ్యేళ్ళవాడు అరవయ్యేళ్ల ముసిలివాడుగా ఎందుకు మారిపోతున్నాడో ఈ వ్యవస్థలో కృష్ణారావు కవితా ధర్మంగా వివరించాడు : 'మనుగడ కొండచిలువ గహ్వరమై/తుది ముది విడి వడివడిగా వచ్చి/ ముడుచుక కూర్చుని/ మనలో చేరి ముచ్చటిస్తుంది ఆ ముదివగ్గు' దాని పేరే 'దరిద్రం'. దారిద్ర్య బాధ ఎలాంటిదో శూద్రకుని 'మృచ్ఛకటికమ్'లో చారుదత్తుడు చెబుతాడు. అలాగే అంతరాల దొంతర్ల సమాజంలో ఆ బాధకు తాళలేని బడుగు జీవి 'నేనే పాపం చేశానని/ నీ కడుపున పుట్టాన'ని తల్లిని ప్రశ్నించినప్పుడు వాడికి సంతృప్తి కలిగించే సమాధానం చెప్పగల విశ్వాస పాత్రుడి కోసం వెతుకులాట, వెంపరలాట ఈ కవితా కదంబరంలో అడుగడుగునా కనిపిస్తుంది. ఆ సమాధానం బుద్ధుడు చెప్పలేడు, గాంధీ చెప్పలేడు, చివరికి అంబేడ్కరూ చెప్పలేడు. అయితే రావలసిన సమాధానం పలాయనవాదం కాదు, ప్రకంపనలు సృష్టించడానికి సిద్ధపడే చండ్రప్రచండ చైతన్య

'ఈ అశ్రుధార పెల్లుబికిన రక్తజీర'!

మూర్తులు మాత్రమేనని 'చరిత్ర మాతృదేహం మీద రాల్చిన కన్నీటి చుక్కలు' చెప్పక చెబుతున్నాయి! కనుకనే అనుభవం ప్రతివాడినీ 'అందరితో ఒకేసారి రోదించు/ ఒకే స్వరంతో స్పందించు' అని కోరుతోంది! 'కళ్లు తెరిచి చూడు' అన్న -కవిత గొప్ప స్పందన. నిరాశకు సమాధానం, ఆశకు ఆహ్వానం. ఒక చిరంతన సత్యాన్ని చిరువెలుగులా లోకంలో ప్రతిష్ఠించడానికి ప్రయత్నించిన ఓ భావశకలం. రచయితే ఈ సంపుటంలో ఒక అనామకుడిగా, దిగంబరిగా, క్షుధార్తుడిగా వ్యవహరించి సత్యనిష్ఠను ప్రతిష్ఠించాడు. లాతూరులోని దారుణ భూకంపానికి కవితలో స్పందించక ముందు పునరావాస కార్యక్రమంలో తల మున్కలైన కార్యకర్తగా మెలగిన కార్యవాది కృష్ణారావు. వేలాది మందిని ఊడ్చుకుపోయిన దివిసీమ పెను ఉప్పెనకు స్పందించిన నగ్నముని 'కొయ్యగుర్రం'లా కృష్ణారావు లాతురు భూ కంపాన్ని 'కిల్లారి' కవితలో పొదిగాడు. స్పందన కవితలలో దానిస్థానం పదిలం. అసాధారణమైన భావ చిత్రాలను అలవోకగా అందించడంలో కవి కృషి ప్రశంసనీయం. 'వైతరణి' సంపుటిలో ఎన్ని భావముద్రలు బొమ్మకట్టి చిత్రవిచిత్రాలుగా కళ్లముందు కొచ్చి నిలబడతాయి? ఆకలి ఆవేదనలో చిరువంకలు తిరిగే పెదిమలకు కవి 'సస్యస్తన్యం' ఇచ్చాడు. రంపం పోడిమికి ఓడివిసిరేసిన అణు సహస్రాలను చూపాడు. చిరిగిన గుడ్డలో సందులు చలికి ముఖద్వారాలయ్యాయి. సూర్యచంద్రుల నేత్రాల అంచులలో తృణీకరించిన చూపులు చూపాడు. మేధా ఉద్విగ్నతలో ఆకాశయానం చేయించి తారల అవధులు దాటించాడు. మానిసి నేత్రాంచలాలలో పరదా కప్పుకున్న తీక్ష్ణాంశువును చూడమన్నాడు! ఒక్కొక్క పట్టులో ఈ వచన కవితలు బలమైన భావాన్ని దట్టించుకొని కదలబారిన పదచిత్ర జవనాశ్వాలు, పదాతి దళాలూ. 'రేపు'లో కృష్ణారావు సృష్టించిన అమాయకుడు కేవల అమాయకుడు కాడు, ఆ రూపంలో వున్న రాజకీయవేత్త: 'ఈ చిత్రమైన ప్రపంచంలో అనామకుడు చక్రవర్తి కావాలనుకుంటాడు. ఎవడూ చూడకుండా దర్బారు చౌకీదారు రాజాగారి సింహాసనం మీద కూర్చుని మీసాలు మెలేస్తాడు. ఈ మూఢుణ్ణి చీకటి తప్ప ఎవరు చక్రవర్తిగా గుర్తించారు? అందుకే అసలు సింహాసనాన్నే విరగదన్నండి. తరతమ భేదాల తెలియకుండా పోతుందం'టాడు! అప్పుడుగాని శాంతి, విశ్రాంతీ దొరకదు, అప్పుడుగాని క్రాంతి కిరణాలు చొరబొడవు! ఆ ముహూర్తం ఎప్పుడు? 'సంచలన సముద్ర ఘోషలో మనం శబ్ద బిందువులైనప్పుడూ' ఆదర్శ శిఖరాల నుంచి మనిషి ఎన్నటికీ జారిపోనప్పుడూ!

(ఆదివారం *22*, ఫిబ్రవరి *1998*)

# ఛాయాదేవి చిరకాలపు 'కలం స్నేహితుడు'!

ఎనిమిదేళ్ళనాడు కాబోలు మాస్కోలోని 'రాదుగ' ప్రచురణాలయం వారు రాస్కిన్ అనే రచయిత పిల్లలకోసం ఉద్దేశించి రాసిన ''నాన్నారి చిన్నతనం'' అనే పుస్తకం వెలువరించారు. జీవితంలో ప్రతివాడూ ''నా చిన్నతనంలో...'' అని ఎప్పుడో ఒకప్పుడు ఓ కథ చెప్పడం, బాల్య స్మృతుల్ని చెప్పుకోవడం సహజం. ఇందులో ''సాష'' అనే చిన్నపిల్ల తనకు జబ్బు చేసినప్పుడు నాన్నను అడిగేదట: ''నాన్నా, నాన్నా, నువ్వు చిన్నపిల్లాడిగా ఉన్నప్పుడు ఏం జరిగిందో చెప్పు'' అని! అలా అడిగిన ప్రతిసారీ ఆ 'నాన్న' ఏదో ఒక కథ చెప్పేవాడట. అలాంటి చిన్నపిల్లల అనుభవాలే ''నాన్నారి చిన్నతనం'' కథా కదంబం! కాని జీవితంలోని వెలుగునీడలతో కూడిన అలాంటి నాన్నారి 'పెద్దతనం' గురించి సుప్రసిద్ధ రచయిత, విద్వన్మణి అబ్బూరి ఛాయాదేవి చెప్పిన గాథ ''మృత్యుంజయ''. మరో సుప్రసిద్ధ రచయిత, ధారణశక్తికి అసాధారణ నామధేయుడు, సంభాషణా చాతుర్యంలో అతి సరసుడూ అయిన అబ్బూరి వరద రాజేశ్వర్రావు సతీమణిగానేగాక, తెలుగు సాహితీ చరిత్రలో చెరగని ముద్రలు వేసుకున్న వ్యక్తి అబ్బూరి రామకృష్ణారావుగారి కోడలు ఛాయాదేవి. ఈ సాహిత్య వనంలో, ఈ సారస్వతా నిలయంలో ప్రవేశించి మూడుపూవులూ ఆరుకాయలుగా వర్ధిల్లని వ్యక్తులు ఉండరంటే అతిశయోక్తి కాదు! ఇంతకాలం 'వరద' అవకాశం దొరికితే చాలు 'మానాన్నగారు' అంటూ పదేపదే రామకృష్ణారావు గురించి ప్రస్తావించకుండా ఉండేవారు కారు కాని ఛాయాదేవి తండ్రి 'మృత్యుంజయు'డి గురించి ఆ తరం వారికేమోగాని ఈ తరంవారికి తెలియదు. ఆయని ఆంగ్ల పాండిత్యం గురించి, ఆయని వ్యక్తిత్వ వికాసాల గురించీ అంతకంటే తెలియదు. ఈసారి ఛాయాదేవి చేసిన పని 'వరద'తో పోటీపడి తన తండ్రి గురించి తెలుగువారికి ఏదో ఒకటి చెప్పాలనుకోవడంకాదు, ఆ చెప్పేది అందంగా చెప్పాలని భావించడం. తండ్రి వ్యక్తిత్వ వికాసం గురించి, తాత్త్విక సమాలోచనా స్ఫూర్తి గురించీ, ఏయే ప్రభావాలు ఆయన మీద పనిచేశాయి, కుటుంబంతో, సాహిత్యంతో ఆ వ్యక్తి సంబంధ బాంధవ్యాలు ఎలా ఉండేవి, ఇత్యాది విషయాల గురించీ ఛాయాదేవి

ఛాయాదేవి చిరకాలపు 'కలం స్నేహితుడు'!

''మృత్యుంజయ'' రచనలో చెప్పిన తీరు అద్భుతం. తండ్రీ- కూతుళ్ల మధ్య సాగిన ఉత్తర ప్రత్యుత్తరాలలోని ఉత్తమ భావాల సంకలనమే ఛాయాదేవి రచన. లోకంలోని తండ్రీ కూతుళ్ళు అనేకమంది లేఖలు రాసుకోకపోరు. కాని ఈ రచన మరింత లోకోత్తరం. తండ్రీ-బిడ్డల మధ్య సాగే ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ ఆ ఇరువురికి తప్ప లోకానికి అంత విలువైనవి కాకపోవచ్చు. కాని ఇందిరాగాంధీకి పండిట్ నెహ్రూ రాసిన లేఖావళి ప్రపంచ చరిత్రగా ప్రఖ్యాతిలోకి వచ్చింది. ఆ స్థాయిలో ఛాయాదేవి రచన సరిపోలదు. అయినా, ఛాయాదేవికి తండ్రి రాసిన ఉత్తరాలు మానవ జీవిత విలువలను ప్రస్తావిస్తూన్న తాత్త్విక వివేచనా ముద్రలు. ప్రపంచ సాహిత్య చరిత్రలో అరుదువే అయినా అపురూపమైన లేఖలు రాసిన విదుషీమణులు లేకపోలేదు. ఛాయాదేవి రచనలో కూడా తండ్రి మృత్యుంజయుని తాత్త్విక ధోరణిలో వచ్చిన క్రమ పరిణామానికి సంబంధించిన లేఖలను మాత్రమే ప్రధానంగా పొందుపరుస్తూ మధ్యలో పూసల్లో దారంలా పదునైన వ్యాఖ్యానాలు కొనసాగుతూ ఉండటం విశేషం. 20వ శతాబ్దం తొలి దశాబ్దంలో మెసపటోమియా రాయబారి సర్ హగ్‌బెల్ కూతురు జెర్ ట్రూడ్ బెల్ అరేబియా పర్యటనలో ఉన్నపుడు బాగ్దాద్ నుంచి తండ్రికి రాసిన లేఖలు ఈ సందర్భంలో గుర్తుకొస్తాయి. ఇలాంటి లేఖావళిలో ప్రసిద్ధాలు- కాథరీన్ క్లైవ్, ఇంగ్లాండ్‌లో తొలి స్త్రీవాద రచయితలలో ఒకరైన మేరీ మాంటేగ్, సారా సిడాన్స్ ఉత్తరాలు. ఢిల్లీలోని జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్శిటీ లైబ్రేరియన్‌గా ఏనాడో ఖ్యాతికెక్కిన ఛాయాదేవి 'వరద'తో కలిసి ''కవిత'' ''మోడరన్ తెలుగు పొయట్రీ'' సంకలనాలకు సంపాదకత్వం వహించింది. స్టీఫెన్ స్విగ్ కథలను అనుసరించి తెలుగులో ''అపరిచిత లేఖ'' పేరిట కథానికలు తెచ్చింది. పిల్లలకు జానపద గాథలు అందించింది. నాగరికత, సంస్కారాలకు మారుపేరుగా ఎదిగిన ఛాయాదేవి అనుభవాలు అభ్యుదయ భావాల సంపుటం. అతివేలానికి దూరంగా, బాధ్యతలు తెలిసి మెలిగిన స్త్రీవాది. జిడ్డు కృష్ణమూర్తి కేంద్రం ఆధ్వర్యంలో ఆ తాత్త్వికుని విశిష్ట రచనలు కొన్నింటిని తెలుగులోకి తీసుకు వస్తున్న రచయిత్రి. అబ్బూరి రచనలే గాక, ''వరద స్మృతి'', 'ఛాయాదేవి కథలు' సంపుటీ వెలుగులోకి వచ్చాయి. కథా రచయతగా ఛాయాదేవి సాంఘిక సమస్యలకు, పేద, మధ్యతరగతి జీవుల కష్టసుఖాలకు తన కథలలో ప్రాధాన్యం ఇచ్చిందేగాని, తన సొంత సమస్యలకు వేదిక చేసుకున్న వ్యక్తికాదు. సామాజిక చైతన్యాన్ని నిష్ఠతో పెంచే కృషిలో, మనిషి వ్యక్తిత్వాన్ని పెంచి పోషించే యత్నంలో స్త్రీవాదిగా ఆమె ఒక రెబెకా వెస్ట్, ఒక వర్జీనియా ఉల్ఫ్, ఒక జేన్

ఆస్టిన్. ఈ సందర్భంగా శామ్యూల్ హిన్‌జ్, రెబెకా వెస్ట్ గురించి రాసిన మాటలు ఛాయాదేవి క్కూడా వర్తిస్తాయి : **"She has not allowed herself to be merely a mirror in which to reflect life; before treating her material she has treated herself...'**

అలాంటి ఛాయాదేవి తన తండ్రి గురించి రాస్తూ ఆ కుటుంబం రాజమండ్రి, హైదరాబాద్, నర్సాపురంలలో గడిపిన రోజుల పూర్వ స్మృతులు కొన్ని చెప్పారు. లాయరు వృత్తిలో ఉన్న తండ్రి, సంప్రదాయాలను తు.చ. తప్పక పాటించే వ్యక్తి పచ్చి మూఢవిశ్వాసాలను మూటకట్టుకున్న దశ నుంచి క్రమంగా వాటిని విసర్జించి మానవతా వాదంవైపుగా, విలువల ప్రతిష్ఠాపన కోసం ఎలా మళ్లుతూ వచ్చిందీ ఆమె చెప్పింది. ఈ అన్ని దశల్లోనూ కూతురిని కూడా పాలు పంచుకోవాలని ఎలా కోరిందీ తండ్రి లేఖల్లో ఉంది. ఛాయాదేవి మాటల్లోనే మృత్యుంజయుని క్రమ పరిణామం మనకు అర్థమవుతుంది. రాగద్వేషాలకు అతీతంగా చెప్పింది: ''నలభై ఏళ్ల క్రితం మడిగా ఆరేసిన ధోవతి కట్టుకుని, ఎదురుగా రాగిపంచ పాత్రలో ఉద్ధరిణి, నీళ్లు పెట్టుకునేవాడు, పక్కన రాగిపళ్లెంలో తిరుచూర్ణం, నామం కటిక, నుదుటి మీద నామం, జంధ్యం సర్దుకుంటూ జపం''- ఇది మసక తొలగని రూపం. కాగా మసక తొలిగిన మరో రూపం- ఉతికి ఆరేసిన రంగు మాసిన తెల్లధోవతి, మీద అంగవస్త్రం, జంధ్యం తీసేసిన ఛాతీ, చేతిలో కర్ర, నామంలేని నుదురు- ఇలా. కాని ఆయనలో - ఆహార్యంలో, నడతలో ఈ మార్పు రావడానికి దోహదం చేసిన ప్రభావాలేమిటో ఛాయాదేవి ఈ రచనలో తండ్రి మాటల్లోనే వివరిస్తూ పోయింది. ఆదిలో దివ్యజ్ఞాన సమాజంవైపు మొగ్గిన తండ్రి, ఆ సమాజంలో చేరతావా లేదా అని 'ఛాయ'ను పట్టుబట్టి బలవంతం చేసిన మృత్యుంజయ కొన్నాళ్ళకు ఆ సమాజాన్నే విడిచిపెట్టాడు. విశ్వవిఖ్యాత తత్త్వవేత్తగా ఎదిగిన జిడ్డు కృష్ణమూర్తి ప్రబోధాల,రచనల ప్రభావంలోకి వెళ్లాడు. ఆదిలో సంప్రదాయవాదిగా ఉన్నప్పటికీ మృత్యుంజయ బతుకు భారాన్నంతా దేవుడి మీదికి నెట్టి కూర్చునే తత్వం కలవాడు కాడు. అసహనం, అహంకారం మూర్తీభవించిన వ్యక్తే అయినా, యోగితత్వం అలవర్చుకున్న వైరుధ్యం కూడా ఆయనలో ఉంది. యోగితత్వాన్ని ఆయన సన్యసించడంగా భావించడు. ఆయన ఉద్దేశంలో సన్యసించడం అంటే అడవుల్లో దూరడం కాదు, మానసికంగా సన్యసించడం అని, రాగద్వేషాలకు దూరంగా ఉండడమని, మనస్సును ప్రశాంతంగా ఉంచుకోవడమని! భయాన్ని

విడనాడడమే సన్యసించడమని! స్టాన్లీ గార్డెనర్, జిడ్డు కృష్ణమూర్తి, బెర్ట్రాండ్ రస్సెల్ రచనలు, రాధాకృష్ణ ఉపనిషత్తులు, ఫ్రాయిడ్ మనస్తత్వ శాస్త్రం ఈయని సంప్రదాయ ఆలోచనా స్రవంతిని మళ్లించాయి. ఔన్నత్యంగానీ, జ్ఞానోదయంగానీ ఏ అతీంద్రియ శక్తుల్ని నమ్ముకుంటేనో కలిగేది కావనీ, మహాత్ముల సాన్నిధ్యంలో ఉండడంవల్లనే కలుగుతుందని మృత్యుంజయ నమ్మసాగాడు. అందరికంటే ప్రధానంగా జిడ్డు కృష్ణమూర్తి ప్రసిద్ధ రచనలు- కామెంటరీస్ ఆన్ లివింగ్, ఫస్ట్ అండ్ లాస్ట్ ఫ్రీడం- ఛాయాదేవి తండ్రిని అమితంగా ప్రభావితం చేశాయి. మరణానికి ఆయన చెప్పిన భాష్యం వేరు. మనిషికి కావలసింది మరణంలోని నిశ్చలత కాదు, ప్రశాంతమైన అవగాహనలోని నిశ్చలత అంటాడాయన. నూరేళ్ళు బతకడం, అంటే ''సెంచరీ'' కొట్టడం అందరికీ సాధ్యంకాదు, ఏ మోక్షగుండం విశ్వేశ్వరయ్యకో,కార్వే పండితుడికో తప్ప అంటాడు. సంప్రదాయవాదిగా స్త్రీపట్ల సదభిప్రాయం కొన్నాళ్ల వరకూ లేకపోయినా, తరువాత తరువాత స్త్రీ గౌరవాన్ని ఇలా ప్రతిష్ఠిస్తూ వచ్చాడు: ''స్త్రీని ఉన్నత స్థితిలో ఉంచగలిగినప్పుడే, ప్రపంచానికి ముక్తీ, మోక్షం. స్త్రీ శారీరక బానిసత్వపు శృంఖలాల్ని తెంచుకుని బయట పడగలిగినప్పుడే ఆమె నిజరూపం ఏమిటో, ప్రకృతిలో ఆమెకు తగిన స్థానం ఏమిటో ప్రపంచానికి అవగతమవుతుంది''!

కృష్ణమూర్తి తాత్త్విక చింతన ప్రభావం వల్లనే మృత్యుంజయ భావజాలంలో మానవ సమాజం పట్ల ఎన్నో మార్పులు వచ్చాయి. వరకట్న సమస్యను ప్రస్తావిస్తూ, మనం ఎక్కడికిపోతున్నాం, భారత సమాజం కుళ్లిపోయింది, కట్నాలు కానుకలు సిగ్గిడిసి అడుగుతున్నారని ఆవేదన ప్రకటించాడు. దేశంలోని మహిళా సంఘాలన్నీ వరకట్న సమస్యపై పోరాడి, ఈ దురాచారాన్ని రూపుమాపాలన్నాడు. ఇందుకోసం స్త్రీలు ఆత్మగౌరవాన్ని, ఆత్మవిశ్వాసాన్ని, ధైర్యాన్ని, శీలాన్నీ, సాహసాన్నీ, నిస్వార్థతనూ, త్యాగబుద్ధినీ, చెక్కుచెదరని సాంఘిక సేవాభిలాషనూ పెంపొందించుకోవాలన్నాడు! కృష్ణమూర్తి మానవతా వాదం క్రమంగా ఛాయాదేవి తండ్రిని మృత్యుంజయుణ్ణి చేసింది! ఎందుకంటే, విశ్వతాత్త్వికుడికి (కృష్ణమూర్తికి) ప్రామాణికం డబ్బూ, దస్కం కాదు, మనిషీ అతని ప్రవర్తన: తనను తాను తెలుసుకునే సత్యాన్వేషణే మానవునికి నిజమైన స్వేచ్ఛను ప్రసాదిస్తుంది, ఆ అన్వేషణే నవ్యసమాజ నిర్మాణానికి రహదారులేర్పరుస్తుంది కనుక సత్యాన్ని చేరడానికి వేదాలుగానీ, మత గ్రంథాలుగానీ, ఉపనిషత్తులుగానీ, ఏ మతసంస్థల, గురువుల తోడ్పాటుగానీ, అవసరంలేదు- ఇదే కృష్ణమూర్తి తత్త్వం కనుకనే

నమ్ముకోవలసింది మూక సిద్ధాంతంకాదు, వ్యక్తి వికాసం అంటాడు. ప్రతి వ్యక్తికీ మనస్సనేది ఒకటుంది గనుక తానుగా ఆలోచించి, నిర్ణయాలు చేయాలి. మీకు మీరే గురువు, మీ జీవిత గ్రంథాన్ని తెరుచుకోండి, చదువుకోండి, వెలుగురేకలు ప్రసరించండి, స్వతంత్రులై నిలబడండి, పరాధీనులు మాత్రం కాకండి. ఈ ప్రవచనం మృత్యుంజయుని చెవికెక్కింది. కృష్ణమూర్తిలానే ఇతనూ నిరాసక్తుడై ''పేరు, కుటుంబం, ఆస్తి- వీటిలో ప్రతివాడికీ తాను వేరే వ్యక్తినన్న భావం కలుగుతుంది. ఈ ప్రత్యేకత, ఈ వ్యక్తిత్వ భావం సమాజానికి ఎంతో హాని కలుగచేస్తాయి''ని నమ్ముతూ వచ్చాడు. కనుకనే ఛాయాదేవిని ఉద్దేశించి ఆయన ''మానవసేవ జీవిత ముఖ్యోద్దేశం కావాల''ని ప్రబోధించాడు. బుద్ధుడిని, క్రీస్తును, భగవద్గీతను పరామర్శించడంతోపాటు అనిబిసెంట్, రుక్మిణీ అరండేల్‌తో, వీరేశలింగం సంస్థలతో తాత్త్విక అనుబంధాలు పెంచుకున్నాడు. అంతేగాదు, మానవజాతి ఎదుర్కొంటున్న క్లిష్ట పరిస్థితులను తలపోసుకుంటూ మృత్యుంజయ ''పరిణామం ఎలా జరుగుతుందో తెలుసుకోవలసి ఉంది. జీవితంలో దేనికి ఎలాంటి విలువలు ఇవ్వాలో వివేకంతో గ్రహించవలసి ఉంది. ఆ విలువలు తెలియకపోవడం వల్లనే ఇంత బాధ, పోరాటం, కష్టం కలుగుతున్నాయి'' అన్నాడు! ఈ మాటలు ఆయన అన్నప్పుడు ఆర్థర్ జార్జి హీత్ (1915) తన తల్లికి రాసుకున్న ఓ జాబులో జీవిత విలువల గురించి వెలిబుచ్చిన సుందరమైన భావన జ్ఞప్తికి వస్తోంది : **"Life is a quality rather than a quantity,and there are certain moments of real life whose Value seems so great that to measure them by the clock, and find them to have lasted so many hours or minutes, must appear trivial and meaningless. Their power is such that we cannot properly tell how long they last, for they can colour all the rest of our lives, and remain a source of strength and joy".**

ఛాయాదేవి దృష్టిలో'నాన్న' తిక్కమనిషి కాదు, చిక్కుమనిషి. ఎంత వేదాంతం చెప్పినా తనదాకా వచ్చేసరికి ఆయన నిర్లిప్తత అలవరచుకొనక పోవడం ఆయనలోని పెద్ద లోపం అంటుంది. అయితే క్రమంగా అన్యాయవాదం ప్రబలుతున్న కొద్దీ మృత్యుంజయకు న్యాయవాద వృత్తిమీద విరక్తి కలిగింది, ధన సంపాదనపైన ముఖం మొత్తింది. తన తప్పు లేనప్పుడు ఎదుటివారిని విమర్శించడంలో, ఖండించడంలో ఈ తండ్రీ- కూతుళ్లిద్దరూ ఏమాత్రం వెనుకాడరు. తప్పుంటే కిక్కురుమనరు. ఆ సమన్వయం తనలో ఉంది కనుకనే మృత్యుంజయ లేఖలు మొక్కుబడి రచనలు కావు, స్పందన, ప్రతిస్పందన

వాటికి ఊపిరి. ఆయని రాజకీయ వ్యాఖ్యలు కూడా పదునైనవే. కాంగ్రెస్ వాదుల సంప్రదాయాన్ని ఇలా ఆడిపోసుకోవలసి వచ్చింది: ''సత్యం, అహింస- వీటిని మొట్టమొదటగా అందరూ విసర్జించేది, ముఖ్యంగా కాంగ్రెస్ కార్యకర్తలే. గాంధీగారి ఆదర్శాల్లో ఒక్కదాన్నికూడా గౌరవించి ఆచరణలో పెట్టడంలేదు వాళ్లు'' అన్నారాయన. కనుకనే మూక సిద్ధాంతం వైపుగాకుండా మానవతా వాదం వైపు మళ్లాలంటాడు. ఉపనిషత్తుల్లో ఆత్మగురించి, పరమాత్మ గురించీ ఎంత వివరించినా, తనకెప్పుడూ ఆ 'ఆత్మ' ఎదురుపడలేదని చమత్కరించాడు. అయితే ''కఠోపనిషత్తు''లోని నచికేతుడిలా 'తను', 'నేను' (లేదా 'తన'-'పర') అన్న స్పృహనుంచి దూరమైతే మనిషి సజీవంగా, పూర్తి మెలకువగా, చైతన్యంలో ఉండగలుగుతాడు, అప్పుడే మరణాన్ని నిశ్చింతగా పొందగలుగుతాడని చెప్పాడు! ఆ నిశ్చలత మనస్సుకు అవసరం అన్నాడు. ఎందుకని? సోక్రటీస్‌లా జైల్లోకూడా ఆనందంగా గడపడం అన్నది నిశ్చలత వల్లనే సాధ్యం: నిర్లిప్తంగా, వివక్షలేకుండా గమనిస్తున్నప్పుడే మనస్సు నిశ్చలమవుతుంది. ఆ నిశ్చలతను ఏ పేరు పెట్టి పిలిచినా- సత్యం అన్నా, దేవుడన్నా, అనంతం అన్నా, బ్రహ్మానందం అన్నాసరే, ఆ స్థితి ఉన్నతం, అత్యున్నతం అంటాడు మృత్యుంజయ. మనశ్శాంతి యాత్రల వల్ల, పూజలవల్ల, జపతపాల వల్ల రాదు, ఆత్మజ్ఞానం అవసరం అన్నాడు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ''అజ్ఞానం ఉన్నంతవరకూ శాంతి దొరకదు''ని స్పష్టం చేశాడు! ఇది విద్యావ్యాప్తి వల్లగాని సాధ్యపడదు మరి! కనుకనే అజ్ఞానం తొలగితే గాని నిజమైన ప్రేమతత్వం కూడా తెలిసిరాదు. ప్రేమకూడా దైవంలాగే అవ్యక్తమైనది. స్వార్థం లేనప్పుడే ప్రేమ ఉదయిస్తుంది. ప్రేమ అనేదాన్ని ఈ లోకంలో దేనితోనైనా పోల్చుకోగలగాలంటే- అది ఒక్క 'సూర్యకాంతి'తోనే, సూర్యకాంతిలా పవిత్రంగా నిష్కల్మషంగా, నిష్పక్షపాతంగా ఉన్నప్పుడే అది ప్రేమ అనిపించుకుంటుంది. మనం ప్రేమ అనుకునేది కల్మషమైనది, వ్యాపారబద్ధమైనదని మృత్యుంజయుడి తీర్మానం! నాగరికత, సంస్కారం ఉన్న వ్యక్తి దేనికీ భయపడనసరం లేదన్నది ఆయని భరోసా. నిజంగా ప్రతిరోజూ ' ఒక నవ్యదినం' కాగలిగితే నిస్పృహకూ, నిరాశకూ తావే వుండదు. నిత్య నవజీవనంలో నిస్పృహ అనేది వుండదు, వుండకూడదు. అది మన చేతిలో పని. ఇదీ, ఛాయాదేవి ''మృత్యుంజయ'' సారాంశం!

*(ఆదివారం 1, మార్చి 1998)*

# ఆరాటు పోరాటాల మధ్య లక్ష్మీదేవి ఆదర్శ శిఖరాలు!

ఆధునిక తెలుగు కథను సుసంపన్నం చేసిన ఉద్దండులలో ఒకరైన చలం కళా సృష్టికీ, ప్రకృతి సృష్టికీ మధ్య అవినాభావ సంబంధాన్ని చక్కగా నిర్వచించాడు. రెంటికీ స్వేచ్ఛ ముఖ్యం, కనుకనే ఉద్దేశంతో రాయడం కళని ఇరుకులో పెడుతుందని తీర్మానించాడు! ఆ ఇరుకు సందుల నుంచి కథా సృష్టిని స్వేచ్ఛా మార్గం వైపు తిప్పి కొత్త అర్థాలు చెప్పడానికి ప్రయత్నిస్తున్న రోదసీ యుగపు కథకులలో ఒకరు వాడ్రేవు వీరలక్ష్మీదేవి. ఏ సిద్ధాంతమూ జీవితాన్నీ, జీవితానుభవాన్నీ పరిపూర్ణంగా చిత్రించలేదు. అలా అని ఆదర్శాలూ, మానవ వికాసానికి దోహదపడే సిద్ధాంతాలూ అసలు పనికి రావనీ కాదు, లక్ష్మీదేవి ఒక సరికొత్త ప్రేమ సామ్రాజ్యానికి తన కథా సంపుటి 'ఉత్సవ సౌరభం' లో పురుడు పోయడానికి ప్రయత్నించారు. మానవ జీవితాన్ని ప్రేమానుభవాల పుట్టగా మలచుకుంటే సమస్యలకు పరిష్కారం, సమభావనకు పురస్కారం సాధ్యమని భావిస్తారావె. 'స్వేచ్ఛ'కు కొందరి దృష్టిలో అర్థం - రసాస్వాదనకు, సౌందర్యారాధనకు (ఈస్తటిక్స్) దూరంగా ఉండడం, ఆభరణాలను, అలంకరణలను ఈసడించుకోవడం, మొండి చేతులకు, మొండి చెవులకు స్వాగతం చెప్పడం! 'స్వేచ్ఛ'ను కోరేవారెవరూ, హద్దులెరిగిన బాధ్యతాయుత పౌరులెవ్వరూ సౌందర్యానికి దూరంగా ఉండనక్కరలేదు. మానవ జీవితంలో అదొక భాగం, జీవితంపై దానిదొక ప్రభావం. అయితే సౌందర్యం చాటున బక్క బతుకులను, శ్రామిక జీవుల సమస్యలను మరిచి అంతా సవ్యంగానే ఉన్నదని సంతృప్తి వెల్లడించే కుహనా వాదులను ఎవరూ సమర్థించరు, సమర్థించరాదు. ప్రేమైక జీవనానికి 2600 సంవత్సరాలనాడే గ్రీకు కవయిత్రి సాఫో (Sappho) స్నేహితురాలు ఎధీస్ సజల నేత్రాలతో సెలవు తీసుకున్న ఘడియలలో సాఫో ఆదర్శించిన లక్ష్యం, సందేశం ప్రేమ. ప్రపంచాన్ని ప్రేమతో జయించమంది, ప్రేమతో పోగొట్టుకోమంది, మనస్సులను కొల్లగొట్టుకోమంది, ఆ పనిచేతకాకపోతే పరస్పరం ఇద్దరి జీవితాలను బంధించిన అపురూప ఘడియలను జ్ఞాపకాలను నీవు కోరిందే తడవుగా కుప్పపోసి చెబుతా, నీ మెడలో మల్లెల దండలు వేస్తా అన్నది 'సాఫో'. ఆమె మాటల్లో చెప్పాలంటే "Go, be happy, good-by/ Remember me - for you know how I loved you.../ All the garlands woven / Around your delicate neck / Fashioned from a hundred flowers!" ఇలాంటి

స్వచ్ఛమైన ప్రేమ సందేశం ద్వారానే లక్ష్మీదేవి సమస్యల చౌరస్తాకు చేరి దారితెన్నూ కానకుండా ఏదో సాధించాలన్న ఆరాటంతో, ఆందోళన చెంది తెచ్చిపెట్టుకున్న ఉద్రిక్తతలకు లోనై సుఖశాంతులకు దూరమవుతున్న నేటి మానవులకు ఒక సంజీవిని కనిపెట్టింది. అది - సమస్యల నుంచి దూరంగా పారిపొమ్మన్న సందేశం కాదు, జీవితానికి, పరిపూర్ణతకు మానవుణ్ణి సన్నిహితం చేసే సమన్వయ దృష్టికి మరలవలసిన అవసరాన్ని గుర్తింపచేస్తుంది. మనిషి చీకు చింతల నుంచి బయటపడాలి, ఎన్ని సమస్యలున్నా, జీవరసాన్ని కోల్పోయే ఉద్రిక్తతకు దూరంగా ఉండాలి. చైతన్యాన్ని కోల్పోకుండానే మనసును అదుపు చేసుకోవాలి.చేవను చంపుకోకుండానే తోవను ప్రశాంతంగా వెతుక్కోవాలి. ఇదీ లక్ష్మీదేవి కథలలో ఒక పార్శ్వానికి చెందిన సారం. ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును/ ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును అన్నాడు గురజాడ. ప్రేమచంద్ 'గబన్' నవల విలువ ఇచ్చింది అందానికీ, ఆభరణాలకు కాదు, మనిషే బంగారం కాబట్టి ఆ మనిషికీ, అతనిలో ఎదిగిన రావలసిన అమూల్యమైన సంస్కృతీ విలువలకూ. మనిషికీ మనిషికీ మధ్య సంబంధమే స్త్రీ - పురుషుల మధ్య సంబంధాలనీ, అంతేగాని పురుష న్యాయం, స్త్రీన్యాయం అని విభజించడానికి వీలులేదని, జీవశాస్త్రం ఇందుకు విరుద్ధమనీ, ఇంతకు విన్నామరో వింత ఆలోచనలు పోవడానికి వీలులేదనీ చెప్పినవాడు కారల్ మార్క్స్! మనుషుల మధ్య సహజ సంబంధాలే. స్త్రీ - పురుషుల మధ్య సంబంధాల్ని కూడా శాసించాలన్నాడు. అందుకే బహుశా కవీ,కథా రచయిత అయిన లక్ష్మీదేవి కూడా ఈ జీవితాన్ని తల్లిగానూ, గురువుగానూ భావించి ఈ జీవితం ఉందే దాన్ని లాక్కురావడం ముఖ్యం కాబట్టి, అందులో కొన్ని వరాలూ, కొన్ని శాపాలూ అనుభవించి తీర్చాల్సిందేనంటుంది! 'ఉత్సవ సౌరభం' లోని పదహారు కథలూ ఆణిముత్యాలే అయినా ఇతివృత్త వైవిధ్యం మధ్య కొన్ని వైరుధ్యాలూ కొన్ని లేకపోలేదు. ఈ కథాసంపుటిలో తారసిల్లే శివరాం, మూర్తి, చెల్లి, 'నేను', విజయసారథి, రామ్మూర్తి, లక్ష్మి, వీర్రాజు, అమృత, సీతమ్మ, సూపర్వైజరు, హేమ, వసుంధర, వసుంధరరావ్, ప్రభావతి, జయ, రావ్, బామ్మ, అరుణ, సుందరి, రమణ, గిరిజ, సంధ్య, రాధ, రాజు - ఇలా ప్రతి ఒక్కరూ రకరకాల సమస్యలను ఎదుర్కొన్నవారే, పరిష్కారాలు చూసుకున్నవారే, రాజీలు పడినవారే, ఆరాటాలున్నలారే, పోరాటాలు చేసినవారే. ఆరాటం పోరాటం కాదనుకున్నవారూ, భార్యలపట్ల దురుసుగా ప్రవర్తించే భర్తలూ, భర్తల సౌమ్యతను అర్థం చేసుకోలేని భార్యలూ, స్త్రీలపై దాష్టీకం చెలాయించే మగవాళ్ళూ ఇందులో ఎదురవుతారు ఆలోచించుకుని నిర్ణయించుకునే ప్రశాంతి లేక కొందరికీ,వంటింటి కుందేళ్ళుగా మారి రొటీన్ నుంచి బయటపడలేని విద్యాధికులైన

మహిళామూర్తులు కొందరికీ మనస్సు మొద్దుబారిపోతుంది; మరి కొందరికి ఆనందించే శక్తి పోతుంది; ఇంకొందరికి తమకు తాము రక్షించుకునే స్పందన కూడా పోతుంది. అతి ఆలోచనల వల్ల, 'ఆరాటం' వల్ల మరి కొందరికి ఫిట్సూ, హిస్టీరియాలు! ఇంతకూ టెన్షన్ నుంచి దూరంగా ఉంటే సమస్యలు పరిష్కారమవుతాయా? సమస్యల నుంచి తప్పించుకోవడం ద్వారా టెన్షన్ తగ్గుతుందా? పలాయన మంత్రం జీవన యాత్రను ఫలవంతం చేస్తుందా? ఈ లెక్కన ముక్కు మూసుకుని గంగలో అయినా దూకాలి లేదా కందమూల ఫలాలతో సరిపెట్టుకొని ఏ నైమిశారణ్యంలోనో మునులుగానైనా అవతరించాలి! సంప్రదాయం మీద ఎక్కువ మక్కువ ఉన్న లక్ష్మీదేవి ఈ చిలిపి సూత్రాన్ని ప్రబోధించకుండానే జీవితాన్ని జీవితంగా తీసుకోమనీ, ప్రశాంత చిత్తంతో ఆలోచించమనీ, జీవితం ఆలోచన, స్పందన సమపాళ్ళతో ముందుకు సాగాలనీ కోరుకుంటుంది. ఫెమినిజాన్ని లక్ష్మీదేవి నిరసించదు గాని, ఇతివృత్తానికి ఇచ్చే ట్రీట్‌మెంట్‌లో ఫెమినిస్టులతో ఏకీభవించదు. ఆరాట పోరాటాల మధ్య ఆమె తన ఆదర్శ శిఖరాలు నిలబెట్టుకోడానికి ఈ కథలలో ప్రయత్నించింది. ఆమె కళారంగంలోనైనా, జీవన కళారంగంలోనైనా ఉన్మత్తతను సహించలేదు; అలా అని స్తబ్దతనూ ప్రేమించ లేదు. సంప్రదాయధిక్కారాన్ని అభిలషిస్తున్నట్టు కనిపిస్తున్నదే గాని ధిక్కరించే పేరుతో కొసకంటా ప్రయాణించనూ లేదు. అయితే జీవితానికి అందం కాదు, చురుకుదనం ప్రధానం అంటుంది. మనిషికి చురుకుదనమే ఆభరణమూ, ఆకర్షణా అంటుంది. 'ప్రయాణం'లోని 'విద్య' పాత్ర ఒక అభినవ సృష్టి. తానొక మనిషిగా ఉండడానికే ఇష్టపడుతుందిగాని, స్త్రీగా ఉండడానికి ససేమీరా అంటుంది. అందరిచేత తానూ గుర్తించబడాలన్న 'విద్య' కోరిక వ్యక్తిత్వ వికాసానికి ప్రతీక. అందుకే విద్య 'నాలోని స్త్రీత్వం నాకూ, నాలోని సున్నితాన్ని గౌరవించి, ఆరాధించే కొద్ది మందికే పరిమితం' అని ఢంకా బజాయించగలుగుతుంది! అయితే కుటుంబ వ్యవస్థను కొందరు స్త్రీవాదులు (ఫెమినిస్టులు) ఎందుకు వద్దంటున్నారో ఆలోచించమని చెబుతూ సమత లేని కుటుంబం కుటుంబమే కాదని, సమత వ్యవస్థకు ముఖ్యమనీ లక్ష్మీదేవి భావన. మారాలనుకున్నా మారలేక మనిషి పోరాటం, ఎదగాలన్న ఆశయం కాస్తా అలాగే ఉండడిపోయి ఫలశ్రుతి కోసం ఆరాటం. స్వేచ్ఛ కోసం పరితపించే వాళ్ళు ఈ రెండు ధ్రువాల మధ్య సమన్వయం సాధిస్తే లక్ష్మీదేవికి తృప్తి! ఈ తపనలో భాగంగానే ఆమె 'సమభావం' కథలో బామ్మ పాత్రలోని ఉత్తమ గుణాలన్నీ కుటుంబ సభ్యులు పంచుకోవాలని భావిస్తుంది: ఒకరు బామ్మలోని ప్రేమించే స్వభావాన్ని, మరొకరు ఆమె ఓర్పునీ, ఇంకొకరు ఆమెలోని నిజాయితీని, మరొకరు క్రమశిక్షణను, ఆమె

సేవా భావాన్ని, వేరొకరు ఆమెలోని సౌమ్యతను, మంచితనాన్ని పుణికి పుచ్చుకుంటారు. ఈ సమభావ సందర్శనం నిజానికి ఆరాటం లేకుండా, అనుక్షణం పోరాటం లేకుండా సంఘానికి అబ్బదు. దోపిడీ ఆర్థిక వ్యవస్థను మార్చుకోనిదే వ్యక్తి నిష్టమైన ఏ ఆదర్శమూ సమాజపరం కాజాలదు.

మన బాధలకు కారణాలను మరొకళ్ళ మీదికి నెడుతున్నామని, మన దుఃఖానికి మరొకళ్ళని నిందిస్తున్నామని, అసలే చిక్కుముళ్ళతో ఉన్న జీవనయానం ఈ నిందారోపణలతో మరింత చిక్కుపడుతోందన్న పేరుతో మానవుడి ఆరాటాన్ని కాదనకూడదు. అంతేగాదు, మన బాధల్ని పోల్చుకునే ప్రయత్నంలో సాంఘిక, ఆర్థిక కారణాలను వెతకొద్దన్న బోధ కార్యకారణ సంబంధాన్ని కనుగొనే అన్వేషణా శక్తిని చంపివేస్తుంది. వర్గ సమస్యని, జండర్ సమస్యనీ తడమొద్దన్న కొందరి ఆలోచన పలాయన వాదానికి పరాకాష్ఠ. ఇప్పుడు నడుస్తున్న చరిత్రను గుడ్డిగా కాదనడమే అవుతుంది. 'మార్క్స్'ను చదవడానికి వ్యర్థ ప్రయత్నం చేశానంటున్న లక్ష్మీదేవికి ఈ కార్యకారణ సంబంధాన్ని అర్థం చేసుకోలేకనే, మానవ జీవితాలే లక్ష్యంగా, ఉత్పత్తి శక్తుల చేతనాపైన, అచేతనాపైన ఆధారపడి సాధించే పురోగతినిగాని, పురః పతనాన్ని గాన్ని అవగాహన చేసుకోలేకనే మార్క్స్ గ్రంథమేదీ 'నా బుర్రకి ఎక్కడం లేద'ని బాధపడవలసి రావడం! అయితే ఎవరికి వారు పరిశీలించుకోవలసింది తాను పుట్టి పెరిగిన పరిసరాలు. ఒకవైపున లక్ష్మీదేవి తనకు మార్క్స్ చైతన్యం ఇచ్చాడంటుంది, మరోవైపున దోపిడీ తాలూకు జ్ఞాపకాలు మనిషిని, మనసుని అచేతనం చేయడానికి మార్క్స్ కారణం అంటుంది! మనిషి వ్యక్తిత్వ వికాసాన్ని గౌరవించినవాడు కాబట్టే మార్క్స్ తన సిద్ధాంతాలకు సరిపడని పూర్వరంగంలో, తమ కాలంనాటి వాతావరణంలో షేక్స్పియర్, బాల్జాక్ రచనలెన్నింటినో మెచ్చుకున్నాడు. ఒక వాస్తవాన్ని చెప్పడానికి మార్క్సిస్టు కానక్కరలేదుగాని, నెహ్రూ చెప్పినట్టుగా చరిత్ర విశిష్ట అధ్యయనానికి సువర్ణ సులోచనాలను మార్క్సిజం అందించగలుగుతుందంటే అతిశయోక్తి కాదేమో! అవమానం ఆలోచనలు రేకెత్తిస్తుంది. బీదరికానికి అశుభ్రతకు సంబంధం ఎంతవరకు అన్న లక్ష్మీదేవి అమాయకపు ప్రశ్నలోనే సమాధానం కూడా ఉంది! ఆర్థిక అసమానతల్లో ఉండే చికాకులే అశుభ్రతక్కూడా పునాది. అస్పృశ్యత, అశుభ్రతల నుండి పుట్టుకొచ్చిన ఈ కారణాల నీడల్లోనే ఇంతకాలం ఈ ఉత్పత్తి శక్తుల ప్రాధాన్యాన్ని తగ్గిస్తూ వచ్చాం! కడుపు మండిన వారి అశుభ్రతకూ, కడుపు నిండిన వారి అశుభ్రతకూ తేడా ఉంది ఒకరిది సాంఘిక దురన్యాయాలవల్ల, వెలివేతవల్ల, విద్యాగంధానికి దూరమైనందున వచ్చిన ఫలితం కాగా, వేరొకరిది అన్నీ ఉన్నా 'వొళ్ళు బలిసి

పాడే పెళ్ళి పదంలాగా' కేవలం నౌకర్లపై ఆధారపడి ఇవతల కంచం అవతల పెట్టడానికి చేతులాడనందువల్ల పుట్టుకొచ్చిన జబ్బు! 'ఉత్సవ సౌరభం', '24 కారెట్' కథలు ఈసంపుటికి హైలెట్సుగా భావించాలి. డబ్బు జీవితానందాన్ని కొని ఇవ్వదన్న నీతిని ఇవి ప్రబోధిస్తాయి; అంతేగాదు, శ్రమ శక్తిని దోచుకోవడంకంటే, శ్రమించగలిగే శక్తినే దోచుకోవడం, పోగొట్టడమూ దుర్మార్గమనీ, నిసర్గమైన శ్రమ జీవన సౌందర్యం నిండిన కష్టజీవుల రక్తంలోకి ఏ విలువలూ లేని విలాసవంతమైన కాలుష్యాన్ని ఎక్కించడం దయనీయమనీ చాటిచెప్పింది లక్ష్మీదేవి. ఈమెకు సహజమైన ప్రకృతి సౌందర్యం పట్ల ఎంతో ఆరాధనా భావం. నిత్యమల్లెలు, ఈతపళ్ళు, మాటలు నేర్చిన మైనగోరు పిట్టలూ తలంపునకు రావలసిందే. లత పాటలూ, శాంతారామ్ సినీ దృశ్యాలూ మనోల్లాసం చేయవలసిందే; శరత్కాలపు అందాలు, మందకొడి హేమంతాలు, గోగులు, బూరుగులు, మోదుగులు, పసుపు రంగు బంగారు పూతలలో వెలగొందే వరి పొలాలు, అరటి గెలలూ, చెరకు గడలూ, రావిచెట్లు, రాచఉసిరి చెట్లూ, కోవెలలు, రామ కోవెలలూ ఇందులో మనకు కనువిందు చేస్తాయి. ఆలయంలో ధ్వజస్తంభపు చిరుమువ్వల సవ్వడులు వినిపిస్తాయి; చేలగట్లపై తాడిచెట్లు, వేసవి వెన్నెల రాత్రుళ్ళు, పొగడ పూల పరిమళాలు, పనస పువ్వుల గాలి మన మనస్సులను జాషువా సిద్ధపరచిన ఆ 'రస విమానాల'లో ప్రయాణింపచేస్తాయి! తాత్త్విక చింతనలో లక్ష్మీదేవి కొన్ని ఆదర్శాలు ప్రబోధించింది. 'చింత' మనిషిని ఎప్పుడూ వెన్నంటే ఉంటుంది కాని, చింతను మనసులోంచి తరిమెయ్యాలనీ, మన ఆలోచనలు మధ్యాహ్న సూర్యుడిలా తేజోవంతంగా ఉండాలనీ, అపుడు నీడ పడదనీ భరోసా చెబుతుంది; కొందరు 'కాలేజీ జీవితం తిరిగొస్తే ఎంత బావుండుననుకుంటారు'. కాని లక్ష్మీదేవికి ఆదురాశలేదు. జ్ఞాపకాల స్పృహ చాలు. ఆస్పృహ తనను తిరిగి పువ్వులా మృదువుగా ఉంచుతుంది. ఈ యవ్వనం మొగలి ముళ్లలో గుచ్చినా ఆ మెత్తనయిన సువాసనే ఆమెకు ఇష్టం! చివరికి ఎండిన పొగడ పూల పరిమళంలాగా, జీవితంపై అత్యాశలు పెట్టుకోకుండా వృద్ధాప్యాన్ని కూడా ఆహ్వానించగల శక్తిని ప్రతివారూ ఆ బాల్యం నుంచే చేదుకోవాలని ఆమె ఆశాభావం! మానవుడు పరాయీకరణవల్ల (తన తనాన్ని కోల్పోవడంవల్ల) తోటి మానవుడికే పరాయివాడు కాకూడదని, ఇందుకు మనస్సును పనిగట్టుకుని అన్ని బాధలు మరిచి నవం నవంగా ఉంచుకోవడం అవశ్యమని ఆమె సందేశం. వాడిన పూలు వికసించాలని కోరడం, వికసించినపుడు చూడడం ఒక అనుభూతి కాగా వాడని పూలని కూడా ఊహించడం లక్ష్మీదేవి ప్రత్యేకత! నిజానికి లక్ష్మీదేవికి ఈ లోకంలోని సుఖదుఃఖాలను దగ్గరికి తీసుకునే హృదయం ఉన్నవాళ్లను చూసి ఆనందిస్తుంది. అలాంటి

హృదయాన్ని ఆవిష్కరించగల శక్తి ఒక్క సాహిత్యానికే ఉందని ఆమె తీర్మానం. అందుకేగోర్నేలీ అనే ఐర్లాండ్ కవయిత్రీ అని ఉంటుంది: "Sorrow to one whose pride is gold/ Sorrow to one who's selfish/ I paid poets for their words/ before god took my riches.../ If my words do her Justice / how much better the poets'! లక్ష్మీదేవి తాత్విక ప్రశ్నకు సమాధానం వెదకాలి: ''ప్రపంచంలోని అందరి ఆనందాలను నావి చేసుకోగలిగితే నాలోని దుఃఖమే లేదు. కాని అంత సులభమా అది?'' కనిపించే ఆనందాలతోపాటు కుమిలిపోయే జీవులలో కనిపించని ఆవేదనను, అశ్రువులను కూడా తనవిగా చేసుకోగలిగితే ఆమె కూడా ఒక వెరోనికా ఫ్రాంకో (16వ శతాబ్ది ఇటాలియన్ కవయిత్రి) కాగల అవకాశం లేకపోలేదు: "No more words! To the field, to arms!/ I intend to rid myself of pain/ even if I end up dying for it"!

*(ఆదివారం 30, జూన్ 1997)*

# సమైక్యతా రాగానికి 'శివశంకరి' తానం, పల్లవి!

**క**ళా సాహిత్యాలు సంస్కృతీ వారధిని నిర్మించగలవా? భిన్నజాతులు, విభిన్న భాషలు, భిన్న సంస్కృతులూ తాండవిస్తున్న చోట జాతీయ సమైక్యత సాధ్యమా? దేశ సమగ్రత సుసాధ్యమా? రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిస్థితుల సమగ్ర అధ్యయనం మాత్రమే ఈ ప్రశ్నలకు తగిన సమాధానం ఇవ్వగలుగుతుంది. కేవలం కళా సంస్కృతుల వ్యాప్తివల్లనే, భిన్న ప్రాంతాల మధ్య ఈ సంసర్గత వల్లనే, ఈ ఆదాన ప్రదానాల వల్లనే పరిపూర్ణమైన జాతీయ సమైక్యత సాధ్యపడుతుందని బల్లగుద్ది చెప్పలేకపోవచ్చు. కాని రాజకీయ, ఆర్థిక కారణాల వల్ల మానసికంగా ఏర్పడిన అడ్డుగోడలను తొలగించి ప్రజల మధ్య సాన్నిహిత్యాన్ని పెంపొందించడంలో సాహిత్య కళారంగాల ప్రభావాన్ని మాత్రం తక్కువ అంచనా వేయలేము. ఈ దృష్టితో సాహసించి ముందడుగు వేసి, భారతదేశాన్ని నాలుగంచులూ తీరిన సమైక్యతా నిలయంగా దిద్ది తీర్చడానికి ప్రసిద్ధ తమిళ రచయిత్రి, కథా, నవలా రచయిత అయిన శివశంకరి ఒక విశిష్టమైన సాహితీ యజ్ఞం నిర్వహిస్తోంది. ఈ పనిని ఆమె కడచిన అయిదేళ్లుగా చేస్తోంది. దేశంలోనే ఒక ప్రాంతం ప్రజలకు మరో ప్రాంతం సంప్రదాయాలు, కళా, సాహిత్యాలు, సంస్కృతీ విలువలు అంతగా తెలియని ఈరోజుల్లోదేశంలోని వివిధ ప్రాంతాల మధ్య, ప్రజల మధ్య పూసల్లో దారంగా ఆయా ప్రాంతాల సాహితీ విలువలను సంస్కృతీ సంపదనూ పరస్పరం ఇచ్చిపుచ్చుకునేట్టు చేయడం ద్వారా జాతీయ సమగ్రతను కాపాడుకోవచ్చునన్న అభిలాషతో శివశంకరి ఈ యజ్ఞం తలపెట్టింది. 'సంచార శాలియౌ సాల భంజిక వోలె' అన్నట్టు శివశంకరి కాళ్లకు బలపాలు కట్టుకుని మరీ ఉత్తర, దక్షిణ, తూర్పు, పశ్చిమ భారతాలలో పర్యటనలు జరిపి ఆశేతు సీతాచలం గుబాళించే సాహిత్య వాసనలను మూటకట్టుకుని నాలుగు సంపుటాలలో సాహితీ ప్రియంభావుకులకు, ప్రజలకు అందించాలని సంకల్పించింది రాజ్యాంగం గుర్తించిన 18 భాషలలోని సౌకుమార్య సౌందర్యాలను రచయితల సాహిత్య వ్యాసంగాలు ఆధారంగా, విభిన్న సాహిత్య ప్రక్రియలు ఆకరంగా ఆమె ఈ బృహత్ ప్రయత్నానికి దిగారు ప్రభుత్వాలు, అకాడమీలు చేయవలసిన పనిని ఒక్క చేతి మీదుగా శివశంకరి తలపెట్టడం సాహసమేగాక, శివశంకరి పట్టుదలకు నిదర్శనం. ఈ ప్రయత్నంలో

భాగంగా వెలువడిన తొలి సాహితీ కుసుమం దక్షిణ భారత స్థూల సాహిత్య దర్పణం. ఈ యజ్ఞ వేదికకు ఆమె పెట్టుకున్న పేరు: సాహిత్యం ద్వారా భారత సమైక్యతా సాధన ("Knit India Through Literature") ఈ దేశ రాజ్యాంగం గుర్తించిన 18 భాషలతోనే సరిపెట్టుకోలేదు. వాటికి తోడునీడగా 350కి పైబడిన ప్రత్యేక భాషా మాండలికాలు (dialects)న్నాయి. అయినా భారతదేశం ముక్కచెక్కలు చెదరలేదు. ఎందుకని ? ఎంతగా ఓ, ఉద్రేక ఘడియలలో పరస్పరం తిట్టుకున్నా తిమ్ముకున్నా, మరెంతగా కొట్లాడుకున్నా అంతరంగంలో మాత్రం అందరం భారతీయులమేనన్న ధీమా అంతిమంగా మన మనసుల్ని శాసించడమే ఇందుకు కారణం. విదేశీ దండయాత్రల వల్ల కాని పని ప్రజల ఆత్మీయతా బంధాల వల్ల నెరవేరుతుంది. దక్షిణ భారత సాహిత్య సంపుటానికి ముందు మాట రాసిన కుష్వంత్‌సింగ్ అన్నట్టు కడచిన యాభై ఏళ్ళ అనుభవంలో -దేశం విచ్ఛిన్నమయ్యే ప్రమాదం ఉందన్న భీతి, వేదన, ఆవేదన మనల్ని వెన్నాడుతున్నాయి. రాజకీయాల వల్ల కలిగిన ఈ ఆవేదనను తొలగించడానికి దేశ సమైక్యతను కాపాడడానికి జాతీయ సమైక్యతా మండలి కృషి చేసినట్టు, ప్రధాన మంత్రులు, ముఖ్యమంత్రులూ కృషి చేసినట్టు పైకి కనపడుతుంది. కాని వారందరి కృషికన్నా సంస్కృతీ సాహిత్యాల ద్వారా ప్రజల మధ్య ఐక్యతను మరింతగా కదతొక్కి-ప్రజా జీవితంలో పునర్నవం కలిగించడానికి శివశంకరి లాంటి వారు చేస్తున్న ప్రయత్నాలు సర్వదా ప్రశంసనీయం. విభిన్న రకాల భావధారకు అవకాశం కల్పించిన ఈ సంపుటంలో ప్రజలు నేడెదుర్కొంటున్న సమస్యలపట్ల రచయితల, కవుల దృక్పథాలు వెల్లడయ్యాయి. దారిద్ర్యం, అమాయకత్వం, కుల, వర్గ వైషమ్యాలు, లింగవివక్ష, ఆధునికత విసురుతున్న సవాళ్ళు, తలెత్తజూస్తున్న, మతమౌఢ్యం, అంధవిశ్వాసాలు, అసహిష్ణుత, పతనమవుతున్న విలువలూ - వీటన్నిటిపైన రచయితల రచనల, అభిప్రాయాల ముద్రలు ఇందులో ఉన్నాయి. 'నిట్ ఇండియా' పరంపరంలోని ఈ తొలి సంపుటంలో కేరళ, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, తమిళనాడులకు చెందినస్థూలమైన భౌగోళిక, సాహితీ విలువల ప్రస్తావనతోపాటు ఆయా రాష్ట్రాలలోని కొందరు ప్రసిద్ధులతో శివశంకరి జరిపిన ప్రత్యేక ఇంటర్వ్యూలూ ఉన్నాయి. 27 ఇంటర్‌వ్యూలతోపాటు పాతిక మంది సాహితీవేత్తల ప్రసిద్ధ రచనల నుంచి ప్రాంతీయ సాహితికి ప్రాతినిధ్యంగా పొందుపరిచిన విశిష్ట శకలాలు ఉన్నాయి. ప్రజా బాహుళ్యం మనస్సులను సమైక్యతా భావం నుంచి దూరం కాకుండా వారి ఆలోచనను చిత్రికపట్టి నవ్య మార్గానికి, సమైక్యతా బృందగానానికీ మళ్ళించాలన్నది శివశంకరి తపన. 'మనిషిలో ఉత్సాహం అన్నది ఎప్పుడు పుట్టుకొస్తుంది. ప్రకృతి నుంచా? వ్యక్తి ఆత్మనుంచా?' అని ప్రశ్నించిన వ్యక్తికి

సుప్రసిద్ధ అమెరికన్ కవి ఎ ఆర్. అమోన్స్ ఇలా సమాధానమిచ్చాడు: తపనగాని, ఉత్సాహంగాని, వేదన నుంచి ఆవేదన నుంచి పెల్లుబికి వస్తుందన్నాడు ("Inspiration comes from anxiety") అలాంటి తపనే శివశంకరిని ఇలాంటి పెను కార్యానికి నెట్టే ఉంటుంది! సామాజిక స్పృహగానీ, జీవితానుభవాలనుగానీ, చైతన్యంగానీ కొరవడిన చోట రచయిత మనస్సు నిర్మలంగా ఉండలేదు, నిశ్చలంగానూ ఉండలేదు. ఆ స్పృహ శివశంకరికి ఇంతకు ముందే ఉంది కాబట్టి - రెండు రకాల ప్రమాణాలతో, ద్వంద్వ నీతితో తీసుకుంటున్న సమాజంపై తిరగబడగలిగింది. కాలం చెల్లిన విలువలను కాటికి పంపించడానికి నడుం కట్టింది వయస్సు నడిపొద్దుకు చేరకముందే భర్త చనిపోయినా మనస్సును నిభాయించుకుని స్వతంత్రమైన దారి తొక్కిన మహిళ శివశంకరి. కట్టూబొట్టూ ఎవరికీ మొగుడితో రావు, మొగుడితో పోవు. 'నాకెవరి దయాదాక్షిణ్యాలు అక్కర్లేద' ని దండోరా వేసి సభ్యసమాజంలో దిలాసాగా తలెత్తుకుని నిలబడిన మహిళామూర్తి ఆమె. కంచి పరమాచార్యతో కలిసి పాల్గొన్న ఒక సభలో పాడుపడిన ఛాందస సంప్రదాయాలు కొన్నింటిని ప్రశ్నించి-సుద్దులు చెప్పివచ్చిన సుమతి శివశంకరి! ప్రేమకు అర్థం భౌతిక స్పర్శకాదు, స్నేహంతో ప్రారంభం కావలసింది ప్రేమ అంటుందామె. సమన్వయ పూర్వకమైన స్త్రీవాదానికి ప్రతినిధిగా శివశంకరి దాంపత్య జీవితానికి చెప్పిన భాష్యం కూడా పరిశీలించదగింది: 'ఎవరూ అహం ప్రదర్శించకూడదు, దుడుకుగా వ్యవహరించకూడదు, అలా అని అతి విశ్వాసంతోనూ ఉండకూడదు. కాని అదే సమయంలో ఎవరికి వారు, తనను తాను తక్కువ చేసుకోకూడదు, న్యూనతాభావం రానివ్వకూడదు'. తన అమ్మ చెప్పిన 'అమ్మకథలు' ఆమె జీవితానికి చుక్కానులయ్యాయి. మద్యపాన వ్యసనంపైన, వృద్ధాప్య సమస్యలపైన వ్యవస్థా స్థాయిలో ఉద్యమించిన శివశంకరి సమాజ ఔన్నత్యం కోసం జాతీయ సమైక్యతకోసం, పౌర స్పందనోద్యమానికి నేతృత్వం వహించిన వ్యక్తి.

శివశంకరి ప్రారంభించిన సాహితీ స్రవంతి లక్ష్యాన్ని చేరుకోవడానికి మరో సంవత్సరం పట్టినా - ఆమె జరుపుతున్న యజ్ఞాన్ని నలభై ఏళ్ళకుపైగా జార్జి ప్లింప్టన్, డోనాల్డ్ హాల్, బ్లెయర్ ఫుల్లర్ సంపాదకులుగా నడుపుతున్న 'పారిస్ రివ్యూ' సంపుటాలతో ("Writers At Work) పోల్చవచ్చు! ఒక్క చేతిమీదుగా శివశంకరి చేస్తున్న కృషిని అంతర్జాతీయ స్థాయిలో దేశాల మధ్య కళా సాహిత్యాల ద్వారా సంస్కృతీ విలువలకు ప్రోదిచేయడం 'పారిస్ రివ్యూ' బాధ్యతగా పెట్టుకుంది. వెలుగులు విరజిమ్మే ఓ మహిళ గురించి రాస్తూ ఫ్రెడ్ డింగ్స్ (అమెరికా) అనే కవి ఆమె నడచిన చోటెల్ల చిమ్మే వెలుగులు/ ఆమె సహవాసి ఆర్ద్రతా సౌరభాలు చీకట్లను చీల్చే కర్పూర రాగాలు అన్నాడు ("A glow lingered wherever she walked/ The

fragrance of her companion incensed the dark")! అలాగే నేడు దేశాన్ని పీడిస్తున్న అనైక్యతా జాడ్యాన్ని వదిలించడానికే శివశంకరి సాహితీ యాత్రలు సాగించింది, సాగిస్తోంది. ఆమెకు కొందరు రచయితల చైతన్యం పట్ల అనుమానాలున్నాయి! ఏమంటే, కొందరికి పెరటి అరటి పనికిరాదు, పొరుగింటి పుల్లకూర రుచి ఏ ఆఫ్రికన్ రచయితల సమావేశమంటేనో, వారి సాహిత్యపు ఆదాన ప్రదానలంటేనో పడి చస్తారు. కాని తన రచనలను దేశంలోని ఇతర భాషలలోకి ఇతర దేశాల రచయితల మాదిరిగా ఇతర ప్రాంతీయ భాషల్లోకి అనువదించుకోలేరు. ఇందువల్ల జరుగుతున్న పనేమిటి? శివశంకరి భాషలో చెప్పాలంటే, చాలా మంది బయటివారికి తెలుగుసంస్కృతి అంటే ఊర మామిడిపచ్చడికో లేదా 'ఆంధ్రమాత' హోదాలో గోంగూరకో పరిమితంగాని ఆంధ్ర సాహిత్య పరిణామంగానీ, ఆధునిక భావనా స్రవంతిగానీ కాదు; అలాగే తమిళనాడు అంటే 'ఇడ్లీ -సాంబార్' గుర్తుకొచ్చినంతగా సుబ్రహ్మణ్య భారతి తలపునకు రాడు; బెంగాల్ అంటే కలకత్తా రసగుల్లాలు, రాజస్థాన్ అంటే పాలరాళ్లు, కేరళ అంటే పీచూ కొబ్బరి పీచూ తెలుసుగాని ప్రజల సాహిత్యం స్ఫురణకు రాదు. వివిధ సభలూ, సమావేశాలకు తాను హాజరైనప్పటి అనుభవాలను శివశంకరి గమనించింది. ఈ వక్రదృష్టిని తిప్పికొట్టేందుకు, జాతీ సమైక్యతను, సమగ్రతను నిండారా సాధించేందుకు నడుం కట్టింది. ఇందుకోసం తనలో పొంగులు వారే సృజన శక్తికీ, కథా స్రవంతికీ తాత్కాలికంగా కరకట్టలు వేసుకునైనా అయిదేళ్ళుగా భిన్న ప్రాంతాల సాహితీ కదంబాలతో సమైక్యతా బంధాలను పేనుకుంటూ వస్తోంది. కష్టపడి ప్రాంతీయ సాహితికి చెందిన ప్రసిద్ధుల రచనలకు ఓపికతో అనువాదాలు సేకరించుకుంది. అన్ని అనువాదాలూ ఆమెకు తృప్తి కలిగించకపోవచ్చు. కామిలో జోసీ సిలా (స్పెయిన్) అన్నట్టు ఒక్కోప్పుడు "a translator can also be a traitor, althrough not deliberately, and often subconsciously"!! తెలుగు సాహిత్య వనం నుంచి ఈ సంపుటిలో శివశంకరి చేర్చిన కుసుమాలు సి.నారాయణరెడ్డి, రావూరి భరద్వాజ, శేషేంద్రశర్మ, ఆరుద్ర, వాసిరెడ్డి సీతాదేవి, మాలతీచందూర్. రచనలు, అభిప్రాయాలూ, సాహితీ ప్రక్రియలలో ఏకత్వంలో భిన్నత్వాన్నేగాక, భిన్నత్వంలో కూడా ఏకత్వాన్ని సాధించిన తెలుగు సాహితికి కేవలం వీరు మాత్రమే ప్రతినిధులు కారు, తమ తనాన్ని ముద్ర వేసుకుంటున్న వర్ధిష్ణువులు మరెందరోకూడా ఉన్నారు. అయినా ఎక్కడో ఒకచోట ఇంత కృషిలోనూ ప్రారంభం, ముగింపు ఉండాలి కాబట్టి శివశంకరి ప్రయత్నం కొంత అసమగ్రంగా ఉన్నా విశాల దృష్టిలో ఆస్వాదనీయమే అవుతుంది! ఆధునిక తెలుగు సాహిత్యం గురించి చల్లా రాధాకృష్ణ శర్మ విహంగ వీక్షణం చేశారు ఇక మలయాళ సాహిత్యానికి ప్రతినిధులుగా వాసుదేవన్ నాయర్, కమలాదాస్,

వైకోమ్ మహ్మద్ బషీర్, సుగమకుమారిని చూపారు. కర్ణాటక ప్రతినిధులుగా ప్రొఫెసర్ అనంతమూర్తి, శివరామ్ కరంత్, భైరప్ప, శేషగిరిరావు, చదురంగను పరిచయం చేశారు. తమిళ ప్రతినిధులుగా అబ్దుల్ రహ్మాన్, ఇందిరా పార్థసారథి, రాజమ్ కృష్ణన్, జయకాంతన్ వగైరాలను ప్రస్తావించారు. ప్రతీ రాష్ట్రీయ విభాగానికి ఆధునిక సాహిత్య సమీక్షలు అందించారు. వివేకానందుడిలా శివశంకరిలో కూడా సమాజం తనకు అందించిన విద్యా రుణాన్ని కొంతైనా తిరిగి సమాజానికి చెల్లగట్టుకోవాలన్న ఆకాంక్ష ఉంది. ఇప్పుడామె ఆ ఆదర్శాన్ని సాధించుకోడంలోనే ఉందనిపిస్తుంది. ఒక సందర్భంలో మాట్లాడుతూ శివశంకరి తన మార్గాన్ని ఇలా హేతుబద్ధంగా నిర్దేశించుకుంది: 'జీవితం ఓ యాత్ర. సాహసయాత్ర. ఇది ఎప్పుడు ముగుస్తుందో ఎవరికీ తెలియదు. నేను కోరుకునేదల్లా - జీవించినంత కాలం హుందాగా బతకాలనీ, వృద్ధాప్యంలోనూ అంత హుందాగానూ గడపాలనీ, ఎవరినీ బాధించకుండా ఎవరికీ హాని కలగజేయకుండా మంచి మనిషిగా చివరికి అంత హుందాగానూ చచ్చిపోవాలనీ. మంచి రచయితగా చనిపోవడంకన్నా మంచి మనిషిగా నా చరమాంకం రచించుకోవాలనుకుంటున్నా''! ఈలాంటి సమున్నత భావధారను చూసే కాబోలు సహృదయులైన సాహితీవేత్తలు అనుకుంటుంటారు: ''అమూల్య భావ మణిరాసుల భావుక హృద్వసుంధరన్... / దివ్యటివట్టి చూప నవతేజము వెల్గగ జేసెనంతటిన్'' అని!!

*(ఆదివారం 22, మార్చి 1998)*

# పాఠకుల స్పందన

'వార్త'లో మీ సంపాదకీయాలు ఎంతో విజ్ఞానదాయకంగా ఉంటున్నాయి...

- ఎన్. కృష్ణమూర్తి,
డోన్ మండలి, కర్నూలు జిల్లా.

మీ సంపాదకీయాలు విషయ నిష్కర్షలో ప్రథమశ్రేణిలోనూ, పాత్రికేయ ప్రమాణాలలో ప్రపంచస్థాయిలోనూ ఉన్నాయి. మరికొంత కర్కశత్వం అవసరమైనప్పుడు ఆహ్వానించతగినదే – 'హో' పైన సంపాదకీయంలా.

- ప్రొఫెసర్ చందు సుబ్బారావు,
విశాఖపట్నం.

మహోతీక్షణమైన బుద్ధిశక్తితో సత్యధర్మ సంయుతమైన ఊహా పరంపరతో నిష్పాక్షికమైన విమర్శలతో మీరు వెలువరిస్తున్న సంపాదకీయాలు చదువుతుంటే నందనవనంలో విహరిస్తున్న అనుభూతి కలుగుతుంది. ఇక ఆదివారాల్లో వెలువడుతున్న మీ సాహిత్య సంపాదకీయాల్లో మీ నిరంతర అధ్యయనం, సృజనాత్మకత, రసాస్వాదనా పరిపక్వత స్ఫుటంగా దర్శనమిస్తున్నాయి.

- మైలవరపు రామమూర్తి,
కృష్ణపాలెం, పశ్చిమగోదావరి జిల్లా.

తెలుగునాటక రంగంపై ఆదివారం సాహిత్య సంపాదకీయం అభినందనీయం. నాటకం గురించి పుస్తకాలు చదువుకున్నాను, నా చిన్నతనంలో కొన్ని నాటకాలు చూశాను. ఈ సంపాదకీయం ఆద్యంతం ఆలోచనను రేకెత్తించింది. అది యువతరానికి సందేశం...

- కుమ్మరి భిక్షపతి,
నర్సాపూర్, మెదక్ జిల్లా.

శ్రీనివాస్ విధించుకున్న స్వయం ఖైదు 'హో' మకుటంతో వచ్చిన మీ సంపాదకీయం అద్భుతంగా ఉంది. విచ్చలవిడితనాన్ని స్వేచ్ఛగానూ, అరాచకత్వాన్ని ఆధునికతగానూ భ్రమపడుతున్న యువతరానికి ఇది కనువిప్పు... ఇది సామాజిక బాధ్యతతో అందించిన సంపాదకీయం.

- అదృష్టదీపక్,
రామచంద్రాపురం, తూ.గో.జిల్లా.

పాత్రికేయ ప్రపంచంలో అగ్రస్థానంలో కుదురుకున్న వారు శ్రీ ఎ.బి.కె.ప్రసాద్. వారు 'సాహిత్యకీయాలు' అనే పేరుతో గుదిగూర్చిన సంపాదకీయ శకలాలను చదివాను. ఇవన్నీ ఆహ్లాదకరమైన పద్ధతిలో పాఠకుని మెదడుకు మేత వేసే రీతిలో ఉన్నాయి. వీటి శీర్షికల మధ్య ఒక సాహిత్యచతురుడు, ఒక భాషాశిల్పి, ఒక అనుదిన ఘటనా వివేచనశీలి తళుక్కుమని మెరుస్తుండడం ముచ్చటగా అనిపించింది.

దేశ విదేశ విషయాలు, తాత్త్విక చింతనలు, కవితా విహారయాత్రలు, విజ్ఞానం, వివేచన కలగలిసిన పరిపక్వ మేధో విలసనాలు, ఇంకా ఎన్నో విషయాలతో ఈ నిబద్ధాక్షరి తీర్చబడడం పాఠకుల చేతనావర్తాన్ని విస్తృతం చేయడానికే! తన శైలీ పటుత్వంవల్ల మన ముక్కుకు తాడు వేసి ముందుకు లాక్కుపోయే ఈ సాహిత్యశిల్పిని మనం అభినందించకుండా ఉండలేము.

- నాయని కృష్ణకుమారి
28-5-1998

I do not know how to find the right words to thank you for your wonderful editorial in 'VAARTHA' daily, written on my book 'KNIT INDIA THROUGH LITERATURE.' The write-up was not only indepth and analytical but it also reflected your concern for unity in diversity. I have received few calls from my Telugu writer friends and also from Sri. G. Narayanan, Chairman of ANDHRA BANK, complimenting the nature of the article. I thank you once again for the lovely and inspiring words which, I am sure, will introduce me properly to the people of Andhra.

**SIVASANKARI,**
Chennai,
28 March, 1998
(సుప్రసిద్ధ తమిళ రచయిత్రి)